# త్యాగరాజు-రామదర్శనము

(ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే 1985లో పిహెచ్. డి.
పట్టము పొందిన సిద్ధాంత గ్రంథాంతర్గతము)

భాషా ప్రవీణ :

డాక్టర్ ములుకుట్ల బ్రహ్మానందశాస్త్రి, M.A., Ph.D.

ఆంధ్రోపన్యాసకులు :

ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గుంతకల్.

త్యాగరాజ భారతి ప్రచురణలు

రామలింగేశ్వరపేట, తెనాలి - 522 201.

# THYAGARAJU - RAMADARSHANAM

(Part of Thesis Approved by the Andhra University in 1985)

**By,**

**Dr. Mulukutla Brahmananda Sastry,** M.A., Ph.D.

ప్రథమ ముద్రణ : **1987** ప్రభవ, ముక్కోటి

ప్రతులు : **1200**



మూల్యము : **50-00**

ప్రతులకు :

కుమారి M. S. సుబ్బలక్ష్మి
త్యాగరాజ భారతి ప్రచురణలు,
రామలింగేశ్వర పేట, తెనాలి - 522 201.

చల్లా మల్లికార్జునశర్మ B. Com.
20-3-31 1/B, దూద్‌బౌలి
హైదరాబాదు - 500 264

ముద్రణ :

నాగార్జున ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్,
తెనాలి.

# మాతృ దేవోభవ - పితృ దేవోభవ



వంశమ్ము ములుకుట్ల వారార్ష సంప్ర
దాయానుసారులు మహాజ్ఞానులరయ
జనకుండు సంగీత సాహిత్యనిధి 'సదా
శివశాస్త్రి' లోకప్రసిద్ధ బుధుడు
జనని దయార్ద్ర భావనయగు 'ననసూయ'
వాత్సల్యరసఝరీభరిత హృదయ

# ఆచార్య దేవోభవ



మహాకవి-మధుర సరస్వతి-సాహితీ రత్నాకర-శృంగార సర్వజ్ఞ

## ఆచార్య శ్రీ యస్వీ. జోగారావు

M.A., Ph D., D. Litt. (Hon.)

(A.U. & U.S.A.) National Professor
Andhra University, WALTAIR - 530 003

అనురాగమ్మున ఛాత్ర సంతతికి బాఠ్యాంశాలు బోధించి చి
క్కని సాహిత్య రసామృతంబిడి 'లెనిన్‌గ్రాడ్' విశ్వ విద్యాలయ
మ్మున నాంధ్రమ్మును మప్పి నిర్మలయశమ్మున్‌గొన్న మిమ్మెన్న నా
కనువౌనే వరదేశికా! నతులు జోగారాయ విద్వన్మణీ.

.... .... .... సత్కవి యస్వీ జోగరా
యని గురువంచుచెప్పి కొనగానది గొప్ప తెలుంగునాడునన్.

# ఆచార్య దేవో భవ



## ఆచార్య జోస్యుల సూర్యప్రకాశరావు

M.A., (Tel., Skt., Hindi.) Ph.D.

**Rashtra Bhasha Praveena, B P., P.O.L., D.I.G.**
**Diploma in Linguistics,**
**professor & Head-Department of Telugu**
**Benaras Hindu University,**
**VARANASI-221 005**

**మమతాబంధుర చిత్తవృత్తి గుణి సంభావ్యమ్ము-వ్యుత్పత్తి వి
సముదోసమ్మును లేనిబోధ వరివస్యల్ గొన్న శాస్త్రీయ త
త్త్వము మీసొమ్ములు ప్రాజ్ఞనుత్యకవితావారాశి సూర్యప్రకా
శ మనీషి గ్రహియింప వేడెద నమస్కారాంజలుల్ పేర్మితో.**



ఈ గ్రంథ ముద్రణమునకు భూరి విరాళమునిచ్చిన వదాన్యులు శ్రీ మాగంటి సూర్యనారాయణ పంతులు గారు
"త్యాగరాజు – రామదర్శనము" కృతిస్వీకర్త శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారిని పుష్పమాలాలంకృతునిగా
చేయుచున్నప్పటి దృశ్యము – మధ్య శ్రీ కంచిభట్ల నరసింహారావు గారు
త్యాగరాజ రామాయణ సంగీతోపన్యాస కార్యక్రమ నిర్వాహకులు (విజయవాడ)

## పుస్తక ముద్రణమునకు రు. 116/- విరాళమందించిన దాతలు

### రాజమండ్రి

**శ్రీ న్యాపతి వీరరాఘవరావు,** *M.A., B.L.,*

శ్రీ వక్కలంక సత్యనారాయణమూర్తి (మాజీ కరణం)

శ్రీ కొప్పిశెట్టి విశ్వనాథరావు

శ్రీ పోతుకుచ్చి సూర్యనారాయణమూర్తి *M.A., B.L.*
అడ్వకేట్ - హిందూ విలేఖరి

### తెనాలి

శ్రీ పుచ్చా పున్నయ్య, శ్రీమతి పుచ్చా వరలక్ష్మమ్మగార్ల జ్ఞాపకార్థము వారికుమారుడు

**శ్రీ పి. యస్. ఆర్.** కె. శాస్త్రి, *B. Sc., B. Ed.,*
తాలూకా జూనియర్ కళాశాల, తెనాలి (రెండు నూటపదహార్లు)

**శ్రీ ఉమ్మలనేని కోటేశ్వరరావు** Rtd. Teacher, TENALI.

### నందిగామ

శ్రీమాన్ డా. దీవి మంగనాథాచార్యులు
వారి తండ్రిగారి జ్ఞాపకార్థము

ఓం

ములుకుట్ల వంశాబ్ధి పూర్ణశశాంకుడు
సంగీత సాహిత్య సారవేత్త
నవనీత సదృశమానసముతో ననుబెంచి
పెద్దజేసిన పూజ్య పితృచరణులు
హరికథాగాన విద్యా మహాంభోనిధి
కోవిదస్తవనీయ గుణభరితులు
కమనీయ త్యాగరాట్కథను గానముచేసి
వినుత విఖ్యాతినందిన యశస్వి
సకలభారత బుధపరిషత్తులందు
స్వర్ణ కుసుమాభిషేక సంపదలబొరలి
సరసులైన సదాశివశాస్త్రి చరణ
ములకు గేల్మోడ్చి యంకితమ్ముగనొనర్తు.

—)0(—



కృతిస్వీకర్త – కథాగాన కళాప్రపూర్ణ, నాదయోగి శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి

# గ్రంథరచనా సముద్దేశము

సంగీత జగద్గురువు, రామభక్తి సామ్రాజ్య పట్టభద్రుడు, రామనామరసికా గ్రణి, మహాకవి యగు త్యాగయ్య వాగ్గేయకారుడుగా మాత్రమే లబ్ధప్రతిష్ఠుడు. సంగీతముపై మక్కువయున్నను సర్వపూర్వ సంస్కృతాంధ్ర సాహిత్యమును మథించిన సాహిత్య భావుకుడు. సాహిత్యవేత్త. పరమ భావుక పట్టభద్రుడు కాని కేవలసంగీత ప్రియుడు కాడు. ఆయన కృతులలో కావలసినంత కవితా కమనీయత, సాహిత్య సత్తా గలవు. సామాన్య కవిత్వముగాదు. మహాకవిత్వమాయనది. ఆంధ్ర దేశపు కవుల జాబితాలో స్థానము దొరికినదికాదు. ఆది శంకరులు, వివేకానందుడు, త్యాగయ్య, ఆదిభట్ల నారాయణదాసు మహాకవులయినను కవుల చరిత్రలందు వారి పేళ్ళు కానరావు. కారణము వారి ప్రధానకర్మక్షేత్రము కవితకాదు కనుక. అపూర్వ సంగీతకృతి ప్రపంచ నిర్మాణము త్యాగయ్య ప్రధాన కర్మక్షేత్రమయిన కారణాన ఆయన యెంత కమనీయ కవిత్వమును, సరస సాహిత్యమును, తన కృతులలో ప్రవేశపెట్టినప్పటికి కవిగా త్యాగయ్య గుర్తింపబడలేదు. త్యాగయ్యను కవిగా ఉపరి మహాకవిగా గుర్తింపవలసిన యవసరమెంతేని గలదు.

ఈ విషయమును చాలాకాలము క్రితము మా గురుదేవులు ఆచార్య శ్రీ యస్వీ జోగారావుగారు పత్రికాముఖముగా, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారు ఆంధ్ర సాహిత్య చరిత్రయందు వ్రాసి యున్నారు. కాక మా పితృపాదులు "కథాగాన కళా ప్రపూర్ణ" శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారు "త్యాగరాజ చరిత్రను" కథాగానము చేయుటలో "అతనికతండెసాటి" యను యశస్సునార్జించినారు. ఈనాటికీ మా జనకులు త్యాగరాజ చరిత్రను ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతములలో పలుతావుల కథా గానము చేయుచు, త్యాగరాజ మహనీయుని భక్తి కవితాతత్త్వములను, సంగీత ప్రతి భను చాటుచున్నారు. కేవల హరికథకులేగాదు; సంగీత సాహిత్య భూషణులు మా తండ్రిగారు. ఈ సందర్భాలను పురస్కరించుకొని చిన్ననాటినుండి నాకు త్యాగయ్యపై భక్తి కుదిరినది. ఆంధ్ర సాహిత్యమున పరిశ్రమ చేసినవాడనగుటచేత

ఆయన సత్కృతులలో గల సాహిత్య సౌష్ఠవమును లోక ప్రకాశము గావించి మహా కవిగా స్థాపించవలెనన్న కుతూహలము సహజముగా నేర్పడినది. ఆ కారణముగా నా సంస్కారము, ఆసక్తి, ఆశయము, అభిరుచులను గుర్తించి మా గురుదేవులు ఆచార్య శ్రీ యస్వీ. జోగారావుగారు కతిపయ సభాసందర్భములయందు త్యాగయ్యను గురించి నేను చేసిన ప్రసంగములను విని హర్షించి "త్యాగరాజస్వామి సారస్వత ప్రతిభ-సముదాత్త వ్యక్తిత్వము - ఒక సమీక్ష" అను దానిని నాపరిశోధన విషయముగా నిర్ణయించిరి.

ఆ నిర్దేశించు సందర్భమున వారు నాతో "తానెపుడో త్యాగయ్యగారి నివాస స్థలమైన తిరువైయ్యార్‌ను సందర్శించినట్లు, ఆ సమయమున తత్రత్యులైన త్యాగయ్య భక్తులు కొందరు తమతో ఆ మహనీయునిలో పీఠము పెట్టుకొనిన సరస్వతీ మహాదేవియొక్క ఒక ప్రముఖాంశయైన సంగీతమును గురించి మాత్రమే సర్వ తమిళ ప్రపంచమునకు సువిశ్రుతమైనది గాని, ఆ కృతులలో ఆ మహాభాగుని సాహిత్య సౌభాగ్య మెట్టిదో తెలియదు - అట్టిచో మీ వంటి ఆంధ్ర సాహిత్యవేత్తలు ఆ విషయమును విశకలితముగా ఆంధ్రేతర లోకములకు ఏల తెలియజేయరాదు"అని పృచ్ఛించినట్లు చెప్పిరి. అదియు నా పరిశ్రమకొక ప్రరోచన యయ్యెను. అంత మాత్రమే కాదు. తదుపరి యొక పర్యాయము గురువర్యులు శ్రీ జోగారావుగారితో నేను ఇతర సహవ్రత సమేతముగా తిరువైయ్యార్‌ను - అచట త్యాగయ్యకృతులు చక్కగ చెక్కబడిన చంద్రమశ్శిలాఫలకములచే నిర్మితమయిన త్యాగరాయమందిర మును సందర్శింపనేగితిమి. ఆనాడు స్వామికచట ఒక ఆరాధనామహోత్సవము జరుగుచుండెను. ఎందరో మహానుభావులు వివిధ జంత్ర గాత్ర ప్రక్రియా పరి శ్రాంతులు తమ విద్యకింకను వన్నె పెట్టుకొనుటకై అచట స్వామి సన్నిధిలో సాధన చేసిన తమ ప్రావీణ్య మినుమడించు నను విశ్వాసముతో తమ సంగీత విద్యావిదగ్ధత లను ఆ ప్రశాంత వాతావరణమున నేకాంతముగా నివేదించు కొనుచుండిరి. నేనా సన్నివేశమును గాంచి ఆనందాశ్చర్యములలో నోలలాడితిని. అప్పటికప్పుడు ఆశ్రమపాలకులు (శ్రీనివాసయ్య) త్యాగయ్య అన్నగారు జపేశుడు. జపేశుని మని మనుమడు రాముడు భాగవతార్. రాముడు భాగవతార్.దౌహిత్రుడే - శ్రీనివాసయ్య -

ఈ వివరములను త్యాగరాజు-జీవితోదంతమను ప్రకరణమున నొసంగబడినవి) నాడు స్వామి ఆరాధనామహోత్సవము గాన, తత్రత్యులమైన మాలోనెవరైనను స్వామి ప్రశంసాపూర్వకముగ ప్రసంగించిన బాగుండునని సెలవిచ్చిరి. అంత నా యాంతర్య మెరిగిన శ్రీ జోగారావుగారు నన్ను ముందునకు త్రోసిరి. సంగతి ముందుగా తెలియక సన్నద్ధుడనుగా లేని నేను, స్వామి యనుగ్రహమును పురస్కరించుకొని సరేనని వారి కృతులనుదాహరించుచు వారి మాహాత్మ్యమునుగ్గడించితిని. "భాంగుభళా" యని మా గురువర్యులు నన్ను మెన్నుతట్టి యాశీర్వదించిరి. అవశ్యము ఏతద్విషయ పరిశోధనకు అర్హుడవు నీవయని ప్రశంసించిరి. ఆ ప్రశంస మాట యెటులున్నను వారి యాశీర్వాదమును, వారివలె నాకు వంద్యులైన మా గురువర్యులు - నాకీ పరిశోధన పరిశ్రమయందు పర్యవేక్షకులు నయిన డా॥ జోస్యుల సూర్యప్రకాశరావుగారి యామోద ప్రోత్సాహములు, మార్గదర్శకత్వమును, మా పితృపాదులు హరికథా క్షీరసాగర శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారి అండదండలను పురస్కరించుకొని నేనీ సముద్యమమునకు సమకట్టితిని. కృతార్థుడనై పిహెచ్. డి. పట్టమును పొందితిని. ఆ సిద్ధాంత వ్యాసమున మూడు ప్రకరణముల నెన్నుకొని త్యాగరాజు జీవితోదంతము, త్యాగరాజ దర్శనము, త్యాగరాజు - రామదర్శనము యీ నాటికి ముద్రింపించ గలిగితిని.



# కృతజ్ఞతలు

ఈ పరిశోధన ఆధ్వర్యవమున ఆధానమునుండి అవభృథము వరకు నాకండగ నిలచి, వెన్నంటి సర్వవిధముల నన్ను ప్రోత్సహించిన గురుదేవులు ఆచార్య శ్రీ యస్వీ. జోగారావుగారికి, గురుదేవులు, నా పరిశోధనా వ్యాసంగమునకు పర్యవేక్షకులు నయిన ఆచార్య శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావుగారికి నా హృదయ పూర్వక ప్రణామములు.

ఈ పరిశోధనా మహాక్రతువున నాకు హార్దికముగ, ఆర్థికముగ చేయూత నొసంగిన మా పితృదేవులు కథాగాన కళాప్రపూర్ణ శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారికి సప్రశ్రయ ప్రణామములు.

కావలి జవహర్ భారతిలో పనిచేయుచున్న రోజులలో ఈపరిశోధనా వ్యాసంగము నకు అంకురార్పణ జరిగినది. బహుశః 1979 నవంబర్ మాసాంతమను కుందును. నాటినుండి పరిశోధన పూర్తియగు వరకు నాకండదండలుగానున్న సంస్కృతాంధ్ర ఆంగ్లభాషాకోవిదులు, సహృదయులు, మిత్రులు శ్రీ కరవది రాధాకృష్ణమూర్తిగారికి (ఆంగ్లోపన్యాసకులు, జవహర్ భారతి - కావలి) సర్వదా కృతజ్ఞుడను.

పరిశోధనగావించుపట్టుల తమ సహాయ సహకారములనందించిన సతీర్థులు-గురుమిత్రులు - సుప్రసిద్ధ కథకులు శ్రీ ప్రతాప వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి M.A., (ఆంధ్రోపన్యాసకులు V. R. S. & Y. R. N. కళాశాల, చీరాల) గారికి నా ప్రణామములు.

పరిశోధన పూర్తియయి సిద్ధాంత వ్యాసమును విశ్వవిద్యాలయమునకు సమ ర్పించినది 17 జులై - 1984. 85 మార్చి నాటికి ఫలితము తెలిసినది. ఏప్రియల్ మొదటి వారమున Viva జరుగునని వాల్తేరు నుండి వర్తమానము రాగా ఎంతో

ఆనందముతోనున్న రోజులవి. తీవ్రవ్యాధిగ్రస్తుడనై నాను 85 మార్చి 20 వ తేదీకి. April 6న Viva జరుగునని అధికారికముగా తెలిసినది. Vivaకు వెళ్ళు సందర్భమున (6-4-85) స్నాతకోత్సవమున డాక్టర్ డిగ్రీ తీసికొనుటకు వెళ్ళు సందర్భమున 25-5-85 (అప్పటికింకను వ్యాధిగ్రస్తుడనై యున్నాను) సౌమిత్రివలె వెన్నంటి ఎంతయో శ్రమకోర్చి సురక్షితముగా నన్నిల్లుజేర్చిన నా సోదరుడు చిరంజీవి విశ్వనాథశర్మ M.A., కు నా మనః పూర్వక మంగళాశాసనములు. నా కనుజుడు గనుక చిరంజీవికి కృతజ్ఞతలు తెల్పుటకంటె అతనికి, అతని కుటుంబమునకు ఆయురారోగ్యైశ్వర్యాలు ప్రసాదించగలందులకు త్యాగరాజనుతుడగు శ్రీ రామచంద్రుని మనసార ప్రార్థించుచున్నాను. ఇట్లే నా కనిష్ఠ సోదరుడు చిరంజీవి శివరామకృష్ణశాస్త్రికిని, వాని కుటుంబమునకును నా మనఃపూర్వక మంగళాశాసనములు.

నాకు డాక్టర్ డిగ్రీ వచ్చినందులకెంతగనో పొంగి నన్నభినందించుచు జాబులు వ్రాసిన నా బావమఱదులు చిరంజీవులు చల్లా సత్యనారాయణ, మల్లికార్జున శర్మలకు శుభాశీస్సులు.

పరిశోధనా వ్యాసంగ కాలమున తమ సహకారాన్ని అందించి నాకు చేయూతనొసంగిన శ్రీ వి. పిచ్చయ్యగారికి నా నమస్సులు. పరి శోధన గావించుపట్టుల అడుగడుగున నన్ను ప్రోత్సహించిన శ్రీ వెన్నం పిచ్చయ్యగారి అర్థాంగలక్ష్మి శ్రీమతి కృపావతిగారికి నా సౌహార్దసాధువాదములు.

చిన్ననాటి స్నేహితుడు, నాశ్రేయఃకాంక్షి, సహోపాధ్యాయుడు శ్రీ V.L.N. శాస్త్రికి, సహోపాధ్యాయులు, స్నేహశీలి శ్రీ K. V. కృష్ణమోహనరావుగారికి, శ్రీ మారేమండ హనుమంతరావుగారికి నా నమస్సుమనస్సులు.

1982 డిసెంబరు మాసమున ఊహింపని పరిణామముల కారణాన మనఃసంక్షోభము ననుభవించుచు - పరిశోధన విషయంలో ప్రాలుమాలిన సందర్భమున నన్ను త్తేజ పరచి ఎప్పటికప్పుడు ధైర్యవచనాలు పలుకుచు నన్ను కార్యోన్ముఖుని గావించిన నా శ్రీమతి చి॥ ల॥ సౌ॥ భ్రమరాంబకు, నా ఏకైక పుత్రిక చి॥ సుబ్బలక్ష్మికి నా మంగళా శాసనములు.

సిద్ధాంత వ్యాసమును మా పూజ్యజనకులు నాన్నగారికంకితమియవలయునన్న దృఢసంకల్పముతో నున్న నాకు పుస్తకముద్రణము భారమై దిక్కుతోచకున్న పరిస్థితులలో "త్యాగరాజు"ను గురించి నేజేసిన ప్రసంగము విని పుస్తకముద్రణమునకు వలసిన ధనమును పెట్టుబడి పెట్టుటకు ముందుకువచ్చి రు. 5,000/- లు అందజేసిన హైదరాబాదు విద్యానగర్ వాస్తవ్యులు - సహృదయులు - భక్తులు శ్రీ పొత్తూరు నాగేశ్వరరావుగారికి,

పెదరావూరు వాస్తవ్యులు - ఉదారులు - భక్తులు - సహృదయులు - శ్రీ పాలడుగు సూర్యనారాయణగారు రు. 1,116/- లు నా పుస్తకముద్రణమునకు విరాళమందించిరి. వారికి -

రాజమండ్రి శ్రీ త్యాగరాజ నారాయణ దాస సేవాసమితి - తరపున రు. 116/- లు ఇచ్చిన వారికి (వారి పేర్లు - విడిగా ఇవ్వబడినవి). పుస్తక ముద్రణమునకు రు. 200/- లు విరాళ మందించిన బందరు వాస్తవ్యులు శ్రీ చలమలశెట్టి నాంచారయ్యగారికి, పుస్తక ప్రచురణ పూర్వవిరాళముగా రు. 25/- లు అందజేసిన వారలకు - నా కృతజ్ఞతలు. వారికి త్యాగరాజనుతుడగు శ్రీరామచంద్రుడు ఆయురారోగ్య సకలైశ్వర్యాలను ప్రసాదించాలని ప్రార్థింతును.

విజయవాడ వాస్తవ్యులు వదాన్యులు - శ్రీ మాగంటి సూర్యనారాయణ మహోదయులు పుస్తకప్రచురణమునకు భూరి విరాళమందజేసినారు. వారికి నా నమస్సుమనస్సులు. భక్తులు, సహృదయులు శ్రీ కంచిభట్ల నరసింహారావుగారు (విజయవాడ వాస్తవ్యులు) తమ యింట 1987 జనవరిలో నాన్నగారి త్యాగరాజ రామాయణము సంగీతోపన్యాస కార్యక్రమమునేర్పాటుచేసి ఎంతగనో ప్రోత్సాహ మిచ్చినందులకు వారికి కృతజ్ఞుడను.

నేను కోరినంతనే నా యీ గ్రంథమునకు ఆశీః పూర్వక తమ యామోద ప్రమోదములను తెలియజేసిన పూజ్యజనకులు శ్రీ సదాశివశాస్త్రిగారికి, గురుదేవులు ఆచార్యశ్రీ యస్వీ జోగారావుగారికి, గురుదేవులు, పరిశోధనా వ్యాసంగమునకు పర్య

వేక్షకులు నయిన ఆచార్య శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావుగారికి, సంగీత కళానిధి, పద్మశ్రీ, డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారికి నా మనఃపూర్వక ప్రణామములు.

త్యాగరాజు - రామదర్శనము అను నీ గ్రంథమును సర్వాంగ సుందరముగా ముద్రింపించి యిచ్చిన సహృదయులు, స్నేహశీలురు శ్రీ రాచాబత్తుని శివలింగేశ్వర రావు గారికి (నాగార్జున ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్ - అధినేతలు) వారి సోదరులకు నా కృతజ్ఞతలు. ఇంకెందరో -

ఎందరో మహానుభావులు

అందరికి వందనములు -

- బ్రహ్మానందశాస్త్రి



హరికథా క్షీరసాగర, కథాగాన కళాప్రపూర్ణ, నాదయోగి,
సంగీతసాహిత్య భూషణ, విద్వాన్

## ములుకుట్ల సదాశివశాస్త్రి

# ఆశీస్సు

పెక్కు దేవతాంశలతో నవతరించిన మహనీయుడు శ్రీ త్యాగరాజస్వామి. ఆయనయే మాకు ఇలవేల్పు. కేవల సంగీత విద్వాంసుడు మాత్రమేకాదు త్యాగయ్య: సర్వవేదశాస్త్ర పురాణాదుల జదివి సారమెరింగిన మహామనీషి. అద్వైత సిద్ధిని పొందినవాడు. శంకరభగవత్పాదుల అద్వైత సిద్ధాంతమంతయు తనకృతుల జేర్చి ప్రజలకు బోధించిన మతాచార్యుడు. ఆయన వాల్మీకి రామాయణమునేగాక అధ్యాత్మ రామాయణము, భాస్కర రామాయణము, రంగనాధ రామాయణము మొదలుగాగల రామాయణముల నెన్నింటినో జూచి, వానిలోని విషయములను కీర్తనల జొప్పించిన ధీశాలి. కనుకనేవారు "రామాయణ రహస్యార్థ ప్రకాశకు"లని ప్రశంసింప బడినారు. సంస్కృతాంధ్రాలను, సంగీత సాహిత్యాలను, గ్రాంధిక వ్యావహారికాలను, సగుణ నిర్గుణాలను, శైవవైష్ణవాలను, లౌకిక వైదికాలను సమన్వయము చేయుచు శ్రీవారు ప్రదర్శించిన ప్రజ్ఞఅనితరసాధ్యము. అట్టిమహనీయుని జీవితముపై, సాహిత్యముపై పరిశోధన చేయబూనుట కష్టసాధ్యమైనపని. ఐనను మా చిరంజీవి బ్రహ్మానందశాస్త్రి గురుదేవులు ఆచార్య శ్రీ యస్వీ. జోగారావుగారు, ఆచార్య శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావుగారల ఆజ్ఞానుసారము శ్రీవారి జీవితాన్ని, సాహిత్యాన్ని పరిశోధనకు విషయముగా నెన్నుకొని, గురుదేవుల ఆశీస్సులతో సిద్ధాంత వ్యాసమును ఆంధ్ర విశ్వవిద్యాలయమువారికి సమర్పించి పిహెచ్. డి. డిగ్రీని పొంది కృతార్థుడైనాడు.

మా వంశమున మా పూర్వులందరు శ్రీ మద్రామాయణమే శరణ్యముగా, జీవనోపాధిగ తీసికొని ధర్మప్రచారము చేసినవారలే. శ్రీరాముని సేవించి తరించిన

వారలే. మా చిరంజీవియు రామ సాక్షాత్కారము పొందిన భక్తవరేణ్యుడైన శ్రీ త్యాగరాజు జీవితమును పరిశోధనకు తీసికొని వారి కీర్తనలు, అందులోని రామాయణ రహస్యములను అచ్చటచ్చట ఉపన్యాస రూపమున శ్రోతలకు విని పించుచు రామాయణ ప్రచారమును గావించుచున్నందులకు సంతసించుచున్నాను. కలియుగమున జనించి అరిషడ్వర్గములను జయించి "స్వయంతీర్ణః పరాంస్తారయతి" తాను తరించి మానవాళికి తరణోపాయమును జూపించిన మహర్షి త్యాగరాజస్వామి. "సంసారులైతేనేమయా శిఖిపింఛావతంసుడెదుటనుండగ" సంసారులైన వారికి భక్తి - జ్ఞాన - మోక్షములు సాధ్యములని నిరూపించిన వ్యక్తి త్యాగయ్య. వారి బోధనలను కొన్నింటినైన ఆచరణలో నుంచుకొని ప్రచారముచేయుచు శ్రీవారి అనుగ్రహపాత్రుడు కావలయునని "ఆశీస్సు"ల నందజేయుచున్నాను.

త్యాగరాజుని యెడల భక్తి ప్రపత్తులుగల వారు కూడ నీ గ్రంథమును జదివి భగవదనుగ్రహ పాత్రులగుదురు గాక.

రామలింగేశ్వరపేట,<br>
తెనాలి

బుధజన విధేయుడు<br>
(సం.) ములుకుట్ల సదాశివశాస్త్రి

# సహృదయ భూమిక

పుత్రుడే పౌత్రుడగుట విశేషము, విచిత్రము. నాకు M.A.,లో ప్రియశిష్యుడు, High distinction తో అనగా 77% మార్కులతో కృతార్థుడు అయిన డాక్టర్ చిరంజీవి ములుకుట్ల బ్రహ్మానందశాస్త్రి నాకు అత్యంత సన్నిహిత అంతేవాసియు, అంతర్వాణి వరేణ్యుడు నయిన డాక్టర్ జోస్యుల సూర్యప్రకాశరాయల పర్యవేక్షణలో డాక్టర్ పట్టభద్రుడైనాడు. అప్పటికే గురుకుల క్లిష్టుడు ఉపాధ్యాయ వృత్తిలో ఉదాత్తు డనిపించుకొన్నవాడు. తండ్రి - తాతముత్తాతల తరతరాల నుండి సంప్రదాయ సంస్కారమున గడిదేరినవాడు. పిన్నటనుండి విద్వత్కవి, లోకపారిషదుడు త్యాగరాజ జీవితచరిత్రాద్యనేక హరికథాగానప్రవీణ ప్రతిష్ఠామహితుడు అయిన పితృపాదులు శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి మహోదయుల వరివస్యలో త్యాగరాజు సంగీత సాహిత్యములందు నిజమైన మన్ననయు, నిక్కమైన మక్కువయు పెనుపొందించుకొన్న భాగ్యశాలి. ఒట్టి వాగ్గేయకారుడు కాక అంతటి మహాకవియైన త్యాగరాజుకు ఆంధ్రకవులచరిత్ర గ్రంథములందు ప్రశస్తి మాట యటుండ ప్రసక్తియే లేకపోయినది. ఆ విషయమున వ్యథావ్యాకులిత హృదయముతో నేటికి ముప్పది మూడేండ్లనాడు త్యాగరాజును కవిరాజుగా గుర్తింపవలసిన అవశ్యకత యెంతేని యున్నదని పత్రికా ముఖమున ఉద్ఘోషించితిని. చిరంజీవి శాస్త్రియొక్క అభిరుచిని, అభినివేశమును గమనించి అదియే అతని పరిశోధనకు అనువైన విషయమని నిర్దేశించితిని. ఆచార్య ప్రకాశరావుగారి సమర్థసారథ్యమున చిరంజీవి శాస్త్రి 1985లో డాక్టర్ పట్టభద్రుడైనాడు.

అసలే విషయము అతి విశిష్టమైనది. విలువైనది. దానికితోడు తనదైన యభినివేశము తద్విషయమున చిరంతన పరంధామమునైన చిత్తమున పరవళ్ళు త్రొక్కుచున్నది. సారవంతమైన సంస్కారము, ఉల్లమునూగిసలాడించినది. పనికట్టుకొని పరిశ్రమకుపక్రమించినాడు శాస్త్రి.

అదియొక తపస్సుగా, ఆత్మసాక్షాత్కారము పొందిన ఒక మహాయోగివలె తన పరిశోధన నిబంధమునకు బంధురమైన రూపకల్పన చేసినాడు. త్యాగరాజు - రామదర్శనమును మాత్రమే చేయగలిగి యుండగా ఆ యుభయుల దర్శనమును ఊచముట్టుగ చేయగలిగినాడు శాస్త్రి.

ప్రకృత మీ కృతి అతని పరిశోధన నిబంధమున తొలిపాలు మాత్రము. తాదృశకృతి సమ్యగాకృతికి వలయు సామగ్రి సర్వము ఇందు సమగ్రముగ సజ్జీకృతమైనది. విషయ విభాగము, ప్రకృష్ట ప్రణాళిక, తత్ర తత్ర ఆవశ్యకములగు అనర్ఘపంక్తుల సముద్ధరణము, విషయ విచారణ ప్రవీణత, నిరవద్య భాషానిపుణ పరిధవము, శైలీలాలిత్యము, ప్రామాణికతా పారమ్యము అన్నిటిని మించి అభిరుచి ఆలపించిన అంతరంగ సంగీతము - ఈ హంగులన్నియు ఈ గ్రంథమునందు చక్కగ చోటు చేసికొన్నవి. అత్యతన ఆంధ్ర వాఙ్మయమున ఇదియొక అపురూపమైన గ్రంథరాజము. చిరంజీవి శాస్త్రికి నా మనఃపూర్వక మంగళాశాసనములు.

ప్రభవ, దీపావళి

-యస్వీ. జోగారావు



డా॥ జె. యస్. ప్రకాశరావు
యం. ఏ., (తెలుగు, సంస్కృతము, హింది) పిహెచ్.డి.
ప్రొఫెసర్ & హెడ్, డిపార్టుమెంటు ఆఫ్ తెలుగు
ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్సు
హిందూ విశ్వవిద్యాలయము
వా ర ణా సి - 221 005

## ఆ శీః

"సంగీతమపిసాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్।
ఏకమాపాత మధురమన్యదా లోచనామృతమ్॥"

అనెడి ఆర్యోక్తికి అన్ని విధముల లక్ష్యభూతుడైనట్టి మహనీయుడు సంగీత సాహిత్యామృతాంభసుడైన శ్రీ త్యాగరాజస్వామి. ఆతడు సంగీత జగద్గురువు. నిధికంటె రాముని సన్నిధియే మిన్న యని నమ్మి మన్నన గన్నయట్టి దిట్ట. ఆయన ప్రధాన కర్మక్షేత్రము అపూర్వ సంగీతకృతి ప్రాదుర్భావ మహిత మగుటచే నిరుపమాన వాగ్గేయకార శిరోమణిగ లబ్ధప్రతిష్ఠుడైనవాడు.

కాని శ్రీ త్యాగరాజస్వామి సహృదయ హృదయంగమమగు సరససాహిత్య స్రష్టకూడ. ఆ సంగతి లోకమునకంతగ దెలియదు. శ్రీ త్యాగబ్రహ్మను కవిగా - కాదు కాదు - మహాకవిగ గుర్తింపవలసిన యవసరమున్నది. ముఖ్యముగ సాహిత్యారాధకులకు. ఈ విషయమునేనాడో గుర్తించి యదనుకై వేచియున్న ప్రాచార్యులు, జాతీయాచార్యులు, ఉపరి అస్మద్గురువర్యులునైన శ్రీయస్వీ. జోగారావు గారు ప్రసంగవశమున నీ యంశము నుట్టంకించి పిహెచ్.డి. కి పరిశోధనాంశముగ వర్ధిష్ణువు చిరంజీవి బ్రహ్మానందశాస్త్రికి నిర్దేశించి తత్పర్యవేక్షణ భారమును నాపై నుంచిరి. చి॥ శాస్త్రి సంగీత సాహిత్యములందారితేరిన సవ్యసాచి. స్వతః పండితకుటుంబమునకు చెందినవాడు. గురుకుల క్లిష్టుడై సంగీత సాహిత్యముల నధ్యయన మొనర్చి, వానిసారమెరింగి పూజ్య పితృపాదులగు బ్రహ్మశ్రీ సదాశివ శాస్త్రిగారి "త్యాగరాజ చరిత్ర" హరికథా కాలక్షేపములను బహువారములు విని త్యాగరాజుపై, ఆయన సాహిత్యముపై నభిమానమును పెంచుకొనినవ్యక్తి. అంతే కాదు: శ్రీ త్యాగరాజస్వామి కృతుల నానుపూర్విగ సంతరించి "శ్రీ త్యాగరాజు - రామదర్శనము" మున్నగు విషయముల గూర్చి సోదాహరణ ప్రసంగ మొనర్చుచు శ్రోతలనానందడోలికల నూగించుచు మంచి వక్తగ వాసిగన్నవాడు.

పరిశోధనమున ప్రాగ్రేసరుడై పరిశ్రమించి త్రికరణశుద్ధిగ పయనించి పండిత వర్యుల ప్రశంసకు పాత్రుడైనాడు చిరంజీవి శాస్త్రి. తత్ఫలితమీయుత్తమ నిబంధ వ్యాసము. "స్థానేషు శిష్యనివహైర్వ్వినియుజ్యమానా విద్యా, గురుంహి గుణవత్తర మాతనోతి" యను సూక్తి మా యిరువురియెడ సార్థక మగుననుట ముఖస్తుతి కన్న మాటకాదు. ఉన్నమాటయే.

పరిశోధన ప్రక్రమమున సంగీత సాహిత్య మహారథులనుచేరి వారి మనసు లోని మర్మములనెరిగి సంశయరాహిత్యమొనర్చుకొని సర్వాంగ సుందరముగ నాతనిచే రూపుదిద్దుకొనబడినదీ విశిష్టగ్రంథము. నా పర్యవేక్షణలోనే వెలువడిన దానినిగూర్చి నేను పలుకుటకంటె పరిశోధ లోకమునకే యావని నప్పగించుట లెస్స యని నా తలంపు.

జాతీయాచార్య శ్రీ జోగారావుగారు, గ్రంథకర్త పూజ్యపితృపాదులు బ్రహ్మశ్రీ సదాశివశాస్త్రిగారు, తదితర త్యాగరాజస్వామి భక్తబృందముల యామోద ప్రోత్సాహముచే నీ గ్రంథమచ్చొత్తింపబడి యశేషాంధ్రావళికి మోదమును కల్గింప నున్నదనుట విని, నా యనుమోదమును తెలుపుటకుత్సహించుచున్నాను. ఇట్టి సుకృతియైన చి॥శాస్త్రి కృతి యితర భాషలలోనికియనువదింపబడి తెలుగు తెలియని త్యాగరాజస్వామి భక్తులకు, సంగీతప్రియులకు అందుబాటులోనికి రావలెనని చి॥ శాస్త్రి యట్టి చూపుపెట్టగలడని నా యాకాంక్ష.

ఇట్టి శిష్యరత్నమును నాకందించిన గురువర్యులు ఆచార్య జోగారావుగారికి సప్రశ్రయముగ భక్త్యంజలి ఘటించుచు నాపర్యవేక్షణనంగీకరించి,పరిశోధనగావించి యుభయతారకముగ"పట్టా" నందుకొనినందులకు చి॥ శాస్త్రి నభినందించుచు, నాతనికి నాతని కుటుంబమునకును శ్రీ త్యాగేశ్వరుడు సకలాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని, యున్నత స్థితిని కల్పించవలెనని కోరుచున్నాను.

ప్రబంధకర్తగనే కాక ప్రశస్తవక్తగను ప్రథితిగన్న చిరంజీవి శాస్త్రిలేఖిని నుండి యింకను నిటువంటి యుత్తమ గ్రంథములు వెలువడి సహృదయ హృదయా వర్జకములు కావలెనని యాశంసించుచున్నాను. ఇట్లు,

//ఇతిశమ్//

విద్వజ్జన విధేయుడు

(సం) జోస్యుల సూర్యప్రకాశరావు

డా॥ యం. బాలమురళీకృష్ణ
నెం. 3, కనకశ్రీ నగర్,
కెథడ్రల్ రోడ్, మద్రాసు - 600 086
ఫోన్ నెం : 478192

# అభిప్రాయము

శ్రీ బ్రహ్మానందశాస్త్రి జగమెరిగిన శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారి పుత్రుడు. వీరు శ్రీ త్యాగరాజుని గురించి పరిశోధించి త్యాగరాజు - రామదర్శనము అను గ్రంథమును రచించి, నాకు చూపించి నా అభిప్రాయమును కోరిరి. త్యాగరాజ కీర్తనలు, కృతులు ఏవో నాకు తెలిసినవి కొన్ని అర్థశతాబ్దము పాడితినిగాని, పరిశోధనలను పరిశోధించి అభిప్రాయము తెలిపెడి అర్హత నాకు లేదు. అయినను నా మీద శ్రీ బ్రహ్మానందశాస్త్రికి గల గౌరవము, ప్రేమ నన్ను ఈ "అభిప్రాయము" వ్రాయనుపురిగొల్పినది. పరిశోధనలు రెండు విధములు. జరిగినవాటిని గురించి పరిశోధించి లభించిన ఆధారములవల్ల ఒక అభిప్రాయమునకు వచ్చుట. రెండవది జరిగినవి పునాదిగా భవిష్యత్తును రూపొందించే నిమిత్తం ఉపయోగపడు పరిశోధన.

నేను రెండవ తరగతి వాడిని. నాకు భవిష్యత్తును గురించిన ఆలోచనలు తృప్తిని కల్గజేయును. చారిత్రక పరిశోధకులు చాలామంది గలరు. వారు ఒకరి నొకరు ఎన్నడూ అంగీకరించలేదు. నేర్చుకున్నది బాగా పాడువాడు గాయకుడు. విషయమును తెలిసినవాడు విద్వాంసుడు. వీటినాధారముగా క్రొత్త సృష్టిని చేయగలవాడు కళాకారుడు.

శ్రీ త్యాగరాజు వాగ్గేయకారుడు. వాగ్గేయకారుడే ఉత్తమ తరగతికి చెందిన గాయకుడని కొన్ని గ్రంథములు తెల్పుచున్నవి. త్యాగరాజు, త్యాగరాజస్వామి అని శ్రీవారిని అంటూ వుంటాము. ఈ మధ్య త్యాగరాజును గురించిన చైతన్యం ప్రబలంగా గానవస్తోంది. మరీ ఈ మధ్య ఈ చైతన్యం అన్నమయ్యకు మళ్ళింది. మంచిదే. త్యాగరాజు అరవంలో త్యాగరాజయ్య అని సంతకం చేసేవారు. వారిని బీదవానిగా, భిక్షకునిగా, దీనునిగా నేను భావించలేను,

వారు ధీరోదాత్తులు. అనేక మంచి కార్యములు చేసినారు. వచ్చినవారికి సకలోపచారములు చేసి సంతోషపరచినారు. వారు పుట్టినది తిరువైయ్యారులోనే అని నా నమ్మకం. శ్రీవారి శిష్యుల కీర్తనలలోనూ, శ్రీ త్యాగరాజయ్య "మణిరంగు" రాగంలో "నీకు సరి ఎవరురా" అనే కృతిలో వారే చెప్పుకున్నారు. "పంచనద పురమున జనించిన నా పాపముల తీర్చిన ప్రణతార్తిహరుడవు" అని. దీనినిబట్టి శ్రీ త్యాగరాజయ్య జనించినది తిరువైయ్యారులోనే అని నా నమ్మకము. శ్రీవారి శిష్యులు వ్రాసిన ప్రతి కీర్తనలోనూ శ్రీవారు తిరువైయ్యారులోనే అవతరించిరని పేర్కొని పాడినారు. అట్లుగాక పరిశోధకులు శ్రీ త్యాగరాజస్వామి తిరువైయ్యారులో పుట్టలేదు, తిరువారూరులోనే జనించిరి అని అన్నచో నాకేమీ బాధ కల్గదు. కారణం తిరువారూరుగాని, తిరువైయ్యారుగాని నా స్వంతవూరుకాదు కాబట్టి. "ఉంఛవృత్తిభజన ఉన్నతముగా చేసితి" అన్నారు. సంప్రదాయముకొరకు ఉంఛవృత్తి చేసిరి. వారు రెండు ఇళ్ళకు మాత్రమే వెళ్ళిరి. మరొక వీధికి వెళ్ళినట్లు ఆధారములులేవు. కొంతమంది పరిశోధకులు ఈమధ్య స్వాతితిరుణాళ్కు ఏమీతెలియదు, రాదు అన్నారు. భవిష్యత్తులో త్యాగరాజుకు కూడ ఏమీతెలియదు అని అంటే ఆశ్చర్యపడనక్కర లేదు. నేను బ్రతికి ఉండగానే నే పాడేది శాస్త్రీయ సంగీతంకాదు అని వెనకాల ప్రచారం చేయడంలేదా? అలాగే భవిష్యత్తులో నే రచించిన కీర్తనలు, నే రచించినవి కాదు అని అనవచ్చు.

ఏదిఏమైనా శ్రీ త్యాగరాజయ్యగారు సంగీత సృష్టికర్త. గొప్పకవి. గాయకుడు. రాగాల స్వరూపాలను సృష్టించి లోకమునకు అర్పించిన మహామహుడు. ఆయనను పేదవానిగా, బిచ్చమెత్తుకుని మెతుకులు తిన్నవానిగా నిరూపించడానికి పరిశోధనచేసి, ఒకవేళ కృతకృత్యులైతే అది వారి సంతోషానికి ఉపయోగకారి అయితే నాకేమీ బాధలేదు. కృతివేరు, కీర్తనవేరు అనినేనంటే కొందరు కాదన్నారు. నేను ఏది అన్నా అది "కాదు" అనడంలో కొందరికి సంతోషం. వారికి సంతోషం కల్గచేయడానికి నేను అంటూ వుండడంలో నాకు సంతోషం.

కృతి కీర్తన ఒకటే అయితే వారికి దృష్టిదోషం అని చెప్పాలి.

చాల విషయాలను సవివరంగా ఈ గ్రంథంలో చెప్పబడి, శ్రీ త్యాగరాజ చరిత్రకు ఒక నూతన చైతన్యం కల్గించారు శ్రీ బ్రహ్మానందశాస్త్రి.

ఈ పరిశోధనకు వీరికి డాక్టరేటు లభించింది. ఇందుకు వీరు తగినవారనీ, ఇటువంటి మంచిపనులు ఇంకాచేస్తూ భావితరాలవారికి మహోపకారం చేస్తారని, వీరికృషికి ఎప్పుడూ ఆదరణ లభించి ఆయురారోగ్య భోగభాగ్యాలతో తులతూగుతూ వుండాలని ఆశీర్వదిస్తున్నాను.

ఇట్లు,

డా॥ యం. బాలమురళీకృష్ణ



శ్రీరామశ్శరణంమమ

త్యాగరాజ గురుదేవ సదాగతిర్మే

# త్యాగరాజు జీవితోదంతము

సీ॥ ఏ కళా కలితుండు లోకోపకారియై
నౌకాచరిత్రమున్నతిరచించె
నే దయాపరుడు ప్రహ్లాద భక్తివిజయ
మను ప్రబంధమొనర్చి వినుతికెక్కె
నే మహాత్ముడు రామనామాంకితంబగు
వివిధకృతుల్‌జేసి భువిని నిలిపె
నే నయశాలి నానానూనగానతా
నానుపమాన విజ్ఞానియయ్యె
రమణ నేగుణి వేంకటరమణ భాగ
వత గృహంబున పరనిరూపిత సురూపు
డయ్యె నాతని త్యాగరాజార్యవర్యు
ధైర్యవిజితా మరాహార్యుదలతునెపుడు

కర్ణాటక సంగీత ప్రపంచమునకు శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ త్యాగరాజస్వామి, శ్రీ ముత్తుస్వామి దీక్షితులు త్రిమూర్తులు. ఈ మూర్తిత్రయమున శ్రీ శ్యామశాస్త్రి జ్యేష్ఠులు. ఆయన దేవీ ఉపాసకులు. ఆయన యిష్టదైవము కామాక్షి. శ్యామశాస్త్రి

కీర్తనలు "శ్యామకృష్ణ" అను ముద్రతోనుండును. శ్రీ శ్యామశాస్త్రిగారిని శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి గారిట్లు కీర్తించినారు.[1]

శరణు శరణు శ్యామకృష్ణ సద్గురూత్తమ
అరమర సేయకమమ్మ ఆదరింపుమా ॥శరణు॥
పిలచి దేవితోడ నీవు పలికినాడవు
తలపగ జీవితములోన ధన్యతముడవు
పరదేవీ పదసేవక సురుచిర సుమధురగాయక
స్వరరాగ భావపోషక పరమభక్త సుఖదాయక ॥శరణు॥

శ్యామశాస్త్రివాక్కు కామాక్షీదేవి కృపాకటాక్షమున వికసించి, నాద ప్రవాహమై శ్రోతలను పరవశులను జేయుచున్నది.

త్రిమూర్తులలో ద్వితీయుడగు త్యాగయ్య అద్వితీయుడై తొంబదియాఱుకోట్లు రామనామము జపించి మతభేదములేక సర్వదేవతాపరముగ కృతులను రచించి, ప్రత్యక్షముగ శ్రీరామచంద్రుని జూచి తరించిన రామభక్త శిఖామణి. శ్రీ త్యాగరాజ కృతులు "త్యాగరాజనుత" అను ముద్రతోనుండును. సంగీత త్రిమూర్తులలో కడపటివారగు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు సుబ్రహ్మణ్యోపాసకులు. నవగ్రహ కీర్తనలు, నవావరణ కీర్తనలు, సర్వదేవతా పరములగు కీర్తనలను అద్భుతమగు పాండిత్య ప్రతిభతో రచించి తరించిన మహనీయులు. శ్రీ దీక్షితులవారు సుబ్రహ్మణ్యస్వామి కృపనొందిన వేదాగమ పండితులు. వీరి కృతులు జీవగమక లక్షణములతో వెలుగుచు సంగీత కళకు అమర కీర్తినాపాదించుచున్నవి.

శ్యామశాస్త్రి 1762 వ సంవత్సరమున, త్యాగరాజస్వామి 1767 వ సంవత్సరమున, ముత్తుస్వామి దీక్షితులు 1772 వ సంవత్సరమున జననమందిరి. ఈ ముఖ్వురు ప్రాతః స్మరణీయులు. ఈ మూర్తిత్రయకాలమే కర్ణాటక సంగీతమున కత్యుచ్చదశ. ఆ దశలో త్యాగరాజు సంగీత జ్యోత్స్నను కుంభవృష్టిగా వర్షించిన నిండుచంద్రుడు. త్యాగరాజు రామభక్తి సామ్రాజ్యపట్టభద్రుడు. ఆయన భక్తి గానసుధాప్రవాహము రామాభిషేకమునకు పరమ తీర్థమైనది. శ్రీ త్యాగరాజస్వామి భగవదవతారము. ఈ విషయమును త్యాగయ్యగారే స్వీయ రచనయగు "దాశరథే

1. తెలుగు సంగీత మహర్షులు.

నీ ఋణము దీర్పనాతరమా" అను తోడి రాగకృతియందు చెప్పికొనినారని కీ. శే. శ్రీహరినాగభూషణంగారు వ్రాసి యున్నారు.[1]

ప॥ దాశరథే నీ ఋణము దీర్పనాతరమా పరమపావననామ॥

అ॥ప॥ ఆశదీర దూరదేశములను ప్రకాశింపజేసిన రసిక శిరోమణి॥

చ॥ భక్తిలేని కవిజాలవరేణ్యులు-భావమెరుగలేరని కలిలోజని
భుక్తిముక్తి కల్గునని కీర్తనముల బోధించిన త్యాగరాజ
కరార్చిత ॥దా॥

"ఓ రామచంద్రా ! నీవు నాకు దిగంత విశ్రాంతమగు కీర్తిని ప్రసాదించి యున్నావు. దానంజేసి నేను నీకు బహుగా ఋణపడి యున్నాడను. అట్టి నా ఋణము నెటుల తీర్చుకోగలను ? తీర్చుకోలేను గాని యొక విధముగా తీర్చి కొన్నాను. ఎటులన ఈ కలియుగంబున "కవిజాలవరేణ్యులు" అనగా పండితుల నెడు ఖ్యాతివహించిన మనీషులుగూడ నీభావము, అనగా నీసత్తారూపమగు యథార్థ స్వరూపమును తెలిసికోలేక మృషావాదములు సల్పుచున్నారు. అట్టిచో పామరుల విషయమిక చెప్పనేల ? దానంజేసి పండిత పామరులు సర్వులు నీ స్వరూపమును గుర్తించి తరించుటకై కీర్తనములు రచించి బోధించి యున్నాడను. అనగా దద్వార మున భగవత్తత్త్వమును, తద్ జ్ఞానము సాధనోత్తమంబగు భక్తిని నిరూపించి యున్నాడను. ఇందుకొఱకే నేను భూలోకమున జన్మించి యుంటిని. ఈ విధముగా నీకీర్తిని నేనును లోకమున జాటియున్నాడను. కాన నీ ఋణ మీరీతి నేను దీర్చి కొన్నాడను" అని యీ కీర్తన యొక్క సంగ్రహ తాత్పర్యము.

ఈ కీర్తనము యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం
పరిత్రాణాయ సాధునాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే

మొదలుగాగల భగవద్గీతోక్తుల ననుగమించునదై శ్రీ వారు భగవదవతారమని స్వీయవచనములచేతనే చాటుచున్నది.

1. భారతి-సర్వజిత్ భాద్రపదము.

శ్రీ త్యాగరాజస్వామి శంభు, నారద, గణపతి, ఆంజనేయ, వాల్మీకి అంశలతో జనన మందినారని విమర్శకుల తలంపు. త్యాగయ్య కృతులు ఉపనిషత్సూక్తులకు ఆలవాలములని, ఆకారణముగ ఆయన కృతులకు "త్యాగబ్రహ్మోపనిషత్తు"లను పేరు కలిగినదని బహుపండితాభిప్రాయము.

'Thyagaraja combined in himself the five amsas of Sambhu, Narada, Ganapathi, Anjaneya and Valmiki. In the aspect of music, he is Narada, in the interpretation of Nada Sankara, a real Bhakta as Anjaneya, Abhayankara and exposer of Pranava as Ganapathi and a veritable Valmiki in his episode from Ramayana. Hence his compositions contain the Sukthis of Upanishads and are known as 'Thyagabrahmopanishat'even today renowned scholars and Vidwans. Narada initiated him into the mysteries of Ganakala by presenting Swerarnava.[1]

త్యాగయ్య సహజ వాగ్గేయ కారులు. మహాకవి. త్యాగయ్యగారి ముఖ్య శిష్యులలో నొకరగు శ్రీ వాలాజాపేట వేంకటరమణ భాగవతులు తాము వ్రాసిన గుర్వష్టకశ్లోకములలో అయ్యగారి వైభవమునిట్లు చాటినారు.

> వ్యాసోనైగమ చర్చయా మృదుగిరా వల్మీకజన్మాముని:
> వైరాగ్యేశుక ఏవ భక్తివిషయే ప్రహ్లాద ఏవస్వయం
> బ్రహ్మనారదఏవచాఽప్రతిమయో:సాహిత్యసంగీతయో:
> యోరామామృతపాన నిర్జిత శివస్తం త్యాగరాజంభజే.

శాస్త్ర చర్చయందు వ్యాసుడు, మృదువైన వాక్యములను పలుకుటలో వాల్మీకి, వైరాగ్యమున శుకయోగీంద్రులు, భక్తి విషయమున స్వయం ప్రహ్లాదులు, సాహిత్యమున బ్రహ్మ, సంగీతమున నారదుడు, రామనామామృత పానమున శివుని జయించినవాడునగు త్యాగయ్య ఆంధ్రుడగుట ఆంధ్రుల పుణ్యపరీపాకము.

---

1 నాట్యకళ – నాదయోగి – త్యాగరాజు – శ్రీ M. R. శాస్త్రి

# త్యాగయ్య పూర్వీకులు - జననము

త్యాగయ్య పూర్వులు కర్నూలు జిల్లా కాకర్ల గ్రామమునకు చెందినవారు. కాకర్ల యను గ్రామము కంభమునకు నాలుగు మైళ్ళ దూరమున గలదు. త్యాగయ్య ముత్తాత పంచనదబ్రహ్మము. వీరిది ములకనాటి వైదికశాఖ. భారద్వాజసగోత్రము. ఆపస్తంభ సూత్రులు. వీరిని విజయనగర ప్రభువులు హిందూ ధర్మ ప్రచారమునకై దక్షిణ దేశమున కంపిరి. తంజావూరు జిల్లా "తిరువారూరు"ను గ్రామమున పంచనదబ్రహ్మము నివాస మేర్పరచుకొనిరి. వీరికి ఐదుగురు కొమరులు. సదాశివబ్రహ్మము, సదానందబ్రహ్మము, సచ్చిదానందబ్రహ్మము, బాలబ్రహ్మము,గిరిరాజబ్రహ్మము. సదాశివబ్రహ్మము, సదానందబ్రహ్మము బాల్యముననే యోగులై "తిరువణ్ణామలై"సమీపముమున్న "సదానందకోన" అను కొండగుహలో తపము చేసికొనుటకై వెళ్ళి తిరిగి రారైరి. సచ్చిదానందబ్రహ్మము, బాలబ్రహ్మములను గురించిన వివరములు తెలియరాలేదు. వారు లబ్ధప్రతిష్ఠులు కాదు. కనిష్ఠుడగు గిరిరాజబ్రహ్మము గిరిరాజకవిగా పేర్వడసినాడు. ఈయనకు "సుబ్రహ్మణ్య భారతి" యను నామాంతరము కలదు. కొందరు పండితులు దేశ కాలములు సరిపోవుచున్నవని క్రీ.శ. 1684 — 1712 సంవత్సరముల నడిమి కాలమున తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువు శహజీ ఆస్థానాంధ్రకవియగు గిరిరాజకవి, త్యాగయ్య పితామహులగు గిరిరాజకవి ఒకరేనని భ్రమపడి యున్నారు. కాని శహాజీ ఆస్థానాంధ్రకవియగు గిరిరాజకవి యింటిపేరు దర్భావారు. ఈ గిరిరాజకవి శహాజీ యనుజుడగు శరభోజీ ఆస్థానమును కూడ ఆశ్రయించి యుండెను. శరభోజి రాజ్యపాలనాకాలము 1712 — 1727. వీరు ఆపస్తంబసూత్రులు. లోహిత గోత్రులు.[1] ఈ వివరములన్నియు ఆచార్య శ్రీ యస్వీ. జోగారావుగారు తమ "ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర" ద్వితీయభాగము, పుట 314 నందును, "సప్తతంతువు" అనువ్యాస సంపుటమున "త్యాగరాజు — కృతులు" అను వ్యాసమునందు ఇచ్చియున్నారు. త్యాగయ పితామహులగు గిరిరాజబ్రహ్మము సంగీత సాహిత్యము లందసమానశేముషీధురంధరులై

1. చూ. తంజావూరు సరస్వతీమహలు — గ్రంథ దీపిక నెం. 353
కవి గిరి రుక్మాంగద చరిత్ర

శహాజీ ఆస్థాన గాయకులైరి. వీరనేకములగు పదములను, కీర్తనలను వ్రాసిరి. కాంభోజీ రాగములోని 'మాయా నీ వంచన నడవదు' అను వీరి కీర్తన బహుళ ప్రచారము నందియున్నది. గిరిరాజబ్రహ్మము వ్రాసిన కీర్తనలు 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' అను గ్రంథమున నీయబడినవి. త్యాగయ్య పితామహులగు గిరిరాజ బ్రహ్మము శహాజీ సమ్మానము అందుకొనినట్లు 'కృతి మణిమాల' అను గ్రంథము వలన తెలియుచున్నది. గిరిరాజబ్రహ్మమునకు ఐదుగురు కొమరులు. అందు కనిష్ఠుడు రామబ్రహ్మము. ఈయన గొప్ప పండితుడు. భాగవత శివపురాణ నిష్ణాత. రామభక్తి పరుడు. పేరొందిన రామాయణ పౌరాణికుడు. యదృచ్ఛాలాభ సంతుష్టుడై, నిరంతర రామనామ జపశీలియై బ్రహ్మానందమును పొందియున్న కారణమున నతడు రామబ్రహ్మాభిధానుడైనాడు. రామబ్రహ్మముగారు సీతమ్మ యను కన్యను పరిణయము చేసికొనిరి. కొందరామెను 'శాంతమ్మ' అనుచున్నారు. వాలాజాపేట వేంకటరమణ భాగవతులు వ్రాసిన 'త్యాగరాజ స్వామి జీవితచరిత్ర' యందు రామబ్రహ్మముగారి భార్య సీతమ్మ అని యున్నది. ఈమె సుగుణఖని. భర్తకనువ్రత. రామబ్రహ్మముగారికి పంచాపకేశన్ (జప్యేశుడు), రామనాథ బ్రహ్మము అను నిరువురు కుమారులు కలిగిరి. జప్యేశ్య, రామనాథబ్రహ్మము లిరువురు తిరువారూర జననమందిరి. త్యాగయ్య జీవితమును గురించి వివరముగ తెలియజెప్పిన ఖ్యాతి ఆచార్య సాంబమూర్తిగారికే దక్కినదనుట సత్యదూరము కాదు. సాంబమూర్తిగారు వ్రాసిన వివరములను కొన్నికొన్ని తావుల చాల అసందర్భముగ నున్నవి. జప్యేశుడు తిరువయ్యార్‌నందు జనన మందినట్లు శ్రీ సాంబమూర్తిగారు వ్రాసినారు.

'The first son was named Jalpesan because he was born in Tiruvaiyar. It is usual to name the first son born in a family after the name of the presiding Deity of the place. Panchanadisa, Panchapakesa, and Pranatarthihara are the other names of the Deity of the temple of Tiruvaiyar' [1].

సాంబమూర్తిగారి వ్రాతనే ఆధారము చేసికొని తిరుమల - తిరుపతి దేవస్థానము వారు ప్రచురించిన పుస్తకమున డా॥ కె. సర్వోత్తమన్‌గారు కూడ "రామబ్రహ్మం తిరువైయ్యార్‌లో వున్నప్పుడు పెద్దకొడుకు పుట్టాడు. అందువల్ల ఆ గ్రామంలోని స్వామి పేరే జప్యేశుడని మొదటి కొడుక్కి పెట్టాడు" అని వ్రాసిరి.[2]

1. Great composers II -Thyagaraja Revised Edition P.18.
2. త్యాగరాజు పే. 8

రామబ్రహ్మముగారు తమ ద్వితీయ పుత్రునకు రామనాథమను పేరుపెట్టుటకు గల కారణమును సాంబమూర్తిగారిట్లు వ్రాసినారు.

"The second son was named Ramanathan because Ramabrahmam was a devotee of Sri Rama and performed puja to the Rama Vigraha in his house every day".

(Great composers II. Thyagaraja – P-18.)

జప్యేశుడు తిరువయ్యార్‌లో జననమందినమాట వాస్తవము కాదు. జప్యేశుడే కాదు; నిజమునకు రామనాథము, త్యాగయ్యలు కూడ తిరువయ్యార్‌న జనన మంద లేదు. ముమ్వురును తిరువారూరున జన్మించిరి. జపేశ్య, రామనాథములు బాల్యము వీడి యౌవనమున నడుగిడుచు కుచేష్టితావలంబకులగుచు మూర్ఖులై జననీ జనకుల మనస్తాపమునకు కారకులైరి.

"ఋణకర్తా పితాశత్రుః మాతా చవ్యభిచారిణీ
భార్యా రూపవతీశత్రుః పుత్రశ్శత్రుర పండితః"

అనికదా సూక్తి.

జప్యేశ, రామనాథబ్రహ్మముల వలన రామబ్రహ్మము దంపతులు పొందిన మానసిక వ్యధను గూర్చి వాలాజాపేట వేంకటరమణ భాగవతులు తాము వ్రాసిన త్యాగరాజ చరిత్రమున వ్రాసిరి. వీరు త్యాగయ్య జీవితచరిత్రను త్యాగయ్యగారి ద్వితీయ వివాహ పర్యంతమే వ్రాసిరి. అప్పటికి త్యాగయ్య వయసు 23 సంవత్సరములు. వేంకటరమణ భాగవతులు వ్రాసిన త్యాగయ్య జీవిత చరిత్రకు త్యాగయ్య శిష్యుడగు తంజావూరు రామారావు ఆమోద ముద్ర లభించినది. తంజావూరు రామారావు త్యాగయ్య కంటె వయసున రెండేళ్లు మాత్రమే చిన్నవాడు. రామారావు త్యాగయ్యకు అంతరంగిక శిష్యుడు. త్యాగయ్యతో చనువుగ మాటలాడు నవకాశము రామారావుకు మాత్రమే కలదు. వాలాజాపేట వేంకటరమణ భాగవతుల కుమారుడు కృష్ణస్వామి భాగవతార్ త్యాగయ్య జీవిత విశేషములను కొలదిగ వ్రాసి యుండెను. అది యేమి దురదృష్టమోగాని వేంకటరమణ భాగవతులు త్యాగయ్య జీవిత చరిత్రను పూర్తిగ వ్రాయరైరి. వ్రాసియుండినను నేడది లబ్ధమగుట లేదు. వారు వ్రాసినంతవరకు త్యాగయ్య జీవితచరిత్ర 1947 ఆంధ్ర పత్రిక వ్యయనామ సంవత్సర ఉగాది సంచికలో అచ్చయినది.

త్యాగయ్య జీవిత చరిత్రను సుబ్బరామ దీక్షితులు తమ 'సంగీత సంప్రదాయ ప్రదర్శిని' అను గ్రంథమున వ్రాసిరి. త్యాగయ్య నిర్యాణము నాటికి సుబ్బరామ దీక్షితుల వయసు ఎనిమిదేండ్లు. సుబ్బరామ దీక్షితుల వ్రాతలకు, వేంకటరమణ భాగవతుల వ్రాతలకు చాల వ్యత్యాసము గలదు. ఇది వాస్తవమని చెప్పదగిన త్యాగయ్య జీవితచరిత్ర నింతవరకెవ్వరును వ్రాయలేరి.

"మొదటి ఇరువురు పుత్రులు పుట్టిన రాజస తామస గుణములే స్వరూపముగా పుట్టినవో అనునటులుండిరి. వీరు చేయు దుష్టపనుల వలన తల్లిదండ్రులు అతి వ్యసనము పొందుచుండిరి." ఈ పరిస్థితులలో సీతాంబ తృతీయ గర్భము దాల్చినది. తృతీయ గర్భమున నెటువంటి పుత్రుడు పుట్టునో అని కుందుచుండిరి. శ్రీ వేంకట రమణ భాగవతులా సందర్భమున నిట్లు వ్రాసిరి.

"ఇటులుండ వీధులయందుండువారు ఇరువురి దుష్టచర్యలకు సహించక తల్లి దండ్రులను నొప్పించుచుండిరి. రామబ్రహ్మస్వామివారును వీరి ధర్మపత్నియగు సీతాంబవారును, ఇరువురు పుత్రుల దుష్టచేష్టల వీధివారితో కలహమునకు సమాధానము చేయుటయే ఒక్క పనిగానున్నది. భగవద్భక్తి చేయుటకు అభ్యంతరముగా నున్నది. ఇపుడు మూడవ గర్భము పూర్ణంబయ్యె ఈ గర్భమున ఎటువంటి పుత్రుడు పుట్టునో, వాని వల్ల ఏమేమి సంకటముల నొందవలసియున్నదో ఆపేక్షింపకయే భగవంతుడు సంతానము నిచ్చుచున్నాడే అని దంపతులు ఒకరినొకరు వ్యసనముచే నిరాహారులై ఆ రాత్రి నిదురించిరి.

ఆ రాత్రి చతుర్థయామమున రామబ్రహ్మము దంపతులకు భూసురుడొకడు స్వప్నమున దోచి రామబ్రహ్మము చేయి పట్టుకొని "తృతీయ గర్భము ఏర్పడినదని వగవకుము. ఈ తృతీయ గర్భమున జన్మించిన పుత్రుడు నీ వంశమునకు కీర్తిని తెచ్చి ఇహపరసాధకములగు కృతులకు పెక్కింటిని రచించి లోకుల కందించును. శిష్యులకనేకులకు సంగీత పాఠములను చెప్పును. నేను నారదాంశమునను, వాల్మీకి అంశమునను, సరస్వతీ అంశమునను జననమందెదను" అని పలుకుచుండ జటా వల్కలధారియగు భూసురుడు పరుగున వచ్చి "స్వామీ ! నా గోత్రమున మీరు ఉద్భవించుట వలన నా అంశమునుకూడ చేర్చవలెను. శ్రీరాములవారికి విందు భోజనముల నేర్పాటు చేయుటలో కాలము గడచుటతో క్షిప్రము చేయుటకు వీలుపడినది

కాదు" అని పలికెను. రామబ్రహ్మము చేయిపట్టుకొని ఆ ఊరి ఆలయము వరకు పిలుచుకొని వెళ్ళిన బ్రాహ్మణుడు రామబ్రహ్మముతో "ఇపుడు వచ్చినవాడు భరద్వాజ మహర్షి యనిచెప్పి — నారద, వాల్మీకి, సరస్వతి, భరద్వాజ, నా అంశమొత్తము ఐదంశములతో నీకు పుత్రుడు పుట్టును. నేను తిరువాయూర వెలసియున్న త్యాగేశ్వర స్వామిని. నీకు కలుగబోవు తృతీయ పుత్ర రత్నమునకు నా పేరు పెట్టవలయు"నని చెప్పి అదృశ్యుడయ్యెను.

రామబ్రహ్మము దంపతులు నిదురలేచి తమకు గలిగిన స్వప్నమును గురించి ఒకరికొకరు చెప్పుకొని, ఉదయాత్పూర్వము కలుగు స్వప్నము సద్యఃఫలము నిచ్చునని సంతసమందిరి. తనను ఆలయమునకు తీసికొని వెళ్ళిన వ్యక్తి త్యాగేశ్వర స్వామి యని తెలిసికొని బ్రహ్మానందపడినాడు రామబ్రహ్మము. ఆలయమున కేగి త్యాగేశ్వరస్వామికి విశేషార్చనలు సలిపినాడు. పూజాదికముల నిర్వర్తించుకొని ఇంటికి తిరిగి వచ్చినాడు. స్వప్నఫలము కొరకు ఎదురుతెన్నులు చూచుచున్నారు రామబ్రహ్మము దంపతులు.

స్వప్నము వచ్చిన ఐదారు రోజులకు రామబ్రహ్మము దంపతులకు పుత్రోదయమయ్యెను. పదునొకండవ దినమున జాతకర్మాదులు సలిపి 'త్యాగరాజ' అని నామకరణము చేసి వంశాచారము ప్రకారము 'త్యాగబ్రహ్మ'మనుపేర పిలుచుచుండిరి. త్యాగయ్య జననము సర్వజిన్నామ వైశాఖ శుద్ధ సప్తమి సోమవారము (4-5-1767). సంగీత త్రిమూర్తులగు శ్యామశాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు కమలాలయ క్షేత్రమైన తిరువారూరనే జననమందుట విశేషము.

జననాత్కమలాలయే దర్శనాచ్చ చిదంబరే
స్మరణాదరుణాచలే కాశ్యాంతు మరణాన్ముక్తిః

కమలాలయ క్షేత్రమున జన్మించినంత మాత్రమున ముక్తి నొందుదురని ప్రతీతి. అట్టి కమలాలయ క్షేత్రమున జన్మించిన కర్ణాటక సంగీత ప్రపంచమునకు మూర్తిత్రయమనదగు శ్యామశాస్త్రి, త్యాగరాజు, ముత్తుస్వామి దీక్షితులు నాదోపాసన మూలమున ముక్తినొందిరి. ఈ ముప్పురు జీవన్ముక్తులు. (గీతాద్యనఖిలో నిషత్సార భూత జీవన్ముక్తుడగుటకు సీతావర సంగీత జ్ఞానము ధాత వ్రాయవలెరా. అని త్యాగయ్యగారు).

పలువురు పండితులు త్యాగయ్య వైశాఖ శుద్ధ షష్ఠినాడు జనన మందిరని వ్రాసిరి. త్యాగయ్య పుట్టిన దినము షష్ఠి యగుట నిజమేకాని, షష్ఠి ఘడియలు వెళ్ళి సప్తమి వచ్చిన తరువాతనే జననమందిరి. ఆ దినమున 14 ఘడియల 50 విఘడియల వరకు మాత్రమే షష్ఠి యుండెను. త్యాగయ్య 14 ఘడియల 56 విఘడియలకు జననమందెను.

(శ్రీ త్యాగరాజస్వామివారి జాతకము అనుబంధమున చూడనగును.)

వేంకటరమణ భాగవతులు వ్రాసిన త్యాగయ్య జీవితము ప్రకటింపబడునంత వరకు అనగా 1947 సంవత్సరము వరకు త్యాగయ్యగారు 1759లో జననమందినట్లు శ్రీ సాంబమూర్తిగారు 1934 సంవత్సరమున (Syama Sastry and other famous figures) అను గ్రంథమున వ్రాసిరి. సంగీత సంప్రదాయ ప్రదర్శిని గ్రంథకర్త సుబ్బరామ దీక్షితులు త్యాగయ్య 1770వ సంవత్సరమున జన్మించినట్లు వ్రాసిరి, శ్రీ పంజు భాగవతార్, శ్రీ నరసింహ భాగవతార్, శ్రీ కె. వి. శ్రీనివాసయ్యంగార్ – సయితము త్యాగయ్య 1759 సంవత్సరమున జనన మందినట్లు వ్రాసిరి. 1947 సంవత్సరమున వాలాజాపేట వేంకటరమణ భాగవతులు వ్రాసిన త్యాగయ్య జీవితము ప్రకటింపబడిన తరువాత సాంబమూర్తిగారు 1956 సంవత్సరమున ("Great composers Book II - Thyagaraja") ప్రచురించిన పుస్తకములో త్యాగయ్యగారు 1767 సంవత్సరమున జనన మందినట్లు వ్రాసి తమ పొరపాటును సరిదిద్దుకొనిరి. Preface to the first Edition లో సాంబమూర్తి గారు పై పుస్తకమును గురించి ఇట్లు వ్రాసిరి.

'I am glad that I am able to publish this work, just on the eve of the composer's 108th anniversary in January 1955'.

త్యాగయ్యగారు తాను 'రామబ్రహ్మ తనయుడ'నని చెప్పికొనినారు.

రామబ్రహ్మ తనయుడౌ త్యాగరాజు తాబాడుచు నూచగ

(దొరకునా ఇటువంటి సేవ — బిలహరి)

శ్రీ మత్పంచనదంబన
భూమిని విలసిల్లునట్టి పురవరమున శ్రీ
రామ స్వరూపు డనదగు
రామ బ్రహ్మార్యసుతుడ రాగర హితుడన్

(ప్రహ్లాదభక్తి విజయము)

శ్రీరామ బ్రహ్మతనయ త్యాగరాజేన నిర్మితం
ప్రహ్లాద భక్తివిజయ ప్రబంధం భుక్తి ముక్తిదం
యే గాయంతి సదాభక్త్యా యే శృణ్వంతిచ శ్రద్ధయా
యే పఠంతి సదా ప్రీత్యా తేషాం సర్వాఘనాశనం.

(ఫలశ్రుతిః ప్రహ్లాదభక్తి విజయము)

త్యాగయ్యగారు రామబ్రహ్మ సుపుత్రులని, రామనామ సుఖాత్ములని, రామచంద్ర స్వరూపులని శ్రీవారి శిష్యులు వాలాజాపేట వేంకటరమణ భాగవతులు తాము వ్రాసిన గుర్వష్టక శ్లోకములలో నుడివినారు[1]. త్యాగయ్యగారు తన తల్లిదండ్రుల పేర్లను "సీతమ్మ మాయమ్మ-శ్రీరాముడు మాకు తండ్రి" అను వసంతరాగ కీర్తనమున భావగర్భితముగచెప్పినారనిపలువురు పండితుల యభిప్రాయము. వాలాజాపేట తాళపత్రప్రతులలో (Walajapet Manuscripts) కూడ త్యాగయ్యగారి తల్లి పేరు సీతమ్మగారనియే కలదు.

సీతాంబాగర్భ జాతాయ పార్వతీ కమలేతిచ
ద్విభార్యాసంయుతాయ శ్రీ త్యాగరాజాయ మంగళమ్

కావున కొందరనునట్లు త్యాగయ్యగారి తల్లిపేరు శాంతమ్మగారు కాక సీతమ్మగారై ఉండవలెను. త్యాగయ్య తనకు కలిగిన ఏకైక పుత్రికకు "సీతాలక్ష్మి" యని నామకరణము చేయుటకూడ నిందుకు దోహదము చేయుచున్నది. తన పితామహులగు గిరిరాజకవి పేరును గూడ "గిరిరాజ సుతాతనయ" అను బంగాళ రాగకృతియందు ధ్వనింపజేసిరని ప్రతీతి. త్యాగయ్య మాతామహులు వీణకాళహస్తి అయ్యర్.

1. రామబ్రహ్మ సుపుత్రాయ రామనామ సుఖాత్మనే
రామచంద్ర స్వరూపాయ త్యాగరాజాయ మంగళం.

# బాల్యము

శుక్లపక్ష క్షపాకరునివలె త్యాగరాజు దినదిన ప్రవర్ధమానుడగు చుండెను. పువ్వు పుట్టినతోడనే పరిమళము తీసు తెలియునన్నట్లు త్యాగరాజు తండ్రిచేయు రామ పూజలో పాల్గొనెడివాడు. తమ యింటనున్న ఏకపీఠమున గల రామ పంచాయ తనమునుగని రోమాంచితదేహుడై నిశ్చేష్టుడగును. దేవతా విగ్రహములను తనివితీర పూజించుచుండును. హరిగాథలను వచియించు వారి సరసనజేరి ఆ హరిగాథలను చెవికోసికొని వినును. భగవన్నామము చేయుచు వచ్చు భిక్షుకులకే భిక్షమిడుచుండెడి వాడు. హరినామమును తక్క అన్య భాషణము సేయు బిచ్చగాండ్రను పొమ్మని గద్దించును. తోడి బాలురతో నాడబోడు. తల్లి సీతమ్మగారు చక్కని గాయకురాలై పురందరదాసు, జయదేవ, రామదాసు కీర్తనలను పాడుచుండ తన్మయుడై వినును. తండ్రి రామాయణ పురాణమును చెప్పుచుండ అనక్తితో వినును. ఇవ్విధముగ త్యాగయ్యగారు దైనందిన జీవితమును గడపుచు పంచవర్ష ప్రాయుడయ్యెను.

ఐదు సంవత్సరముల వయస్సున త్యాగయ్యగారికి జబ్బు చేసినది. పరిస్థితి విషమించినది. తల్లిదండ్రులు చాల భయపడినారు. రామబ్రహ్మము దంపతులు అప్పటికే ముందు కలిగిన ఇరువురు కుమారుల వలన అప్రతిష్ఠ పాలైనారు. వారి ఆశలన్నియు త్యాగయ్యగారి మీదనే. కనిష్ఠ పుత్రుడైన త్యాగయ్య జన్మించుటకు ముందు తమకు స్వప్నమున దోచి త్యాగేశుడు "మీకు కలుగనున్న కుమారుడు సంగీత సాహిత్య కళాకోవిదుడుకాగలడని, అతని వలన మీ వంశము యొక్క కీర్తి ఆచంద్రతారార్కము నిలుచుననుచు" తమతో పలికిన మాటలను తలచుకొని తలచు కొని దుఃఖించినారు రామబ్రహ్మము దంపతులు.

పరిస్థితి ఆందోళనకరముగ పరిణమించుటతో తమ యాశలు అడియాసలైన వని భావించినారు. అట్టి సమయమున సన్న్యాసి యొకడువచ్చి రామబ్రహ్మము దంపతులతో "మీరు బాధపడవలదు. రేపటికి పిల్లవానికి స్వస్థత చిక్కగలద"ను ధైర్యవచనములను పలికి వెడలినారు. దైవముపై భారమువేసి ధైర్యమూనినారు రామబ్రహ్మము దంపతులు. మరుసటి దినమునకు త్యాగయ్యగారికి స్వస్థత చిక్కి నది. రామబ్రహ్మము దంపతులు చాల సంతసించినారు. త్యాగయ్యగారి జీవి

తము మహోన్నతమైన మార్గమున నడచుటకు మహాపురుష సమాగమము కారణ మని శ్రీవారి జీవితము మనకు సాక్ష్యమిచ్చును.

"దుర్లభం త్రయమేవైతత్ జన్మానుగ్రహ హేతుకం
మనుష్యత్వం, ముముక్షుత్వం, మహాపురుష సంశ్రయః"

అని గదా శంకరభగవత్పాదుల వక్కాణ[1]. దుర్లభములైన మూడును త్యాగయ్యగారికి లభ్యములైనవి. మనుష్యజన్మ లభించినది. మోక్షేచ్ఛ వారికున్నది. మహా పురుష సంశ్రయణము దొరికినది.

బాల్యమున తిరువారూరు వీధిబడిలో చదివినారు త్యాగయ్య. తిరువారూర చదువు పూర్తియయినది. రామబ్రహ్మముగారు 1774వ సంవత్సరమున తిరువారూరును వీడి తిరువయ్యార్ చేరినారు సకుటుంబముగ. తిరువయ్యార్ పంచనద క్షేత్రము. కావేరి, కొల్లెడము, కుడమురుతి, వెన్నార్, వెట్టార్ అను నైదునదులు కలియు పవిత్ర స్థలము.

'ఐదు మహాస్రవంతులట నైక్యముగా బ్రవహించి స్వీయ పూ
తోదకమందు గ్రుంకు లిడుచున్న జనాళికశేషపాప వి
చ్ఛేద మొనర్చి భావుకవిశిష్ట ఫలప్రద మౌనుగాన యి
మ్మేదిని క్షేత్రమద్ది ప్రథమీజెను పంచనదా హ్వాయంబుతోన్[2]

అసలే పంచ నదము (తిరువయ్యార్) పవిత్రక్షేత్రము. త్యాగయ్యగారి జీవిత మంతయు తిరువయ్యార్‌నందే గడచినది. ఆ మహాభక్తుడు, సంగీత జగద్గురువు నివసించిన పవిత్ర స్థలముగా గూడ తిరువయ్యార్ పేరందినది. అచట ఈశ్వ

1. వివేక చూడామణి.
2. త్యాగరాజ చరిత్రము—పద్యకావ్యము. శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు.

రుడు పంచనదీశుడు. దేవి ధర్మసంవర్ధని. త్యాగయ్యగారు పంచనదీశుని ప్రణతార్తి హరుడని[1] కీర్తించినారు.

ఆనాడు తిరువయ్యార్ విద్యాకేంద్రముగ (Learning Centre) గూడ పేర్వడసినది. రామబ్రహ్మముగారు తిరువారూరు విడచి తిరువయ్యార్ చేరుటకు పలువురు పలు కారణములను చెప్పుచున్నారు.

## శ్రీవారి ముఖ్య శిష్యులగు వాలాజాపేట వేంకటరమణ భాగవతులు

"ఇటులుండ జ్యేష్ఠ పుత్రులయిన ఇరువురు వీధి వారలతో బహు కలహములు చేయగా వీధివారలకు సమాధానములు చెప్పుచు ఒకే చోట నుండి ఇట్లు బాధలు పడుట కంటె కాశీయాత్రకు పోయి రావచ్చునని దంపతులు యోచించి రాజస, తామస, సాత్త్వక స్వరూపులగు ముగ్గురు పుత్రులను పిలుచుకొని ప్రయాణమయి వచ్చుచు మార్గమున తిరువయ్యారను ఊరికి వచ్చిరి. ఆ రాత్రి స్వప్నమున పంచనదస్వామివారు కనబడి "యీ క్షేత్రము కాశి కంటె గొప్పది. ఇచట సిద్ధి పొందినవారు లింగస్వరూపు లగుదురు. గనుక నీవు ఈ యూరిలోనే వసియించి మూడవ పుత్రునికి విద్యయందు అభివృద్ధి చేయవలసినది" అని పలికి అంతర్ధానమయ్యెనట. అప్పుడు తంజావూరును పాలించుచున్న తులసింగమహారాజునకు (1765–1787) ఆ సమయమున పంచనదీశుడు స్వప్నమున కనబడి "పండితుడు, రామభక్తుడునగు రామబ్రహ్మము తిరువయ్యార్‌లో ఉండుటకు వలసిన యేర్పాటు చేయుమని" ఆదేశించి అదృశ్యుడయ్యెను. తులసింగు మహారాజు రామబ్రహ్మమునకు కబురంపి శ్రీరామనవమి సందర్భముగ 10 రోజులు రామాయణ ప్రవచనము చేయుమని కోరిరి. రామబ్రహ్మము గారంగీకరించిరి. తిరుమంజనవీధి (తిరువయ్యార్)లో ప్రణతార్తిహరుని ఆలయమునకు, కావేరి తీరమునకు 50–60 గజముల దూరమున ఒక యింటిని రామబ్రహ్మముగారి వసతికై ఏర్పరచిరి. అచటకు సమీపమునగల పశుపతి కోవెల అగ్రహారములో ఒక వేలి[2] భూమిని దానమొసగిరి. రామబ్రహ్మము వెంటనే ఆ స్తిని స్వాధీనపఱచుకొని శ్రీరామనవమి పదిరోజులు తులసింగు మహారాజు ఆస్థానమున రామాయణ ప్రవచనము చేయుచు, అందరకు తలలోని నాల్కవలె మెలగుచు పవిత్ర జీవనమును గడపుచుండెను.

---

1. ఇలలో ప్రణతార్తి హరుడని.
2. "వేలి అనునది 6¾ ఎకరములకు సమానమగు ఆనాటి భూప్రమాణము

## సంగీత సంప్రదాయ కర్త సుబ్బరామదీక్షితులు

"రామబ్రహ్మము లేమిచే మిగుల కష్టపడి తన భార్యాపుత్రులతో తిరువారూరును విడచి తిరువయ్యార్ అను పంచనద క్షేత్రమును చేరినని, తిరువయ్యార్‌లో అద్దె యివ్వనవసరములేని గృహవసతి యేర్పడినదని వ్రాసిరి." సుబ్బరామ దీక్షితుల వ్రాత సమంజసముగా తోచదు. జీవనోపాధి కొఱకే తిరువారూరును వీడినచో రామబ్రహ్మము వ్యాపారకూడలియై తిరువారూరునకు 35 మైళ్ళ దూరమునను న్న తంజావూరు జిల్లాకు కేంద్రమైన తంజావూరు చేరియుండునుకాని, వ్యాపారకూడలి కాక కుగ్రామమైన తిరువయ్యార్‌ను చేరియుండడు. "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" - స్వర్గముకంటె మిన్నయైన జన్మభూమి యగు తిరువారూరును, ఆ యూర పిత్రార్జితమగు గృహమును తిరువారూరు New street, 6 నెంబరు ఇల్లు, ఇలవేల్పు త్యాగేశుని వీడి చనుటకు రామబ్రహ్మము చాల బాధపడినారు. "సప్తస్థానోత్సవముల సందర్భముగా భజన కార్యక్రమములలో పాల్గొనుటకు రామబ్రహ్మముగారు తిరువయ్యారునకు పోయి, అక్కడ కుటుంబ పోషణమునకు వలయు సౌకర్యము లుండుటను గుర్తించి తమ కాపురముతిరువయ్యార్‌కు మార్చుట త్యాగరాజు సంస్కృతికి దోహదమిచ్చినదని ఆర్. రంగరామానుజయ్యంగార్ వ్రాసినారు [1]"

త్యాగయ్యగారి జీవిత చరిత్రను సమగ్రముగ అందించిన ఆచార్య సాంబమూర్తిగారు రామబ్రహ్మంగారు తన నివాసమును తిరువారూరు నుండి తిరువయ్యార్ నకు మార్చు విషయమై ఏమియును వ్రాయరైరి. వాలాజాపేట వేంకటరమణ భాగవతులు వ్రాసినట్లు జప్యేశ, రామనాథబ్రహ్మములొనరించు ఆగడముల వలన కలిగిన అపఖ్యాతిని తొలగించుకొనుటకే రామబ్రహ్మము తిరువారూరును వీడుట నిజమై యుండవలెను.

---

1. కృతిమణిమాల

# విద్యాభ్యాసము

త్యాగయ్యకు ఎనిమిదవయేట ఉపనయన సంస్కారము జరిగినది. "ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" అనునట్లు త్యాగయ్య అనతికాలముననే సంస్కృతాంధ్రముల నిష్ణాతులైనారు. తండ్రిచేయు రామపూజలో నిత్యము త్యాగయ్య పాల్గొనెడివారు. విద్యయందు త్యాగయ్యకున్న చురుకుదనము, యోగ్యమైన నడవడిని గమనించి రామబ్రహ్మముగారు త్యాగయ్యగారికి రామషడక్షరీ మంత్రమునుపదేశించిరి. రామబ్రహ్మముగారికి త్యాగయ్యగారిని "ఏదేని యొక శాస్త్రమునందు పండితుని" జేయవలెనని కోరిక. ఆ ఉద్దేశముతోనే త్యాగయ్యగారిని తిరువయ్యార్‌నందలి సంస్కృత పాఠశాలలో చేర్పించిరి. అచ్యుతప్పనాయకుని కాలమున మహామేధావియైన గోవింద దీక్షితులు స్థాపించిన విద్యాశాల అది. వేద, వేదాంగ, జ్యోతిష, తర్క, వ్యాకరణ, ఆయుర్వేదములను, చతుష్షష్టి కళలను బోధించుటకు తగిన ఏర్పాటు కావించి తక్షశిల, నలందలకు సాటి రాగలిగిన విద్యాకేంద్రముగ తిరువయ్యార్‌ను తీర్చి దిద్దవలెనను కోరికతో స్థాపించబడిన పాఠశాల అది. నవాబుల కాలమున మూగవోయిన ఆ పాఠశాల త్యాగయ్య కాలమున తిరిగి పలుక మొదలిడినది. త్యాగయ్య ఆ విద్యాలయమున నాలుగు సంవత్సరముల కాలము చదివి, వేద వేదాంగములందు, జ్యోతిష, తర్క, వ్యాకరణ, గణిత, మంత్రశాస్త్రములందు ప్రవీణుడాయెను.

త్యాగయ్య తల్లి సీతమ్మగారు మంచి గాయని. ఆమె తన తండ్రి వీణ కాళహస్తి అయ్యర్ వద్ద సంగీతవిద్య నభ్యసించెను. ఆమె పురందరదాస, జయదేవ, భద్రాచల రామదాసుల రచనలను తరచు పాడుచుండెడిది. త్యాగయ్య అపూర్వగాత్ర సంపద కలవాడు, అది భగవద్దత్తము. త్యాగయ్య తల్లి పాడిన కీర్తనలను మరల పాడుచుండెడివాడు. ఒకవిధముగ త్యాగయ్యకు మొదటి సంగీత విద్యా గురువు తల్లి సీతమ్మగారే. కుమారుని పాటవిని బ్రహ్మానందమంది సీతమ్మగారు కుమారుని "నాకన్నా నువ్వు గొప్ప గాయకుడవవుతావురా" అని యాశీర్వదించినది. ఆనాటి తల్లి యాశీర్వచనమే త్యాగయ్యగారికి శ్రీరామరక్ష యైనది.

రామబ్రహ్మముగారు గ్రామాంతరము వెళ్ళినారు ఆనాడు రామపీఠమును పూజించునవకాశము త్యాగయ్యగారికి కలిగినది. బ్రహ్మానందభరితులై ఏకపీఠ విగ్రహమును పూజించినారు. పూజ పూర్తియైనది. షోడశోపచార పూజా విధులలో "గీతం శ్రావయామి" అనుచు భగవంతునకు పాటపాడి వినిపించుట కూడ నొకటి. రామానుగ్రహ బలమువలన త్యాగయ్యగారి నోటివెంట అపూర్వమైన సాహిత్యము వెలువడినది. ఆనాడు త్యాగయ్యగారి ముఖతః వెలువడిన ఆ సాహిత్యము "దివ్యనామ సంకీర్తనము" లనుపేర విరాజిల్లినది. త్యాగయ్య మహనీయుని భక్తి సంగీతరచనాసాగరమునుండి ప్రాదుర్భవించిన ఆణిముత్యములే ఆ దివ్య నామ సంకీర్తనములు.

## దేశికతోడి

నమోనమో రాఘవాయ అనిశం ॥నమోనమో॥
శుకనుతాయ దీనబాంధవే సకలలోక దయాసింధవే॥
శ్రితదురితతమో బహురవయే సతతపాలితామృతకవయే
నిజసేవక కల్పతరవే అజరుద్రాద్యమరసుగురవే
దీనమానవగణపతయే దానకాంతజాయ సుమతయే
ఆయురారోగ్యదాయినే వాయుభోజభోగశాయినే
నూతననవనీతభక్షిణే భూతలాదిసర్వసాక్షిణే
వరగజకరతులితబాహవే శరజితదానవసుబాహవే
నాగరాజ పాలనాయ త్యాగరాజసేవితాయ ॥నమోనమో॥

ఈ కీర్తనలను త్యాగయ్య యింటిగోడలపై వ్రాసి యుంచినాడు. త్యాగయ్య ప్రతినిత్యము తండ్రి చేయు దైవపూజకు పూలను తీసికొనివచ్చు నిమిత్తము తిరువయ్యార్‌లోని "ఉత్తరమాడవీధికి" సమీపముమన్న "ఆనందనార్‌కురుచ్చి" అను ప్రదేశమునకు వెళ్ళుచుండెడివాడు. ఆ దారిలో తంజాపురాస్థాన సంగీత విద్వాంసుడును, రామబ్రహ్మముగారికి మిత్రుడునగు శొంఠి వేంకట రమణభాగవతుల (ఈయనను వీణ వేంకటరమణదాసు అనికూడ నందురు) యిల్లు గలదు వేంకటరమణ భాగవతులు తన యింటిలో విద్యార్థులకు సంగీతమున శిక్షణ నిచ్చుచుండ త్యాగయ్య

ఆయింటి ముందాగివినుచు తన్మయుడగుచుండెడి వాడు. రామబ్రహ్మముగారీ సంగతిని గుర్తించినారు. అప్పటికే త్యాగయ్య వ్రాసియుంచిన కీర్తనలను రామబ్రహ్మముగారు ఆ యూరి విద్వాంసులగు రామశేషశాస్త్రి, శ్రీభాష్యం కృష్ణశాస్త్రిగారలకు చూపగా వారా కీర్తనలయందలి సహజత్వమునకు, భక్తి భావమునకు సంతసిల్లి త్యాగయ్యకు సంగీతమున శిక్షణనిప్పింపుడని రామబ్రహ్మముగారికి చెప్పిరి. ఈ సంఘటన 1782వ సంవత్సరమున జరిగినది. ఈ సంవత్సరముననే త్యాగయ్యగారి రెండవ అన్నగారగు రామనాథ బ్రహ్మము వ్యాధిగ్రస్తులైరి. తల్లి సీతమ్మగారు కుమారుని అనారోగ్య కారణముగా తీవ్రమగు మనస్తాపమునకు గురియయి త్యాగయ్యను బిలిచి "నాయనా త్యాగూ! నీ అన్న చావుబ్రతుకుల మధ్యనున్నాడు. శ్రీరాముని నీ యన్నకు ఆరోగ్య భాగ్యము నొసంగుమని" కోరుమనెను. త్యాగయ్యగారును ప్రత్యక్ష దైవమగు మాతృదేవి ఆదేశమును శిరసావహించి తన యన్నకు ఆరోగ్యము నొసంగుమని శ్రీరామునిట్లు ప్రార్థించెను.

కాపి – ఆది

అన్యాయము సేయకురా రామ
అన్యునిగా చూడకురా నా యెడ ||అ||
ఎన్నో తప్పులు గలవారిని రాజన్య నీవు బ్రోచినావు
గనుకను ||అ||

జడ భరతుడు జింక శిశువునెత్తి బడలిక తీర్చగలేదా
కడలిని మునిగిన నౌక కూర్మము కాపాడగ లేదా
పుడమిని పాండవద్రోహిని ధర్మపుత్రుడు బ్రోవగలేదా
నడిమి ప్రాయమున త్యాగరాజనుత నా పూర్వజు
బాధతీర్పలేదని ||అ||

ఆ రాత్రి శ్రీరామచంద్రుడు త్యాగయ్యకు స్వప్నమున దోచి "నీ భ్రాతకు ఆయుస్సుతీరినది, వగవకుమని" పలికెరి. ఈ కీర్తన పైనుదహరించిన సన్నివేశమందలిదని–"త్యాగబ్రహ్మము వారి జీవిత చరిత్ర"ను వ్రాసిన వాలాజాపేట వేంకటరమణభాగవతులు వ్రాసిరి. వేంకటరమణ భాగవతులు వ్రాసిన "త్యాగబ్రహ్మము

వారి జీవిత చరిత్ర" ఆంధ్ర పత్రిక వ్యయనామ సంవత్సర ఉగాది సంచిక"లో ప్రచు రింపబడినది. "త్యాగరాజ కీర్తనలు - విశేష వివరణము" అను గ్రంథమును వ్రాసిన శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారును ఉగాది సంచికను ఆధారముగ తీసికొని, త్యాగయ్య శిష్యపరంపర ద్వారా లభించిన వివరముల నాధారముగా "అన్యాయము సేయకురా" అను కీర్తన మాతృదేవి యాదేశానుసారము త్యాగయ్యగారు తన యన్నకు ఆరోగ్యభాగ్యము నొసంగుమని శ్రీరాముని ప్రార్థించిన సందర్భములోనిదే నని వ్రాసిరి. కాని శ్రీ యస్. వి. కృష్ణస్వామిగారు తమ Thyagaraja Saint and Singer (Orient Longmans) గ్రంథమున "అన్యాయము సేయకురా" అను కీర్తనకు ఈ క్రింది విధముగ వివరణ నిచ్చిరి.

"It is not your duty to save me from the torment of my brother" (త్యాగయ్యగారు తన జ్యేష్ఠ భ్రాత-జప్యేశుని విషయమున అన్యాయము సేయకురా అను కీర్తనను చెప్పినట్లు కృష్ణస్వామిగారి యభిప్రాయమై యుండనోవు)

శ్రీ కృష్ణస్వామిగారా విధముగ వ్యాఖ్యానించుటకు ఆధారము కానరాదు. "నడిమిప్రాయమున త్యాగరాజనుత నా పూర్వజు బాధ తీర్పలేదని" అని యున్న కారణమున పైకీర్తనను త్యాగయ్యగారు వారి రెండవ అన్నగారు రామనాధబ్రహ్మము వ్యాధిగ్రస్తుడై యున్నపుడు వ్యాధి నివారణార్థము తల్లి అనతిపై శ్రీరాముని ప్రార్థించుపట్టున వ్రాసినమాటయే యథార్థమై యుండును. కొందరీకీర్తనను త్యాగయ్యగారు రామచంద్రుడు కలలో కనపడి "నీ భ్రాతకు ఆయుస్సు తీరినది" అని చెప్పిన యనంతరము వ్రాసినదనుచున్నారు. ఈ స్వప్న వృత్తాంతము జరిగిన పిదప ఐదారు దినములకు రామనాధము మరణించినాడు.

త్యాగయ్యగారు తల్లి కోరికపై "రామనాధమునకు ఆరోగ్యభాగ్యమును ప్రసా దింపుమని రామచంద్రుని ప్రార్థించుట దోషము-అసాధారణమని త్యాగయ్యగారి చర్యలు మనకు అర్థముగావని శ్రీనారుమంచి సుబ్బారావుగారు వ్రాసినారు.[1]

త్యాగయ్యగారు తనకై ఎట్టి వరములను శ్రీరాముని కోరుకొనినవారు కారు. ప్రత్యక్షదైవమైన తల్లి కోరికను కాదనలేక త్యాగయ్యగారు తన యన్నగారి కారోగ్యమును చేకూర్చుమని శ్రీరాముని ప్రార్థించుట దోషముగాదు. అసాధారణ

1. సంగీత మహర్షులు-రెండవ భాగము, పేజీ 26

మునుగాదు. "నమాతుః పరదైవతమ్" అని కదా ! త్యాగయ్యగారి వంటి సచ్ఛీలురు మాత్రాజ్ఞాను శిరసావహింపకుందురా ! అట్లు శిరసావహింపకుండుట దోషముగాని, శిరసావహించుట దోషము గాదు. "సజ్జనులు దారె పరహితాచరణమతులు" అని కదా సూక్తి.

రామదాసుగారు మృతుడైన తన కుమారుని పునర్జీవితుని చేయుమని శ్రీరాముని ప్రార్థింప లేదా !

కోదండరామ కోదండరామ కోదండరామ కోదండడరామ
నీ దండనాకు నీ వెందుబోకు వాదేల నీకు వద్దు వరాకు ॥కో॥
శ్రీరామ మమ్ము చేపట్టుకొమ్ము ఆదుకోరమ్మ ఆరోగ్యమిమ్ము ॥కో॥
ఏ బుద్ధిని వీడు ఎరుగని వాడు పాపడు వీడు బడలి యున్నాడు॥

సంగీత త్రిమూర్తులలో జ్యేష్ఠులైన శ్రీశ్యామశాస్త్రిగారు తనకారోగ్యము నొసంగుమని తన యిష్టదైవమగు కామాక్షిని వేడుకొనలేదా !

1782 సంవత్సరమున ద్వితీయ పుత్రుడు గతించిన తరువాత 1783 సంవత్సరమున రామబ్రహ్మముగారు త్యాగయ్యగారిని శొంఠి వేంకటరమణయ్యగారి దగ్గరకు తీసికొనివెళ్ళి సంగీతమున శిక్షణనిప్పింప గడంగిరి. సంగీతసాహిత్యముల యందాసక్తి గలిగిన త్యాగయ్యవంటి శిష్యుడు తనకు లభించినందులకు వేంకటరమణ భాగవతు లెంతగానో సంతోషించిరి[1] ఏకసంథాగ్రాహి యగు త్యాగయ్యగారు ఒక్క సంవత్సర కాలములోనే అగస్త్యుడు సముద్రమును ఆపోశనబట్టినట్లు సంగీత శాస్త్రమును ఆపోశనబట్టినారు. త్యాగయ్యగారు గొప్ప వైణికులు. వారుపయోగించిన వీణ యిప్పటికిని కలదు.

త్యాగయ్య జీవితమున 18వ సంవత్సరము అత్యంత ప్రాముఖ్యమును సంతరించుకొనినది. రామాయణ పారాయణ జరుగుచున్నది. ఏకపీఠ విగ్రహమును

1. స్థానేషు శిష్యనివహైర్వినియుజ్యమానా విద్యాగురుంహి గుణవత్తర మాతనోతి

పూజించుచున్నారు. దివ్యనామ సంకీర్తనముల రచన సాగుచున్నది. కాని మనసున ఆందోళన అధికము కా సాగినది. సంసార సాగరమును తరించుటెట్లు ? సంసార తరణోపాయమును జెప్పు వారెవరు ? సంసార సాగరమున నే బడుచున్న గాసిని శ్రీరామునితో తెల్పు పెద్దలెవరైన కలరాయని_

"ఎవరైన లేరా పెద్దలు ఇలలో దీనుల బ్రోవ
భవసాగరమున చరించేబలు గాసి రామునితో తెలుప॥
కలిమాన వాధముల కార్యముల్ కామ మత్సరాదుల
కృత్యముల్ ।
చలచిత్తము లేని దారిపుడు చాల త్యాగరాజ నుతినితో
తెలుప ॥

పరితాపపడినారు. భక్త పరాధీనుడైన దాశరధి మనసు కరిగినది. రామ కృష్ణానంద యతీంద్రులను సన్యాసి త్యాగయ్యగారి గృహమున కేతెంచి రామషడక్షరీ మంత్రమును అంగన్యాస కరన్యాస పూర్వకముగనుపదేశించి మంత్రమహిమము నిట్లు వచించిరి

అనుపమమైన మంత్రమును మహాస్థను తొంబది యారు
కోట్లు దీ
క్షను జపమాచరించిన నఘంబులు వోవు రఘూత్తముండు ద
ర్శన మిడు పుణ్యలోకపు సిరుల్ వశపర్చు భవాంబురాశి భ
క్త్యను నొకనావ నూతగొని దాటగ నేర్తువు సుమ్ము
త్యాగయ్యా

---

1. పసుమర్తి కృష్ణమూర్తిగారు

పలికెనిటుల్ యతీశ్వరుఁడభంగుర కారుణికోత్తముండు ని
ర్మలతర భక్తి నీ మహిత మంత్రము దొంబది యాఱు కోట్లు మా
రులు జపియించితేని యమరున్ మనుసిద్ధియు రామచంద్రుఁ డా
శలు ఫలియింప దర్శనమొసంగి యొసంగు నభీష్టదాయియై[1]

అని పల్కి సంయమీంద్రుఁడు
జనియెం దనమార్గమున నచంచల దీక్షా
వినిహిత విఘ్నుండై జప
ము నొనర్చుచునుండె మంత్రమును ద్యాగయదాన్[2]

పై పద్యమునుబట్టి త్యాగయ్య తన జీవితకాలమున మంత్రోపదేశమును పొందిన నాటినుండి దినమునకు 1,25,000 చొప్పున 21 సంవత్సరములు రామ మంత్రమును జపించిరని తెలియుచున్నది. (18వ ఏట ప్రారంభింపబడిన రామ మంత్రజపము త్యాగయ్యగారికి సుమారు 40 సంవత్సరములు వచ్చుసరికి 96 కోట్లు పూర్తియైనదని, ఆ పిమ్మటనే రామచంద్రమూర్తి యాగ రక్షణమునకై అనుజుడైన లక్ష్మణుని వెంట నిడుకొని విశ్వామిత్రుని వెంట వెళ్ళినప్పటి రూపముతో త్యాగయ్యగారికి దర్శన మిచ్చినారని, త్యాగయ్యగారి జీవిత చరిత్రమునుబట్టి తెలియుచున్నది). కాని సాంబమూర్తిగారు త్యాగయ్యగారు చేసినది 'రామనామ మనియే' వ్రాసిరి. (Ramanama Recital) శ్రీధరబాబుగారు 'నాట్యకళ' (త్యాగరాజ ద్విశత జయంత్యుత్సవ సంచిక) లో త్యాగయ్యగారు జపము చేసినది రామనామ మనితో వ్రాసిరి. సుబ్బరామ దీక్షితులును తమ సంగీత సంప్రదాయ ప్రదర్శిని యను గ్రంథమున త్యాగయ్యగారు చేసినది రామనామమనియే వ్రాసిరి. పై నుదహరించిన మూడు పద్యములలో త్యాగయ్యగారు చేసినది రామ మంత్రమనియే తెలియుచున్నది. "పలికెనిటుల్", "అనిపల్కి" అను పద్యములను వ్రాసిన శ్రీమాన్

---

1. } త్యాగరాజ చరిత్ర పద్యకావ్యము —
2. } శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు.

వల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు ఆ పద్యములలో త్యాగయ్యగారు మంత్రోపదేశమును పొంది అచంచలదీక్షతో మంత్రజపమునొనర్చిరని వ్రాసిరి. వారే "గానకళ" (ఫిబ్రవరి—మార్చి 1978 సంచికలలో) త్యాగరాజు రామనామ జపము అను శీర్షిక క్రింద నిట్లు వ్రాసిరి.

త్యాగయ్యగారు చేసినది నామ జపమే గని మంత్రజపము కాదు. ఆయన ఎక్కడ చెప్పినా "సుఖియెవ్వరో రామనామ సుఖియెవ్వరో" "రామ నామమనే వర ఖడ్గము" "నామ పుణ్యము చెలగున"—"రామా నీయెడ ప్రేమ రహితులకు నీ నామ రుచి తెలియునా" "ప్రేమ ముప్పిరిగొను వేళ నామమును దలచువారు" అని పెక్కు కృతులలో చెప్పబడినది అన్నిటిలో నామ ప్రసక్తియే గలదు. మంత్ర ప్రసక్తి ఎచటను లేదు. మంత్రాన్ని గూర్చియే ఆయనది ఒక మాటకూడనున్నది. "మనసు స్వాధీనమైన ఆ ఘనునికి మరి మంత్ర తంత్రములేల ?' అని. ఇది సాధారణ దృష్టి అనుకోండి. రామమంత్రమంటే అయనకు అయిష్టమని దీని యర్థముకాదు. నామ ప్రాధాన్యము కొఱకే ఇది చెప్పబడినది. రామషడక్షరీమంత్రమనుకొన్నప్పుడే 38 సంవత్సరాలలో 96 కోట్లు ఎట్లు పూర్తి అయినది ? అనే శంక కలుగక తప్పదు. షడక్షరమంత్రము నిమిషానికి ఏబది మాత్రమే అగును. అప్పుడహో రాత్రములు విడువక ఇంకొక పనిలేక జపిస్తే సుమారు 38 సంవత్సరాలకు పూర్తి అగును. ఇది అసంభవమే. ఇక రామ రహస్యోపనిషత్తులోని 96 కోట్లు అనే విషయము రామనామమునకే చెప్పబడియున్నది. కేవలము రామనామమును జపించునప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసములతో కూడిన నామాన్ని సంధించి జపిస్తే నిమిషమునకు 200 (రెండు వందలు) పర్యాయము లయినది. కేవలము నామమయినప్పుడు "రామ్" అని మకారము దానంతట అది అర్ధమాత్ర అయి కొంతవేగాన్ని పుంజుకునే అవకాశమున్నది. ఇంకొక పెద్ద చిత్రము పొడకట్టుచున్నది. త్యాగయ్యగారి "నాద సుధారసంబు" అనే ఆరభికృతిని మరికొంచెము విమర్శిస్తే నాదసుధారసము అంటే రామనామము నరాకృతి అంటే ఉచ్ఛ్వాస నిశ్వాసరూపము అయినది అని. నరశబ్దమునకు ఉచ్ఛ్వాస నిశ్వాసములని ఉపనిషత్తు చెప్పిన అర్థము (బహుశః ఈ ఉపనిషత్తు నాదబిందూపనిషత్తు అనుకుంటాను). ప్రణవ నాదసుధారసము అంటే ఓంకారమని కదా లోగడ చెప్పుకున్నాము. రామ్ అనేదానిలో రామనామమే కాక "ఓం"కారము కూడ నున్నది ర్ అ అ ఉ మ్ ఇవి అందులోనున్న భాగములు. అట్లే నాదము ఓం రామ్ అనే నాదము నరాకృతి యయినది.

నామోచ్చారణముచేత మనస్సులో రామమూర్తి పొడకట్టుచున్నది. ఈ విషయ మునే "ఇంతకన్నానందమేమి" అనే బిలహరి రాగకృతిలోని "నీ జపముల వేళ ఈ జగములు నీవై రాజిల్లినయ్య" లో గోచరిస్తుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసము లతో కలిసి ఆనాదము అగుచున్నది. అనగా ఇది నామజపము చేయునప్పుడు అను భవము అని మన మూహింపవచ్చును. సారాంశమేమంటే రామనామము, ఉచ్ఛ్వాస నిశ్వాసము లొకటై రామనామ జపము జరిగినదని భావింపవచ్చును. అప్పుడు తేలికగా రామనామము నిముషమునకు రెండు వందలు అగును. గంటకు పన్నెండు వేలు. రోజుకు ఆరుగంటలు జపానికి కేటాయిస్తే రోజుకు డెబ్బది రెండు వేలగును. ఈ లెక్క ప్రకారము 36, 37 సంవత్సరాలకు 96 కోట్లు పూర్తి అగును. ఆయన నిత్యజీవితములోని తక్కిన కృత్యములకు తగిన అవకాశము రోజులో నున్నది. ఈ పూర్తి అగుసరికి చరిత్ర ప్రకారము 58, 60 సంవత్సరములు. తరువాతసుమారు 20, 22 సంవత్సరములు ఆయన పరిపక్వదశ, ఇట్లు సమస్య పరిష్కరింపబడిన దనుకొందును. ఈ సమస్యకు కారణము చరిత్రకారులు షడక్షరీ మంత్రమని చెప్పుట రోజుకు 1 25000 అని చెప్పుట అయితే స్వామి ఉపదేశించినది షడక్షరి కాదనబోము. షడక్షరి ఉపదేశించుట జరిగినది అది రోజుకు అష్టోత్తరశతము నామ జపానికి ముందు జపింపవచ్చును. చరిత్రకారులు ఈ విభజనము గమనింపక కలిపివేయుట చేత శంకావకాశము కలిగినది. ముఖ్యముగా రామరహస్యోపనిషత్తులో 96 కోట్ల నామ మని చెప్పబడిన సంగతి మరువరాదు. కొద్దిగా మనకవసరమయిన ఉపనిషద్భాగాన్ని క్రింద ఉట్టంకిస్తున్నాను.

"విభీషణ ఉవాచః సింహాసనే సమాసీనగతం రామం పౌలస్త్య సూదనం ప్రణమ్య దండవద్భూమౌ పౌలస్త్యో వాక్యమబ్రవీత్ రఘునాథ మహాబాహో కేవలం కథితం త్వయా అంగానాం సులభం చైవ కథనీయంచ సౌలభం శ్రీరామ ఉవాచ అథనంచదండకాని పితృఘ్నో, మాతృఘ్నో, బ్రహ్మఘ్నో గురుహననః కోటి యతిఘ్నో ఽనేకకృతపాపో యోమమషణ్ణవతి కోటినామాని జపతితేభ్యః పాపేభ్యః ప్రముచ్యతే. స్వయమేవ సచ్చిదానందరూపో భవేన్నకిమ్ "

1955 వ సంవత్సరమున తాము వ్రాసి ప్రచురించిన "త్యాగరాజ చరిత్ర" పద్యకావ్యమందు త్యాగరాజు చేసినది రామమంత్ర జపమని వ్రాసిన శ్రీమాన్ N. Ch. కృష్ణమాచార్యులుగారు 1978 నాటికి త్యాగయ్యగారు చేసినది రామనామ

జపమని, ఆయన కిష్టమైనది రామనామమని గానకళ పత్రికలలో వ్రాసినారు. అనేక కృతులలో త్యాగయ్యగారు రామనామమునే బహుధా సంభావించిన మాట వాస్తవము.

i) మేలు మేలు రామనామ మీ ధరలోన (సౌరాష్ట్ర)

ii) రామనామము మేలు — రామ చింతనచాలు
(రామ కోదండరామ భైరవి)

iii) రామనామము జన్మరక్షక మంత్రము
తామసము సేయక భజింపవే ఓమనసా (అఠాణ)

అనునవి త్యాగయ్యగారు రామనామమును గురించి చెప్పిన కీర్తనములలో కొన్ని. త్యాగయ్యగారు చేసినది "రామనామ జపమే" అనుటకెట్టి సందియమును లేదు. వాలాజాపేట వేంకటరమణ భాగవతులు నిట్లు వ్రాసిరి.

"గురుస్వాములు అతి భక్తితో రామనామమునున్ను రామషడక్షరీ మంత్రమును పునశ్చరణము చేయుచువచ్చిరి." త్యాగయ్యగారు రామనామము నెచట జపించిరి ? ఈ విషయమును గురించి వాలాజాపేట వేంకటరమణ భాగవతులు ఏమియును వ్రాసియుండలేదు. ఆచార్య సాంబమూర్తిగారు_

During the afternons he used to sit in the mantapa of the temple called Dakshina Kailasa anc carry on his Ramanamajapam This Temple is on the sou therm wing of the Panchanadiswara Swamy Temple of Tiruvaiyar and it was in this Dakshina Kailasa Temple that Appar (7 th cent) had his darsan of Lord Siva.[1]

శ్రీనారుమంచి సుబ్బారావుగారు సంగీత మహర్షులు అను గ్రంధమున త్యాగయ్య జీవితమును వ్రాయుచు త్యాగయ్య రామనామ జపమును జప్యేశ మంపమున చేసిరని వ్రాసిరి.

త్యాగయ్యగారి జీవితచరిత్రను గురించి ఆచార్య సాంబమూర్తిగారొసంగినన్ని వివరములు ఇతరులెవ్వరునిచ్చి యుండలేదు. శ్రీ సాంబమూర్తిగారీ విషయముల నెట్లు సేకరించిరి ?

1. Great Composers II Thyagaraja Revised Edition P. 249

త్యాగయ్యకు ఆత్మీయుడు, ప్రధాన శిష్యులలో నొకడు మేనత్త కుమారుడు నగు శ్రీమానంబుచావడి వెంకట సుబ్బయ్యగారికి తెలియని విషయములుండవు. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్, మహావైద్యనాథయ్యర్—ఇరువురు వేంకట సుబ్బయ్యగారి శిష్యులు. టైగర్ వరదాచారి, మైసూరు వాసుదేవాచారి, పట్నం సుబ్రహ్మణ్యయ్యర్ నకు శిష్యులు. ఈ యిరువురి మరణకాలమునకు సాంబమూర్తిగారు సజీవులు. మహావైద్యనాధయ్యర్ శిష్యులు సభేశయ్యర్, సభేశయ్యర్ శిష్యులు ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్. ముసిరి సుబ్రహ్మణ్యయ్యర్ నిర్యాణానంతరము సాంబమూర్తిగారు మరణించిరి. కావున సాంబమూర్తిగారికి త్యాగయ్య జీవిత విశేషములు వారి శిష్య పరంపరవలన తెలిసియుండును.

త్యాగయ్యగారు చేసిన రామనామ జప సంఖ్య విషయమునగూడ భేదాభిప్రాయములు పొడసూపుచున్నవి. రామ మంత్రోపదేశమును రామకృష్ణానందయతీంద్రుల వలన ఉపము పొందిన నాటినుండి దినమునకు 1,25000 చొప్పున 96 కోట్లు రామనామ జపము జేసిరని త్యాగయ్య జీవిత చరిత్రను వ్రాసినవారందరును వ్రాసిరి. ఆచార్య సాంబమూర్తిగారును త్యాగయ్య 96 కోట్ల రామనామ జపము చేసిరని వ్రాసిరి 96 కోట్ల రామనామమును జపించినది భారతదేశమందలి భక్తులలో త్యాగయ్యగారొక్కరే. భారతదేశమున భద్రాచల రామదాసు కబీరు వంటి రామభక్తులెందరో కలరు. కాని వారెవ్వరును 96 కోట్లు రామనామమును జపించిన వారు కాదు. ఆ ఘనత య్యాగయ్యగారికే దక్కినది.

## నారద సందర్శనము – స్వరార్ణవప్రాప్తి

త్యాగయ్య జీవిత పంచాగమున పదునెనిమిదవ సంవత్సరమునకు విశేష ప్రాముఖ్యమున్నది. పదునెనిమిదవయేటనే త్యాగయ్యగారు "పార్వతి" అను కన్యకామణిని వివాహమాడిరి. త్యాగయ్యగారు రామనామ జపమును ప్రారంభించినది పదునెనిమిదవయేటనే.

రామనామ జపము నిరాటంకముగ సాగుచున్నది. రామాయణమును కీర్తనలుగా గానము చేయవలెనన్న తహతహ ఎక్కువైనది త్యాగయ్యగారికి. సంగీత శాస్త్రమున అనేక సందేహములు పొడసూపినవి. సందేహములు తొలగినకాని రామాయణకృతి రచన చేయుటకు వీలులేదు. సద్గురు కటాక్షమునగాని సందేహములు తొలగనేరవని నిర్ధారణ చేసికొనినారు. "గురు లేక ఎటువంటి గుణికి తెలియకపోదు అని సద్గురు కటాక్షమునకై త్యాగయ్యగారెంగనో పరితపించినారు.

గౌరీమనోహరి - ఝంప

గురులేక యెటువంటి గుణికి। దెలియగఁబోదు ॥గు॥
కరుకైన హృద్రోగ గహనమును గొట్టను సద్ ॥గు॥
తనువుసుతధన దారదాయాది బాంధవులు
జనియించి చెదరుజాలిని కరుణతో
మనసునంటకమంచి మందనుచుఁదత్త్వబో
ధన చేసి కాపాడు త్యాగరాజాప్తుడగు ॥గు॥

దృష్టాంతో నైవ దృష్టస్త్రిభువనజఠ రేసద్గురోర్జ్ఞానదాతుః
స్పర్శశ్చేత్తత్ర కల్ప్యస్సనయతి యదహో
స్వర్ణతామశ్మసారమ్
న స్పర్శత్వం తథాఽపిశ్రితచరణయుగే
సద్గురుస్స్వీయశిష్యే
స్వీయంసామ్యం విధత్తేభవతి నిరుపమస్తేన చాలౌకికోఽపి[1]

అని గురుకటాక్ష ప్రశంస. తత్త్వబోధన చేసికాపాడు సద్గురు వెచట లభించును ? అని ఎంతగనో పరితపించి "ఆచార్యస్సహరిస్సాక్షాత్" కాన శ్రీరాముసే సద్గురువుగ నెంచి త్యాగయ్యగారిట్లు ప్రార్థించినారు.

ధన్యాసి - చాపు

నీ చిత్తము నిర్మలము నిశ్చలమని నిన్నే నమ్మినాను ॥నీ॥
నా చిత్తము వంచన చంచలమనినను విడనాడకు శ్రీరామ ॥నీ॥
గురువు చిల్లగింజ గురువే భ్రమరము
గురుడే భాస్కరుడు గురువే పరుసవేది
గురుడే ఉత్తమగతి గురువు నీవనుకొంటి
ధరను దాసుని బ్రోవు త్యాగరాజనుత ॥నీ॥

1. శతశ్లోకి - మొదటి శ్లోకము.

"తద్విజ్ఞానార్థం సద్గురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్
తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్
"ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ యేనాక్షరం పురుషం
వేదసత్యం ప్రో వాచతాం తత్త్వతో బ్రహ్మ విద్యాం"
ఆచినోతి హి శాస్త్రార్థానా చారే స్థాపయత్యపి
స్వయమాచరతే యస్మాత్తస్మాదాచార్య ఉచ్యతే

ఇత్యాది ప్రమాణ వాక్యములను గుర్తెరింగినవారై త్యాగయ్యగారు సద్గురు కటాక్షము కొఱకు పరితాపపడినారు. శ్రీరాముని వేడుకొన్నారు. దాశరథి దయా శరధి కదా! రామషడక్షరీమంత్రము నుపదేశించిన రామకృష్ణానందయతీంద్రులు త్యాగ రాజార్తినెరింగి త్యాగయ్యను చేరి నారద మంత్రోపదేశము చేసి "మంత్ర జపము చేయుము. కృతార్థుడవుకాగలవని" చెప్పి వెడలిరి. గుర్వనుగ్రహమునగాని రామాయణగానమును చేయజాలనని తలచినంత మాత్రమున యతీంద్రులువచ్చి మంత్రోపదేశముచేసి త్యాగయ్యకు దారిచూపి వెడలినారు. "అథవా భవితవ్యానాం ద్వారాణిభవన్తి సర్వత్ర" అని చెప్పుట ఇటువంటి సందర్భముననే కదా సమంజసము.

మంత్ర జపైకతత్పరుడై త్యాగయ్య నారద మంత్రోపాసన ప్రారంభించిన కొన్ని దినములకే కాషాయాంబరధారియై యతీశ్వరుడొకడు తన దేహకాంతిచే చీకటు లను పారద్రోలుచు గ్రంథమొండు చేతబట్టుకొని త్యాగయ్య యింటికేతెంచినారు. "కాషాయ దండమాత్రేణ యతిఃపూజ్యోనసంశయః" అను సూక్తి చొప్పున వచ్చిన అతిథికి అంజలి ఘటించి వినమ్రుడై త్యాగయ్య

"ఎచటివారు మీరిట కంచితముగ
వచ్చిన కతమేమొ పల్కుడుస్వామి
తమ రాకచే పవిత్రంబయ్యె గృహము
మము బోంట్లనుద్ధరింపగవచ్చితిరే"

అని ప్రశ్నించినారు. అందులకా యతివరేణ్యుడు

"ఓయీ ! మాకొక యూరు కాపురము గాదుర్వీతలంబెల్లమా
దీ యీ నాడిట రేపికెచ్చటనో మేమిచ్చం జరింపంగనౌ
నా యంభోనిధి కన్యకాపతి పదధ్యానంబె మాకెప్పుడున్
శ్రేయంబిచ్చును సర్వలోకములకున్ సేమంబెమాకోర్కెయౌ

అని సమాధానము చెప్పి త్యాగయ్యను పంచనదీశ్వరునాలయమునకు తోడ్కొని పోయి త్యాగయ్య కరకమలములయందు స్వరార్ణవముంచి "ఇద్దిస్వరార్ణవము. సంగీతశాస్త్ర రహస్యములను తెలియజెప్పు గ్రంథము. దీనితో నీ సందేహములు తొలగగలవని" చెప్పి అదృశ్యుడై నాడట. ఆ యతీశ్వరుడు త్యాగయ్య కిచ్చిన గ్రంధములలో రెండవది "నారదీయము". ఆ విధముగ నదృశ్యుడైన యతీంద్రుని నారదునిగా గుర్తెరింగి త్యాగయ్యగారు నారదుని బహుధా కీర్తించినారు. ఆ సందర్భమున త్యాగయ్యగారు నారదుని గురించి చెప్పిన కీర్తనములు "నారద పంచరత్నములు"గ ప్రశస్తికెక్కినవి.

## నారద పంచరత్నములు

1. శ్రీ నారదమునిగురురాయ భైరవి.
2. శ్రీనారద నాదసరసీరుహభృంగ శుభాంగ కానడ.
3. నారదగురు స్వామీ దర్బారు.
4. వరనారదనారాయణ విజయశ్రీ
   స్మరణానందానుభవము

"నారదగానలోల" అను అఠాణ రాగకృతిని నారదశబ్దప్రసక్త మాత్రము చేత నారద పంచరత్నముల చేర్చి చెప్పుచున్నారు. నారదగానలోలుడు విష్ణువు. విష్ణువును సంబోధించిజెప్పిన కీర్తన అది. నారదుని శరీరకాంతి "శరదిందు నిభము" కాని అఠాణ రాగకృతిలో "నీరదసమనీల నిరుపమశీల"అని యున్నది. దీనినిబట్టియు "అఠాణరాగకృతి" నారద పంచరత్నములలోనిది కాదని నిస్సందేహముగ చెప్ప వచ్చును.

నారద పంచరత్నములనుటకు - సంఖ్యాపూరణ మునకే అయినచో "నారద వర్ణనము" కలిగిన ప్రహ్లాద భక్తి విజయమునందలి" నారదముని వెడలిన సుగుణాతిశ

యము వినరే" అను దానిని చేర్చుట సమంజసము. వాగ్గేయకారులలో నారద సందర్శన భాగ్యమును పొందినవారు కాని, నారదునిపై కీర్తనలు చెప్పినవారుగాని మరియొకరులేరు. త్యాగయ్యగారొక్కరే అనుటకు సందియములేదు.

వైష్ణవులకు శ్రీమద్రామానుజుడెట్లో, అద్వైతులకు శ్రీ శంకరాచార్యులెట్లో కబీరునకు రామానందుడెట్లో చైతన్యునకు నీశ్వరపురియు, కేశవభారతియెట్లో, రామదాసునకు కబీరెట్లో త్యాగరాజునకు నారదుడట్లు.

కొందరు రచయితలు త్యాగయ్య యింటికి వచ్చిన యతీశ్వరుడు త్యాగయ్య యింటపూజామందిరమున రెండు గ్రంథముల నుంచి కావేరికి వెళ్ళి స్నానమాడి సంధ్యావందనమును చేసికొని ఆతిధ్యమునకు త్యాగయ్య యింటికి వత్తునని చెప్పి వెళ్ళినట్లు, భిక్షకు వత్తునని జెప్పి వెళ్ళిన అతిధి రాక కొఱకు త్యాగయ్యగారు నిరీక్షించిరనియు ఆ నిరీక్షణలో త్యాగయ్య ప్రాణము పోలిపోనున్న సమయమున ఆ రాత్రి త్యాగయ్యకు ఆ యోగిపుంగవుడు స్వప్నమున దర్శనమిడి "నేను నారదుడను అద్ది స్వరార్ణవము. నీదేవాగారమందుంచితినని" చెప్పినట్లు వ్రాసిరి. ఏదియేమైనను త్యాగయ్యను నారదుడనుగ్రహించి స్వరార్ణవము నొసంగినది యథార్థము. త్యాగయ్య గారికి నారదసందర్శనము లభింపలేదని, త్యాగయ్యగారు స్వరార్ణవమను గ్రంథమును చూచినవారు కారని కొందరి వాదన. వారి వాదమునకు సాక్షీభూతమైన ఆధారమేమో తెలియదు. త్యాగయ్యగారు తాము "స్వరార్ణవము"ను గ్రంథము నెరుగుదునని చెప్పి నపుడు ఇట్టి సందేహములకు తావెక్కడిది ?

"రజతగిరీశుడు నగజకు దెలుపు స్వరార్ణవమర్మములు
విజయము గలిగిన త్యాగరాజునకెరుకే

(స్వరరాగసుధా రసయుత భక్తి స్వర్గాపవర్గమురా—శంకరాభరణము)

స్వరార్ణవ పరిశీలనముతో త్యాగయ్యగారికి సంగీతశాస్త్రమున గల సందేహములు పటా పంచలైనవి. స్వరార్ణవము నందలిదీ క్రింది శ్లోకము.

ఆత్మమధ్యగతో ప్రాణః ప్రాణమధ్యగతో ధ్వనిః
ధ్వనిమధ్యగతో నాదః నాదమధ్యగతో సదాశివః.

స్వరార్ణవపరిశీలమున త్యాగయ్యగారికి సంగీత శాస్త్రమున గల సందేహములు పటాపంచలైనవి. రామాయణకృతిరచనకు కడంగినారు. నూతన రాగముల నెన్నింటినో సృష్టి చేసినారు (కైకవశి, రసావళి మున్నగునవి)

(రామాయణ రచనా విశేషములు — త్యాగరాజు — రామదర్శనము అను ప్రకరణమున చూడనగును).

## జ్యోతిస్స్వరూపిణి రాగము పాడి దీపమును వెలిగించుట

పై సన్నివేశము 1785వసంవత్సరమున జరిగినట్టులు శ్రీ సాంబమూర్తి గారు వ్రాసినారు. త్యాగయ్యగారు "జ్యోతి స్వరూపిణి" రాగమును పాడి దీపమను వెలిగించినట్టులు పుదుకోట నిఘంటువునందు గలదు [1]

త్యాగయ్యగారు తన గురువుగారైన శ్రీ శొంఠి వేంకటరమణ భాగవతులతో కలిసి ఒకప్పుడు పుదుకోట వెళ్ళిరి. పుదుకోట రాజగు రామచంద్ర తొండమాన్ తన ఆస్థానమునకు వచ్చిన సంగీత విద్వాంసులను పరీక్షింప సంకల్పించినాడు ఆ సభామధ్యమున ఒక దీప పాత్రలో నూనె, వత్తి వేసియుంచి అగ్నిజ్వాల నుపయోగించకుండ సంగీతముతో దీపమును వెలిగింపుమని అచటకుచేరిన సంగీత విద్వాంసుల నందర నాహ్వానించినాడు. త్యాగయ్యగారు తన గురువుగారి ప్రోత్సాహముతో "జ్యోతి స్వరూపిణి" రాగమును పాడి దీపమును వెలిగించినారట రాగముయొక్క హెచ్చు, తగ్గు స్థాయుల ననుసరించి దీపము ప్రకాశముగూడ హెచ్చి తగ్గి అందరను ఆశ్చర్యపరిచినదట.

## పి తృ వి యో గ ము

త్యాగయ్య అన్నగారగు జప్యేశుడు సదానంగక్రియా లోలుడై కాలక్షేపము సేయుచుండెను. త్యాగయ్య తన భార్యయగు పార్వతితో కలిసి "స్వాంఘ్రిచేశిలన్ నాతిగ జేసినట్టి రఘునాధునారతము దలచుచు" కాపురము చేయుచుండెను. ఇట్లుండ 1789వ సంవత్సరమున అనగా త్యాగయ్యగారికి ఇరువది సంవత్సరముల

1. The following account of the incident is given at the bottom of page 870 of a Manual of the phdnkkthai state volume II (Part I) second and rellised Edition' 40.

ప్రాయమున తండ్రి రామబ్రహ్మముగారు దివంగతులైరి. రామబ్రహ్మముగారు మరణించుటకుముందు సీతమ్మగారు తానును భర్తతో బాటు సహగమనము చేయ సంకల్పించినది. కాని రామబ్రహ్మముగారు సహగమనము చేయవలదని "మనకు త్యాగేశ్వరుని వరప్రసాదముగా జనించిన తృతీయపుత్ర రత్నమగు త్యాగయ్య భావి జీవితౌన్నత్యమును చూచుటకు జీవించి యుండవలయు" నని చెప్పి ఆమె నా ప్రయత్నము నుండి విరమింపజేసిరి.

## భార్యా వియోగము (1790)

పితృ వియోగమునకే కుందుచున్న త్యాగయ్యగారికి గోరుచుట్టుమీద రోకటి పోటన్నట్లు భార్యావియోగము గూడ సంభవించినది. పార్వతి మరణించునాటికి త్యాగయ్య వయసు 23 సంవత్సరములు. పార్వతి మరణించుచు త్యాగయ్యను మరల వివాహమాడుమని కోరినది. పార్వతి మరణమునకు త్యాగయ్యగారెంతగనో కుందినారు.

బిలహరి

తొలిజన్మమునచేయు దుడుకు తెలిసెను రామ ॥తొ॥
నీమహిమ ఫలమేమో—అరచేతి పుంటికద్దమువలెనా ॥తొ॥
రాగిపైరుల చెంత రమ్యమౌ వరిమొలక
రాజిల్ల నేర్చునట రా
నాగశయన త్యాగరాజు పాపముతోను
నామపుణ్యము చెలగునా—నేను ॥తొ॥

పార్వతి కోరికను తీర్చుటకు ఆమెచెల్లెలు కమలాంబను త్యాగయ్యగారు వివాహమాడిరి. త్యాగయ్య — కమలాంబలకు సీతాలక్ష్మియను కుమార్తె కలిగినది.

# ఉంఛవృత్తి

త్యాగరాజు అనాదియై, సంప్రదాయసిద్ధమై, అనిందితమైన ఉంఛవృత్తి మార్గమున జీవయాత్రను సాగించిరి. ఆయన చాల సాధారణమైన జీవితమును గడిపిరి. మానవజాతికి భక్తి, సంగీతముల ద్వారమున నమూల్యమగు సేవచేసిన మహనీయుడు త్యాగరాజు. తిరువయ్యార్–తిరుమంజన వీధిలోని పిత్రార్జితమగు గృహమందలి భాగము, కొద్దిపాటి (3–37 సెంట్లు) భూవసతి తప్ప తదితరమగు నాస్తిపాస్తు లేవియు కలిగినవాడు కాడు త్యాగరాజు. తన కుటుంబమును, శిష్యబృందమును ఉంఛవృత్తి మూలమున నార్జించిన దానితోనే పోషించుచుండెడివాడు. అప్పుడప్పుడు తనను దర్శింపవచ్చిన సంగీత విద్వాంసులు, పండితులు, భాగవతులు, కొందరు వారముల తరబడి, నెలల తరబడి త్యాగయ్య యింటనుండెడి వారు. త్యాగరాజు వారమున కొకసారి మాత్రమే ఉంఛవృత్తి జరిపి ఆర్జించినదానితోనే తన కుటుంబమును, శిష్యబృందమును, ఇంటికి వచ్చిన అతిధులను పోషించెడి వారట. అప్పుడప్పుడు తిరువయ్యార్‌నకు సమీపమునగల కల్యాణపురము, మానంబు చావడి మున్నగు గ్రామములకు ఉంఛవృత్తి జరుపుటకు ఆ గ్రామస్థుల ఆహ్వానముపై వెళ్ళెడివారు.

త్యాగరాజు అక్షయపాత్రను శిరముపై నిడుకొని తంబూర చేబూని శిష్యులు వెంటరా–

### యమునా కళ్యాణి - ఆది

హరిదాసులు వెడలేముచ్చట ఆనందమాయె దయాళో ॥హ॥
హరి గోవింద నరహరి రామకృష్ణయని
వరుసగనామము కరుణతో జేయుచు ॥హ॥
సంగతిగాను మృదంగ ఘోషములచే
బొంగుచు వీధులకేగుచు మెఱయుచు ॥హ॥

5)

చక్కని హరిచేఁ జిక్కితిమని మది
జొక్కుచు నామమె దిక్కని పొగడుచు ॥హ॥
దిట్టముగా నడుకట్టుతో నడుగులు
బెట్టుచు తాళముబట్టి గల్ గలనగ ॥హ॥
జ్ఞానముతో రామధ్యానముతో మంచి
గానముతో మేనుదాన మొసంగుచు ॥హ॥
రాజరాజునిపై జాజులు చల్లుచు
రాజిల్లుచు త్యాగరాజునితోఁ గూడి ॥హ॥

అని గానము చేయుచు ఉంఛవృత్తికై బయలుదేరెడివారు. త్యాగయ్యకు సమకాలికుడు, త్యాగయ్యను సందర్శించి తన జీవితమును పునీత మొనరించుకొనిన మహాభాగుడు, అపరరామదాసని పేర్వడసిన తూము నరసింహదాసు కూడ నుంఛ వృత్తి మార్గముననే జీవయాత్ర సాగించినట్లు ఈ క్రింది కీర్తనవలన తెలియు చున్నది.

"పరమ పావనమైన అక్షయపాత్ర జీవనాధారము చేసుక రాముల నమ్మితి ఈ దేహము స్వామి కమ్మితి" (తూము నృసింహదాసు)

త్యాగయ్య విశేషముగ ఆస్తిపాస్తులు లేనివాడని ఆయన వాటాకు వచ్చిన 3-37 సెంట్ల భూమికూడ ఎక్కువగా పండునది కాదని, త్యాగయ్యకు భక్తులు సమర్పించిన ద్రవ్యముతో అటు కుటుంబపోషణము ఇటు శిష్యులను, ఇంటికి వచ్చిన అతిధులను పోషించుటకు వారమున కొకసారి ఉంఛవృత్తి మార్గమున నార్జించినది సరిపోదని నిత్యము ఉంఛవృత్తి చేసెడివారని, త్యాగయ్యగారే

మాళవశ్రీ రాగము

ఎన్నాళ్ళు తిరిగేది ॥ఏ॥
ఎన్నరాని దేహాలెత్తి ఈ సంసార గహనమందు
పన్నగచోరులరీతి పరులను ఏవగించుచు ॥ఎ॥

ఉప్పు కప్పూరము వరకు ఉంఛవృత్తిచే నార్జించి
మెప్పుఁకు పొట్టనింపి మేమే పెద్దలమనుచు ॥ఎ॥
రేపటి కూటికి లేదని రేయి పగలు వెసనమంది
శ్రీపతిపూజలు మరచి చేసినట్టి వారివలెనే ॥ఎ॥
భ్రమనుకొని ఇరుగుపొరుగు భక్షింప రమ్మని పిల్వ
అమరుచుకోపూజ జపము నాసాయమౌఁగనుచు ॥ఎ॥
నాయందు ఉండేతప్పులు నాడే తెలిసికొంటిగావి
బాయవిడువక మహానుభావ త్యాగరాజ వినుత ॥ఎ॥

ఉప్పు కర్పూరము వరకు ఉంఛవృత్తిచే ఆర్జించినట్లు చెప్పికొనినాఁని శ్రీ నారుమంచి సుబ్బారావుగారు వ్రాసిరి.1

సంగీత కళానిధి డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు త్యాగయ్య జరిపిన ఉంఛవృత్తిపై తమ యభిప్రాయము నీ విధముగ వ్యక్తము చేసినారు.

"శ్రీవారి నిజమైన జీవిత విశేషములను గురించి మనకు సరిగా తెలియదనే చెప్పాలి. మనకు తెలిసినది కేవలము ఆకర్ణిగా మాత్రమే. లేక వారి కృతులలోని అర్థమును గైకొని ఊహించినది మాత్రమే. ఇందులకు ఏమికారణము 24,000 కృతులు రచించిరి త్యాగరాజు. అవన్నీ ఏమైనట్లు ? నారదునిచే ప్రసాదింపబడిన స్వరార్ణవమేమైనది ? శ్రీ త్యాగరాజు వారి జీవితములో పలువేదనలకు లోనైనట్లు గోచరించును. అందుకు కారణము వారి దైన్యజీవనముగా కొందరు వచియించు చున్నారు. అట్టి వారివాదన పాపభూయిష్ఠము. శ్రీ త్యాగరాజు బీదవాడు కాడు. జీవనమునకు లోటులేదు. నిత్యము పూజలు, నిరతాన్నదానములు చేసినవారు. అదీ గాక ఎంతోమందికి తగిన సలహాలనిచ్చే గౌరవనీతిపతిగా చెలంగినవారు. ఉంఛవృత్తి కేవలము సంప్రదాయాను సారముగా సాగించినవారే కాని పొట్టకూటి కొఱకుగాదు ఈ విషయములు నేను అక్కడక్కడ విశదీకరించినప్పుడు కొందరు ఆంధ్ర ప్రముఖులు నన్ను అపార్థము చేసికొన్నారు. శ్రీ త్యాగరాజును బీదవానినిగా నిరూపించుటలో గల సంతోషముకన్న వేరొక తృప్తి లేనటులతోచును2.

1. తెలుగు సంగీత మహర్షులు-రెండవభాగము-త్యాగయ-జీవిత చరిత్ర
2. "నాదబ్రహ్మ"-చేబ్రోలు చిన్మయబ్రహ్మకవి- మంగళంపల్లివారి తొలిపలుకు.

డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు వ్రాక్రుచ్చినట్లు త్యాగయ్యగారు ఉంఛవృత్తిని కేవలము సంప్రదాయానుసారము సాగించినవారేకాని పొట్టకూటి కొఱకు మాత్రముగాదు. అట్లయిన 'మాళవశ్రీ" రాగములోని "ఎన్నాళ్ళుతిరిగేది" అను కీర్తనలో త్యాగయ్య చెప్పికొనిన "ఉప్పు కర్పూరము వరకు ఉంఛవృత్తిచే నార్జించితిని'' అనుదాని మాటేమిటి ? అనిన - ఆచరణము కేవలము వారి నిర్వేదమునే తెలియజేయును.

శ్రీ నారుమంచి సుబ్బారావుగారు త్యాగయ్య తన కుటుంబమును, శిష్యబృందమును, ఇలటికి వచ్చు అతిథులను పోషించుటకు వారొక్కరోజు జరిపిన ఉంఛవృత్తి మూలమునవచ్చు పదార్థములు సరిపోవు కావున నిత్యము వారు ఉంఛవృత్తిని చేసెడివారను మాటయు సత్యదూరమే.

తిరువయ్యార్ ప్రజలకు త్యాగయ్య దైవసముడు. ఆయన కర్పించిన ఏ పదార్థమైనను రామసేవకు వినియోగింపబడునని తమ జీవితములు చరితార్థములగునని తిరువయ్యార్ ప్రజలు భావించెడివారు. త్యాగయ్యగారును తన శిరముపైనున్న అక్షయపాత్ర నిండగనే నాటి కుంచవృత్తిని చాలించి ఇంటికి తిరుగుముఖము పట్టెడివారట. అతిథి అభ్యాగత సేవయే పరమార్థముగ భావించిన త్యాగరాజు తన కుంచవృత్తితో లభించిన పదార్థము సరిపోదనుకొనినప్పుడు అక్షయపాత్ర నిండగనే ఇంటికి తిరుగు ముఖము పట్టక ఇంకను ఆర్జించుటకు సిద్ధపడెడివారు కదా! కావున డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు చెప్పినట్లు త్యాగయ్యగారు ఉంఛవృత్తిని కేవలము సంప్రదాయానుసారముగనే జరిపియుందురన్నమాట వాస్తవము.

## దినచర్య

త్యాగరాజు ప్రభాతమునలేచి తన యింటనున్న ఏక పీఠ విగ్రహమును చేరి శ్రీరామచంద్రునకిట్లు సుప్రభాతము పలికెడివారు,

ప్రాతఃస్మరామి రఘునాథ ముఖారవిందం
మందస్మితం మధురభాషి విశాలఫాలమ్
కర్ణావలంబి చల కుండల శోభిగండం
కర్ణాంత దీర్ఘనయనం నయనాభిరామమ్.

సౌరాష్ట్రం - రూపకం

మేలుకో దయానిధీ మేలుకో దాశరథీ ॥మే॥
మేలుకో దయానిధీ మిత్రోదయామౌవేళ ॥మే॥
నారదాదిమునులు సురలు వారిజభవుడిందుకలా
ధారుడు నీ సన్నిధినే కోరి కొలువుగాచినారు ॥మే॥
వెన్నపాలు బంగారుగిన్నెల నేనుంచినాను
తిన్నగారగించి తేటకన్నులతోనన్ను జూడు ॥మే॥
రాజరాజాది దిగ్రాజు లెల్ల వచ్చినారు
రాజనీతితెలియ త్యాగరాజవినుత నన్ను బ్రోవ ॥మే॥

మేలుకొలుపులు పాడి శ్రీరామునకు 'ఆకలిదీర పాలారగింపు' చేసెడివారు. 'చనువున ఘనునకు పన్నీటి స్నానము' చేయించెడివారు. కమ్మని భోజనము పెట్టెడివారు విడెమిచ్చెడివారు. 1,25000 నియమము చొప్పున నిత్యముచేయు రామనామ జపమును (త్యాగయ్యగారు చేసినది రామనామమే అనుటకు "నీవే నన్నెడ జేసితే నేనెవరితో దెలుపుదునయ్య-అను సౌరాష్ట్రరాగకీర్తనమందలి ఈ క్రింది చరణము ప్రబల సాక్ష్యము).

పతితపావన సమ్మతమున సుజనసం
గతిసేయుటకు సమరహిత రామనామము
సతతము సేయ నీ వ్రతము గోరితిగాని
నతజనకకులాబ్జహిత త్యాగరాజునిపై.

జపేశ్వర మంటపమున పూర్తిచేసి శ్రీరామునకు షోడశోపచార పూజలుచేసి శ్రీరామ ప్రసాదమును భుజించి, కొంతతడవు విశ్రాంతి తీసికొని, సాయంకాలము శిష్యులకు వారివారి యోగ్యతకు తగినట్లుగ పాఠముచెప్పి, కావేరికి వెళ్ళి స్నానమాడి సంధ్యావందనము చేసికొని ఇంటికి వచ్చి "చేతులార శృంగారము చేసి చూతునని శ్రీరామున కలంకారము చేసెడివారు. బాగుగ ఘనరాగముల దీపారాధన మొనరించి రాగరత్నమాలికచే రంజిల్లునటహరి-భాగవతోత్తములు కూడి పాడే కీర్తనములట-అని శ్రీరామునకు రోజురోజునకు కొంగ్రొత్త రాగములతో కూర్చిన దండను సమర్పించి-శ్రీరామునకు ఉయ్యాలవేసి పరుండజేసి

"ఉయ్యాల లూగవయ్యా శ్రీరామ" అని మల్లెపూల పాన్పువేసి రామునందు పవ్వళించుమని-

పూలపాన్పుమీద బాగపూర్ణ పవ్వళించు।
నీల ఘనశ్యామ హరే నిరుపమ రామయ్యా మల్లె॥ ॥పూ॥
మధుశర్కర యానబాలు మరి యారగించి।
విధుముఖ కమ్మని విడెము వేసికను కటాక్షించి॥ ॥పూ॥
పరిమళ గంధంబు మేన బాగుగాను పూసి।
మెరయగ సుమహారములను మెడనిండుగ వేసి॥ ॥పూ॥
ఆగమోక్తమైన శయ్య నంగీకరించి।
త్యాగరాజ కృతములెల్ల తథ్యమని సంతోషించి॥ ॥పూ॥
రామ శ్రీరామలాలి ఊగుమ ఘనశ్యామ బ్రోవుము లాలీ
చాలపాలింతు లాలీ మీగడ వెన్నపాలు తాగింతులాలి
శయ్యపైని మల్లెపూల బరతులాలీ వరమైన వి
డేల నొసగేలాలీ ఓ వనమాలీ! ॥రా॥
కాచిసేవింతు లాలీ శేషతల్పమునూచి పాడుదులాలీ
ఏకాంతమున దాచి పూజింతులాలీ
ఆవేళ నిన్ను జూచుచుప్పొంగుదులాలీ ఓ వనమాలీ! ॥రా॥

వేదవేద్య మాలాలీ కన్నుల జూడవే
దయానిధిలాలీ నాదుఃరమున నీ
పాదముఃలుంచులాలీ శ్రీ త్యాగరాజ మోదరూః మాలాలీ
ఓ వనమాలీ !

జోజోరామ ఆనందఘన జోజోజోరామ ॥జో॥
జోజో దశరధ బాలరామ జోజో భూజాలోల రామ ॥జో॥
జోజో రఘుకుల తిలక రామ జోజోకుటిలతరాలకరామః॥జో॥
జోజో నిర్గుణరూప రామః జోజో సుగుణకలాపరామ ॥జో॥
జోజోరవి శశినయన రామః జోజో ఫణివరశయనరామ॥
జోజో మృదుతరభాషరామ జోజో మంజులవేషరామ
జోజో త్యాగరాజార్చితరామ జోజో భక్తసమాజరామ.

అని జోలపాటలుపాడి శ్రీరాముని నిదురింపజేసి తానును విశ్రమించెడివారు.

త్యాగయ్య ఈ విధముఃగ స్వవిరచిత కీర్తనములను రామదాస పురందరిసాది భక్తుల కీర్తనలను గానము చేయుఃచుఃడెడివారు.

## త్యాగయ్య శొంఠి వేంకటరమణ భాగవతుల యింటబాడుట

## 1801—1802

త్యాగయ్య గొప్ప గాయకుడుగ కీర్తి గాంచినాడు. ఆయన కీర్తి దేశము నలుమూలల వ్యాపించినది. ఆ కాలమున తంజాపుర పాలకుడు శరభోజీ మహారాజు. సంగీత ప్రియుడాతడు. ఆయన ఆస్థానమున 364 మంది గాయకు లుండిరట. సంవత్సరమున కొక్కరోజు ఒక్కొక్క విద్వాంసుడు గానము చేయవలయును ఆ సంవత్సరమునకు సరిపడు గ్రాసమును రాజు ఆయన కొసంగును. శొంఠి వేంకట సుబ్బయ్యగారు తంజాపురాస్థాన సంగీత విద్వాంసులు. ఈయన శ్రీకృష్ణ లీలా తరంగిణి కర్తలగు శ్రీనారాయణ తీర్థులవారి శిష్యులు. శరభోజీ మహారాజు వేంకట సుబ్బయ్యగారి ఉపజ్ఞకు మెచ్చుకొని ఉగాదినాడు గానసభ చేయునవకాశమును

సింహాసనము నిచ్చి గౌరవించిరి. వేంకటసుబ్బయగారి కుమారులు వేంకటరమణ భాగవతులు. ఈయన త్యాగయ్యకు సంగీత విద్యాగురువు. వేంకటరమణ భాగవతులును తంజాపురాస్థాన సంగీత విద్వాంసులు.

వేంకటరమణ భాగవతులు త్యాగయ్య కీర్తిని విని మహానందపడి వెంటనే వచ్చి తన సన్నిధిని పాడుమని త్యాగయ్యకు కబురంపిరి. త్యాగయ్య గుర్వాజ్ఞాను సారము వెంటనే బయలుదేరి వేంకటరమణ భాగవతుల సన్నిధికిచేరిరి. వినయ వినమిత గాత్రుడై త్యాగరాజు గురువుకు నమస్కరించి తంబుర చేబూని బిలహరి రాగము నాలాపించి "దొరకునా ఇటువంటి సేవ" అను కీర్తనను గానము చేసి "కామితఫలదాయకియగు సీత" అనుచోట నెరవుచేసి స్వరమును పాడిరి. ఆ కీర్తన పూర్తియగుటకు కొన్ని గంటలు పట్టినది. వేంకటరమణ భాగవతులతో బాటుగ సభకు చేరిన సంగీత విద్వాంసులును త్యాగయ్య గాత్ర సంపదకు పాండిత్య ప్రకర్షకు, భక్తిభావమునకబ్బురపడిరి. త్యాగయ్యవంటి శిష్యుడు దొరికినందులకు వేంకటరమణ భాగవతులను బహుధా శ్లాఘించినారు విద్వాంసులు. ఆనాడు వేంకట రమణ భాగవతులు పొందిన ఆనందమున కవధులు లేవు. వేంకట రమణయ్యగారు త్యాగయ్యను దగ్గరకు తీసికొని—

త్యాగయ నాదు శిష్యగణమందున నిన్నొక శిష్యునట్టులన్
నేగని నాడగాని యిటునిస్తులగాన రసాన్వితుండవై
ఆగజ చర్మధారిలసదంశ జనించిన మర్త్యరూపి వం
చే గణియింపకుంటి యిపుడే నినుగాంచి ముదంబునందితిన్.
త్రిదశాంశోద్భవ తావకీనమృదు వాగ్ధీరత్వము గ్గాత్రసం
పద నిష్ఠారతి తత్త్వచింతనము నామ్నాయోక్త సద్వర్తనం
బుదయాసత్య శమాది సద్గుణ శతంబున్ నీకయొప్పెయ శా
స్పదమౌగానము నుద్ధరింపుము సహస్రాబ్దాయు రుత్సాహివై

అని ప్రశంసించి శరభోజీ ప్రభువు తన కొసంగిన ఆభరణములను త్యాగయ్యకుబహూకరించి యాశీర్వదించెను. గురువుగారినుండి బహుమానములను స్వీకరించుటకు ముందుగ త్యాగయ్య కొంత వెనుకాడినను తుదకు స్వీకరించినారు. త్వరలో జరుగ

నున్న గురుపుత్రికా వివాహ సందర్భమున గురువుగారు తన కొసంగిన ఆభరణము లకు మరికొన్నిటిని జతచేర్చి గురుపుత్రికకు బహుమానముగ నివ్వవచ్చునన్న తలంపుతో స్వీకరించి ఆ విధముగనే చేసినారు త్యాగయ్య. వేంకటరమణ భాగవతులను "దొరకునా యిటువంటి శిష్యుడు" అని పలికి "దీర్ఘాయురస్తు" అని యాశీర్వదించి భగవదర్పితముగ ననేక కృతులను రచింపుమని ప్రోత్సహించిరి.

1789వ సంవత్సరమున ప్రథమ కళత్ర వియోగానంతరము 1790 వ సంవత్సరమున ద్వితీయ వివాహము జరిగిన తరువాత శ్రీ వాలాజాపేట వేంకట రమణ భాగవతులు వ్రాసిన త్యాగబ్రహ్మము వారి చరిత్రలో 1801-1802 సంవత్సరమున శొంఠి వేంకటరమణ భాగవతులయింట త్యాగయ్య పాడి ప్రశంసలందుకొనిన సంఘటన ఉండుటవలన శ్రీ వాలాజాపేట వేంకటరమణ భాగవతులు త్యాగయ్య జీవితమును 34 సంవత్సర పర్యంతము వ్రాసియుండిరనవచ్చును. ఆ జీవిత చరిత్ర వరుసక్రమములో లేదు. ముందు త్యాగయ్యగారు గురువుగారింట పాడుట ఆ తరువాత భార్యా వియోగము జరిగినట్టుల గలదు. ఏది యేమైనను వాలాజాపేట వేంకటరమణ భాగవతులు వ్రాసిన త్యాగయ్యగారి జీవితచరిత్ర అసమగ్రము-అసంపూర్ణము అని చెప్పకతప్పదు.

వేంకటరమణయ్యగారు తన శిష్యుడైన త్యాగయ్యగానమును తంజావూరనున్న తన తండ్రి వేంకటసుబ్బయ్యగారికి వినిపింప తలంచి త్యాగయ్యను వెంట నిడుకొని తంజావూరు చేరినారు. త్యాగయ్య రమణయ్యలు తంజావూరు చేరుసరికి తంజాపురాస్థాన గాయకులందరు వేంకటసుబ్బయ్యగారింట బసచేసియుండిరి. ఆనాడు రాజ ప్రాసాదములో ఉత్సవము. గాయకులందరు విధిగ పాల్గొనవలయునని రాజునాజ్ఞ. త్యాగయ్యగారిని పాడుమని ఆజ్ఞాపించినారు వేంకటరమణయ్యగారు. ఒకప్రక్క గురువులు వేంకటరమణ భాగవతులు- మరొకప్రక్క వేంకటరమణ భాగవతుల తండ్రి వేంకటసుబ్బయ్యగారు ఆసీనులై యుండిరి. శ్రోతలా తంజాపురాస్థాన విద్వాంసులు 364 మంది. అంపర సమక్షమున త్యాగయ్యగారు పాడుటకు జంకిరి. గుర్వాజ్ఞ అనుల్లంఘనీయము. గురువుగారికి, వారి తండ్రిగారికి నిండు మనముతో ప్రణమిల్లి-సభలో నాసీనులైన సంగీత కోవిదులందరకు అంజలి ఘటించి తంబూర శ్రుతి చేసి త్యాగయ్యగారు నాడు కాంభోజిరాగమున-కీర్తనను పాడిరి.

కాంభోజి ఆది

మరిమరి నిన్నే మొరలిడ నీ మనసున దయరాదు ॥మ॥
కరి మొర విని సరగున చన నీకు కారణమేమి
సర్వాంతర్యామి ॥మ॥
కరుణతో ధృవునికెదుట నిల్చిన కథవిన్నానయ్యా
సురరిపు తనయునికై నరమృగమౌ సూచనలేమయ్యా
మరచియున్న వనచరుని బ్రోచిన మహిమ దెలుపవయ్యా
ధరనువెలయు త్యాగరాజసన్నుత తరముగాదికనే
విననయ్యా ॥మ॥

కీర్తన పూర్తియగుటకు ఎనిమిది గంటలు పట్టినది. వేంకట సుబ్బయ్యగారు శరభోజికి సర్దిచెప్పగలరను నుద్దేశముతో త్యాగయ్య అమృతగానమును వినుచున్నారు విద్వాంసులు. పోతన భాగవతము చేత బహుధా ప్రభావితులు త్యాగయ్యగారు. భాగవతము నిత్యపారాయణ గ్రంథము వారికి. పై కీర్తనలో భాగవతమునందలి గజేంద్ర మోక్షణము, ధృవోపాఖ్యానము, ప్రహ్లాద చరిత్ర శ్రీమద్రామాయణమునందలి సుగ్రీవుని చరిత్ర చోటు చేసికొనినవి. వేంకటసుబ్బయ్యగారు_వేంకట రమణభాగవతులు నాడు త్యాగయ్య గానమును విని పొందిన యానందము హద్దులు లేనిది. ఇక మిగిలిన గాయకుల విషయము చెప్పబనిలేదు. మరునాడు సుబ్బయ్యగారు విద్వాంసులను వెంటనిడుకొని రాజప్రసాదమునకేగినారు. క్రితమురోజు ఆస్థానమునకు రాని కారణము నడిగినాడు శరభోజి. త్యాగయ్య గాన మహిమమును ఏకవాక్యముగ విద్వాంసులందరు రాజునకెరిగించిరి. వేంకట సుబ్బయ్యగారు ప్రత్యేకించి త్యాగయ్యను అభినందించుచు రాజునకు త్యాగయ్య గాన పాండితీమహిమము నెరిగించిరి. శరభోజి త్యాగయ్య గాన వైభవమును విని_అంతటి యద్భుత గానమును వినిన శ్రోతల అదృష్టమున కెంతగనో మురిసిపోయి విద్వాంసులు సభకురాని విషయమునుగూడ మరచి, తాను కూడ త్యాగయ్యను తన యాస్థానమునకు పిలిపించుకొని ఆయన గానమును వినకుతూహలపడినాడు.

## శరభోజి ఆహ్వానము - 1802

శొంఠి వేంకట సుబ్బయ్య మొదలగు సంగీత విద్వాంసుల వలన త్యాగయ్య గాన వైశిష్ట్యమును గురించి వినిన శరభోజి త్యాగయ్యను తన ఆస్థానమునకు రప్పించి ఆయన పాటను విను తలంపుతో జాబు వ్రాసి సకల లాంఛన పురస్సరముగ త్యాగయ్యకడకు రాజోద్యోగిని పంపెను. అప్పటికి త్యాగయ్య వయసు 35 సంవత్సరములు. శరభోజి వ్రాసిన జాబులోని సారాంశము.

గాయక సార్వభౌమ వినగావలతున్ తమ గానమేనురే
పీయెడ మీరలొచ్చియొనరింపగలారె కచేరి యట్టిచో
మీ యపురూప కౌశలము మెచ్చికొనున్ సభయెల్ల మీరునున్
తీయని సౌఖ్య భోగముల తేలుదురింతకు కొల్వు చేరినన్

రాజోద్యోగి త్యాగయ్య యుల్లు చేరినాడు, జాబును త్యాగయ్యగారి కందజేసినాడు. జప్యేశుడు త్యాగయ్యకు వచ్చిన అపూర్వ అవకాశమునకు చాల సంతసించినాడు. తమ దారిద్ర్య బాధలు తొలగగలవని సంతసించినాడు. త్యాగయ్యకు రాజభవనము క్రొత్తగాదు. తండ్రితోబాటు బాల్యమున రామాయణ కథా ప్రసంగములకు వెళ్ళినవాడే. శరభోజి ఆహ్వానము త్యాగయ్యకు కోపమును తెప్పించినది. బాధను కలిగించినది. కారణము శరభోజి తనపై రెండు కీర్తనలను వ్రాసి పాడుమని త్యాగయ్యను కోరుటయే. ఆ విధముగ తనపై కీర్తనలను రచించి గానము చేసిన భూవసతిని కల్పింతుననుట. బంగారమును బహుమానముగ నిచ్చెదననుట.

"పదము త్యాగరాజనుతునిపై కానిది పాడేమి యేడ్చేమి" అనునది త్యాగయ్య సిద్ధాంతము. రాజు రాజత్వమునకు కారణమైన శ్రీరాముని సన్నిధినికాక ప్రభువుల సన్నిధిని పాడకూడదను నియమము గలవాడు త్యాగయ్య. ప్రభువుల సన్నిధిని పాడి పొందు లబ్ధి వలన కలుగు సుఖము కంటె రాముని సన్నిధిని పాడి నందువలన కలుగు సుఖము గొప్పది యని త్యాగయ్య విశ్వాసము. త్యాగయ్యగారాభావమును రాజాహ్వాన తిరస్కార సందర్భమున మనసును సంబోధించి ఈ క్రింది కీర్తనలో చెప్పినాడు. మన ఏవ మనుష్యాణాంకారణం బంధమోక్షయోః అని గదా సూక్తి.

చ॥ పలుకు బోటిని సభలోన పతిత మానవులకొసగు
ఖలుల నెచట బొగడని శ్రీకర త్యాగరాజవినుత ॥దు॥

రాజాహ్వాన తిరస్కార సందర్భమున త్యాగయ్యపై పోతన ప్రభావమెంతేని కలదు. ఒక్క రాజాహ్వాన తిరస్కార సందర్భముననేగాదు. త్యాగయ్య జీవితముపై ఆయన రచనలపై పోతన ప్రభావము అడుగడుగున కన్పడును. పోతన భాగవతము నాంధ్రీకరించుచు

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విన్ పురాణావళుల్
తెనుగుంజేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో
తెనుగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిన్ తెనింగించినా
జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్

అని వ్రాసుచ్చినారు. "శ్రీకైవల్య పదంబు చేరుటకునై చింతించెదన్-మోక్షప్రాప్తికి-నందాంగనాడింభకుని చింతించెదనని నొక్కివక్కాణించినారు. త్యాగయ్యగారును తన జీవిత గమ్యమును చేరుటకు సంగీతమును పాథేయముగ స్వీకరించి "సంగీత జ్ఞాన విహీనులకు మోక్షము లేదని సిద్ధాంతము చేసికొనినారు. (వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతి జాతి విశారదః తాళజ్ఞశ్చ అప్రయాసేన మోక్షమార్గం నిగచ్ఛతి-యాజ్ఞవల్క్య స్మృతి)

సారమతి-దేశాది

మోక్షము కలదా భువిలో జీవన్ముక్తులు కాని వారలకు ॥మో॥
సాక్షాత్కార నీ సద్భక్తి సంగీత జ్ఞానవిహీనులకు ॥మో॥
'దుర్మార్గ చరాధముల'-అను కీర్తనపై పోతన ప్రభావము
కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్య మర్దనుని గాదిలి కోడల యోమదంబ యో
హాటకగర్భు రాణి నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాటకీచ కుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ

భాగవతమును "పంటవలంతియల్లునకే" ధారపోసి నిష్కంటక వృత్తికై నడుము కట్టిన ధన్యమూర్తి పోతన. తాజెప్పిన ప్రతి కీర్తన భగవత్పరము చేసి మానవమాత్రులను కీర్తించనొల్లక పంటవలంతి యల్లునే కీర్తించి జీవితమును ధన్యతమ మొనర్చుకొనిన పుణ్యమూర్తి త్యాగయ్య.

ఛాయా తరంగిణి – ఆది

ప॥ కృపజూచుటకు వేళరా రామ ॥కృ॥
అ॥ప॥ అపరాధముల నోర్వ్వనశమా యనబోకవే
సరివారలలో ॥కృ॥
చ॥ పరమార్థమౌ మార్గ మెరుగరు-ప్రభువు లెల్ల నీచ
సేవకులుర
పరలోక భయమెంతగానరు వరత్యాగరాజ
హృత్సదన॥

గౌళిపంతు – ఆది

ప॥ కాసిచ్చేదే గొప్పాయెసురా కలిలో రాజులకు ॥కా॥
(హరి) దాసులు సేవింపరనుచు ప్రభువులు
దయమానిరి పరమెంచక పోయిరి ॥కా॥

బేగడ॥ త్రిపుట

గట్టిగాను నను చెయి బట్టే దెన్నటికో ॥గ॥
పుట్టిన నాటినుండి ఇట్టి విధములే కాని ॥గ॥
తెప్పున ఇంగిత మెరుగక మెప్పుల కాసించే యీ
చప్పని ప్రభువుల కడకును త్రిప్పటలేలరాయనుచు॥

రాజాహ్వానమును తృణప్రాయముగ నెంచిన వైరాగ్య సంపన్నులు త్యాగయ్యగారు. కాననే శ్రీ వారి శిష్యులు వాలాజాపేట వేంకటరమణ భాగవతులు

వైరాగ్యైకశకఏవ" అని త్యాగయ్యను కీర్తించినారు. గురుదేవులు పొతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి మహోదయులును "తాము రచించిన త్యాగరాజ సుప్రభాత శ్లోకములందు ఈ విధముగ కీర్తించి అయ్యగారికి సుప్రభాతము పలికినారు.

శ్రీరామ తారకమహామనుశుద్ధచిత్త
వాగ్వ్యాస నారదమహర్షి గణాంశభూత
వైరాగ్యభూషణ విభూషిత యోగిరాజ
శ్రీత్యాగరాజ గురురాట్ తవ సుప్రభాతమ్

వీక్షాల మృత నిషేచన వామాత్రజాత
జ్ఞానాంకురోల్ల సిత చోరమనోరసాల
నైరాశ్య సూచన తృణీకృతరాజలోక
శ్రీ త్యాగరాజ గురురాట్ తవసుప్రభాతమ్

శరభోజి పంపిన వార్తాహరులు త్యాగయ్య సమాధానమును విని చేయునది లేక తిరిగి వెళ్ళి జరిగిన వృత్తాంతమును రాజునకు నివేదించిరి. శరభోజి త్యాగయ్యపై ఆగ్రహించి త్యాగయ్యను బంధించి తన యాస్థానమునకు తీసికొని రావలసినదని గుర్రపు రౌతుల నిరువురను పంపినాడు. భాగవతాపచారము ఊరకపోవునా ! గుర్రపు రౌతులు రాజునానతిని బయలుదేరినదే తడవుగా శరభోజికి శూలవ్యాధి ప్రారంభ మైనది. ఏమిచేసినను ఆ నొప్పి సద్దుకొనినదికాదు. చివరకు ఆస్థాన కార్తాంతికులకు కబురంపగా వారు ఒక మహావ్యక్తిని అవమానింప యత్నించిన దానికి ఫలమిదియని చెప్పిరి. వెంటనే శరభోజి త్యాగయ్యను బాధింపనేగిన రౌతులను వెనుదిరిగి రావలసి నదిగా నాజ్ఞాపించి వార్తనంపినారు. ప్రధాన రౌతులు రాజునానతిని వేగముగా వెడలి ముందు వెళ్ళిన గుర్రపురౌతులను వెనుకకు మళ్ళించిరి. గుర్రపురౌతులు ప్రభు సన్నిధికి రాకమునుపే ప్రభువు శూల వ్యాధి మటుమాయమయ్యెను. నాటి నుండి శరభోజి మహారాజునకు త్యాగయ్యపై ఎనలేని గౌరవాభిమానములు కలిగినవి. మరునటి దినమే శరభోజి మహారాజు తిరువయ్యార్ వెళ్ళి త్యాగయ్యను సందర్శించి క్షమింపు డని వేడుకొనెను. అప్పటి నుండి శరభోజి సకుటుంబముగా తరచు తిరువయ్యార్ వెళ్ళి త్యాగయ్య గానమును వినుచుండెడివాడు. తాను సకుటుంబముగ త్యాగయ్య గానమును వినుటకు వెళ్ళి మకాము చేయుటకు శరభోజి కల్యాణ మహల్‌ను తిరు

వయ్యార్ లో త్యాగయ్య యింటికి సమీపమున కట్టించినాడు. త్యాగయ్య యింటి స్థల మునకు—కళ్యాణ మహల్‌నకు మధ్య సుమారు మూడు గజముల వెడల్పుగల సందు మాత్రము గలదు. ఈ రోజు త్యాగబ్రహ్మ ఆరాధన సభ కార్యాలయముగ నుపయో గింపబడుచున్న త్యాగయ్యయింట తాళపత్రమొకటి గలదు. ఆ తాళపత్రమునందలి వ్రాత త్యాగయ్య స్వదస్తూరితో కూడియున్నది. ఆ తాళపత్రము రాజాస్థానమునకు సంబంధించిన లాడూ బాయమ్మకు పై సందులో భాగమైన 5 గజముల స్థలమును త్యాగయ్య విక్రయించిన పత్రమునకు నకలైయున్నది. త్యాగయ్యగారింట జరుగు ఏకాదశీ ఉత్సవమున పాల్గొను శరభోజి తన ధనమును కొంత త్యాగయ్యకు సమర్పింపవలయునను సంకల్పము కలిగియుండి అట్టి యవకాశము ఎప్పుడు వచ్చునా యని యెదురు తెన్నులు చూచుచుండెను. త్యాగయ్య శిరముపై అక్షయపాత్ర నిడు కొని ఉంఛవృత్తికి బయలుదేరిన సమయమున శరభోజి మహారాజు పరిజనులు ఆ యక్షయపాత్రయందు సవ్వడి కాకుండగ జాగరూకతతో ఆయా సమయములందు బంగరు నాణెములనుంచినారు. త్యాగయ్య శిష్యులలో కొందరు దీనిని గుర్తించిరికాని ఆ వ్యక్తులు రాజపరిచారకులని గుర్తించుటచే వారికావిషయమున జోక్యము చేసు కొనుటకు ధైర్యము లేక పోయెను. కాని మరియొక పర్యాయము బంగారు నాణెమును పాత్రయందు విడిచినపుడు దురదృష్టవశమున అది అక్షయపాత్ర అంచునకు తగిలి లోనికి జారుటచే శబ్దమయ్యెను. ఆ మ్రోత విన్నంతనే త్యాగరాజస్వామి విషయ మేమని శిష్యుల ప్రశ్నింప వారు యావద్వృత్తాంతము త్యాగయ్యకు విన్నవించిరి. త్యాగయ్యగారు కుపితులై వెంటనే అక్షయపాత్రను నేలపై బోర్లించి రిక్తపాత్రను మరల తలపై నిడుకొని భజనసేయుచు ముందుకుసాగిరి. ఆ నాణెముల స్పర్శవలన అంతకు ముందు సంపాదించిన అక్షయపాత్రలోని బియ్యముకూడ నపవిత్రమయ్యెనని అవియు త్యాజ్యములేనని ఆయన భావించిరి.

త్యాగయ్య రాజాహ్వానము తిరస్కరించుటకు ఆయన తల్లి సీతమ్మగారు సజీవులు ఆమె కుమారుని ప్రతిష్ఠకు, ఆదర్శమునకెంతగనో సంబంధపడినది.

## త్యాగయ్య పూజించిన రామ పీఠమును జపేశుడు కావేరిలో పడద్రోచుట — 1803

త్యాగయ్య రాజాహ్వానమును తిరస్కరించిన నాటినుండి జపేశుడు త్యాగయ్యను సాధించుటెట్లని యోచన చేయుచుండెను. త్యాగయ్య తల్లి సీతమ్మగారు త్యాగయ్య వైఖరిని సమర్థించుచుండెను. మాతృదేవి యభిమానమును చూరగొనిన త్యాగయ్యను బహిరంగముగ నడ్డుకొనుట జపేశునకు చేతకాని పనియైయున్నది. త్యాగయ్య పూజించు రామ పీఠమును ఆయనకు దూరము చేసినగాని బాగుపడడని, ధనార్జనకు సుముఖుడుకాడని తలచి జపేశుడొకనాటి రేయి త్యాగయ్య పూజించు రామ పీఠమును తమ యింటికి సుమారు 60 గజముల దూరమున నున్న కావేరిలో దుష్ప్రవృత్తి గలిగి పడద్రోచెను. నిత్యము వలెనే త్యాగయ్య రామచంద్రునకు వేకువన సుప్రభాతము పాడుటకు రామ పీఠము చెంతకరుగగా పూజామందిరమున విగ్రహములు కనబడలేదు. నిశ్చేష్టుడైనాడు. త్యాగయ్య స్పృహనుకోల్పోయినాడు. కొంత తడవునకు తెప్పరిల్లినాడు. రాముడు లేని గేహ మొక యిల్లు కాదనుకొనినాడు. "భక్త మందారుడగు రామయ్యను జూడని కన్నులు కన్నులుగావని నోరారగ రమానాధ మాయయ్య, రాఘవ యని శ్రీరాముని కీర్తింపని నోరు నోరుగాదని ఇక మొంచి ప్రాణాలతో పెయ్యారేండ్లు బ్రతుకుట దుర్భరమని" తలచి తలచి పలవించినారు త్యాగయ్యగారు. విగ్రహములు లభించునంతవరకు నిద్రాహారములు వర్జింతునని శపథమూనినారు. శిష్యులు త్యాగయ్యగారి ననునయింప ప్రయత్నించినారు. ఫలితము శూన్యము. విగ్రహాన్వేషణ ప్రారంభమైనది. వెదకి వెదకి ఫలితము శూన్యము కాగా విసిగి వేసారినారు. సర్వాంతర్యామియగు రాముడెచటనున్నాడని-ఎచటలేడని- ఈ అన్వేషణ అని ఆర్తుడై పలవించినారు త్యాగయ్యగారు.

ప॥ నేనెందు వెదకుదురా హరి ॥నేనెందు॥

అ॥ ప॥ ఆనాల్గు మోములవాని మొరనాలకించిరాని నిన్ను ॥నే॥

చ॥ కలుషాత్ముడై దుష్కర్మయుతుడై
పలుమారు దుర్భాషియై
ఇలలో భక్తాగ్రేస
రుల వేషియై త్యాగరాజపూజిత ॥నే॥

అన్నగారెచటనో విగ్రహములు దాచియుంతురని, దుఃఖపడవలదని క్షుళి లెంతగనో అనునయింప ప్రయత్నముచేయగా త్యాగయ్యగారు

ప॥ ఎందు దాగినాడో-ఈడకురానెన్నడు దయ వచ్చునో
ఓ మనసా ॥ఎం॥

అ॥ ప॥ ఎందుకు చపలము వినవె నామనవిని
ముందటివలె భక్తుల పోషించుట ॥కెం॥

అలనాడు కనక కశిపు నిండారు
చలము చేసి సుతుని సకల బా
ధల బెట్టగా మదిని తాళక ని
శ్చలుడైన ప్రహ్లాదు కొరకు కంబములో
పల నుండగ లేదా ఆ రీతినే ॥డెం॥

మును వారివాహ వాహన తనయుడు మద
మున రవిజుని చాలకొట్టుటఁజూచి
మనసు తాళలేక ప్రేమ
మున పాలనము సేయ తాళతరువు మరు
గున నిల్వగ లేదా రీతిని నే ॥డెం॥

తొలి జన్మములనాడు జేసిన దుష్కర్మ
ముల నణగను సేయ ఆరు శ
త్రుల బట్టి పొడిసేయ అదియుగాక
ఇలలో చంచలము రహిత నిజ భక్త జ
నులను త్యాగరాజుని రక్షింపనే ॥డెం॥

విగ్రహములు లభింపకుంటతో జీవితము దుర్భరమైనది త్యాగయ్యగారికి. దుఃఖోపశమనమునకై తన మేనత్తకుమారుడు, శిష్యుడునగు మానంబుచావడి వేంకట సుబ్బయ్యగారింటికి వెళ్ళి కొలది దినములక్కడ, కొలది దినములు తిరువాయూరు వెళ్ళి అచట కాలము వెళ్ళబుచ్చినారు త్యాగయ్యగారు. రామానుగ్రహము లభింపలేదు. రాముని నిష్ఠురములాడినారు.

అడిగి సుఖము లెవ్వరనుభవించిరిరా ఆదిమూలమా
రామ ॥అ॥
సడలని పాప తిమిర కోటి సూర్య సార్వభౌమ సారసాక్ష
సద్గుణనిన్ను॥
ఆశ్రయించి వరమడిగిన సీత యడవికి బోనాయె
ఆశహరణ రక్కసి యిష్టమడుగ అపుడె ముక్కుపోయె
ఓ రామ ॥అ॥
వాసిగ నారదమౌని వరమడుగ వనిత రూపుడాయె
ఆసించి దుర్వాసుడన్నమడుగ అపుడెమందమాయె
ఓ రామ ॥అ॥
సుతుని వేడుకజూడ దేవకి యశోద సూడనాయె
సతులెల్ల రతిభిక్షమడుగ వారివారి పతుల వీడనాయె
ఓ రామ ॥అ॥
నీ కేదయ బుట్టి బ్రోతువో బ్రోవవో నీ గుట్టు బయలాయె
సాకేతధామ శ్రీత్యాగరాజనుత స్వామి ఏటిమాయా
ఓ రామ నిన్నడిగి

ఇప్పట్టున త్యాగయ్య ఆర్తుడై చెప్పిన కీర్తనలు పెక్కు గలవు.

దాచుకోవలెనా దాశరథి నీ దయ ॥దా॥
చూచువారలలోన చులకనేననుజూచి ॥దా॥
కనికరము కాంతపై కలిగి ముద్దిడువేళ
జనకజ నామాట సమయమని బల్కితే ॥దా॥
కరగి పదముల వ్రాలగని కరుణసేయువేళ
భరతుడెంతో నన్ను భక్తుడని పల్కితే ॥దా॥
నేమమున బరిచర్యనేర్పును పొగడు వేళ
సౌమిత్రి త్యాగరాజుని మాట బల్కితే ॥దా॥

చేసినదెల్ల మరచితివో ఓ రామ రామ ॥చే॥
ఆసకొన్నట్టి నన్నాలయించుటకు మున్ను ॥చే॥
అలు నీకైన భక్తురాలో యనుచు నాడు
ప్రాలు మాలక రవి బాలుని చెలిమియు ॥చే॥
భాష తప్పకను విభీషణుని కోరకాది
శేషుడగు తమ్ముని పోషించమని రాజు ॥చే॥
రామ శ్రీత్యాగరాజ ప్రేమావతార సీతా
భామ మాటలు తెల్పు భీమాంజనేయు బ్రహ్మ ॥చే॥

నే పొగడకుంటే నీకేమి కొదవో
నీ మనసు తెలిసెగదరా ఓ రామ ॥నే॥
ప్రాపు గల శుకసనక ప్రహ్లాద నారద
పరమేశ రుద్రాది భక్తులర్చింపగ ॥నే॥
భుజియింప బెట్టసతి బుధులు సామాజికులు
భజియింప సోదరులు పవనసూను
డజబిడౌజాది సురలాప్తులైనారు నీ
రజనయన శ్రీత్యాగరాజనుత బాలుడగు ॥నే॥

"యుక్తము కాదు నను రక్షింపక యుండేది." అని శ్రీరాముని నిలదీసి యడిగినారు త్యాగయ్యగారు. ఎందరనో రక్షించితివే. ఆ నీ కీర్తిని నేను విని యున్నానే. నన్ను రక్షించుటకీనాడెందులకు రావు? నన్ను రక్షింపవలదని నీతో నెవరైన చెప్పినారా?

ఎందుకీచలము నేనెవరితోఁదెల్పుదు
కందర్ప జనక నీకే కాంత చెప్పెనో హరిహరి ॥ఎం॥
కౌసల్య చెప్పెనో-నీకే సమ్మతి లేదో
అహల్య చెప్పెనో నన్నాదరించలేవో ॥ఎం॥

కబరీ భారిణి సీతాకాంత చెప్పెనో లేక
శబరి చెప్పెనో నీదు శాంత మెందుబోయె ॥ఎం॥
బాలయౌ స్వయంప్రభ చెప్పెనో
తాళ నాతరమా త్యాగరాజునిపై ॥ఎం॥

నన్ను రక్షింపవలదని—నీ సుందరవదనారవిందమును నాకు చూపవలదని నీతో నెవ్వరు చెప్పి యుండరు. నీకే యిష్టము లేదని—మరల కొంతతడవు రాముని నిష్ఠ రము లాడినారు త్యాగయ్య.

వద్దనే వారు లేరు ॥వ॥
అద్దంపు మోమును జూడ నే నయమంగలార్చితే
జూచి ॥వ॥
కోరికలిలలో దివిలో కొంచెమైన లేని నా మనసు
దారి తెలియు దైవము నీవు సుమీ
త్యాగరాజ హృద్భూషణ నిను వినా ॥వ॥

క్షీరసాగరశయన నన్ను చింతల బెట్టవలెనా రామ ॥క్షీ॥
వారణరాజును బ్రోవను వేగమె వచ్చినది విన్నానురా
రామ ॥క్షీ॥
నారీమణికి జీరలిచ్చినది నాడే విన్నానురా
ధీరుడౌ రామదాసుని బంధము దీర్చినది విన్నానురా
నీరజాక్షికై నీరధిదాటిన నీ కీర్తిని విన్నానురా
తారకనామ త్యాగరాజనుత దయతో నేలుకోరా
రామా ॥క్షీ॥

పలుకవేమి నా దైవమా పరులు నవ్వేది న్యాయమా
అలుగ కారణమేమిరా రామ నీ వాడించినట్లు ఆడిన
నాతో ॥ప॥

తల్లి దండ్రి భక్తినొసగి రక్షించిరి-తక్కిన
వారలెంతో హింసించిరి
తెలిసి యూరకుండేది యెన్నాళ్ళురా దేవాదిదేవ
త్యాగరాజవినితో ॥ప॥

ఎంతగ ప్రార్థించినను ప్రయోజనము శూన్యము. విగ్రహముల జాడలేదు రాముని మనసు కరిగినది కాదు. కారణము తోచలేదు త్యాగయ్యగారికి. "ఎందుకో నీ మనసు కరుగదు" అని శ్రీరాముని "అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమ్" "నీ మనసు కరుగని కారణమేమని" శ్రీరామునడిగి అను నిశ్చయమునకు వచ్చినారు

"ప్రారబ్ధ మిట్లుండగా ఒరులననపనిలేదు నీ వుండగ ॥ప్రా॥
బాల గుణశీల జనపాల వరద కృపాల
వాల కాలాతీత శూలధర వినుత నా ॥ప్రా॥
ఉపకారినే నైతె అపకారులయ్యేరు
కృప జూచితే మిగుల నెపము లెంచేరయ్య
చపల చిత్తులు భక్త వేషులై ననుజూచి
శత్రులయ్యేరు శ్రీత్యాగరాజాప్తనా ॥ప్రా॥

శ్రీరాముడు తన్ను సాధించుచున్నాడని తలచినారు. "సాధించెనె ఓమనసా" ఎట్టకేలకు—రామచంద్రా ! నన్ను రక్షింప వలెనను తలపే అసలు నీ మనసున ఉన్నదా ! లేదా ! అట్టి తలపే నీ మనసుననున్నను నీకు తీరిక చిక్కకున్నచో రామ కార్య ధురంధరుడని పేర్వడసిన హనుమానునితో; నిన్నాశ్రయించి రాజ్యమును పొందిన విభీషణునితో, తనివారగనీకు పరిచర్యచేసి "రామస్య దక్షిణోబాహుః నిత్యం ప్రాణో బహిశ్చరః" అని పేరెక్కిన నీ కత్యంతప్రియ సోదరుడగు లక్ష్మణునితో, మా అమ్మ సీతమ్మతోనైన ప్రసంగవశమున "త్యాగయ్య మనవాడని" చెప్పకూడదా రామచంద్రా-నీ నగుమోమునుగనలేని నా జాలిని దెలిసి నన్ను బ్రోవ రాదా ! అని శ్రీరాముని ప్రార్థించినారు.

నగుమోము గనలేని నాజాలి దెలిసి
నను బ్రోవగ రాదా శ్రీరఘువర ॥నీ॥

నగరాజధర నీదు పరివారులెల్ల
ఒగిబోధన చేసేవారలు గారె అటులుండుదురే ॥నీ॥
ఖగరాజు నీయానతి విని వేగచనలేదో
గగనానికిలకు బహుదూరంబనినాడో
జగమేలే పరమాత్మ యెవరితో మొరలిడుదు
వగజూపకు తాళను నన్నేలుకోరా త్యాగరాజనుత ॥నీ॥

ఎట్టకేలకు రాముని మనసు కరిగినది. విగ్రహములు త్యాగయ్యగారికి దూరమై రెండు మాసములు గడిచినవి మూడవనెల ప్రవేశించనున్న సమయమున శ్రీరామచంద్రుడు త్యాగయ్యకు స్వప్నమున దర్శనమిచ్చి "ఓయి విగ్రహములు కావేరి రేవులో నున్నవోయి వేవేగ తెచ్చికొమ్ము" అని చెప్పినాడట.

ఈ విషయమై సాంబమూర్తిగారిట్లు వ్రాసినారు. ఈ విగ్రహములను జప్యేశుడు కావేరిలో పడద్రోచినది 1805 సంవత్సరమున.[1]

"Rama Vigraha thrown into the Kaveri river by his crue l brother, a few days after the family quarrel during Bhogi pandigal (January) and Thyagaraja's recovery of the idol in April of the same year i.e. after a period of thrce months".

ఆ మాటలకు త్యాగయ్యగారెంతగనో సంతసించి మహానందముతో కావేరికి పరుగులిడి, కావేరీ మహాప్రవాహమున దూకి రామచంద్రుడు చెప్పిన తావున చేయిపెట్టి చూడగా ఏకపీఠ విగ్రహము త్యాగయ్య కరకమలముల చేరినది. ప్రత్యక్షముగ రాముని చూచినంతగ సంబరపడి శ్రీరాముని సపరివారునిగ తన యింటికి రమ్మని యాహ్వానించినారు.

"రార మా యింటిదాక రఘువీర సుకుమార మ్రొక్కెరా"

శ్రీరాముని విగ్రహములను తన యింటికి తీసికొనివెళ్ళి పూజామందిరమున నుంచి ఎప్పటివలెనే రాముని కీర్తించుచు విశేషముగ శ్రీరామునర్చింప సాగినారు త్యాగయ్యగారు.

1. Great composers II Thyagaraja.

విగ్రహములు దొరికిన సందర్భమున త్యాగయ్యగారు పట్టరాని ఆనందముతో "కనుగొంటిని శ్రీరాముని నేడు" అను కీర్తనను గానము చేసినట్లు కొందరు వ్రాసినారు. కాని ఆ కీర్తన సపరివారుడైన శ్రీరామచంద్రుని ప్రత్యక్షముగ జూచినప్పుడు చెప్పినదని తోచుచున్నది. ఆ కీర్తనమునకు పాఠాంతరములు కలవు. లోకమున సంగీత విద్వాంసులందరు పాడుచున్న "కనుగొంటిని శ్రీరాముని నేడు" అను కీర్తనమందలి సాహిత్యమీ క్రిందిది.

కనుగొంటిని శ్రీరాముని నేడు ॥క॥
ఇనకుల మందు ఇంపుగానుబుట్టి
ఇలలోన సీతానాయకుని నేడు ॥క॥
భరత లక్ష్మణ శత్రుఘ్నులు కొలువ
పవమానసుతుడు పాదములు బట్ట
ధీరులైన సుగ్రీవ ప్రముఖులు
వినుతి సేయ త్యాగరాజనుతుని నేడు ॥క॥

డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు గానము చేయుచున్న కీర్తనయందలి సాహిత్యము :—

కనుగొంటిని శ్రీరాముని నేడు కనులార
నాకామితము తీర ॥కను॥
ఇనకులమందు ఇంపుగానుబుట్టి జనకాత్మజ
సంయుతుడైన రాము ॥కను॥
భరత శత్రుఘ్న అనిలజ భాస్కరాత్మజాత తనయులతో
ధరణీశులు విభీషణుడు కొలువ తత్త్వమసి యనుచు
త్యాగరాజు పాడ ॥కను॥

(ఇది తిల్లైస్థానం రామయ్యంగారి పరంపర ప్రకారము)

తిల్లైస్థానం వారి పాఠమని, ఉమయాళ్పురం వారి పాఠమని త్యాగరాజ కీర్తనలకు పాఠాంతరములు కలవు. ఈ కీర్తనను విగ్రహములు దొరికినప్పుడు కాక శ్రీరామ సాక్షాత్కారము కలిగినపుడు త్యాగయ్యగారు గానము చేసినది.

వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పశ్చాత్
సుమిత్రా సుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయోః వాయ్వాది
కోణేషు చ
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యేనీల సరోజ కోమల రుచిం రామం భజే శ్యామలమ్.

ఈ శ్లోకమందు వర్ణింపబడినది హనుమత్సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న పరివార సమేతుడైన శ్రీరాముడు. సపరివారుడైన శ్రీరామునే త్యాగయ్యగారు చూచినది కూడను. త్యాగరాజస్వామివారి పటముల కొన్నిటిలో త్యాగయ్య యెదుట సాక్షాత్కరించిన సపరివారుడైన శ్రీరామునే మనము కాంతుము.

ఉవిద మహానసంబు తలుపోరగదీసి భుజింప రండటం
చు విభుని బిల్వ బోయియటు జూచికనుంగొనె వారి
ముందరన్
పవనజ భూమిజ భరతభానుజ శత్రు నిషూదనోర్మిళా
ధవ పరివార శోభితుని దాశరథిన్ కరుణాపయోనిధిన్॥

(శ్రీ మద్దూరి సాంబయ్యగారు)

ప్రతి సంవత్సరము పుష్య బహుళ పంచమికి మా యింట త్యాగరాజ స్వామి వారి ఆరాధన జరుపు ఆచారము కలదు. మా చిన్నతనమున ఒక సంవత్సరము మా యింటిలో జరుగు పూజకు విచ్చేసిన కీ॥ శే॥ శ్రీ మద్దూరి సాంబయ్యగారు పూజామందిరముననున్న త్యాగయ్య పటమును జూచి చెప్పిన పద్యము. ఆ పటమున నున్న రూపమును చూచియే శ్రీ మద్దూరి సాంబయ్యగారు పద్యమును చెప్పినారు. త్యాగయ్యగారు "కనుగొంటిని శ్రీరాముని" అను కీర్తనను శ్రీరామ సాక్షాత్కార సందర్భముననే గానముచేసినను యథార్థము.

# సీతాలక్ష్మి వివాహము 1810

సీతాలక్ష్మి త్యాగయ్యగారి ఏకైక పుత్రిక. మొదటి భార్య పార్వతి గతించిన పిమ్మట ఆమె చెల్లెలు కమలాంబనే త్యాగయ్యగారు ద్వితీయ వివాహము చేసికొని నారు. కమలాంబ, త్యాగయ్యలకు కలిగిన సంతానము సీతాలక్ష్మి. సీతాలక్ష్మి వివాహము జరిగినది 1810వ సంవత్సరమున. అప్పటికి త్యాగయ్య వయసు 43 సంవత్సరములు. రామకృష్ణానంద యతీంద్రుల వలన మంత్రోపదేశమును పొందు నాటికి త్యాగయ్య వయసు పదునెనిమిది సంవత్సరములు. మంత్రోపదేశమును పొందిన నాటినుండి దినమునకు 1,25,000 చొప్పున చేయుచున్న రామనామజపము- 96 కోట్లు పూర్తియగునాటికి త్యాగయ్య వయస్సు సుమారు 40 సంవత్సరములు- (96 కోట్లు రామనామము పూర్తి యగుటకు పట్టిన కాలము 21 సంవత్సరముల 5 రోజులని-త్యాగరాజుని ఆధ్యాత్మిక సమన్వయము-అను వ్యాసమున శ్రీధరబాబుగారు వ్రాసిరి. నాట్యకళ - త్యాగరాజస్వామి ద్విశత జయంత్యుత్సవ సంచిక — 1767-1967). తొంబదియారుకోట్లు రామనామ జపము పూర్తియైనది. 96 కోట్లు పూర్తి కాగనే శ్రీరాముడు దర్శనమీయగలడని చెప్పిన రామకృష్ణానంద యతీంద్రుల మాటలను తలచుకొని శ్రీరామునెప్పుడు చూతునా అని-రామదర్శన కాంక్షియై— రామదర్శనము కొఱకు ఉత్కంఠతో నెదురులు చూచుచున్న త్యాగయ్యగారికి శ్రీరాముడు విశ్వామిత్రుని యాగ రక్షణమునకు అనుజుడగు లక్ష్మణుని వెంట నిడు కొని వెళ్ళినప్పటి రూపముతో లీలగా దర్శన మిచ్చినారు. త్యాగయ్యగారి ఆనందము నకు మేరలేదు. తాజూచిన శ్రీరాము నిట్లు పారవశ్యముతో కీర్తించినారు త్యాగయ్యగారు.

వెడలెను కోదండపాణి అనుజ సౌమిత్రి గూడి ॥వె॥
పుడమిలో జనులెల్ల పొగడ పూజితుడై మునితోగూడి ॥వె॥
ఉరమున హారము మెరయ శిరమున కొండియుజార
కరమున శరచాపములు ఘనముగ మెరయ
సురుచిర వాద్యములు మ్రోయ సురలెల్ల వినుతిసేయ
వరత్యాగరాజ నుతుడు వసుధభార మెల్లదీర్ప ॥వె॥

ఏలా నీదయరాదు పరాకు జేసేవేలా సమయముగాదు ॥ఏ॥
బాల కనకమయచేల సుజనపరి
పాల శ్రీరమాలోల విధృతశర
జాల శుభద కరుణాలవాల ఘన
నీల నవ్య వనమాలికా భరణ ॥ఏ॥

రారా దేవాదిదేవ రారా మహానుభావ
రారా రాజీవనేత్ర రఘువర పుత్ర
సారతరసుధా పూర హృదయ పరి
వార జలధి గంభీర దనుజ సం
హార దశరథకుమార బుధజన వి
హార సకల శృతిసార నాదు పై ॥ఏ॥

రాజాధిరాజ ముని పూజిత పద రవి
రాజలోచన శరణ్య అతిలావణ్య
రాజధరనుత విరాజ తురగసుర
రాజవందితసదాజ జనక దీన
రాజకోటి సమతేజ దనుజ గజ
రాజ నిచయ మృగరాజ జలజ ముఖ ॥ఏ॥

యాగరక్షణ పరమ భాగవతార్చిత
యోగీంద్ర సుహృద్భావిత ఆద్యంత రహిత
నాగశయన వరనాగవరద పు
న్నాగ సుమధర సదాఘమోచన స
దాగతిజధృత పదాగమాంత చర
రాగరహిత శ్రీ త్యాగరాజనుత ॥ఏ॥

ఈ సంఘటన జరిగినది 1807వ సంవత్సరమున. తిరువయ్యార్‌కు సుమారు ఒకమైలు దూరముననున్న అఖిలాండ పురమను గ్రామమున నివసించుచు అందరిచే

యోగ్యుడనిపించుకొని సనాతన మార్గమున జీవయాత్ర సాగించుచున్న "కుప్పుస్వామి" అను యువకునకు సీతాలక్ష్మినిచ్చి త్యాగయ్య వివాహము చేసిరి. ఆ వివాహము జరుగునాటికి త్యాగయ్య సన్నిధిని వాలాజాపేట వేంకటరమణ భాగవతులు, మరి కొందరు సంగీతమున శిక్షణ నొందుచుండిరి. వేంకటరమణ భాగవతులు తన శిష్యు డగు వల్లవి యెల్లయ్యచే కోదండరాముని ఛాయా పటమును వ్రాయించి ఆ వివాహ సందర్భముగ ఇతర కానుకలతో బాటు ఆ ఛాయాపటమును బహూకరించిరి. వేంకట రమణ భాగవతులు ఆ పటమును తనయొద్దకు తీసికొని వచ్చుటకు 4, 5 గజముల దూరముననే త్యాగయ్య చూచి మహానందముతో శ్రీరాముడు తనను రక్షించుటకు నడచి తన దగ్గరకు వచ్చుచున్నాడని సంబరపడి వెంటనే మోహనరాగమున నీక్రింది కీర్తనను చెప్పిరి.

ప॥ ననుపాలింప నడచి వచ్చితివో నా ప్రాణనాథ॥

అ॥ప॥ వనజనయన మోమును జూచుట జీ
వనమని నెనరున మనసు మర్మము దెలిసి ॥న॥

సురపతి నీలమణి నిభతనువుతో
ఉరమున ముత్యపుసరుల చయముతో
కరమున శరకోదండ కాంతితో
ధరణి తనయతో త్యాగరాజార్చిత ॥న॥

## త్యాగయ్యకుటుంబము - తిరువయ్యార్‌లోని గృహము కోదండరాముని పటము - వాని వివరములు

సీతాలక్ష్మి - కుప్పుస్వామి దంపతులకొక మగపిల్లవాడు కలిగినాడు. వారా పిల్లవానికి "త్యాగయ్య" యని నామకరణము చేసిరి. ఈ త్యాగయ్య మహావిద్వాంసు డగు మానంబుచావడి వేంకటసుబ్బయ్యయొద్ద సంగీత శిక్షణనొంది అచిరకాలము ననే సంగీతశాస్త్ర పారంగతుడయ్యెను. 35 సంవత్సరములకే త్యాగయ్య (త్యాగ రాజ స్వామివారి దౌహిత్రుడు) మరణించినాడు ఆ కుటుంబమున "త్యాగయ్య" పేరుపెట్టబడినవారు అచిర కాలముననే మరణింతురను నొక ప్రతీతి గలదు

త్యాగరాజస్వామి దౌహిత్రుడైన త్యాగయ్య భార్యపేరు గురవమ్మ. 1847వ సంవత్సరమున త్యాగరాజస్వామి సిద్ధిపొందిన యనంతరము గురవమ్మ కొంతకాలము తిరువయ్యార్, తిరుమంజన వీధిలో త్యాగరాజ స్వామివారు నివసించిన గృహమందుండి యొంటరి జీవితమును భరింపజాలక 1902వ సంవత్సరమున తిరువయ్యార్‌ను వీడి తంజావూరు వరాహప్పయ్యర్ వీధిలో నాటికి సజీవుడుగనున్న తన మేనమామ చంద్రశేఖర జోస్యులు యింటికి చేరి అచట మరణించెను.

1902వ సంవత్సరమున గురవమ్మ తిరువయ్యార్‌ను వీడి తంజావూరు చేరునపుడు ఆమె త్యాగరాజస్వామి పూజించు ఏక పీఠ విగ్రహమును, తలగుడ్డ కలిగి ముందు తంబురనుంచుకొనిన త్యాగయ్య ఛాయా పటమును తనవెంట తీసికొని వెళ్ళెను. ఆ ఏక పీఠవిగ్రహము, త్యాగయ్య ఛాయాపటము నేటికిని తంజావూరు వరాహప్పయ్యర్ వీధిలో గురవమ్మ మేనమామ యింటనున్నవి. తిరువయ్యార్ వెళ్ళి త్యాగయ్య సమాధిని సందర్శించి శ్రద్ధాంజలి ఘటించిన భక్తులు తంజావూరు వరాహప్ప వీధిలో గురవమ్మ మేనమామ యింటనున్న త్యాగరాజు పూజించిన ఏక పీఠ విగ్రహమును, త్యాగయ్య ఛాయపటమును సందర్శించి వత్తురు. గురవమ్మ మరణముతో త్యాగయ్య కుటుంబమంతరించినది. ఈనాడు త్యాగయ్యకు స్త్రీ సంతతిగాని, పురుషసంతతిగాని లేదు. త్యాగయ్య రెండవ అన్నగారు రామనాధము అవివాహితుడుగనే మరణించెను. త్యాగయ్యకు జ్యేష్ఠుడైన జపేశునకు సుబ్రహ్మణ్యము, పట్టాభిరామయ్య యను నిరువురు కుమారులు కలిగిరి. సుబ్రహ్మణ్యమునకు పురుష సంతానము లేదు. "నైషధం పార్వతమ్మ" యను కుమార్తెగలదు. ఆమె సంతతివారిప్పటికిని గలరు. జపేశుని రెండవ కుమారుడగు పట్టాభి రామయ్యకు "పంచాపకేశయ్యర్" అను కుమారుడు కలిగెను. ఈ పంచాపకేశయ్యర్‌కు "రాముడు భాగవతార్" అను కుమారుడు పుట్టెను. గాన విద్యా సుందరి బెంగుళూరు నాగరత్నమ్మ నిర్మింపజేసిన తిరువయ్యార్ నందలి త్యాగరాజ స్వామివారి ఆలయమున రాముడు భాగవతార్ పూజారిగ నియమింపబడెను. (రాముడు భాగవతార్‌ను పూజారిగ నియమించినది బెంగుళూరు నాగరత్నమ్మగారు) రాముడు భాగవతార్ జపేశునకు మునిమనుమడు. రాముడు భాగవతార్‌కు ఇరువురు కుమారులు, ముప్వురు కుమార్తెలు కలిగిరి. మొదటి కుమారుడు పండ్రెడవయేటనే త్యాగరాజు స్వామి పూజించిన రామపంచాయతనమును జపేశుని కావేరిలో వద

ద్రోచిన ప్రదేశమున నీదుచు మరణించెను. ఇతనికిని "త్యాగయ్య" యను పేరు పెట్ట ప్రయత్నించిరి. ఆ పేరుపెట్టిన బాలుడు అచిరకాలమున మరణించునను భయముతో పేరుపెట్టినవారు కారైరి. అయినను ఆ బాలుడు పండ్రెండవయేటనే మరణించెను.

## కోదండరామ పటము

రాముడు భాగవతార్ రెండవ కుమారుడు కుప్పుస్వామి భాగవతార్ పుత్ర సంతతి లేక 40వ యేట మరణించెను. రాముడు భాగవతార్ ముప్వురు కుమార్తెలలో "ధర్మాంబ" యనునామెకు "శ్రీనివాసయ్య" యనునొక కుమారుడు కలిగెను. ఆ శ్రీనివాసయ్యయే ప్రస్తుతము తిరువయ్యార్ నందలి శ్రీ త్యాగరాజ స్వామివారి యాలయమున పూజారిగ నున్నాడు. రాముడు భాగవతార్ రెండవ కుమారుడగు కుప్పుస్వామి భాగవతార్‌కు కుమార్తెలు ముప్వురు జ్యేష్ఠ పుత్రికయగు పర్వత వర్ధనిని తంజావూరునకు 20 మైళ్ళ దూరమునగల "అమ్మాపేట" కాపురస్థుడగు రామమూర్తి కుమారుడు నాగరాజునకిచ్చి వివాహము చేసిరి. కుప్పుస్వామి భార్య వెంగలక్ష్మి. ఈమె జప్యేశునికి వాటాగా వచ్చిన భాగమున (తిరువయ్యార్ తిరుమంజన వీధిలోని గృహమున) కొంతకాలముండి అమ్మాపేట వెళ్ళుచు ఆ భాగమును 1966లో సంగీతభూపతి మహారాజపురం విశ్వనాథయ్యర్‌కు విక్రయించెను. విశ్వనాథయర్యకు ఆ యింటిని స్వాధీనము చేయుటకై వెంగలక్ష్మి ఆ యింటిని ఖాళీ చేయు సందర్భమున రామమూర్తి వాలాజాపేట వేంకటరమణభాగవతులు త్యాగయ్యకు సీతాలక్ష్మి వివాహసందర్భమున బహూకరించిన ఛాయాపటమును బలాత్కారముగ అమ్మాపేట తీసికొని వెళ్ళినాడు. శ్రీకోదండరామపటమును గురించి ప్రొఫెసర్ సాంబమూర్తి గారొసంగిన వివరములు :-

**Nanupalimpa Picture :**

"This Picture was studded with gems and pearls as proved by the charana of the song. These are now missing. These gems and pearls it is said were removed by Pattabhiramaiah the grand father of Ramudu Bhagavatar when perhaps some of them began to drop off.

Once or twice musicians took this picture from Ramudu Bhagavatar's house and kept it in their own house for Puja. But who took this picture was invariably warned and terrorised in dream. One musician it is said saw the fiery forms of Rama and Lakshmana with their bows fully drawn in action. The picture was returned back to Ramudu Bhagavatar. This picture was over since remained in his house in Tirumanjana veedhi.*

పుత్ర సంతానము లేకుండగనే కుప్పుస్వామి మరణించుటతో జప్యేశుని పురుషసంతతియు పూర్తిగ నంతరించినది. ఈనాడు త్యాగయ్యకుగాని, జప్యేశునకు గాని పురుషసంతతిలేదు తానుకొనిన జప్యేశుని పటాను మహారాజపురం విశ్వనాథయ్యర్ అరుణాచలయ్యర్‌కు విక్రయించెను. ఇప్పుడు అరుణాచలయ్యర్ జప్యేశుని యింటిలో నివసించుచున్నాడు. త్యాగరాజస్వామి దౌహిత్రుడగు త్యాగయ్య భార్య గురవమ్మ త్యాగరాజస్వామి పటాను రామానుజయ్యర్‌కు విక్రయించి తిరువయ్యార్ వదలి వెళ్ళినది. 1952లో రామానుజయ్యర్ ఆ పటాను త్యాగబ్రహ్మ ఆరాధన సభకు విక్రయించిరి.

ఈనాడు తిరుమంజన వీధిలోని త్యాగయ్య యింటి ముందు భాగము డాబాగా నున్నది వీధినంటియున్న భాగము త్యాగయ్య కాలములో పూరివసారాగా ఉండెడిది. త్యాగయ్య యింటికి దక్షిణముగా 60, 70 గజముల దూరమున కావేరీ తీరము గలదు. ప్రదోష సమయమున కొంతతడవు త్యాగయ్య ఆ పూరివసారాక్రింద కూర్చుండి స్నాన సంధ్యాద్యనుష్ఠానములకై కావేరికి వెళ్ళెడివారు. ఇపుడు త్యాగబ్రహ్మ ఆరాధన సభవారు ఆ పూరిపాకను తీసి డాబా వేసిరి. ఈ డాబా హద్దుకును వీధికిని మధ్య ఇనుపకడ్డీలు పెట్టబడి ద్వార మమర్చబడినది. ఇప్పుడు డాబాగా మార్చబడిన భాగమునకు వెనుక మూడు భాగములుగా త్యాగరాజస్వామివారి యిల్లు గలదు. వెనుకటి రెండు భాగములు చీకటిగ నుండును. నాలుగవ భాగము వెనుక సందు గలదు. ఆసందు సుమారు 4,5 అడుగుల వెడల్పు గలిగియున్నది. ఈ సందు హద్దుననే తంజావూరు రాజులకు చెందిన కళ్యాణమండపము గలదు. ఆకళ్యాణమండపమునందు వేదసంగీత కళాశాల గలదు. ఈకళ్యాణమండపమున నాసీనులై శరభోజి

*Great composers II Thyagaraja (Revised Edition) P-91

త్యాగయ్య గానమును వినుచుండెడివాడు.

త్యాగయ్య యింటికి 40, 50 గజముల దూరమున ధర్మసంవర్థనీఆలయ ప్రాకారముగలదు. ఈ త్యాగయ్య యింటికి సుమారు రెండు ఫర్లాంగుల దూరమున బెంగుళూరు నాగరత్నమ్మ కట్టించిన త్యాగరాజాలయము గలదు.

## మాతృవియోగము - 1810

సీతాలక్ష్మి వివాహము 1810 సంవత్సరము చైత్రవైశాఖ మాసములలో జరిగినది. తరువాత కొద్దికాలమునకే త్యాగయ్యగారి తల్లి సీతమ్మగారు కాలము చేసినారు. త్యాగయ్య జీవితమున 1810 సంవత్సరము విశేషప్రాముఖ్యతను సంతరించుకొనినది. కుమార్తె సీతాలక్ష్మి వివాహము మాతృవియోగము, అన్నతో విడివడి వేరు కాపురము పెట్టుట—అన్నియు 1810 సంవత్సరమున జరిగినవి.

## కుటుంబ విభజన - ఆస్తి పంపకము

సంగీత జగద్గురువు, ప్రముఖ వాగ్గేయకారుడు, రామసాక్షాత్కార భాగ్యమును బడసిన పుణ్యమూర్తి – ఆంధ్రుడునగు శ్రీ త్యాగరాజస్వామివారి జీవిత విశేషములిప్పటికిని సమగ్రముగ లభించినవని చెప్పుటకవకాశములేకున్నది. త్యాగయ్యగారి జీవితవివరములను చాలవరకు అందించినవారు ఆచార్యసాంబమూర్తిగారనుట నిర్వివాదాంశము. కాని వారివ్రాతలనుగూడ పూర్తిగ నిజమనినమ్ముటకు వీలువేదు. శ్రీసాంబమూర్తిగారు తమ: Great composers II Thyagaraja (Second Edition, revised and enlarged) గ్రంథమున Important events in Thyagaraja's life-Arranged Chronologically-పట్టిక క్రింద కుటుంబ విభజన, ఆస్తి పంపకము 1806 సంవత్సరమున జరిగినట్లును, త్యాగయ్యగారికి

మాతృవియోగము 1812 సంవత్సరమున జరిగినట్లుల వ్రాసినారు. ఈ సాంబ మూర్తిగారే అదే గ్రంథమున కుటుంబవిభజన, ఆస్తిపంపకము మాతృవియోగానంతరము జరిగినట్లుల వ్రాసినారు.

"The family Partition took place after the mother passed away"[1].

త్యాగయ్యగారి కుమార్తె సీతాలక్ష్మి వివాహానంతరము మాతృవియోగము తదనంతరము కుటుంబవిభజన, ఆస్తిపంపకము జరిగియుండుట యథార్థము. ఈ మూడు సంఘటనలు జరిగినది 1810 సంవత్సరమున. కాన త్యాగయ్యగారి జీవితములో 1810 సంవత్సరమునకు విశేషప్రాముఖ్యముగలదు.

త్యాగయ్య జీవనవిధానము జ్యేష్ఠునకు నచ్చినదికాదు. త్యాగయ్య రాజాస్థానముపాడి ధనమార్జించికుటుంబమునకు సహాయపడుటలేదని జ్యేష్ఠునకు త్యాగయ్యపై కినుక. ఆకినుకతోనే లేమివలన బాధపడుచున్న జ్యేష్ఠుడు 1810 సంవత్సరమున భోగిపండుగనాడు త్యాగయ్యను జూచి

"అపుడు తదగ్రజన్ముడిటులాడెను త్యాగయతోడ నీవిటుల్
జపమొనరించుచుండిన ఫలంబదియేమి కుటుంబపోషణం॥
బెపుడును జూడవెట్లు భరియించెద నే నఖిలంబు గాన నీ
విపుడె తొలగి వేఱవసియింవు నీదుమనంబు చొప్పునన్॥

అని శాపించినారట. "పితృసమోజ్యేష్ఠః" అనునానుడి ప్రకారము త్యాగయ్యకు జ్యేష్ఠునిపై గౌరవాదరములుమెండు. అన్నగారి మాటప్రకారము త్యాగయ్య యింటినుండి వెలువలకు వచ్చి వీధిలో నిలబడెను. పతివ్రతయగు త్యాగయ్య భార్య కమలాంబ సయితము భర్తననుసరించెను. మండుటెండలో నిలబడియున్న త్యాగయ్య దంపతులను జూచి తిరువయ్యారు ప్రజలు జాలిచెందిరి, బాధపడిరి. ఈ విషయము ఆ యూరి తహసిల్‌దార్ శ్యామలరావుకు తెలిసినది, వెంటనే శ్యామలరావు త్యాగయ్యను చేరి పరిస్థితిని త్యాగయ్య శిష్యులనడిగి తెలిసికొనినాడు. అన్నగారి నుండి విడివడి వేరుగనుంటయే త్యాగయ్యకు క్షేమమని భావించి భాగములను పంచు

1) Great Composers, Book II P-20

కొని విడివిడిగ నుండుమని జప్యేశత్యాగయ్యలకు సలహానొసంగినాడు శ్యామల రావు. జప్యేశుడు శ్యామలరావొసంగిన సలహాకు అభ్యంతరము చెప్పలేదు. శ్యామలరావే మధ్యవర్తిత్వము వహించి పశుపతి కోవెలలోని భూమిని, తిరువయ్యార్ తిరుమంజన వీధిలోని గృహమును రెండుభాగములుగ చేయించినాడు. ఇంటియందు దక్షిణభాగము జప్యేశునకు ఉత్తరపుప్రైపు భాగము త్యాగయ్యకు పంచబడెను. అదినముననే తాపీవాండ్రను రప్పించి శ్యామలరావు మధ్యగోడకట్టించిరి. తాతతండ్రులనాటినుండి పూజింపబడుచున్న ఏకపీఠవిగ్రహము త్యాగయ్యకు లభించినది. త్యాగయ్య మహానందమందినాడు ఆ ఏకపీఠవిగ్రహము లభించిన తన యదృష్ట విశేషమునకు మురిసినాడు త్యాగయ్య.

ప॥ ఎంతభాగ్యమో మాపాలగల్గితివి
యెవ్వరీడు ముజ్జగములలో ॥తన॥

అ॥స॥ చెంతజేరి సౌజన్యుడై పలికి
చింతబాగతొలగించి బ్రోచితివి ॥ఎంత॥

చ॥ మున్నుమీసమీపమునవెలయుసన్మునులనెల్లనణిమాదిలీలలచే
దిన్నగాను పాలనము జేసినట్టు
నన్నుగాచితివి త్యాగజనుత ॥ఎంత॥

లోకులు త్యాగయ్యయే కావలెనని అన్నగారితో విడివిడి వేరుకాపురముపెట్టి భక్తులనుండి నచ్చు రాబడిని బాగుగ ననుభవించుచు సుఖముగ జీవించుచున్నాడని త్యాగయ్యపై నిందలుమోపిరి. ఈ నిందలు త్యాగయ్య చెవిని సోకినవి. చాల బాధపడినాడు. తనకు కలిగిన కష్టసుఖములనన్నిని తన యిష్టదైవమగు శ్రీరామునకు విన్నవించుకొనెడి త్యాగయ్య రామునితో మొరపెట్టుకొనినాడు.

"నాదుపై బలికేరు నరులు శ్రీరామ
వేద సన్నుత భవము వేరు చేసితిననుచు॥ నాదుపై
పంచశరజనక ప్రపంచమున గల సుఖము
మంచువలె ననుచు మదినెంచితిగాని

పంచుకొని ధనము లార్జించుకొని సరి యెవ్వ
రంచు మరి గతియులేదనుచు బలికితినా॥ నాదుపై
దినము నిత్యోత్సవమున కాస జెందితినిగాని నా
మనసున యిల్లు యొకటియని యుంటిగాని
అనుదినము నొరులమేలును జూచితాళ లే
కను రెండుసేయ వలెననుచు బల్కితినా ॥నా॥
ప్రాణమేపాటియని మానమేమేలంటి
గాని శ్రీరామ పరమానందజలధి
శ్రీనాథకులములో లేని దారిని బట్టి
జేనెడుదరమునింపనొరుల బొగడితినా ॥నా॥
అజాను బాహుయుగ శ్రీజానకీపతి పయోజాక్ష
శ్రీ త్యాగరాజనుతచరణ
ఈజగతిలో నిన్ను బూజించువారి నవ్యాజమున
బ్రోచు సురాజ నీవాడైన ॥నాదుపై॥

ఈ సంఘటన జరుగునాటికి త్యాగయ్య వయసు 43 సంవత్సరములు—

అది అన్నగారితో విడివడి వేరు కాపురము పెట్టిన తొలిరాత్రి. త్యాగయ్య గారి మనసు చాల కలవరపడియున్నది. పదార్థములన్నియు నిండుకున్నవి. ఆరోజు త్యాగయ్యగారికి ఏకాదశియైనది. చీకటిపడినది. ఆ సమయమున ముప్వురు వ్యక్తులు త్యాగయ్యగారింటిని వెదకుకొనుచువచ్చిరి. ఆ ముప్వురిలో నిరువురు వృద్ధదంపతులు. మూడవవ్యక్తి సేవకుడు. త్యాగయ్య వారికి సాదరముగ స్వాగతము పలికినాడు. అతిధి–అభ్యాగత సేవయే పరమావధిగగల త్యాగయ్యగారు వచ్చిన అతిధికి ఏమియు పెట్టజాలని నాటి తన దుస్థితికి వగచిరి. త్యాగయ్య హృదయమునెరిగిన వృద్ధ బ్రాహ్మణుడు త్యాగయ్యను "బాధపడవలదని, పదార్థమున్నదని, సేవకుడు వంట జేసి మనకందరకు భోజనము పెట్టగలడని" యోదార్చినారు. వృద్ధబ్రాహ్మణు నాదేశముతో సేవకుడు తన దగ్గరనున్న పదార్థములతో క్షణకాలములో వంటను పూర్తిచేసెను. ఇదంతయు త్యాగయ్యకయోమయముగనుండెను. తన యింటికి వచ్చిన అతిధులెవ్వరయినది త్యాగయ్య గుర్తింపలేకుండెను. త్యాగయ్య యింటికి

వచ్చిన అతిధులెవ్వరోకాదు. వృద్ధబ్రాహ్మణవేషమ నమున్నది దయాశరధియగు దాశరధి. వృద్ధబ్రాహ్మణి పతివ్రతాశిరోమణియగు జానకి. సేవకవేషమున నున్నది రామభక్తాగ్రగణ్యుడగు నాంజనేయుడు. పదార్థమును తయారుచేసినది మారుతి. వడ్డించినది అఖిలలోకమాత సీత. త్యాగయ యింటనున్న ఏక పీఠ విగ్రహమునకు పదార్థనివేదనము జరిగినది. వంటకము అమృతోపమానమై యుండెను. భోజనములు పూర్తియయినవి. సంభాషణలతో కాలము గడచినది. తెలతెలవారు సమయమున "మంచి కీర్తిప్రతిష్టలు కలుగగలవని" వృద్ధబ్రాహ్మణుడు త్యాగయ్యకు చెప్పి పత్నీ సేవకసహితముగ నదృశ్యుడయ్యెను. కొంత తడవునకు త్యాగయ్య వెలుపలకు వచ్చి అదృశ్యులైన వ్యక్తులకై పరుగులిడెను. ఫలితము శూన్యము. కొంత సేపటికి తన యింటికి అతిధులుగా వచ్చినవ్యక్తులలో దంపతులు సీతారాములని, సేవకుడు ఆంజనేయుడని త్యాగయ్యకు స్ఫురణకు వచ్చెను.

సీతారాములు ఆంజనేయసహితులై త్యాగయ్య యింటికరుదెంచినది త్యాగయ్య నాశీర్వదించుటకు. నాటినుండి త్యాగయ్య కీర్తిదేశదేశములకెగబ్రాకినది. ఈ సందర్భమున త్యాగయ్య వ్రాసినవి రెండు కీర్తనలు. శ్రీరామచంద్రునుద్దేంచి యొకటి మరియొకటి రామకార్య ధురంధరుడగు మారుతాత్మజునుద్దేశించి.

శ్రీరామచంద్రు నుద్దేశించి చెప్పిన కీర్తన

భవనుత నా హృదయమున రమింపుము బడలికదీర
భవతారక నాతో బహుబల్కిన బడలికదీర కమలసం
భవనుత॥

పవనసుతప్రియ తనకై దిరిగిన బడలికదీర
భవనముజేరి నను వెరపించిన బడలిక దీర కమలసం
భవనుత॥

పరమగునైవేద్యము లను జేయని బడలిక దీర
పరవలేక సరిపోయి నట్టాడిన బడలికదీరకమలసం
భవనుత॥

ప్రబలజేసి నను బ్రోచేపనుకొన్న బడలిక దీర
ప్రభు నీవు త్యాగరాజునికి బడలిక తీర కమలసంభవనుత

ఆంజనేయునుద్దేశించి చెప్పిన కీర్తన

కలుగునా పదనీరజసేవ గంధవాహ తనయ
పలుమారు జూచుచు బ్రహ్మానందుడై వరభక్తాగ్రేసర తనకు॥
వేకువజామున నీ కరమున నిడి శ్రీకాంతుడమృత
స్నానము చేసి
పాకము లను శ్రీరంగేశుని కర్పణముజేసి తా సీతాకరములచే
భుజించి నినుసా
త్త్వికపురాణ పఠన జేయుమనే సాకేతపతిని సర్వాధారుని
ప్రాకటముగ త్యాగరాజనుతుని గన ॥కలుగునా॥

ఈ కీర్తనను పుష్యబహుళపంచమినాడు త్యాగరాజస్వామివారి ఆరాధన జరుగు సమయమున శ్రీవారి సమాధి దగ్గర ఉదయము జరుగు పూజాకార్యక్రమమున శ్రీవారి శిష్యపరంపరలోని వారు తప్పనిసరిగా గానము చేయుదురు.

ఈ సంఘటన జరిగినది 1810 సంవత్సరము చివరిభాగమున 1810 సంవత్సరముననే చైత్ర, వైశాఖమాసము లలో సీతాలక్ష్మి వివాహము, అనంతరము సీతమ్మగారి మరణము, తదనంతరము అన్నదమ్ములు వేరు పడుట జరిగినది. ఈ విధమైన ముఖ్య సంఘటనలు జరిగి 1810 సంవత్సరము త్యాగయ్య జీవితమున ప్రాముఖ్యతను సంతరించుకొనినది.

1812 సంవత్సరమున అనగా త్యాగయ్యకు 45వ యేట అన్న జప్యేశుడు మరణించినాడు. 1827వ సంవత్సరమున త్యాగయ్యకు షష్టిపూర్తి ఉత్సవము జరిగినది. ఆ యుత్సవ సందర్భమున త్యాగయ్యకు ఆయన ముఖ్యశిష్యుడగు వాలాజాపేట వేంకటరమణ భాగవతులు త్యాగయ్యకు అత్యంత ప్రియమైనది ఆయన నిత్యము పారాయణజేయు పోతనభాగవతమును స్వదస్తూరితో వ్రాసి బహూకరించిరి. ఇప్పటికిని వేంకటరమణభాగవతులు త్యాగయ్యకు షష్టిపూర్త్యుత్సవ సందర్భమున బహూకరించిన స్వదస్తూరితో వ్రాసిన భాగవతపు ప్రతి మధురై సౌరాష్ట్ర సభలో కలదు

# తీర్థయాత్రలు

త్యాగయ్యగారు వార్ధక్యమున అనగా సుమారు 68. 69 సంవత్సరముల వయసున తీర్థయాత్రలు చేయ సంకల్పముతో ప్రధానశిష్యగణపరివేష్టితులై బయలుదేరిరి. త్యాగయ్య తీర్థయాత్రలకై బయలుదేరిన విషయమున, త్యాగయ్యగారు సందర్శించిన ఆయా క్షేత్రములలో జరిగిన సంఘటనల విషయమున చరిత్రకారులందరునేకాభిప్రాయమునే కలిగియున్నారు. త్యాగయ్య సందర్శించిన క్షేత్రములలో మధుర, ధనుష్కోటులుకూడకలవని కొందరు మాత్రమే వ్రాసియున్నారు. "మనసునిల్ప శక్తిలేకపోతే మధుర ఘంటవిరులపూజేమి చేయును" అను అభోగిరాగకీర్తనను, "కోటినదులు ధనుష్కోటిలో నుండగ ఏటికితిరిగెదవె ఓ మనసా" అను తోడి రాగకీర్తనను ఆధారము చేసికొని త్యాగయ్య మధుర, ధనుష్కోటులను సంధర్శించియుందురని కొందరభిప్రాయపడుచున్నారు. కాని త్యాగయ్య మధుర, ధనుష్కోటులను సందర్శించిరనుటకు ఆ రెండు కీర్తనలేమాత్రము ఆధారభూతములు కావు త్యాగయ్య తాను సందర్శించిన స్థలములలో కోవూరు, శ్రీరంగము. తిరువత్తియూర్ క్షేత్రములందుగల ఆయా దేవతలను గురించి పంచరత్న కీర్తనములను రచించియున్నారు. మధురమీనాక్షిని బోలిన సుందరమూర్తి భారతదేశమునందెచటనులేదని ప్రతీతి. తంజావూరునందలి బంగారుకామాక్షి విగ్రహము బంగారముతో చేయబడి మిక్కిలి అందముగ నుండును. మధురమీనాక్షి విగ్రహము మరకతమణితో చేయబడినది. శ్యామశాస్త్రికి భక్త్యావేశమును కలిగించిన తల్లి కంచికామాక్షి, శ్యామశాస్త్రి కుమారుడగు సుబ్బరాయశాస్త్రికి భక్త్యావేశము కలిగించిన తల్లి మధురమీనాక్షి. సుబ్బరాయశాస్త్రి త్యాగయ్యకు శిష్యుడు. ఇతరక్షేత్రదైవతములపై కీర్తనలను వ్రాసిన త్యాగయ్య మధుర, రామేశ్వరములను సందర్శించియుండినచో మధురమీనాక్షిపై రామేశ్వరునిపై తప్పక కీర్తనములను చెప్పియుండెడివారు. కాన కొందరు చెప్పుచున్నట్లుగా త్యాగయ్యగారు మధురరామేశ్వరములను సందర్శించియుందురను మాట సత్యదూరము.

హిందూసంప్రదాయప్రకారము గృహస్థు భార్యాసహితుడై తీర్థయాత్రాసందర్శనము మొదలగు పుణ్యకార్యములను చేయునుగాని భార్యప్రక్కన లేకుండగ తీర్థయాత్రలను చేయడు.

అట్టిచో పూర్వాచారపరాయణుడు, ఆస్తిక్యబుద్ధిగలిగిన త్యాగయ్య భార్య కమలమ్మ ప్రక్కనలేకుండగ తీర్థయాత్రలు చేయుటకెట్లు సంకల్పించెను? కారణమనూహ్యము. ఈ విషయమై చరిత్రకారులెవ్వరును ఏమియు వ్రాయలేరి. వ్రాసినది శ్రీ సాంబమూర్తిగారొక్కరే. శ్రీ సాంబమూర్తిగారి వ్రాతయు సమంజసముగ తోపదు. త్యాగయ్యగారు తీర్థయాత్రలకు బయలుదేరునాటికి కమలమ్మగారు మరణించిరని వ్రాసినారు సాంబమూర్తిగారు.

'When Thyagaraja started on his Piligrimage to Kanchi and other places, he had already lost his wife. He was carried singly in the palanquin by his disciples.

(Creat composers II Thyagaraja Revised Edition Page 79).

సాంబమూర్తిగారి కథనము ప్రకారము త్యాగయ్యగారు తీర్థయాత్రలకు బయలుదేరినది 1839 వ సంవత్సరమున. (Great composers II Thyagaraja first Edition 122 పేజీలో) త్యాగయ్యగారి ద్వితీయ కళత్రము కమలమ్మ 1846 సంవత్సరమున మరణించినదని, ఆ మరు సంవత్సరము త్యాగయ్య సిద్ధిపొందిరని వ్రాసియున్నారు. ఈ గ్రంధములోనే 163వ పేజీలో సుమారు 30 సంవత్సరములు త్యాగయ్య కమలమ్మ మరణానంతరము జీవించియున్నారని వ్రాసినారు. ఇది హాస్యాస్పదము. పరితాపుల సాంబమూర్తిగారి రచనలో పొంతనలేకున్నది. కాని యిప్పటికి లభించిన త్యాగయ్య జీవితమునకు సంబంధించిన గ్రంధములలో పూర్తి వివరములున్న గ్రంథము శ్రీ సాంబమూర్తిగారి గ్రంధమే. కమలమ్మ మరణించినది 1946 సంవత్సరముననే. త్యాగయ్య తీర్థయాత్రలకు బయలుదేరినది 1834 సంవత్సరములోనని మరికొందరు వ్రాసియున్నారు. త్యాగయ్యగారెప్పుడు తీర్థయాత్రలకు బయలుదేరినను ఆయన తీర్థయాత్రలకు బయలుదేరునాటికి కమలమ్మ సజీవురాలు. కమలమ్మ వ్యాధిగ్రస్తురాలైనప్పుడు "ఏ పాపము నసెతిరా" అను కీర్తనను, మరణించినపుడు "తొలిజన్మమునచేయు దుడుకుతెలిసెను" అను కీర్తనను వ్రాసిరి. కమలమ్మ వెంటలేకుండగ త్యాగయ్య యాత్రలుచేయు విషయమై శ్రీవారి ముఖ్య శిష్యుడగు వాలాజాపేట వేంకటరమణ భాగవతులు ఏమియు వ్రాయలేదు. వేంకటరమణభాగవతులు వ్రాసిన త్యాగయ్య జీవితచరిత్ర మనకు సంపూర్ణముగ లభించి యుండినచో త్యాగయ్య జీవితమునకు సంబంధించిన వివరములు

సమగ్రముగ తెలిసియుండెడివి. అట్లు లభింపకపోవుట ఆంధ్రుల దురదృష్టము. వేంకటరమణభాగవతులు త్యాగయ్య మరణానంతరము జీవించియున్నారు.

త్యాగయ్య తీర్థయాత్రలు చేయసంకల్పించినది రామబ్రహ్మముగారికి బాల్య స్నేహితుడగు "ఉపనిషద్బ్రహ్మేంద్రస్వాముల"వారి ఆహ్వానమును పురస్కరించు కొని. త్యాగయ్య తీర్థయాత్రాటనముపై మక్కువ కలిగినవారు కారు. వారి కీర్తనల నాధారముగ చేసికొని చూచిన ఈ విషయము వెల్లడికాగలదు.

i) కోటి నదులు ధనుష్కోటిలో నుండగ ఏటికి తిరిగెదవె ఓ మనసా!

ii) ధ్యానమేవరమైన గంగాస్నానము. (ఈ కీర్తనపై నారాయణతీర్థుల వారి ప్రభావము గలదు. తీర్థులవారు తమ కృష్ణలీలాతరంగిణిలో "రామకృష్ణ గోవిందేతి నామసంప్రయోగే కామమిహస్నాతవ్యం సర్వోత్తమ ప్రయాగే" అనగా త్యాగయ్యగారు "ధ్యానమేవరమైగంగాస్నానము-రామధ్యానమే వరమైన గంగాస్నాన మనినారు.)

iii) ఘనదుర్మదుడై తామునిగిన కావేరి

మందాకిని ఎటుబ్రోచును (మనసునిల్పశక్తి లేకపోతే)

ఇంటనో, దేవాలయముననో ఒకమూల ఆసీనులై రామనామ జపమును చేసికొనుట యందే త్యాగయ్యకాసక్తిమెండని పై కీర్తనలవలన తెలియుచున్నది. "శ్రీకృష్ణ కర్ణామృతమున" లీలా శుకులు వెల్లడించిన అభిప్రాయముకూడ నిదియే కదా!

సంధ్యావందన భద్రమస్తు భవతే భోస్నానతుభ్యం నమో
భోదేవాః పితరశ్చతర్పణ విధౌనాఽహంక్షమఃక్షమ్యతాం
యత్రక్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారంస్మారం అఘం హరామి తదలం మన్యేకిమన్యేనమే

నవవిధభక్తి మార్గమున త్యాగయ్యగారు శ్రీరామునకర్చనలు సలిపినవారైనను వారు తమ జీవితమునంతను నామ సంకీర్తనమునకే వినియోగించిరి. పై కృష్ణ కర్ణామృత ములో లీలాశుకులు వెల్లడించిన యభిప్రాయమునే త్యాగయ్యగారు

సుగుణములే చెప్పుకొంటి సుందర రఘురామ ॥సు॥
వగలెఱుంగ లేక ఇటు వత్తువనుచు దురాసచే ॥సు॥
స్నానాదిసుకర్మంబులు వేదాధ్యయనంబులెఱుగ
శ్రీనాయక క్షమించుము శ్రీత్యాగరాజవినుత ॥సు॥

తన తండ్రికి సహపాఠియై 108 ఉపనిషత్తులకు భాష్యమును వ్రాసిన ఉపనిషద్బ్రహ్మేంద్రస్వాములవారి ఆహ్వానమును పురస్కరించుకొనియే త్యాగయ్య తీర్థయాత్రలకు బయలుదేరిరని నిస్సంకోచముగ చెప్పవచ్చును. కొందరు త్యాగయ్య విగ్రహములనుకోల్పోయి మనస్థ్సిమితము లేక తీర్థయాత్రలకై సంకల్పించిరని వ్రాసిరికాని అది యథార్థము గాదు.

త్యాగయ్య కీర్తి ప్రతిష్ఠలను గురించి విని, త్యాగయ్య గానమును వినవలయునను ఉద్దేశము గలిగి ఉపనిషద్బ్రహ్మేంద్రులు త్యాగయ్యకు నారాయణ స్మరణ పూర్వకముగ శ్రీముఖమునంపిరి. ఉపనిషద్బ్రహ్మేంద్రులు 108 ఉపనిషత్తులకు భాష్యమును వ్రాసిరి. శ్రీవారు వ్రాసిన 108 ఉపనిషత్తుల భాష్యమును "అడయార్ థియసాఫికల్‌సొసైటీ"వారు ప్రచురించినారు. కంచిలోని ఉపనిషద్బ్రహ్మేంద్ర మఠమున నిప్పటికిని తాళపత్రగ్రంథములు కలవు. ఉపనిషత్తులకర్థము చెప్పుటయందు ఉపనిషద్బ్రహ్మేంద్రుల ఖండప్రజ్ఞావంతులు. ఆయన 115 సంవత్సరములు జీవించినారు.

## త్యాగయ్యగారికి ఉపనిషద్బ్రహ్మేంద్రులవారంపిన శ్రీముఖము

"నేను నీ తండ్రి సహపాఠులము. నాకు ఇప్పుడు 115వ సంవత్సరము నడుచుచున్నది. గాయకునిగా నీకీర్తిప్రతిష్ఠలు దేశమంతటను అలముకొని యున్నవి. నీ గానమును వినవలయునన్న ఆశ నన్ను తొందరపెట్టుచున్నది. కావున నీవు కంచికి వచ్చి కొద్దిరోజులు కంచిలోనుండి నీ అమృతగానమును వినిపించవలసినది."

ఈ శ్రీముఖమును చూచి త్యాగయ్యగారు తీర్థయాత్రలకై బయలుదేరిరి. తీర్థయాత్రా సందర్భమున త్యాగయ్య వెంటనున్న శిష్యులు తంజావూరు రామారావు వాలాజాపేట వేంకటరమణభాగవతులు, తిల్లస్థానం రామయ్యంగార్, సొజిరిసీతారామయ్యగారలు. వీణకుప్పయ్యర్‌గురుపుగారికంటె ముందుగా కంచిచేరి త్యాగయ్య గారచట నుండుటకు కావలసిన వసతులన్నిటిని కల్పించినారు.

త్యాగయ్య తీర్థయాత్రలలో తొలి మజిలీ కంచి. ఉపనిషద్బ్రహ్మేంద్రులవారి యాదేశానుసారము తీర్థయాత్రలకై బయలుదేరిన త్యాగయ్య మొట్టమొదట కంచినే సందర్శించియుందురు. శ్రీసాంబమూర్తిగారు తమ Great Composers II Thyagaraja-Revised Edition లో అనుబంధము క్రింద Walajapat Manuscripts ఆధారముగా త్యాగయ్య జీవితమునకు సంబంధించిన కొన్ని వివరములనిచ్చినారు. అందు త్యాగయ్యగారు ప్రప్రథమమున శ్రీరంగమును సందర్శించినట్లున్నది.

During his trip, Thyagaraja was accompanied by his disciples, Srirangam was the first place visited by him during his trip. He stayed in Srirangam for five days and song the five pieces in praise of Sriranganadha. P 17)

త్యాగయ్యగారు చైత్రోత్సవసందర్భముగ శ్రీరంగమును సందర్శించినట్లు శ్రీసాంబమూర్తిగారు వ్రాసియున్నారు.

Thyagaraja happened to visit Srirangam during Chitrotsavam. (Great Composers II Thyagaraja P. 95)

తీర్థయాత్రలకై బయలుదేరిన త్యాగయ్యగారు ప్రప్రథమమున కంచినే సందర్శించి యుందురనుట సమంజసము.

త్యాగయ్య కంచిని చేరి ఉపనిషద్బ్రహ్మేంద్రులకతిధిగనుండి తమ గానమును స్వామివారికి వినిపించిరి. త్యాగయ్య గంధర్వగానమునకు ఉపనిషద్బ్రహ్మేంద్రులు బ్రహ్మానందమందిరి. త్యాగయ్య నాశీర్వదించినారు. కంచి యందలి ప్రధానదైవము వరదరాజస్వామి. వరదరాజస్వామికి దాసానుదాసుడు వేంకటాద్రిస్వామి. వేంకటాద్రిస్వామి వరదరాజుపై 150కి పైగా కీర్తనములను చెప్పి, ఆ స్వామికి ఎన్నియో ఆభరణములను చేయించినాడు. ఆ వరదరాజ భక్తుడైన వేంకటాద్రిస్వామి త్యాగయ్య సమాధిసమయమున తిరువయ్యార్ నందు జరిగిన యుత్సవములో పాల్గొనినారు. త్యాగయ్య కంచిని చేరుసరికి వరదరాజస్వామికి ఉత్సవము జరుగుచున్నది. త్యాగయ్యగారు వరదరాజస్వామికి జరిగిన గరుడసేవను, స్వామి వైభవమును జూచి ఉప్పొంగి కీర్తించినారు.

"వరదరాజ నిను కోరివచ్చితి మ్రొక్కేరా ॥వ॥
సురులు మునులు భూసురులు చుట్టుచుట్టి సేవించే ॥సు॥
వరగిరి వైకుంఠమట వర్ణింపదరముగాదట ని
ర్జరులను తారకములలో చంద్రుడై మెరయుదువట
వర త్యాగరాజనుత గరుడసేవజూడ ॥వ॥

పై కీర్తనమందలి చరణమున గల "గరుడసేవ" జూడ అను పదములను పరిశీలించిన త్యాగయ్య ప్రతి సంవత్సరము వైశాఖమాసమున స్వామివారికి జరుగు గరుడసేవసమయమున కంచిని సందర్శించిరనుట స్పష్టపడును.

వరదానవనీతాశా పాహి—వరదానవమదనాశా ఏహి ॥వ॥
శరదాభకర విధృతశరాశరశరదాశుగ సుమశరదా
శరహిత ॥వ॥
ద్విరదాద్భుతగమన పురదహననుత స్ఫురదాభరణా
జరావనపర
శరదా శన తురగరథాద్ద్యుతిజిత వరదాసజనాగ్రేసర
త్యాగరాజ—

త్యాగయ్యగారు కంచిలో "కామాక్షిని" సందర్శించి కామాక్షి వైభవమును కీర్తించి "వినాయకునివలె తననుకూడ బ్రోవుమని" కామాక్షిని వేడుకొనినారు.

**వాలాజాపేట :**

త్యాగయ్యగారు కంచినుంచి తన ముఖ్యశిష్యుడైన వాలాజాపేట వేంకటరమణ భాగవతుల ఆహ్వానముపై "వాలాజాపేట" వెళ్ళినారు. త్యాగయ్యగారు "వాలాజాపేట లో పండ్రెండు దినములున్నారు. అచట భజనకూటములలో పాల్గొని తన గంధర్వ గానముతో భజనలుచేసి వాలాజాపేట ప్రజలను పునీతులను చేసిరి. వేంకటరమణ భాగవతుల శిష్యులు నిర్మించుచున్న భజనమందిరమును సందర్శించిరి వాలాజాపేట వేంకటరమణ భాగవతులకు శిష్యులై ఆయన సన్నిధిని సంగీతవిద్య నభ్యసించుచున్న మైసూరు సదాశివరావు వాలాజాపేట వృత్తాంతమును "త్యాగరాజస్వామి వెడలిన" అనుతోడి రాగకీర్తనమందు పొందుపరచినారు.

**తిరుపతి యాత్ర :**

"కలౌ వేంకటనాయకః" కలియుగమున ప్రత్యక్షదైవము వేంకటేశ్వరుడు. కలియుగ వైకుంఠము తిరుమల. సచ్చిదానంద నిలయమైన సత్యలోకము ఆరు లోకాలపై నున్నదనిరి బుధులు. వేంకటేశ్వరుభూతల విష్ణులోకము ఆరుకొండలపై ప్రత్యక్షమగును. "సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహముచ్యతే" సర్వపాపములను పోద్రోచుదైవము వేంకటాచలపతి. భక్తసులభుడు. అట్టి తిరుమల క్షేత్రమును చేరినారు త్యాగయ్యగారు. పవిత్ర పుష్కరిణిని క్రుంకులిడి స్వామి సందర్శనార్థము ఆలయమున ప్రవేశించిరి. అప్పుడు సుమారు పండ్రెండు గంటలయినది. ఏడు కొండలను కాలినడకన ఎక్కుటవలన త్యాగయ్య వెంటనున్న శిష్యులు బడలిక చెందిరి. శిష్యులును పుష్కరిణిని స్నానమాడి స్వామి సందర్శనార్థము ఆలయమును చేరిరి. త్యాగయ్యగారి కృతులు బహుళ ప్రచారమున నున్నవి. ఆలయోద్యోగులు గాని, అర్చకస్వాములుగాని ఆలయమున ప్రవేశించినది ప్రముఖ వాగ్గేయకారులైన త్యాగయ్యయని గుర్తింపజాలరైరి.

త్యాగయ్యగారు స్వామి సందర్శనార్థ మేగుసరికి స్వామివారి కడ్డముగా తెర వేయబడియున్నది. స్వామిదర్శనము కానందుకు త్యాగయ్యగారెంతగనో బాధపడినారు. తానెంతోపాపినని వాపోయినారు. స్వామిని సందర్శింపజాలని తనజన్మము వ్యర్థమనుకొనినారు. తనయందు అజ్ఞానమను తెరయున్న కారణమున స్వామి సందర్శనము కాలేదనుకొనినారు. వెంటనే "తెరతీయగరాదా" అను కీర్తనను గౌళిపంతు రాగమున గానముచేసిరి. శిష్యులు స్వరసహితముగ కీర్తనను భద్రపరచిరి. త్యాగయ్యగారి గానము కొనసాగుచున్నది. త్యాగయ్యగారి గాత్ర సంపదకు ఆకర్షితులై జనము గుంపులుగుంపులుగా ఆలయమును చేరిరి. దేవాలయోద్యోగులు, పూజారులును ఆలయమును చేరిరి. త్యాగయ్య ఆ కీర్తనను పూర్తిచేసినదే తడవుగా అంతదనుక స్వామివారి కడ్డముగానున్న తెర తొలగినది. దివ్యమంగళ విగ్రహుడైన స్వామి దర్శనమయినది త్యాగయ్యగారికి. ఆ దివ్యమంగళ విగ్రహమును కనులార గాంచుటకు తన రెండుకన్నులు చాలవనుకొనినారు. వెంటనే మధ్యమావతి రాగమున నీ క్రింది కీర్తనను గానముచేసిరి.

వేంకటేశా నిను సేవింపను పదివేల కన్నులు కావలెనయ్యా
పంకజాక్ష పరిపాలిత మునిజన భావుకమగు
దివ్యరూపమును వే॥

ఈ మధ్యకాలమున మిగిలిన త్యాగయ్యశిష్యులు నచట గుమిగూడుట, ఆ గంధర్వగానము ప్రముఖ వాగ్గేయకారులైన త్యాగయ్యగారిదని అందరకు తెలిసినది. వెంటనే ఆలయాధికారులు, అర్చకులు ఆలయ మర్యాదలతో త్యాగయ్యగారిని ఆలయములోనికి తీసికొనివెళ్ళి స్వామికి హారతినిచ్చి స్వామిదర్శనము చేయించినారు. ఆ హారతి వెలుగులో వేంకటేశ్వరస్వామి అనేక రూపముల భాసించినారు. అనేక రూపముల భాసించిన స్వామిని జూచిన త్యాగయ్యగారు—

ఎవరని నిర్ణయించిరిరా నిన్నెట్లారాధించిరిరా
నరవరు లెవరని

శివుడనో, మాధవుడనో, కమలభవుడనో పరబ్రహ్మమనో
శివమంత్రమునకు "మ" జీవము మాధవమంత్రమునకు
"రా" జీవము

ఈ వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద వితరణ గుణ
త్యాగరాజ వినుత॥

త్యాగయ్యగారు తిరుపతిని సందర్శించినపుడు గానము చేసిన కీర్తనలు నాలుగు —

1) తెర తీయగరాదా - గౌళిపంతు
2) వేంకటేశా నినుసేవింపను - మధ్యమావతి
3) తరమా నీ మహిమ
4) ఎవరని నిర్ణయించితిరా. దేవామృతవర్షిణి

మొదటి మూడు కీర్తనలు క్షేత్రముద్రను కలిగియున్నవి.

పుత్తూరు :

తిరుపతినుండి బయలుదేరి తిరుగు ప్రయాణమున పుత్తూరను గ్రామము మీదుగా ప్రయాణము సాగించిరి. పుత్తూరనునది తిరుపతికి సమీపమున రైలు స్టేషనుగల ఒక చిన్న గ్రామము. త్యాగయ్యగారా గ్రామము చేరునరికి ఉదయకాలమైనది. ఆ గ్రామమున నొక దేవాలయము గలదు. జనులు గుంపులు గుంపులుగా దేవాలయముముందు చేరిరి. ఒకస్త్రీ శవము మీద పడి యేడ్చుచుండెను. త్యాగయ్యగారు విచారణ సేయగా అచ్చటనున్నవారీవిధముగ చెప్పిరి.

"శేషయ్యయను నీ బ్రాహ్మణుడు భార్యాసహితుడై కడచిన రాత్రి ఈ గ్రామము చేరినాడని, దేవాలయమున తలదాచుకొనదలచి దేవళము తలుపులు తట్టినాడని, తలుపులు మూయబడియున్న కారణాన ప్రాకారపు గోడనెక్కి లోనికి దూర ప్రయత్నించి ప్రమాదవశాత్తు బావిలోపడి మరణించినాడని, భర్త ఎంత సేపటికి రాకుండుటచే భార్య స్పృహతప్పి పడియున్నదని చెప్పిరి. తెల్లవారగనే దేవాలయపు అర్చకులు తలుపులు తీసినారు. బావిలోని శవమును బయటకు తీసినారు. భార్య భర్త మృతకళేబరముపై పడి బిట్టు విలపించు నా దృశ్యమును జూచి త్యాగయ్యగారు జాలి చెందినారు. తిరుపతిలో వేంకటేశుని ఆశీస్సులను పొందిన త్యాగయ్యగారు తన ఆధ్యాత్మిక శక్తులను వినియోగించి మృతబ్రాహ్మణుని పునర్జీవింప జేయదలచి బిలహరిరాగమున నాజీవాధార" అను కృతిని గానముచేసిరి. కృతి పూర్తియగు సమయమునకు త్యాగయ్య తులసి తీర్థమును ఆ మృత కళేబరముపై చల్లగా శేషయ్య యను మృతబ్రాహ్మణుడు నిదురనుండి లేచినవానివలె లేచి కూర్చుండెను.

త్యాగయ్య తన ఆధ్యాత్మిక శక్తులను పరీక్షకు పెట్టిన సన్నివేశ మిది యొక్కటియే. బిలహరి ప్రాణము నొసంగు రాగము. ఉదయకాలమున పాడవలసిన రాగము.

## షోలింగర్ :-

పుత్తూరునుండి త్యాగయ్యగారు షోలింగర్ చేరిరి. షోలింగర్ ఈనాడు ఘటికా చలముగా వ్యవహరింపబడుచున్నది. అచటవెలసియున్న యోగలక్ష్మీ నృసింహ స్వామిని సందర్శించి ఆ స్వామిపై రెండుకృతులను గానముచేసిరి.

1 శ్రీనరసింహామాంపాహి ఫలరంజని—ఆది

2. నరసింహానన్నుబ్రోవవే బిలహరి—త్రిపుట

రామాయణమహామాలారత్నమగు నాంజనేయునిపై షడ్విధమార్గిణిరాగమున "పాహిరామదూత" అనుకృతిని గానము చేసిరి. కాళహస్తిక్షేత్రమున సువర్ణముఖి నదీతీరమునగల విష్ణుదేవుని కీర్తించిరి. "నీవేగాని నన్నెవరు గాతురు". బిలహారి. పై కీర్తన సువర్ణముఖి నదీతీరమున వెలసియున్న విష్ణుమూర్తి నుద్దేశించిచెప్పిన దనుటకు అంతర్గత సాక్ష్యము గలదు. "నదులలో మేటియైన స్వర్ణనది."

మదరాసు :-

వీణకుప్పయ్యర్ ఆహ్వానము మేరకు త్యాగయ్య శిష్యసహితుడై తిరుపతి నుండి తిరుగుప్రయాణమున పుత్తూరు షోలింగర్ల మీదుగ మదరాసు చేరిరి. మదరాసులో త్యాగయ్య రాజప్రాసాదమునుబోలిన మిక్కిలి పెద్దదైన ఒక యింట బసచేసిరి. ఆ యిల్లు సుందరేశమొదలియార్ది. సుందరేశమొదలియార్ ఉపనిషద్బ్రహ్మేంద్రస్వామి శిష్యులలోనొకడు. వీణకుప్పయ్యర్కు ముఖ్యస్నేహితుడు. ఈ సుందరేశమొదలియార్ ఇంటి నెంబరు 4. ఆ యిల్లు బందర్ స్ట్రీట్యందున్నది 1870వ సంవత్సరము తరువాత ఈ భవనమునమ్మిరి. ప్రస్తుతమాభవనము M. O. P. Charities వారి ఆధీనమునయున్నది. ఇప్పుడాప్రదేశమున అంగళ్ళు కలవు.

మదరాసున బసచేసిన దినములలో త్యాగయ్యగారు వరుసగా 6 రోజులు సాయంసమయమున "దేవగాంధారి" రాగాలాపనముచేసిరి. ప్రతిరోజు రాగాలాపన అనంతరము దేవగాంధారి రాగమున ఒక కీర్తనను గానముచేసిరి. కీర్తన, నెరవు. స్వరకల్పన - ఆ కీర్తనయందలి యోగ్యమగు ప్రదేశమునవేసి పాడిరి. ఆ యద్భుత గానము వినువారలకు ఒక విందు భోజనముగ నుండెను. సంగీత విషయకముగా మదరాసు నగరము దినదినాభివృద్ధిని చెందుచుండెను. 1839 ఆ ప్రాంతముల ప్రముఖ వాగ్గేయకారులెందరో మదరాసు నగరమును చేరిరి.

మదరాసున బసచేసియున్న రోజులలో త్యాగయ్యగారు Triplicaneలో నున్న పార్థసారథిస్వామివారి కోవెలను సందర్శించి ఆ స్వామిని "స్వామి వెడలిన పార్థసారథిని గనరే" తోడి రాగమున కీర్తించిరి.

తిరువత్తియూర్ :-

త్యాగయ్య ముఖ్యశిష్యులలో నొకడు వీణకుప్పయ్యర్. అతడు త్యాగయ్యను మదరాసునకు 6 మైళ్ళ దూరమునగల పవిత్రక్షేత్రమగు తిరువత్తియూర్ను సందర్శింపవలసినదిగా కోరినాడు. వీణకుప్పయ్యర్ అభిజనము తిరువత్తియూర్. శిష్యుని కోరికను మన్నించి త్యాగయ్యగారు తిరువత్తియూర్ చేరిరి. ఆదిశంకరులు, అప్పర్, సుందరమూర్తి నయనార్ మొదలగు మహాపురుషుల సందర్శనముచే తిరువత్తియూర్ పవిత్రమైనది. త్యాగయ్య ఆ క్షేత్రమున వెలసియున్న త్రిపురసుందరి సన్నిధికి చేరి ఆమెను కీర్తించిరి.

1. సుందరి నీ దివ్యరూపము - కళ్యాణి - ఆది.

2. సుందరి నన్నిందరిలో - బేగడ - రూపకము.

3. దరిని తెలిసికొంటి - శుద్ధసావేరి. ఆది

4. సుందరి నిను వర్ణింప — ఆరభి - చాపు.

5. కన్నతల్లి - సావేరి - ఆది.

ఈ ఐదు కీర్తనములకు తిరువత్తియూర్ పంచరత్నములని పేరు. తిరువత్తియూర్ ఆదిపురముగాగూడ ప్రసిద్ధిచెందియున్నది.

## కోవూరు :—

మదరాసునకు పడమరగా 13 మైళ్ళ దూరముననున్నది. కోవూరు శివ క్షేత్రము. అచట నున్న స్వామి సుందరేశ్వరుడు. దేవేరి సౌందర్యనాయకి. సుందరేశ మొదలియార్ ఆహ్వానముపై త్యాగరాజు కోవూరు చేరి సుందరేశ్వరుని, సౌందర్యనాయకిని సందర్శించి కీర్తించిరి. కోవూరునకు "గోపురము"ని కూడ నామాంతరము. గో—ఆవు—పురము లేక ఊరు. కోవూరగల సుందరేశ్వరుని కూడ నైదు కృతులతో కీర్తించుకొనినారు త్యాగయ్యగారు. ఆ ఐదు కృతులకు కోవూరు పంచరత్నములని పేరు.

1. శంభో మహాదేవ - పంతువరాళి - రూపకము.

2. ఈవసుధ నీవంటి - శహన - ఆది.

3. కోరిసేవింపరారే - ఖరహరప్రియ - ఆది.

4. నమ్మివచ్చిన - కళ్యాణి - రూపకము.

5. సుందరేశ్వరుని — శంకరాభరణము - ఆది.

## నాగులాపురము - దొంగల బెడద :—

కోవూరు సందర్శనానంతరము త్యాగయ్య, ఆయన శిష్యబృందము తిరువయ్యూర్‌కు పయనమైరి. కోవూరు సుందరేశమొదలియార్ వేయి బంగారు నాణెములను సంచిలోనుంచి త్యాగయ్య ప్రయాణముచేయు పల్లకియందుంచిరి. సుందరేశ

మొదలియార్ త్యాగయ్య శిష్యులతో ఈ ధనమును శ్రీరామనవమి, శ్రీజయంతి, వైకుంఠఏకాదశి మున్నగు పర్వదినముల వినియోగించవలసినదని చెప్పెను. శిష్యులా ధనమును తీసికొనుటకు, పర్వదినములయందు వినియోగించుటకంగీకరించిరి. త్యాగయ్యకీ విషయము తెలియదు.

గృహోన్ముఖులైన త్యాగయ్య - ఆయన శిష్యబృందము భయంకరాటవుల పయనించుచుండిరి. నాగులాపురమని ఆయడవికి పేరు. ఆ యడవి బందిపోటు దొంగలకాలవాలమై యుండెను.

నాగులాపురం దొంగలు త్యాగయ్య ప్రయాణముచేయుచున్న పల్లకియందు బంగరు నాణెములున్న సంగతిని పసిగట్టి బాటసారులను గులకరాళ్ళతో గాయపరచిరి. దొంగలు త్యాగయ్యను, అతని శిష్యులను చుట్టుముట్టిరి. పల్లకిని నిలిపెరి. త్యాగయ్య శిష్యులు త్యాగయ్య చెవిలో రహస్యముగ విషయమును చెప్పబోడగిరి. త్యాగయ్య "మనము వారికి భయపడవలసిన పని యేమున్నది? మనదగ్గర ధనము లేదుకదా?" అనిరి. అప్పుడు వీణకుప్పయ్యర్ త్యాగయ్యచెవిలో పల్లకియందున్న బంగారు నాణెముల విషయమును చెప్పిరి. సుందరేశమొదలియార్ ఒసంగినాడని, పర్వదినముల యందు వినియోగింపవలసినదిగా వారి కోరికయని శిష్యులు త్యాగయ్యకు చెప్పిరి. అప్పుడు తంజావూరు రామారావు కల్పించుకొని సుందరేశమొదలియార్ అభ్యర్థనను (శ్రీరామనవమి, శ్రీజయంతి, వైకుంఠఏకాదశీపర్వదినముల భగవత్కైంకర్యమునకీ ధనమును వినియోగింపవలసినదను) త్యాగయ్యకుచెప్పి ఆయనకు నచ్చచెప్పుటకై ప్రయత్నించినాడు. "అది భగవంతుని ధనమైన భగవానుడే కాపాడుకొనును" మన కెందులకు అని సమాధానమిచ్చినారు త్యాగయ్య. కొంతతడవు ధ్యాననిమగ్నులైనారు త్యాగయ్య. తర్వాత కొంతసేపటికి త్యాగయ్యగారు రామచంద్రునిట్లు ప్రార్థించిరి.

ముందువెనుకకిరుప్రక్కలతోడై
మురఖరహర రారా రారా ॥ముం॥

ఎందు గాన నీ యందము వలె రఘు
నందన వేగమే రారా రారా ॥ముం॥

చండభాస్కరకులాబ్ధి చంద్ర కో
దండ పాణి యై రారా రారా ॥ముం॥

అండగొలుచు సౌమిత్రి సహితుడై
అమిత పరాక్రమ రారా రామ నా ॥ముం॥
ఓ గజరక్షక ఓ రాజకుమారా
ఓంకార సదన రారా రారా
భాగవతప్రియ బాగ బ్రోవవయ్యా
త్యాగరాజనుత రారా రామ ॥ముం॥

పై కీర్తనయందలి పల్లవి ఈ శ్లోకమును జ్ఞప్తికి తెచ్చును.

అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ
ఆకర్ణ పూర్ణధన్వానౌ రక్షేతాం రామలక్ష్మణౌ ॥

త్యాగయ్యగారట్లు ప్రార్థించినదే తడవుగా నిరువురుబాలురు ధనుర్ధారులై కనపడి దొంగలపై బాణవర్షమును కురిపించిరి. దొంగలు భయపడి పారిపోయిరి. ఆ యిరువురు బాలురు పల్లకిని సమీపించిరి. వారికి దొంగభయము తీరినది. దొంగలు వెనుదీసిరని రహస్యముగ త్యాగయ్య శిష్యులకు చెప్పి ధనుర్ధారులై వచ్చిన ఇరువురు బాలురు వెడలిరి. త్యాగయ్య పల్లకి నుండి దిగి శిష్యులను విషయమడిగిరి. శిష్యులు త్యాగయ్యగారికి సంతృప్తికరమగు సమాధానమునీయలేకపోయిరి.

ఊరేగింపు ముందుకు సాగినది. అ పల్లకిని శ్యామలగౌరదేహులు, లసన్మణికుండలహారభూషితులు, విశాలకలవక్షులునగు నిర్వురుబాలుర, కొంచెము దూరమున చోరులనుసరించి వెళ్ళిరి ప్రాతఃకాలమునకు యాత్రికబృందమొక గ్రామమును చేరి అందున్న సత్రముననాగిరి. అద్భుతమగు రూపముగల ఆయిర్వురు బాలుర సందర్శనమున స్మృతినికోల్పోయిన దొంగలు ఆ బాలురెవరో తెలిసికొన ఆతురతతో చాల దూరముననుండి యాత్రిక బృందము వెన్నంటివచ్చిరి. ప్రాతఃకాలమున దొంగలు భక్తిప్రపత్తులతో త్యాగయ్యనుచేరి" ఆ సుందరాకారులగు యువకులెవరు ? ఎవరు మాపై శరవర్షమును గుప్పించి మమ్ములను భయపెట్టినద"ని ప్రశ్నించిరి.

బాబు మరియొకసారి మీ బంట్ల సూపి
పన్నెమ ంగట్టుకోండి బాబూయనండి
మేము సూత్తుండగానే యాసాములిట్టె
మాయమైనారు యిది యేటి మాయొసామి.

అను దొంగల పలుకులకు త్యాగయ్య ఆశ్చర్యపడి "మీమడులు వినుచుండగ మతి భ్రమకలుగుచున్నది. నాకు భటులెవ్వరునులేరు. మీ కనులకు కనపడినదెవరో" అని ప్రత్యుత్తరమొసంగిరి "బాబూ - ఇది సత్తెము-మాతోడు జరిగిన కతనంతా సెప్తాము వినండి. అర్ధరాత్రి మీ సొమ్ము దోయాలన్న యుద్దేశంతో మేము పల్లకి యెంటబడ్డాము. మాకప్పుడగుపించినారు. ఇద్దరు అన్నదమ్ములేమొవారు. పెద్దాయన. నల్లనోడు. చిన్నాయన తెల్లనోడు. సూడసక్కనైనోరు. మాకేసి బాణాల వేసినారు. అదేటిచిత్రమొకాని మాకేటినొవ్వలేదు బాబయ్యా. మేము ఎల్లిపోలేక వారి సోయగమును సూత్తవచ్చినాము. ఇప్పటివ్వటిదనక వారిట్టెవచ్చి మాయమైనారు ఆరు మామంచిదొరలంచు" పలికిన దొంగలపలుకులను విని త్యాగయ్య ఆ యిరువురును మరెవరోగారు-రామలక్ష్మణులై యుందురని భావించి

"ఆహా చోరులుగారు మీరు రఘురామాఖండ సందర్శన
శ్రీహేవాకధురంధరుల్ గద సురశ్రేష్ఠుల్ మునీంద్రుల్ గిర
స్తోమ హంకారులు గాంచలేని ఘనభాగ్యంబబ్బె మీ కిప్డు దా
నోఽహమ్మంచు దదంఘ్రులంబడియె నా త్యాగయ్య
నిర్మానుడై"

దొంగలను ప్రశంసించి వారి పాదములంటివారు. చోరులు వలదని వారించినారు. చోరులు తమ దుష్ప్రవృత్తినిమానినారు. త్యాగయ్యకు శిష్యులైనారు రామచంద్రుడు లక్ష్మణసహితుడై వచ్చి తమను కాపాడి కనపడకుండ వెళ్ళినాడని చాల బాధపడినారు.

మరుగేలరా ఓ రాఘవ
మరుగేల చరాచరరూప పరా
త్పర సూర్యసుధాకర లోచన ॥మరు॥

అన్ని నీవనుచు అంతరంగమున
తిన్నగావెదకి తెలిసికొంటినయ్య
నిన్నెగాని మదినెన్న జాలనొరుల
నన్ను బ్రోవవయ్య త్యాగరాజనుత ॥మరు॥

శ్రీరంగము :-

త్యాగరాజు చైత్రోత్సవ సందర్భమున శ్రీరంగక్షేత్రసందర్శనమున కేగిరి. శ్రీరంగక్షేత్రము భూలోకవైకుంఠముగా వాసికెక్కినదని త్యాగరాజస్వామివారి వక్కాణ. చైత్రోత్సవము చైత్రమాసమున జరుగును. చిత్తానక్షత్రము, పూర్ణిమ కలిసివచ్చు చైత్రమాసమున జరుగునుత్సవమునకు చైత్రోత్సవమని పేరు. త్యాగయ్యగారు దక్షిణ చిత్ర వీధియందుగల ఒక గృహమున బస చేసినారు. త్యాగయ్యగారు బసచేసిన యిల్లు దక్షిణ చిత్ర వీధి పశ్చిమ చిత్ర వీధి కూడలికి సమీపముననున్న తేర్వాడం పొక్కిసందులోనున్నది. ఆ యిల్లు 86 సంఖ్యను కలిగి యున్నది. చైత్రోత్సవము సందర్భముగా స్వామివారికి బంగరు అశ్వవాహనముపై ఊరేగింపుటుత్సవము జరుగుచున్నది. త్యాగయ్య తాను బసచేసిన యింటి ముందు భాగమున నిలబడి దూరమున నుండి వచ్చుచున్న రంగనాయకుని జూచి

దేశికతోడి - రూపకం

రాజువెడలె చూతాము రారె కస్తూరి రంగ ॥రా॥
తేజినెక్కి సామంతరాజు లూడిగము సేయ
తేజరిల్లు నవరత్నపు దివ్యభూషణము లిడి రంగ ॥రా॥
కావేరీ తీరమునను పావనమగు రంగపురిని
శ్రీవెలయు చిత్రవీధిలో వేడ్కగరాగ
సేవను గని సురలు విరులచే ప్రేమను పూజించగ
భావించి త్యాగరాజు పాడగ వైభోగరంగ ॥రాజు వెడలె॥

అని స్వామి వైభవమును కీర్తించిరి. త్యాగయ్యగారు దగ్గరకు వెళ్ళి వైభోగరంగని దర్శింప కుతూహలియై యున్నారు. కాని జనసమ్మర్దమెక్కువగ నుండుటచే బంగరు

అశ్వవాహమునకు దగ్గరగా వెళ్ళి స్వామివారిని సందర్శింపలేకపోయి నిరాశచెంది యటులనే నిలబడిరి.

ఊరేగింపు కొంతముందుకు సాగి ఆ వీధి సందును దాటి ముందుకు సాగక ఆగిపోయినది. కారణము తెలిసివచ్చినది కాదు. అశ్వవాహకులు ముందుకు లాగుట కెంతగనో ప్రయత్నించి విఫలులైరి. అట్టి సమయముననేదో దృష్టి దోషము తగిలి యుండునని భావించి దేవదాసీలు, రాజదాసీలు నృత్యము చేయుట పరిపాటి అట్లే రాజదాసీలు, దేవదాసీలు నృత్యము చేసినారు. బంగరు అశ్వవాహనము ముందుకు సాగినదికాదు. కొంతతడవునకు ఆలయ పూజారులలో నొకరు ముందుకు వచ్చి "అదుగో మహాభక్తుడొకడు స్వామిని సందర్శింపలేని బాధతో నిలబడియున్నాడు. ఆ భక్తుడు వచ్చి స్వామివారిని సందర్శించినగాని ఊరేగింపు ముందునకు సాగదు" అని చెప్పినాడు. వెంటనే ఆలయోద్యోగులు, అర్చకస్వాములు త్యాగయ్యగారిని సందర్శించి స్వామివారిని సందర్శించుటకు రమ్మని, స్వామివారి బంగరు అశ్వవాహనము ముందుకు సాగునట్లనుగ్రహించవలసినదని వేడుకొనినారు. త్యాగయ్య బయలుదేరి బంగరు అశ్వవాహనముపై నధివసించియున్న వైభోగరంగని చేరి యిట్లు ప్రార్థించిరి.

దేవగాంధారి - ఆది

వినరాద నా మనవి ॥వి॥

కనకాంగ కావేటిరంగ శ్రీకాంత
కాంతలెల్ల కామించి పిలచితే ॥విన॥

తేజినెక్కి బాగ తెరువునరాగ
రాజసతులు చూచిరమ్మని పిలచితే ॥విన॥

భాగధేయ వైభోగరంగశ్రీ
త్యాగరాజనుత తరుణులు పిలచితే ॥విన॥

కీర్తన గానము చేయుట పూర్తియైనది. దీపారాధనము చేసినారు. అశ్వవాహకులు వాహనమును ముందుకు లాగప్రయత్నించగా సునాయాసముగ ముందుకు వాహనము సాగినది.

తరువాత త్యాగయ్యగారిని రంగనాయకస్వామి మూల విగ్రహమును సందర్శింప కోవెలకు ఆహ్వానించినారు ఆలయోద్యోగులు. త్యాగయ్యగారు ఆలయమునకు వెళ్ళి మూలవిరాట్టును సందర్శించి ఆ యద్భుతరూపమునకు ముచ్చటపడి స్వామి నిట్లు కీర్తించినారు. త్యాగయ్యగారు రంగనాయకస్వామిని సందర్శించిన సమయమున అర్చకులు స్వామికి (మూల విరాట్టుకు) ముత్తంగి కవచమును (రత్న కవచమును) తొడిగిరి.

కాంభోజి - ఆది

ఓ రంగశాయీ యని పిలిచితే ఓ యని రారాదా ? ఓ॥
సారంగవరుడు చూచి కైలాసాధిపుడు కాలేదా। ఓ॥
భూలోకవైకుంఠమిది యని నీలోన నీవే యుప్పొంగి
శ్రీలోలుడై యుంటే మాచింత దీరేదెన్నడో
మేలోర్వని జనులలోనే మిగుల నొగిలి దివ్యరూపమును ము
త్యాలసరుల యురమును గన వచ్చితి త్యాగరాజ
హృద్భూషణ ॥ఓ॥

నాగ పట్టణము :-

తూర్పు సముద్రతీరమునకు దాపుననున్న నాగపట్టణమున వేంచేసియున్న కాయారోహణస్వామిని ఆయన దేవేరి నీలాయతాక్షిని సందర్శించి త్యాగయ్య పంచరత్నములను రచించిరని ప్రతీతి. కాని నేడా ఐదు కీర్తనములు అనుపలబ్ధములు. ఆ ఐదింటిలో రెండు మాత్రమే నేడుపలబ్ధములు.

1. కర్మమే బలవంతమాయె తల్లి కాయారోహణ జాయా
సావేరి - చాపు

2. ఎవరు తెలియ బొయ్యేరు - తోడి - రూపకము.

సావేరి - చాపు

కర్మమే బలవంతమాయె తల్లి కాయారోహణ జాయా ॥క॥

నిర్మలమగు నాగపురమున నెలకొన్న నీలాయతాక్షి
సకలలోక సాక్షి ॥క॥

ధరను ధనికులగోరి నానాపరితాపముల్ దీర్పలేరై రి యని
సరగుననే బయలు దేరివచ్చి పరమపావని నీ సన్నిధి
చేరినా ॥క॥

వారిధి మది గర్వించి ఈ వసుధకు తారానెంచి నిన్ను
సారెకు గని తలవంచి యుండు ధీరతనము కల్గు
నినుబొడగాంచి నా ॥క॥

కాసాస లేని నా మదికి నీ కరుణేధనమని పల్కి నిం
డాసతో వచ్చి సన్నిధికి నిజదాసుడైన శ్రీత్యాగరాజునికి
॥క॥

సముద్రతీరమునగల నాగపట్టణమున నున్నది నీలాయతాక్షి దేవళము. ఒకప్పుడు సముద్రముపొంగి నీలాయతాక్షి అలయముగూడ మునిగిపోనున్న సమయమున నీలాయతాక్షి మహిమముచే సముద్రము అణగియున్నట్లు స్థలపురాణము. ఈ విషయమును త్యాగయ్యగారు పై కీర్తనమున "వారిధిమదిగర్వించి అనుచరణమున సూచించి దేవీ మహిమమును ప్రస్తుతించినారు. సంగీత త్రిమూర్తులలో జ్యేష్ఠులగు శ్రీశ్యామశాస్త్రి కూడ నీలాయతాక్షిని సందర్శించి కీర్తించిరి.

మాయామాళవగౌళ — త్రిపుట

ప॥ నీలాయతాక్షి నీవె జగత్సాక్షి ॥నీ॥

అ॥ ప॥ ఫాలాక్షునిరాణి పాలితాశ్రితశ్రేణి ॥నీ॥

చ॥ దీనరక్షకి అభయదానమీయవేసాకు
గానలోలే అభిమానముతోను బ్రోవుము ॥నీ॥

లాల్‌గుడి :—

త్యాగయ్య తన శిష్యులలో నొకరగు లాల్‌గుడి రామయ్య ఆహ్వానమును పురస్కరించుకొని లాల్‌గుడిని (తపస్తీర్థమును) దర్శించిరి. లాల్‌గుడి తిరుచిరా

పల్లి జిల్లాలోనున్నది అచట వెలసియున్న స్వామికి సప్తఋషీశ్వరుడని, దేవేరికి శ్రీమతి అని పేరు. త్యాగయ్య లాల్గుడిని సందర్శించి దేవి శ్రీమతిపై, దేవుడైన సప్తఋషీశ్వరునిపై చెప్పిన కీర్తనలు "లాల్గుడి పంచరత్నములు"గా పేరందినవి

దేవి శ్రీమతిపై చెప్పినవి :-

తోడి – ఆది

1. గతి నీవని నే కోరివచ్చితి తల్లి పరాకా ॥గ॥
మతిని ఎంతోవెదకి సమ్మతిని శ్రీప్రవృద్ధ శ్రీ
మతి నీపద యుగముల నేనెరనమ్మతిని బ్రోవుమిక
నిజదాసులకు ॥గతి॥

భైరవి – ఆది

2. లలితే శ్రీప్రవృద్ధే శ్రీమతి లావణ్యనిధిమతి శ్రీమతి ॥ల॥
తెలిపిని వర్థిల్లు శ్రీతపస్తీర్థనగర నిలయే ॥ల॥

కాంభోజి – చాపు

3. మహిత ప్రవృద్ధ శ్రీమతి గుహగణపతి జననీ ॥మ॥
పాహి వదనజితసుధాకరే శ్రీకరే పాహిసుగుణ రత్నాకరే॥
దేహి చరణభక్తిమఖిలదేహిని సదాశుభ ఫలదే
హిమగిరితనయే వైదేహీపసహోదరి ॥మ॥

సప్తఋషీశ్వరునిపై చెప్పినవి

మధ్యమావతి – ఆది

1. దేవశ్రీ తపస్తీర్థపురనివాస దేహిభక్తిమధునా ॥దే॥
పావన ప్రవృద్ధ శ్రీమతి హృద్భవన సకలజగదవన
మహాదేవ॥

కళ్యాణి — రూపకం

ఈశపాహిమాం జగదీశ॥

ఆశరగణ మదహరణ బిలేశయభూష సప్తఋషీశ —

పాహిమాం

తదనంతరము త్యాగయ్య తనయభిజనమగు "తిరువారూరు"ను సందర్శించి అటవెలసియున్న "త్యాగేశ్వరుని"పై సారంగ రాగమున

"ఏహి త్రిజగదీశ శంభో మాం పాహిపంచనదీశ" అనుకీర్తనను గానము చేసిరి. తిరువారూరనున్న త్యాగేశ్వరస్వామి అగస్త్య ప్రతిష్ఠితము. త్యాగయ్య తీర్థ యాత్రల సందర్భమున సందర్శించిన క్షేత్ర వివరములను గురించి పలువురు పలు విధములుగ వ్రాసిరి. ఏ క్షేత్రమునెప్పుడు సందర్శించిరను విషయముపై కూడ నిదమిత్థమగునభిప్రాయములేదు. తీర్థయాత్రలను ముగించుకొని త్యాగయ్యగారు తిరువయ్యార్ చేరిరి.

త్యాగయ్య కీర్తిలత దేశదేశములకెగ్రాకినది. త్యాగయ్యను సందర్శించి ఆయన గానమును విని తరింపవలయునను నుద్దేశ్యముతో ఎందరెందరో సంగీత విద్వాంసులు త్యాగయ్యను దర్శించి తమ జీవితమును పునీతము చేసికొనిరి. ( ఆ వివరములనన్నిటిని త్యాగరాజు - విద్వత్సమాగమము అను శీర్షిక క్రిందనొసంగితిని)

త్యాగయ్య భార్య కమలమ్మ 1845వ సంవత్సరమున మరణించినది. భార్యా వియోగమునకు త్యాగయ్యగారెంతగనో వగచినారు. తనకు శాశ్వతానంద రసానుభవము కలుగుటెన్నటికో అని పరితపించుచు ఐహికవిషయవిముఖులై నిరంతరరామ పదారవిందధ్యానైక చిత్తులై కాలమును వెళ్ళబుచ్చుచున్న త్యాగయ్యగారికి శ్రీరామ చంద్రుడు స్వప్నమునదోచి

"మానుము చింతనీకుఁబడిఁపూనములేయుఁకనీవిధాన మా

పై నొడలిస్ దొఱంగియటుపై నొకజన్మము నెత్తియందు సు

జ్ఞానముగల్గి పూర్వకృతకర్మములన్నిఁటిఁబోనడంచి ని

ర్వాణ పదంబు జూఱకొని క్రమ్మఱఁబుట్టగబోవు త్యాగయా"

అని చెప్పినారు. తనకు మరియొక జన్మముగలదని చెప్పిన శ్రీరాముని మాటలకు త్యాగయ్యగారు చాల బాధపడినారు. తనకింకొక జన్మ వలదని వేడుకొనుచు త్యాగయ్యగారు శ్రీరామునిట్లు ప్రార్థించినారు.

సింహేంద్ర మధ్యమం

నీదుచరణములే గతియని నెఱనమ్మినవాడను
వేదవేదాంతవిదితుండవై వెలయు శ్రీసాకేతరామ ॥నీదు॥
పాపకర్మపు తనువురా యిందు బాధలకు నేతాళరా
ఏపగిదినైన నన్నేలుకోరా త్యాగరాజనుత ॥నేను॥

ముఖారి - ఆది

క్షీణమై తిరుగ జన్మించే సిద్ధిమానురా ఓ మనసా ॥క్షీ॥
గీర్వాణ నాటకాలంకార వేదపురాణ యజ్ఞజపతపాదుల
ఫలము ॥క్షీ॥

ఏదిచేసిన జగన్నాథుడు శిరమున హృదయమున వహించి
పదిలమైన సత్పదమునొసంగే బాట త్యాగరాజవిను
తునిభజనరా ॥క్షీ॥

పూర్వికల్యాణి

జ్ఞానమొసఁగ రాదా గరుడగమన వాదా ॥జ్ఞా॥
నీ నామముచే నామది నిర్మలమైయున్నది ॥జ్ఞా॥
పరమాత్ముడు జీవాత్ముడు పదునాలుగు లోకములు
నరకిన్నర కింపురుష నారదాదిమునులు
పరిపూర్ణ నిష్కళంక నిరవధి సుఖదాయక
వర త్యాగరాజార్చిత వారము తాననే ॥జ్ఞా॥

తనకు మరియొక జన్మము లేకుండగ జేయుమని పరిపరివిధముల వేడుకొనుచున్న త్యాగయ్యకు, రామైక్యంబు కొఱకు తహతహలాడుచున్న త్యాగయ్యకు శ్రీరాముడు పుష్యశుద్ధదశమినాటి రాత్రి కలలో కనపడి

"అపత్సన్నాహ్యసంబును
జేపట్టిన నీదుకోర్కె సిద్ధించును సు
మ్మీ! పదిపూటలు తాళినఁ
బ్రాపించెదవోయి! నీవు పరమపదంబున్

అని చెప్పి అదృశ్యుడైనాడు. ఈ వృత్తాంతమును త్యాగయ్యగారీ క్రింది కీర్తనలో చెప్పినారు.

శహన – అది

గిరిపై నెలకొన్న రాముని గురితప్పక గంటి భద్రగిరిపై॥
పరివారులు విరిసురటులచేని ఇబడి విసరుచుకొసరుచు
సేవింపగ ॥ ॥

పులకాంకితుడై యానందాశ్రువుల నింపుచు
మాటలాడవలెనని
కలువరించగని పదిపూటలపై గాచెదనను త్యాగరాజ
వినుతుని ॥గి॥

పుష్యశుద్ధ ఏకాదశినాటి రాత్రి త్యాగాయ్యగారు రామభజనచేయుచుండిరి. ఏకాదశికి హరి వాసరమని గదా పేరు. త్యాగయ్యగారు దశమినాడు ఏకభుక్తముండి ఏకాదశి నాడుపవాసముండి విశేషముగ నామసంకీర్తనము చేయుదురు. శిష్యులందరు నచట చేరిరి. భజనకార్యక్రమము ముగియనుండగా త్యాగయ్యగారు అచటచేరిన వారినంద రినుజూచి "పుష్యబహుళ పంచమినాడొక అద్భుతము జరుగనున్నది, మీరందరు ఆ దినమునకు తప్పక ఆ యద్భుతదృశ్యమును చూచుటకు తిరువయ్యార్ నందేయుండ వలయుననిచెప్పిరి

రామచంద్రుని ఆదేశము ప్రకారము త్యాగయ్యగారు ఆపత్సన్న్యాసమును స్వీకరించిరి. ఆపత్సన్న్యాసస్వీకార విషయమున గూడ ఎవరికి తోచినట్లుల వారు వ్రాసిరి.

పుష్యశుద్ధపూర్ణిమనాడు త్యాగయ్యగారాపత్సన్న్యాసమందినారని శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులుగారు వ్రాసియున్నారు.

శ్రీపతి సాయుజ్యంబిక
దాపగునని తెలిసి కడుముదంబున నాఁడం
డా పూర్ణిమ తిథియందే
యాపత్సన్న్యాసమందె నార్యులు మెచ్చన్

శ్రీత్యాగరాజ శతవార్షికస్మృతి గ్రంథావళి. కృతిమణిమాల మొదటి భాగమున ఆ గ్రంథ సంపాదకులు శ్రీ ఆర్. రంగరామానుజయ్యంగార్ పుష్యశుద్ధఏకాదశినాడు ఆపత్సన్న్యాసమందిరని వ్రాసిరి.

పుష్యబహుళచతుర్థినాడు — అనగా తన నిర్యాణమునకు ముందురోజు త్యాగయ్యగారు పరమహంస పరివ్రాజకచార్య వర్య బ్రహ్మానందేంద్రస్వామివారిని తనకు సన్న్యాసమిప్పింపమని వేడినారని అందులకు బ్రహ్మానందేంద్రస్వామి" త్యాగయ్య అభ్యర్థనను ముందు అంగీకరింపలేదని - త్యాగయ్య జీవన్ముక్తుడని సన్న్యాసమును స్వీకరింపనవసరములేదనినారని, త్యాగయ్య బలవంతము మీద బ్రహ్మానందేంద్రస్వామి త్యాగయ్యకు ఆపత్సన్న్యాస మిప్పించినారని ఆచార్య శ్రీ సాంబమూర్తిగారు వ్రాసినారు. ఆపత్సన్న్యాస స్వీకారానంతరము త్యాగయ్యగారు "నాదబ్రహ్మానందయోగి"యైనారు. త్యాగయ్యగారు ఆపత్సన్న్యాసమును స్వీకరించు విషయమై శ్రీ టి. వి. సుబ్బారావుగారీ విధముగా వ్రాసిరి.

"పదిరోజుల్లో మోక్షం ప్రసాదిస్తానని భగవంతుడు త్యాగరాజుకు చెప్పాడు. ఆయన దీనిని ఏమాత్రం సంకోచము లేకుండా విశ్వసించారు. అయితే ఆయనకు ఒక విషయం గురించి బెంగాలు పట్టుకుంది. వెనకెప్పుడో ప్రసిద్ధజ్యోతిష్కుడు త్యాగరాజుతో "నీవు ఇంకొక జన్మఎత్తితేగాని మోక్షంరాదు" అని చెప్పాడు. ఈ రెండు ఒకదానితో ఒకటి పొసగటం ఎలాగా అని త్యాగరాజు ఆందోళన పడ్డారు.

అప్పుడు ఎవరో సలహా యిచ్చారు సన్న్యాసం పుచ్చుకోమని. గృహస్థాశ్రమం లోంచి సన్న్యాసాశ్రమం స్వీకరిస్తే పునర్జన్మ ఎత్తినట్లే గదా అంటుకని. అప్పుడు ఆయన మనసు తేలికపడింది. శాంతభావం - ఆనందం - కాంతితో పొంగి పొర్లింది."[1]

ద్వితీయకళత్ర వియోగానంతరము త్యాగయ్య ఐహికవిషయదూరులై దాదాపు సన్న్యాసివలె జీవితమును వెళ్ళబుచ్చుచుండిరి. తనకు మరియొక జన్మమున్నదని శ్రీరాముడు చెప్పినమాటలకు బాధపడి త్యాగయ్యగారు తనకు మరియొక జన్మము లేకుండునట్లు అనుగ్రహింపుమని శ్రీరాముని వేడుకొనినారు. పదిమాసములకు ముందు శ్రీరాముడు త్యాగయ్యకు మరియొక జన్మమున్నదని చెప్పినారు పుష్య బహుళ పంచమికి పదిరోజులముందు స్వప్నమున కనపడి "పది పూటలలో కరుణింతునని, ఆపత్సన్న్యాసమును స్వీకరింపుమని" చెప్పినారు త్యాగయ్యగారికి శ్రీరామచంద్రుడు కలలో కనపడినది పుష్యశుద్ధదశమినాడు. కలలో కనపడి ఆపత్స న్న్యాసమును స్వీకరింపుమని శ్రీరాముడు చెప్పినదే తడవుగా ఏకాదశినాడే ఆశ్రమ స్వీకారము చేసినట్లు శ్రీరంగరామానుజయ్యంగార్, పూర్ణిమనాడు ఆశ్రమస్వీకారము చేసినట్లు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులగారు వ్రాసినారు.

శ్రీసాంబమూర్తిగారి కథనము ప్రకారము శ్రీత్యాగయ్యగారు ఆపత్సన్న్యాసము నందినది పుష్యబహుళచతుర్థినాడు. అప్పటికి త్యాగయ్యగారికి ఆపత్సన్న్యాసమక్కర లేదని, త్యాగయ్యగారు జీవన్ముక్తులని శ్రీబ్రహ్మానందేంద్రస్వాములవారు సెలవిచ్చి నారు. త్యాగయ్యగారు జీవన్ముక్తులనుటకెట్టి సందియమును లేదు. కాన శ్రీ సాంబ మూర్తిగారు వ్రాసినట్లు త్యాగయ్యగారు పుష్యబహుళచతుర్థినాడే ఆపత్సన్న్యాసమును స్వీకరించిరనుట యుక్తము.

ఆపత్సన్న్యాసమంది నాదబ్రహ్మానందయోగియై త్యాగయ్య శిష్యుల నుద్దేశించి "రేపు పదకొండుగంటలకు శ్రీరాముడు నన్ను తనలో ఐక్యము చేసికొందునని"

---

1. 1953లో జరిగిన మద్రాసు మ్యూజిక్ అకాడమీ రజతోత్సవ ప్రత్యేక సంచికలో ముద్రితమైన శ్రీ టి.వి. సుబ్బారావు ఆంగ్లవ్యాసానికి భావాను వాదం, అనువాదం శ్రీ చాగంటి కపాలేశ్వరరావు. భద్రాచలం 9వ వాగ్గేయకారమహోత్సవములు - విద్వత్ సన్మానసంచిక 50-54 పేజీలు.

మాట యిచ్చినారు. ఇప్పటినుంచి విడవకుండగ భజనసేయుడని పలికెను. ఈ వార్త తిరువయ్యారు అంతట వ్యాపించినది. జనులు తండోపతండములుగ వచ్చి చేరిరి. ఆ సమయమున అచట ఉన్న త్యాగయ్య శిష్యులు ఉమయాల్పురం కృష్ణభాగవతార్, తిల్లస్థానం రామయ్యంగార్, అయ్యాభాగవతార్, వాలాజాపేట కృష్ణస్వామి భాగవతార్, కంచి వేంకటాద్రిస్వామి, తాలూకా తహసిల్‌దార్ శ్యామలరావు. పుష్య బహుళపంచమినాటి యుదయమున త్యాగయ్యగారు

నాగధ్వని - ఆది

పరమాత్ముడు వెలిగేముచ్చట బాగ తెలుసుకోరే ॥ప॥

హరియట హరుడట సురలట, నరులట అఖిలాండ
కోటులట యందరిలో ॥అ॥

గగనానిల తేజోజల భూమయమగు మృగఖగనగ
తరుకోటులలో

సగుణములలో విగుణములలో సతతము
సాధు త్యాగరాజార్చితుడిలలో ॥ప॥

మనోహరి - రూపకం

పరితాపము గనియాడిన పలుకుల మరచితివో
ఆ పలుకుల మరచితివో ॥ప॥

సరిలేని సీతతో సరయూ మధ్యంబున నావరమగు
బంగారువాడను మెఱయుచు పదిపూటలపై
కరుణించెదననుచు బ్రోకిగనుల త్యాగరాజుని ॥పరితాపము॥

మధ్యాహ్నము పదకొండుగంటల సమయము. శ్రీరామచంద్రుడు చెప్పిన సూచనలేమియు త్యాగయ్యకు కనపడలేదు. అచట చేరిన వారందరు భక్త్యావేశముతో భగవన్నామమునుచ్చరించుచుండిరి. త్యాగయ్యకు ఏమియు తోచలేదు. వెంటనే ధన్యాసిరాగమున శ్రీరామునితో నీవిధముగ మొరపెట్టుకొనినారు.

శ్యామసుందరాంగ సకలశక్తియు నీవేరా ॥శ్యా॥
తామసరహితగుణసాంద్ర ధరను వెలయు రామచంద్ర ॥శ్యా॥
దుష్టదనుజ మదవిదార శిష్టజనహృదయ విహార
ఇష్టదైవము నీవేర ఇలను త్యాగరాజువేర ॥శ్యా॥

త్యాగయ్యగారు యోగసమాధినిష్ఠులైనారు. చిన్ముద్ర ధరించినారు. త్యాగయ్య కపాలము విచ్ఛిన్నమైనది. కపాలము నుండి జ్యోతి వెలువడి రామవిగ్రహములో కలసిపోయినది. త్యాగయ్యగారు సిద్ధిపొందినారు.

ఎవ్వాడు దేవమౌనీంద్రాంశచే నుద్భ
వించి సుఖ్యాతి వహించినాడో
యెవ్వాడు స్వరసింధులెల్ల నుద్రచ్చిగా
నామృతంబును బంచి యలరినాడో
యెవ్వాడు శ్రీజానకీశు సన్నిధి వన్నె
నెన్ని పెన్నిధిగాలదన్నినాడో
యెవ్వాడు వేదార్థమెల్ల గేయములఁ జొ
పించ్చి లోకులకు బోధించినాడో

అట్టి మహనీయుడైన శ్రీత్యాగరాజు
శిరమునందుండి తేజోవిశేషమొండు
వెడలి శ్రీరామచంద్రుని విగ్రహమున
లీనమయ్యెను విడదీయలేని విధిని

ఆ మహామహుని జీవితము ఆ విధముగ పరిసమాప్తినిచెంది పునరావృత్తి రహితమైన పదమును జేరినది.

త్యాగయ్య నిర్యాణమునకై త్యాగయ్య శిష్యలోకము గగ్గోలు పెట్టినది. త్యాగయ్యగారు తనను, తన గురువుగారైన శొంఠి వేంకటరమణభాగవతుల సమాధి

ప్రక్కగ సమాధి చేయవలసినదని శిష్యులకు చెప్పిరి. త్యాగయ్యగారి శరీరమును మేళతాళములతో, గానములతో నూరేగింపుగా తీసికొనివెళ్ళి త్యాగయ్యగారి ఆదేశానుసారము వేంకటరమణార్య సమాధికి ప్రక్కగా సమాధి చేసిరి. ఆ సమయమున త్యాగయ్య ముఖ్యశిష్యులగు వాలాజాపేట వేంకటరమణభాగవతులు తిరువయ్యార్‌న లేరు. వేంకటరమణభాగవతులు వాలాజాపేటలోనుండిరి. త్యాగయ్యగారి సమాధిపైన బృందావనము నిర్మింపబడినది. తులసికోటను కట్టిరి. పుష్యబహుళ పంచమి నాటి రాత్రి త్యాగయ్యగారు వేంకటరమణభాగవతులకు కలలో కనబడి "నా ఆత్మ యీనాటినుండి ఏకాదశి వరకు శ్రీరంగము, తిరుమల మున్నగు పుణ్యక్షేత్రములను సందర్శించి పుష్యబహుళ ఏకాదశినాడు పూర్ణ సిద్ధినొందునని, ఇప్పటినుండి 60 సంవత్సరములవరకు తనకెట్టి యుత్సవమును జరుపవలదని చెప్పిరి. ఇప్పటికిని వాలాజాపేటలో పుష్యబహుళ ఏకాదశినాడు, తిరువయ్యార్‌లో పుష్యబహుళ పంచమి నాడు త్యాగయ్యగారి ఆరాధనోత్సవము అతివైభవముగ జరుగుచున్నది.

త్యాగయ్యగారు సిద్ధిపొందినది 1847వ సంవత్సరమున. అప్పటినుండి 60 సంవత్సరములవరకు అనగా 1907 సంవత్సరము వరకు త్యాగయ్యగారి ఆదేశముపై తిరువయ్యార్‌లో వారి సమాధిదగ్గర ఎట్టి యుత్సవమును జరిగియుండలేదు. 1907వ సంవత్సరమునుంచి తిరువయ్యార్‌న త్యాగయ్యగారి సమాధిదగ్గర అయ్యగారి ఆరాధనోత్సవము జరుగుచున్నది. దేశమునందలి ప్రముఖ సంగీతవిద్వాంసులందరు నిష్కామముగా భక్తిప్రపత్తులతో ఆయారాధనోత్సవమున పాల్గొని గానము చేయుచు త్యాగయ్యగారికి శ్రద్ధాంజలి ఘటించుచున్నారు.

శ్రీత్యాగరాజస్వామివారి సమాధికెదురుగ తిరువయ్యార్‌లో గాన విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నమ్మగారి సమాధియున్నది. ఆమె తన యావదాస్తిని త్యాగయ్యగారి కైంకర్యమునకు సమర్పించినది. శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మ "శ్రీత్యాగరాజస్వామివారి సమాధి-పూజ" అను శీర్షికన శ్రీత్యాగరాజస్వామివారి శతవార్షిక సంచికలోనొక వ్యాసమును వ్రాసినారు. శ్రీమతి బెంగుళూరు నాగరత్నం ట్రస్టుకు ప్రస్తుతము సంగీత కళానిధి డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ ట్రస్టీగనున్నారు.

త్యాగయ్యగారి దేవాలయనిర్మాణమునకు పూనుకొనినవారు కీ శే. శ్రీయస్ పి. రామస్వామిఅయ్యంగార్. దేవాలయ నిర్మాణము ప్రారంభమైపూర్తియైనది 1925 సంవత్సరమున. అప్పుడొక విచిత్ర సంఘటన జరిగినది.

"దేవాలయానికి పునాదులు వేయడానికి ఎంతలోతు . కావేరి నది ఒడ్డున త్రవ్వాలో అంచనా దొరకలేదు. రామస్వామిఅయ్యంగార్ స్థానికులతో సంప్రదించినారు. సరైన జవాబు దొరకలేదు అయినా త్రవ్వడం ఆరంభమైనది. కొంతదూరం త్రవ్వినతర్వాత బెంజాయిన్ వాసనరావటం ఆరంభించింది ఇక లోతుకు పోగూడదని - అది సూచన అనుకొన్నారు, అక్కడనుంచి కట్టడం ఆరంభమయింది.

ఒకదినం సూలమంగళం వైద్యనాథభాగవతార్ ఒ స్నేహితునితో కలిసి కావేరినది ఒడ్డునకూర్చొని సంధ్యావందనం చేస్తున్నారట. సమాధిలో నుండి "రామ రామ" అను శబ్దం వినిపించిందట. అతడు ఆశ్చర్యపడ్డాడట.

రామనామరసికాగ్రణియై, ఆంధ్రుడై కలియుగమున సుమారు 220 సంవత్సరముల క్రితము మానవుడుగా జన్మించి 96 కోట్ల రామనామమును జపించి శ్రీరాముని జూచి, రామునితో మాటలాడి తరించినవాడు త్యాగయ్య. రామాయణ వాగ్గేయకారుడు, మహాకవి, గేయనాటక మార్గదర్శియగు త్యాగయ్య ప్రాతఃస్మరణీయుడు. ఆ మహామహుడే మానవాళికిఏడుగడ.

యస్యస్మృతిః కలిమలం హరతి ప్రజానాం
సందర్శనం చ తనుతేహరిభక్తి యోగం
నిశ్శ్రేయసాయ జయతే భువియత్కటాక్షః
తత్త్యాగరాజ గురురేవ సదాగతిర్మే —

—

# త్యాగరాజును సందర్శించిన మహనీయులు
## త్యాగరాజు - విద్వత్సమాగమము

మహానుభావుల జీవితోదంతములు మానవజాతి పురోగతికి మార్గదర్శకములు త్యాగేశుని వరప్రసాదియగు త్యాగరాజు కీర్తి అచిరకాలముననే దేశ దేశముల కెగ ప్రాకినది. ఆ మహానుభావుని సందర్శించి తమ జీవితములను పునీతము చేసికొనిన మహనీయులెందరో గలరు. కర్ణాటకసంగీతప్రపంచమునకు మూర్తిత్రయము శ్యామశాస్త్రి, తాగరాజు, ముత్తుస్వామిదీక్షితులు. ఈ ముప్పురు సంగీతము వలన తరించినవారలే. పై ముప్వురిలో శ్యామశాస్త్రి, త్యాగరాజు — ఇరువురును మంచి స్నేహితులు. ఒకరి గానమును ఒకరు విని ఆనందించిన మహానుభావులు శ్యామ శాస్త్రి—త్యాగరాజు. త్యాగయ్య - ముత్తుస్వామిదీక్షితులు ఇరువురు కలిసికొనినట్లు పెద్దగ ఆధారము లేవియులేవు. కాని టి.యస్. వెంకట్రామయ్యర్—తాను వ్రాసిన "ముత్తుస్వామిదీక్షితులు" అను నాంగ్లపుస్తకమున త్యాగరాజు - ముత్తుస్వామి దీక్షితులిరువురును ఒక సందర్భమున త్యాగయ్యగారింటిలో తిరువయ్యూర్‌లో కలిసి కొనినట్లు వ్రాసినారు.

# ఇక త్యాగయ్యను సందర్శించిన మహనీయులు వారి జీవితోదంతములు

రామభక్త శిఖామణిగా, సంగీత జగద్గురువుగా వాసికెక్కిన త్యాగబ్రహ్మమును సందర్శింప వచ్చినవారిలో మహాకవులు, వాగ్గేయకారులు సంగీతవేత్తలు, యోగులు, రాజవంశములకు చెందినవారలుగలరు. వీరిలో కొందరు కొన్నిరోజులు, కొందరు కొన్ని వారములపాటు త్యాగయ్యకు అతిధులుగానున్నారు. త్యాగయ్య గంధర్వ గానమును వినినప్పుడు తమకు గలిగిన మధురానుభూతిని గ్రంథస్థము చేసినవారు కొందరు లేకపోలేదు. ప్రముఖులరాక సందర్భములలో రచింపబడిన కీర్తనలలో వారి రాకను గురించిన ప్రస్తావనమున్నది.

# తూము నరసింహదాసు : 1822

ఆరువేల నియోగులు, ఆపస్తంబసూత్రులు, సంస్కృతాంధ్రభాషలలో భక్తి ప్రధానమైన కీర్తనలను రచించి తరించిన మహానుభావుడు. రామభక్తుడు. అపర రామదాసనిపేర్వడసినాడు. త్యాగయ్యకు సమకాలికుడు. 1790 ప్రాంతమున గుంటూరున జన్మించినాడు. గుంటూరుకు సమీపమున నున్న మంగళగిరిలో వేంచేసి యున్న లక్ష్మీ నృసింహస్వామి అనుగ్రహమున జన్మించినవాడగుటచే తల్లిదండ్రులు పిల్లవానికి "లక్ష్మీనృసింహము"ని నామకరణము చేసిరి. యుక్తవయసు వచ్చినంతనే "లక్ష్మీబాయమ్మ" యను నామెను వివాహమాడిరి పొన్నూరు తాలూకా ఆఫీసులో ఒక చిన్న ఉద్యోగమున ప్రవేశించిరి. ఉద్యోగమునన్నను రామభక్తినివీడక "రామ సహాయమెన్నటికి కలుగునో" అని నిరంతరము పరితపించిరి.

"రామసహాయ మెన్నటికో - భక్తకాముని దయ నాపై కలుగుటెన్నటికో" ఈ యొక్క కీర్తనతో శ్రీ నరసింహదాసుగారు తరించినట్లు చెప్పుదురు. రామచంద్రుడు కలలోకనపడి "నా ప్రియమైన భద్రాద్రికి రావలసినదని" చెప్పినారట. వెంటనే ఉద్యోగమునకు రాజీనామా నొసంగిరి. రాజీనామా నుపసంహరించుకొనవలసినదిగా ఎందరో సలహానొసంగిరి. కలిగిన కుటుంబముగాదు. జీవనమెట్లని బంధుమిత్రులు ప్రశ్నింప "రామనామమే జీవనము, భక్తావనము - పతితపావనము" అని ప్రత్యుత్తరమిచ్చి భద్రగిరికి ప్రయాణమైవెడలిరి. భద్రగిరి చేరి దూరముగా నుండియే భద్రాద్రి రామాలయమును సందర్శించి "అదిగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి" అని పరవశులై గానము చేసిరి. గౌతమిని క్రుంకులిడి ఆలయ ప్రవేశముచేసి ముందుగ రామదేవుని దర్శించి ఆ దివ్యమంగళ విగ్రహాని దర్శనమున కానందపడి

"నాపాలిభాగ్యమేమందు రఘునాధుడు కనిపించెముందు" అని తన యదృష్ట విశేషమునకు మురిసినారు. రామునికి ఆత్మార్పణముచేసి కొనినారు "రామా నీ వాడసుమీ - ఇక నన్ను బాములబెట్టకుమీ. "సకృదేవప్రపన్నాయ తవాస్మీతిచయాచతే అభయం సర్వభూతేభ్యోదదామి ఏతద్వ్రతంమమ అని గదా శ్రీరాముని ప్రతిన. కొన్నిరోజులు భద్రగిరిలోనుండి మరల గుంటూరుచేరి అక్కడ లావాదేవీలు పూర్తి చేసికొని తీర్థయాత్రలకై రామేశ్వరమునకు బయలుదేరిరి. త్యాగయ్యగారి కీర్తిని

విని, ఆమహామహుని దర్శింప కుతూహలియై తిరువయ్యార్ చేరినారు. నరసింహదాసుగారు తిరువయ్యార్ చేరి త్యాగయ్యగారింటికి వెళ్ళినప్పటికి త్యాగయ్యగారు శ్రీరామునకు షోడశోపచారపూజలు సల్పి ఏక పీఠవిగ్రహము ముందు కూర్చొని యున్నారు. శిష్యులు పరివేష్టించి యున్నారు. తంబూరచేబట్టి తన్మయులై రాముని కీర్తించుచున్నారు. ఎవరో అతిధులు వచ్చిన అలికిడియయినది. త్యాగయ్యగారు "నీదయరాదా ! రామ నీదయరాదా ! అను కీర్తనను గానముచేసిరి. త్యాగయ్యగారి గానమును విని ఆనందపరవశులై త్యాగయ్యను భూలోకనారదుడని ప్రశంసించినారు నరసింహదాసుగారు. వచ్చిన అతిధిని చూచినారు త్యాగయ్యగారు. ఆజానుబాహుడు, ఊర్ధ్వపుండ్రములు, చేతిలో తంబుర చిఱతలు, కాలికి గజ్జెలు కలిగిన అద్భుతమైన రూపము నరసింహదాసుగారిది. ఆ రూపమునుగాంచి త్యాగయ్య ఆనందపడిరి. కారణము భక్తసందర్శనము. త్యాగయ్యగారొక కీర్తనలో ఆ విషయమును చెప్పికొని నారు కూడను.

రామభక్తి సామ్రాజ్యమే మానవులకబ్బెనో మనసా ॥రా॥
ఆ మానవుల సందర్శనమత్యంత బ్రహ్మానందమే ॥రా॥

పరమభక్తులైన నరసింహదాసుగారిని జూచి త్యాగయ్యగారు బ్రహ్మానంద పరవశులై "అయ్యా ! తమ నామధేయమేమి ? ఏయూరు ? అని ప్రశ్నించినారు.

అయ్యా ! నేను ఆంధ్రుడను. నన్ను నృసింహదాసు అందురు. తీర్థయాత్ర లకై వచ్చినాను. మీపేరు వినినాను. గొప్ప రామభక్తులని, గాయకులని తెలిసికొని మిమ్ములను దర్శించి మీ గానమును విన వేడుకతో వచ్చినాను. అని ప్రత్యుత్తర మొసంగిరి. త్యాగయ్యగారును నృసింహదాసుగారితో పూజ పూర్తియైనది. మీరును మా రాముని కీర్తించుడు అనిరి. నృసింహదాసుగారు.

రామా నీ దయ రాదా ! పూర్ణకామానీమది లేదా అని గానము చేసిరి. నరసింహదాసుగారు కొద్దిరోజులు త్యాగయ్యగారికతిధులుగనుండి వారి గానమును విని యద్భుతమంది ప్రశంసించిరి.

కేవలానంద సంకీర్తనావళి వింటి
భావశు(సి)ద్ధియు శుద్ధభక్తిఁగంటి
భక్తులు శిష్యులు బలసి కొల్వఁగగంటి
వాజ్మాధురీవైభవంబుగంటి
వినయ సత్సంపద్వివేకముఁన్ కనుగొంటి
శ్రీరామ పదభక్తి చెలువ్వఁగంటి
యజునకఁదగరాని యసుభవంబునుగంటి
దన్మయత్వం బాత్మదనరఁగంటి

నరసి కనుగొంటి త్యాగరాయార్యునందు
నిలసద్గుణ పుంజ మింకెన్ని యైన
దివ్యమహిమాతిశయములు దేజరిలుట
గంటి హర్షాబ్ధినోలాడుచుంటి మదిని

గీ॥ రామ పద భక్తికి త్యాగరాయవరుని
సమముగా నేరరెవ్వరీక్ష్మాతలమున
ప్రేమనాఘనుఁడొకసారి పిలిచెనేని
రాముఁడో హోయటంచు మార్పలుకునంట

తిరుపతి - శ్రీరంగము - కంచి మున్నగు క్షేత్రములను దర్శించి ఆయా దేవతలను కీర్తించిరి. నాదెళ్ళ వరద రామదాసుగారను ధనికునితో పరిచయమేర్పడినది. వరద రామదాసు అనపత్యుడు. నరసింహదాసుగారి వలన రామాయణమును విని వరద రామదాసుగారు నరసింహదాసునకు 4,000 రూపాయలను సమ్మానము చేసినారు. నరసింహదాసుగారు ఆ ధనముతో తనకున్న ఋణములను దీర్చుకొనిరి. వరదరామదాసుగారిని వెంటనిడుకొని నృసింహదాసుగారు సకుటుంబముగా భద్రగిరి జేరిరి. భద్రాద్రి దేవాలయమున శ్రీరామునకు సరిగ కైంకర్యము జరుగనందులకు మిక్కిలి చింతించిరి. ఒకనాటి రాత్రి రామచంద్రుడు వైష్ణవవేషమున స్వప్నమున

దోచి "నైజాము ప్రధానమంత్రి చందూలాల్ మాధవలాల్ సేటును దర్శింపుము. పనులన్నియు చక్కబడగలవని" చెప్పిరి. అట్లే చందూలాల్ మాధవలాల్ సేటుకు గూడ శ్రీరాముడు కలలో కనబడి "నా భక్తుడు నీ దగ్గరకు రాగలడు. ఆయన కోరికను తీర్చుమని" చెప్పిరి.

నృసింహదాసుగారు నైజాము ప్రధానిని దర్శించగా "భద్రాద్రి పాల్వంచ పరగణాలెల్ల భద్రంబుగా నీవు పాలింపవలసుదు" భద్రాద్రి తత్పరిసర గ్రామపరిపాలనకు, కోవెల విచారణకు సర్వాధికారములు కలిగియుండునటుల ఫరమానా వ్రాసి యిచ్చిరి. "రాజా" బిరుదముతో గౌరవించిరి. ఆనాటి నుండి దేవాలయములో జరుగవలసిన విధులన్నిటిని సక్రమముగ నిర్వర్తించిరి శ్రీదాసుగారు.

శ్రీనృసింహదాసుగారి కీర్తనలను శ్రీ సీతారామచంద్రస్వామి దేవస్థానము, భద్రాచలమువారు ప్రచురించిరి. శ్రీనృసింహదాసుగారి కీర్తనలు, ఏకాంత సేవ, పవళింపు సేవ, ప్రభాత సేవ, శుక్రవారపు సేవ కీర్తనలు ప్రసిద్ధములైనవి.

శ్రీ నృసింహదాసుగారికీర్తనలను ఆకాశవాణి, విజయవాడవారు 1957 ప్రాంతములనుంచి భక్తిరంజని ద్వారా ప్రసారము చేయుచున్నారు. "భక్తిమార్గము" అను పేర శ్రీ నరసింహదాసుగారి జీవితమును సంగీత రూపకముగ ప్రసారము చేసినారు. ఆ రూపకమున నరసింహదాసుగా శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రిగారు నటించుటయేకాక దర్శకత్వపు బాధ్యతను కూడ నెరవేర్చిరి. రెండుమూడు పర్యాయములు శ్రీనరసింహదాసుగారి జీవితచరిత్రను శ్రీ సదాశివశాస్త్రిగారు ఆకాశవాణి - విజయవాడలో కథాగానము చేసిరి.

అపర రామదాసుగాపేరంది, భక్తిమయమైన కీర్తనలను వ్రాసి తరించిన ఆ మహనీయుని యుత్సవమును ఏ గానసభ జరుపులేదని వారి కీర్తనలకు తగినంతగా ప్రచారములేదని పరితపించిన వ్యక్తి శ్రీ నారుమంచి సుబ్బారావుగారు వ్యవస్థాపక కార్యదర్శి, శ్రీ సీతారామగానసభ, తెనాలి. నరసింహదాసుగారి యుత్సవమును జరిపిన ఘనత తెనాలి శ్రీ సీతారామగాన సభకే దక్కినది. శ్రీ నారుమంచి. సుబ్బారావుగారు కడు అభినందనీయులు.

# గోపీనాధ భట్టరాచార్యులు :

ఇతడు కాశీ నివాసి. హిందూస్థానీ సంగీతమునందసమాన పాండిత్యము గలవాడు రామేశ్వరయాత్ర చేయవలయునన్న కుతూహలము కలిగిన భట్టాచార్యునకు శ్రీరామచంద్రుడు స్వప్నమున దోచి "తిరువయ్యార్‌నందు త్యాగయ్యయను సంగీత విద్వాంసుడు కలడు అతడు నాకు భక్తుడు. అతనిని సందర్శించి గానమును వినవలసినదని" చెప్పెను. రామేశ్వరయాత్రకు బయలుదేరిన గోపీనాధ భట్టాచార్యులు కతిపయ దినములు ప్రయాణముచేసి తంజావూరుచేరిరి. అచట నుండి పంచనద క్షేత్రమగు తిరువయ్యార్‌చేరి త్యాగయ్య యింటికి వెళ్ళినారు. అతిధి అభ్యాగత సేవయే పరమావధిగాగల త్యాగయ్యగారు గోపీనాధ భట్టాచార్యులకు స్వాగతము పలికినారు. గోపీనాధ భట్టాచార్యులు త్యాగయ్యగారితో "అయ్యా! మీ దేశమునుంచి మా దేశమునకు వచ్చిన సంగీత విద్వాంసులు గానము చేసిన కీర్తనలు మీవని తెలిసికొని చాల ఆనందపడినాను. నేను రామేశ్వరయాత్రకై సంకల్పము చేసినపుడు శ్రీరాముడు "స్వప్నమున దోచి – మిమ్ములను దర్శించి మీ గానమును వినుమని చెప్పినాడు." మిమ్ములను దర్శించి – మీ గానమును విన కుతూహలియై వచ్చినానని చెప్పినారు. ఈ సన్నివేశము త్యాగయ్యను కదలించినది. వెంటనే త్యాగయ్యగారు తన కిట్టికీర్తిని కలుగచేసిన శ్రీరామచంద్రునకు కృతజ్ఞతా నివేదనము చేసినారు.

తోడి

దాశరదే నీ ఋణము దీర్పనాతరమా పరమపావననామ
ఆశదీర దూరదేశములను ప్రకాశింపజేసిన రసికశిరోమణి॥
భక్తిలేని కలిజాలవరేణ్యులు భావమెరుగలేరని కలిలోజని
భుక్తి ముక్తి కలుగు కీర్తనముల బోధించిన త్యాగరాజ
కరార్చిత ॥దా॥

త్యాగయ్యగారి కీర్తనమును తోడి రాగమున రచించుట ఎంతయు సముచితము. ఎట్లన త్యాగయ్యగారు కృతజ్ఞతలు చెప్పుచున్నది దాశరధి రామునకు. శ్రీరాముడుత్తర దేశీయుడు. తన్ను దర్శింపవచ్చిన గోపీనాధ భట్టాచార్యుడు నుత్తరదేశీయుడు.

ఉత్తరదేశీయుడైన శ్రీరామునకు కృతజ్ఞతానివేదనమును ఉత్తరదేశ సంబంధియగు తోడి రాగమున చెప్పుట ఎంతేని సముచితము. శ్రీరాముడు రసికశిరోమణి యట. త్యాగయ్యగారు రామచంద్రుని గానలోలుడని, రసికశిరోమణియని, రాగరసికుడని మొదలగు విశేషణములతో కీర్తించిరి.

(రాగరహిత, రాగరసిక త్యాగరాజ భాగధేయ - నిను వినా సుఖముగాన).

త్యాగయ్యగారి గానమునువిని గోపీనాథ భట్టాచార్యులెంతగనో సంతసించిరి. త్యాగయ్య గానమునకు భగవంతుడే సంతసింప ఇక మానవుల సంగతేమి? తరువాత త్యాగయ్యగారీ సందర్భముననే ఈ కీర్తనముగూడ రచించినట్లు చెప్పుదురు.

శహన

ఈ వసుధ నీవంటిదైవము నెందుగానరా॥
భావుకముగల్గి పర్థిల్లు కోవూరి సుందరేశగిరీశ ॥ఈ॥
ఆసచే అరనిముసము నీపురవాస మొనరజేయు వారిమది
వేసటలెల్లను తొలగించి ధనరాసుల నాయువును
భూసురభక్తియు తేజము నొసంగి భువనమందు కీర్తి
కల్గజేసి
దాసవరద త్యాగరాజ హృదయనివాస చిద్విలాససుందరేశ

(కాని యీ కీర్తనను తీర్థయాత్రాటన సందర్భమున కోవూరును సందర్శించినపుడు ఆ యూరి దైవమగు కోవూరి సుందరేశునిపై చెప్పిన పంచరత్నములలో నొకటి) గోపీనాధ భట్టాచార్యులు కొద్దిరోజులు త్యాగయ్యగారికి అతిధిగనుండి అచటనుంచి రామేశ్వరము వెళ్ళినారు.

## గోపాలకృష్ణభారతి :

19వ శతాబ్ది వాగ్గేయకారులలో "గోపాలకృష్ణభారతి" పేరెన్నికగన్న వ్యక్తి. శ్రీ గోపాలకృష్ణభారతి మూడు గ్రంథములను రచించినారు. 1) నందనార్ చరిత్ర

2) నాయనార్ చరితము 3) తిరునీలకంఠనాయనార్ చరితము. గోపాలకృష్ణ భారతి 1810 సంవత్సరమున నాగపట్టణమునకు సమీపమునమన్న "Narimanam" అను గ్రామమున జన్మించెను. 1896 సంవత్సరము వరకు అనగా 86 సంవత్సరములు జీవించెను. శ్రీగోపాలకృష్ణభారతి తరువాతి రోజులలో "మాయవరమున" నివసించెను. ప్రొఫెసర్ శ్రీ సాంబమూర్తిగారి కథనము ప్రకారము గోపాలకృష్ణభారతి పూర్వులు పండితులు, వైణికులు.

శ్రీ గోపాలకృష్ణభారతి వేదములను, అద్వైతశాస్త్రమును మాయవరమునకు చెందిన గోవిందయతీంద్రుల సన్నిధిని అభ్యసించిరి. తన గురువుగారైన గోవింద యతీంద్రులను శ్రీగోపాలకృష్ణభారతి "ఎంగల్ గురునాథ" అను సురటిరాగ కీర్తనమున కీర్తించిరి. కైవల్యనవనీతము, ప్రబోధచంద్రోదయము అను గ్రంథముల నధ్యయనము చేసెను. "కుండలినీ యోగమును" సాధనచేసినారు భారతి. అద్వైత సిద్ధాంతముపై ప్రగాఢ నమ్మకము కలిగిన వ్యక్తి శ్రీభారతి. జీవితాంతము నైష్ఠిక బ్రహ్మచారి.

బాల్యము నుండి శ్రీ భారతికి సంగీతమునందాసక్తి మెండు. బాల్యమున నేర్చుకొనిన సంగీతముతో తృప్తినందక హిందూస్థానీ సంగీతమును మహారాష్ట్రీయుడైన "రామదాస"ను నొక విద్వాంసుని సన్నిధిని నేర్చుకొనెను. రామదాసును తిరువైద్యై మరుదూరు మహారాజగు అమరసింహుడాదరించెను. అమరసింహ మహారాజు ఘనం కృష్ణయ్యర్‌ను పోషించెను. ఘనం కృష్ణయ్యర్ గోపాలకృష్ణభారతికి తన రచనలనెన్నిటినో నేర్పినాడు.

భాగవతదశమస్కంధ కీర్తన, వేదాంతదేశిక చరిత్ర కీర్తన, ఉత్తరరామాయణ కీర్తనను రచించిన అనంతభారతి అయ్యంగార్, గోపాలకృష్ణభారతి - ఇరువురును కీర్తనలను రచించుటయందు ఒకరి అనుభవముతో మరియొకరు భాగమును పంచుకొని ప్రయోజనమును పొందిరి.

గోపాలకృష్ణభారతి పుణ్యక్షేత్రమగు చిదంబరముతో సంబంధము కలిగి అచటనెలకొనియున్న "నందనార్" విగ్రహమువలన దివ్యజ్ఞానమును (ఆత్మజ్ఞానమును) పొందుచుండెను. గోపాలకృష్ణభారతి "నందనార్" జీవితముపై ఇసైనాటకమును రచింప సంకల్పించి అందుకు సంబంధించిలభ్యమైన సాహిత్యమును

చదివినాడు. గోపాలకృష్ణభారతి నందనార్‌ను నందమునిగా, 3000 మంది దీక్షితు లతో చిదంబరముచేరి అచట అదృశ్యమైనట్లు తెలిసికొనెను. ఇంకను నిరువురు హరిజనులు గూడ చిదంబరమున మోక్షమును పొందినట్లు తెలిసికొనెను.

గోపాలకృష్ణభారతి తమిళమున రచించిన "నందనార్ చరితము" కర్ణాటక సంగీతమునకు గొప్పవరము. కర్ణాటక సంగీతమున సుప్రసిద్ధములైన రాగము లతోబాటు గోపాలకృష్ణభారతి ద్విజావంతి, మాంజి అను నూతనరాగముల సహి తము కీర్తలను రచించెను. అద్భుతమైన కీర్తనారచనతోబాటు గోపాలకృష్ణభారతి దండకము, చిందు మొదలగు సంగీత సంప్రదాయములను మనకందించినాడు.

భారతి తన నందనార్ చరితమును హరికథగా పలు తావుల గానము చేసి నాడు. నందనార్ చరితము - హరికథాగానము బహుళ ప్రచారమునందినది. ఒక ప్పుడు కారైకాల్ దగ్గర ఫ్రెంచి కలెక్టరు "సీసే" అనునాతడు భారతి నందనార్ చరితము కథాగానమును విని ఆ గ్రంథమును ముద్రింపించుటకు వలయు నేర్పాటులు చేసెను. తదనంతరము "నందనార్ చరితము" అనేక ముద్రణములు వెలువడినది.

దక్షిణదేశపు హరికథకులెందరో నందనార్ చరితమును హరికథా గానము చేసిరి. ఆధునిక కథకు తండ్రివంటివాడయిన తంజావూర్ కృష్ణభాగవతార్ నందనార్ చరితమును బహుళ ప్రచారములోనికి తీసికొనివచ్చెను. ఎంబార్ విజయరాఘవాచారి తండ్రియైన చిదంబరం శ్రీరంగాచారియర్ "నందనార్ చరిత్ర"ను కథాగానము చేయుటలో పేరొందెను. తరువాత నందనార్ చరితము రంగస్థలనాటకముగాగూడ ప్రదర్శింపబడినది.

అంతటి ప్రతిభావంతుడగు "గోపాలకృష్ణభారతి" త్యాగయ్య కీర్తి ప్రతిష్ఠ లను విని, త్యాగయ్యను దర్శింప కుతూహలియై యుండెను. గోపాలకృష్ణభారతి తన 35వ ఏట త్యాగయ్యను సందర్శించుటకై తిరువయ్యార్ వెళ్ళెను. ఇంటికి వచ్చిన అతిథిని త్యాగరాజస్వామి సాదరముగ పలుకరించినారు. "ఎక్కడనుండి తమ రాకయని" భారతిని ప్రశ్నించినారు త్యాగయ్యగారు. "మాయవరం" నుండి అని గోపాలకృష్ణభారతి సమాధానము. తమిళమున చక్కని కీర్తనలను రచించుచున్న మాయవరం నివాసియగు గోపాలకృష్ణభారతిని తామెరుంగుదురా అని ప్రశ్నించినారు త్యాగయ్య. గొప్ప సంగీత విద్వాంసుడు, రామభక్తి సామ్రాజ్య పట్టభద్రుడునగు

త్యాగయ్యదగ్గర తనకింతగా గుర్తింపులభించినందులకు భారతి ఎంతగనో ఆనందించి వినయవినమితగాత్రుడై "మహాత్మా! ఆ భారతిని నేనే" అని ప్రత్యుత్తరమిచ్చినాడు. భారతి వినయసంపదకు త్యాగయ్య ముగ్ధుడైనాడు. ప్రతిభావ్యుత్పత్తు లెవరియందున్నను త్యాగయ్య గుర్తించి మెచ్చుకొనెడివారేగాని, వారిపట్ల ఈర్ష్య, ద్వేషభావములను కలిగియుండెడివారుకారు. ఎవరిలో సృజనాత్మక శక్తియున్నను వారిని ప్రోత్సహించెడివారు త్యాగయ్యగారు. ఒకప్పుడు తన శిష్యుడైన సుబ్బరాయశాస్త్రి తిరువయ్యార్ నందలి ధర్మసంవర్థని ఆలయములో కల్యాణిరాగమున "నినువినా గతిగాన జగాన" అను స్వీయరచనను గానము చేసినపుడు త్యాగయ్య శిష్యుని యభినందించినాడు.

గోపాలకృష్ణభారతి వికలాంగుడు. అట్టి వికలాంగుడైనవ్యక్తి ప్రఖ్యాతవాగ్గేయకారుడని మొదట త్యాగయ్యగారే విశ్వసించినవారుకారు.

గోపాలకృష్ణభారతి త్యాగయ్యను సందర్శించిన సమయాన త్యాగయ్య శిష్యబృందము "నన్నుబ్రోవ నీకింతతామసమా నాపై నేరమేమి పల్కు మనసా" అను అభోగిరాగకీర్తనను గానము చేయుచున్నారు. గానము పూర్తియయినది. త్యాగయ్యగారు భారతిని మీరు అభోగిరాగమున ఏదైన కీర్తనను రచించినారా? అని ప్రశ్నించినారు. భారతి మౌనమూనినారు. త్యాగయ్య శిష్యులు ఇతర కృతులను గానము చేయ నారభించినారు. భారతి ఆ రాత్రికి రాత్రి అభోగిరాగమున 'సభాపతిక్కు వేరు దైవం" అను కీర్తనను రచించి మరునాటి ఉదయాన త్యాగయ్యగారి సమక్షమున గానము చేసినారు. ఆ కృతిలోని మాధుర్యానికి త్యాగయ్యముగ్ధులై భారతినాశీర్వదించినారు. ఈ సంఘటన జరిగినది భారతి 35వ ఏట. భారతి జననము 1810. భారతి త్యాగయ్యను సందర్శించినది $1810 + 35 = 1845$. త్యాగయ్య 1847 జనవరిలో సిద్ధిపొందినారు.

"సభాపతిక్కువేరుదైవం" అను కీర్తనను భారతి ఒక్కరాత్రిలో రచించిన విషయమును తెలిసికొనిన త్యాగయ్యగారు భారతి సృజనాత్మశక్తికి, సంగీతసాహిత్యాలలో ఆయనకున్న ప్రావీణ్యమునకెంతగనో సంతసించి భారతినభినందించినారు.

# స్వాతి తిరునాళ్ దూత - వడివేలు - 1835

స్వాతితిరునాళ్ తిరువాన్కూరు పాలకుడు. స్వాతి తిరునాళ్ సంస్కృతాంధ్ర, మరాఠీ, హిందీ, తమిళ, మళయాళభాషా పండితుడు. సంగీత విద్వాంసుడు. అన్ని భాషలలోను కీర్తనలను రచించిన వాగ్గేయకారుడు. కన్నయ్యభాగవతార్ స్వాతి తిరునాళ్ ఆస్థాన విద్వాంసుడు. త్యాగయ్యగారి శిష్యుడు. కన్నయ్యభాగవతార్ త్యాగయ్య కృతులను గానముచేయుచుండగా స్వాతి తిరునాళ్ విని ఆ కృతులలోని సంగీత, సాహిత్య, భక్తిభావాలకు సంతసించి త్యాగయ్యగారిని కలిసికొనవలయునన్న కుతూహలము గలిగి తన యాస్థానవిద్వాంసుడగు వడివేలును తిరువయ్యార్‌కు పంపినాడు. వడివేలు ప్రముఖ వాయులీన విద్వాంసుడు. ఆయన కన్ను మెల్ల. వాయులీన వాద్యమున వడివేలుకు గల ప్రతిభకు అబ్బురమంది స్వాతి తిరునాళ్ 1834 సంవత్సరమున దంతముతో తయారు చేయించిన వాయులీనమును బహూకరించినాడు. స్వాతి తిరునాళ్ మహారాజు కోరిక మేరకు వడివేలు తిరువయ్యార్ చేరినాడు. త్యాగయ్య ముఖ్యశిష్యుడు వీణకుప్పయ్యర్ - వడివేలు ఇరువురు మంచి స్నేహితులు.

ఎట్లయినను త్యాగయ్యను తిరువనంతపురం తీసికొనివెళ్ళవలెయునన్నది వడివేలు తలంపు. అది సాధ్యమా ? త్యాగయ్యగారు నివాసమున్న తిరుమంజన వీధిలోనే ఒక యింటిలో వడివేలు బస చేసినారు. వడివేలు బసచేసిన గృహము త్యాగయ్య గారింటికెదురుగానున్న యిళ్ళలో కావేరికి మరింత దగ్గరలో నున్నది. నిత్యము త్యాగయ్యగారు వడివేలు బసచేసిన యింటి మీదుగనే కావేరికి స్నానానికి వెళ్ళు చుండెడివాడు. త్యాగయ్యగారు కావేరికి వెళ్ళుసమయము కనిపెట్టి త్యాగయ్య తన యింటి ముందునకు వచ్చు సమయమునకు వడివేలు వాయులీనము వాయించు చుండెడివారు. వడివేలు వాయులీనవాదనమునకు త్యాగయ్యగారు పరవశముచెంది మొదటిరోజు వడివేలు యింటిముందు కొద్దిసేపు ఆగినారు. రెండవరోజు మొదటి దినముకంటె ఎక్కువసేపు ఆగినారు. రెండురోజులు వడివేలు వాయులీనవాదనమును విని ఆయనకు సంగీతమునగల ప్రతిభాప్రాభవములను గుర్తించినారు. ఇది త్యాగయ్య గారిలోనున్న విశేషము, విశిష్టలక్షణము. ప్రతిభ అన్నది ఎవరిలో నున్నను గుర్తించి ప్రోత్సహించు తత్త్వము త్యాగయ్యగారిది. ఇతరుల ప్రతిభను జూచి ఈర్ష్యపడు స్వభావముకాదు త్యాగయ్యగారిది.

మొదటి రెండురోజులు వడివేలు వాయులీనవాదనమును విన్న త్యాగయ్య గారికి ఆయనను కలిసికొనవలయునన్న కుతూహలము కలిగి, మూడవనాడు వడివేలు నివాసగృహమున కేగినారు. తన నివాసగృహమున నడుగిడిన త్యాగయ్యను జూచి ఆశ్చర్యచకితుడైనాడు వడివేలు. సవినయముగా త్యాగయ్యకు నమస్కరించి స్వాగతము పలికి "మహాభాగా! నా జీవితమున మరపురాని దినమీనాడు. మీకంతగ నా గానమును వినవలయునన్న కుతూహలమున్న నేనే తమ సన్నిధికి వచ్చి నా వాయులీనవాదనమును వినిపించెడివాడను గదా! "విద్యాదదాతి వినయమ్" అనిగదా ఆర్యోక్తి. తాము స్వయముగా నా బసకు వచ్చి నాకు విశేషగౌరవమును కలిగించి నారు అనినాడు. వడివేలును తమ యింటికి రమ్మని ఆహ్వానించినారు త్యాగయ్య గారు. వడివేలు అంగీకరించినారు.

తన తిరువయ్యార్ రాకకు గల కారణమును త్యాగయ్యకు తెలియజెప్పుటకు తగిన సమయము కొఱకు ఎదురుచూచుచున్న వడివేలు స్వాతి తిరునాళ్ మహా రాజావారి కీర్తనలను త్యాగయ్య ఎదుట గానముచేసి ఆయన మెప్పులను పొందినాడు. వడివేలు గానమునకు సంతసించిన త్యాగయ్యగారు వడివేలు కోరిన ఏ కోరికనైనను నెరవెర్ప తన సంసిద్ధతను వ్యక్తము చేసినారు. తన నిరీక్షణ ఫలించినందులకు వడివేలు ఎంతగనో సంతసించినారు. తన రాకకుగల కారణమును చెప్ప నుద్యుక్తుడైనాడు వడివేలు. వడివేలు "అయ్యా! త్యాగయ్యగారూ! తిరువాన్కూరు మహారాజా స్వాతి తిరునాళ్ మిమ్ములను చూడవలయునని, మీ గానమును విన వలయునని ఉవ్విళ్ళూరుచున్నారు. మా మహారాజు తమ ఆస్థాన గాయక పదవి నీయ సంకల్పించినారు.

రాముని సన్నిధిని తప్ప రాజుల సన్నిధిని గానముచేయని త్యాగయ్యగారు వడివేలు ద్వారా స్వాతి తిరునా మహారాజు పంపిన ఆహ్వానమును పురస్కరించు కొని యీ విధముగ సమాధానము చెప్పినారు.

సాతగభైరవి - ఆది

పదవి నీ సద్భక్తియు కల్గుటే ||ప||
చదివి వేద శాస్త్రోపనిషత్తుల
సత్త తెలియలేనిది పదవా ||ప||

ధనదారసుతాగార సంపదలు
ధరణీశుల చెలిమొక పదవా
రాగలోభయుత యజ్ఞాదులచే
భోగములబ్బుట యది పదవా ||ప||
జపతపాది యణిమాది సిద్ధులచే
జగములనేచుట యది పదవా ||ప||
త్యాగరాజ నుతుడౌ శ్రీరాముని
తత్త్వము తెలియనిదొక పదవా ||ప||

కీర్తనపాడి అయ్యా! వడివేలుగారూ! నేను మీ రాజుగారిని తప్పక కలిసికొందును. నా మాటను నిలబెట్టుకుందును. మే మిరువురము ఈ లోకమున కలిసికొనుటకు సాధ్యపడదు. మరియొక లోకమున మేమిరువురము కలిసికొందుము. మా యిరువురి ఉపాసనామూర్తులు ఒకరే అని పలికిరి. తన ప్రయత్నము విఫలమై నందులకు విచారించినను, ఒక మహాగాయకుని కలిసికొనగలిగితినన్న, గంధర్వ గానము వింటినన్న తృప్తి కలిగినది వడివేలుకు. తిరువనంతపురం తిరిగివెళ్ళినాడు వడివేలు.

స్వాతి తిరునాళ్ మహారాజు ఉత్కంఠతో వడివేలు రాక కొఱకు, త్యాగయ్యగారి రాక కొఱకు ఎదురుచూచుచుండిరి. తిరువనంతపురం చేరిన వడివేలును స్వాతి తిరునాళ్ మహారాజు త్యాగయ్య గారేమనిరి? వారు మన ఆస్థానానికి రాగలమనిరా! అని ప్రశ్నించిరి. దానికి వడివేలు త్యాగయ్య పాడిన కీర్తనను పాడి, ఇదియే త్యాగయ్యగారి సమాధానమనిరి. త్యాగయ్య గొప్పతనమును స్వాతి తిరునాళ్ముందు ఎంతగనో ప్రశంసించినాడు వడివేలు. త్యాగయ్యను చూడవలయునన్న కోరిక స్వాతితిరునాళ్కున్నను, రాజకీయ పరిస్థితులంతగా కలసి వచ్చినవికావు. ఈ సంఘటన జరిగిన తరువాత స్వాతితిరునాళ్ మహారాజా పంద్రెండు సంవత్సరములు జీవించియున్నను, ఇరువురు కలిసికొనుట తటస్థింపలేదు. 1846 డిసెంబరులో స్వాతి తిరునాళ్ పరమపదించిరి. 1847 జనవరి 6వ తేదీన త్యాగయ్యగారు సిద్ధిపొందిరి.

# గోవిందమారార్ - 1843

షట్కాల పల్లవిని పాడగల సమర్థుడు, 19వ శతాబ్ది ప్రథమార్థపు గాయకులలో నగ్రేసరులైన గోవిందమారార్ మతాభినివేశము మెండుగాగల వ్యక్తి. వార్ధకమున కాశీయాత్రకు బయలుదేరి మార్గమధ్యమున తిరువనంతపురమున మజిలీచేసి స్వాతి తిరునాళ్ అందజేసిన స్వాగత సత్కారాలను అందుకొన్న మేటి విద్వాంసుడు. అటనుండి బయలుదేరి 1843 సంవత్సరము తిరువయ్యార్ చేరి త్యాగయ్యను సందర్శించి ఆయన గానామృతమును గ్రోలిన ధన్యుడు.

గోవిందమారార్ ఏడుతీగెల తంబూరా నుపయోగించెడివారు. మారార్ సంగీత ప్రతిభాసంపదకుచిహ్నముగా తంబూరాకు చివర పతాకముండెడిది. గోవింద మారార్ త్యాగయ్యను సందర్శించినది హరివాసరము. పర్వదినము. ప్రతి ఏకాదశికి త్యాగయ్యగారింట భజన కార్యక్రమము నియతముగ జరుగుచుండెడిది. భక్తులెందరో ఆ భజనలో పాల్గొనెడివారు. గోవిందమారార్ కూడ అచట చేరిన భక్తుల మధ్యనాసీనులైనారు. కార్యక్రమమున పూర్వభాగము పూర్తియయినది. భగవంతునికీర్తించ వలసినదిగా భక్తులను ఆహ్వానించు కార్యక్రమమారంభమైనది. గోవిందమారార్‌ను కూడ పాడుమని కోరినారు. గోవిందమారార్ తంబురా అచటకు జేరిన ప్రేక్షకుల నాకర్షించినది. గోవిందమారార్ వెంటనే ఏడుతీగెల తంబురాను మీటుచు "చందన చర్చిత" అను జయదేవుని అష్టపదిని గానముచేసిరి. ఆనాటి గానమున గోవింద మారార్ తన ప్రతిభను కనపరచినారు. ఆయన గాన విద్యావైశారద్యమునకు శ్రోతలు పరవశులైనారు. త్యాగయ్యకూడ గోవిందమారార్ గాన వైదుష్యమున కెంతగనో ముగ్ధులైనారు. ఇది త్యాగయ్యగారిలోనున్న ప్రత్యేక విశిష్ట లక్షణము. గోవింద మారార్ గానమునకు ముగ్ధుడైన త్యాగయ్యగారు అప్పటికే తాను రచించి శిష్యులకు పాఠము చెప్పిన "శ్రీరాగము" నందలి పంచరత్న కీర్తనను గానము చేయవలసి దిగా కోరగా "ఎందరో మహానుభావులు - అందరికి వందనములు" అను శ్రీరాగ పంచరత్న కీర్తనను గానము చేసిరి. తరువాత కొన్నిదినములు గోవిందమారార్ త్యాగయ్యకతిథిగ నున్నారు.

# ముత్తుస్వామి దీక్షితులు :

దీక్షితులవారు - త్యాగయ్యగారు కలిసికొన్నటుల ఆధారములేవియు కన్పట్టుట లేదు. కాని శ్రీ టి. యల్. వెంకట్రామయ్యర్ తాను వ్రాసిన "ముత్తుస్వామి దీక్షితార్" అను నాంగ్ల పుస్తకమున నిరువురు కలిసికొనినట్లు వ్రాసినారు.

ఒకనాడు ముత్తుస్వామి దీక్షితులు తిరువయ్యార్‌లోని పంచనదీశ్వరాలయ సందర్శనమునకై వచ్చిరట. త్యాగయ్యగారి శిష్యులా విషయమును త్యాగయ్యగారికి చెప్పినారట. త్యాగయ్యగారు అంతటి విద్వాంసుని తమ యింటికి ఆహ్వానించి తీసికొని రానందులకు బాధపడి, అప్పటికప్పుడు కబురంపి వారిని తన యింటికి పిలిపించుకొనిరట. ఆనాడు త్యాగయ్యగారింట రామపట్టాభిషేక మహోత్సవము. పట్టాభిషేకము పూర్తియయినది. పట్టాభిషిక్తుడైన రాముని త్యాగయ్యగారు ఆనందపారవశ్యముతో "కొలువైయున్నాడే కోదండపాణి" అని కీర్తించినారు. త్యాగయ్యగారి గాత్ర మాధుర్యమునకు, భక్తిభావమునకు దీక్షితార్ అబ్బురమందినారట. త్యాగయ్యగారు దీక్షితుల వారిని మీరుకూడ మా పట్టాభిరాముని కీర్తించుమని అడిగినదే తడవుగా దీక్షితార్ ఆనందపారవశ్యముతో పట్టాభిషిక్తుడై త్యాగయ్యయింట నెలకొనియున్న రామ పీఠమును జూచి-

"మామవ పట్టాభిరామ-జయమారుతి సన్నుతనామ" అను కీర్తనను "మణిరంగు" రాగమున గానము చేసిరి.

o)(o

# త్యాగరాజు - జీవితదర్శనము

ఆనందసాగర మీదని దేహము భూ భారమె రామ
శ్రీనాయకాఖిల నైగమాశ్రిత సంగీత జ్ఞానమను
బ్రహ్మానంద॥
శ్రీ విశ్వనాథ శ్రీకాంత విధులు పావనమూర్తు లుపాసించ
లేదా
భావించిరాగలయాదులభజియించే శ్రీత్యాగరాజనుత॥
ఆనంద॥

ఆనందసాగరమీదని దేహము భూమికి భారమని, నాదోపాసన వలన బ్రహ్మానందమును పొందవచ్చునని,

నాదలోలుడై బ్రహ్మానందమందవే మనసా
స్వాదుఫలప్రద సప్తస్వరరాగనిచయ సహిత ॥నా॥
హరిహరాత్మ భూసురపతి శరజన్మగణేశాది
వరమౌను లుపాసించరే ధరత్యాగరాజు తెలియు

త్రిమూర్తులు సంగీతము నుపాసించినారని "నాదోపాసనచే శంకరనారాయణ విధులు వెలసిరని, సంపూర్ణానంద స్థానమైన మోక్షసామ్రాజ్యమును పొందుటకు" భక్తియుతమైన సంగీత జ్ఞానముకంటె సన్మార్గము లేదని

సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గముగలదే మనసా
భృంగినటేశ సమీరజసుటజమ
తంగనారదాదులుపాసించే ॥సం॥

న్యాయాన్యాయము తెలుసును, జగము
మాయామయమని తెలుసును దుర్గుణ
కాయజాది షడ్రిపుల జయించే
కార్యము తెలుసును త్యాగరాజునికే

సంగీత శాస్త్రజ్ఞానము సాయుజ్యసౌఖ్యదమని నిశ్చయించుకొని సంపూర్ణానంద స్థానమైన మోక్షసామ్రాజ్యమును పొందుటకు భక్తియుతమైన సంగీతజ్ఞానముకంటె సన్మార్గములేదని నిశ్చయించుకొని, నాదబ్రహ్మోపాసనామార్గమున తరించిన మహనీయుడు త్యాగరాజు. నాదోపాసనా మార్గమును ప్రచారముచేసి లోకోద్ధారణము గావించిన ఘనత త్యాగరాజునకే దక్కినది.

శ్రీ త్యాగరాజస్వామి శంకరభగవత్పాదుల యవతారమని పెద్దల భావన. శ్రీరామకృష్ణావతారములు భగవత్సంపూర్ణావతారములు. శ్రీ శంకర త్యాగరాజాదులు భగవదంశావతారమూర్తులు. శ్రీ శంకరాచార్యుడే తిరిగి త్యాగరాజుగ నవతరించి తాను పూర్వము సంస్కృతమున వ్రాసిన ఉపనిషద్భాష్యాదులను తేటతెలుగున నందించి మానవాళికి మహోపకారము చేసినారని, ఆ కారణముగా త్యాగరాజ కృతులకు "త్యాగబ్రహ్మోపనిషత్తు" అనుపేరు కలిగినదని తద్జ్ఞుల తలంపు. యధార్థము గూడను. త్యాగరాజ కృతులలోని పల్లవి సూత్రము, అనుపల్లవి వృత్తి, చరణము భాష్యమని- పెద్దల నిర్ణయము.

శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు ఆధ్యాత్మికభావకుసుమాలతో నిండియుండును. త్యాగరాజ కీర్తనల కొక ప్రత్యేకతను తెచ్చిపెట్టినది ఆ కీర్తనల సాహిత్యమునగల ఆధ్యాత్మిక నేపధ్యమని శ్రీధరబాబుగారు వ్రాసినారు.[1]

శ్రీ శంకరభగవత్పాదులే త్యాగయ్యగ నవతరించిరను విషయమును గురించి శ్రీహరి నాగభూషణంగారిట్లు వ్రాసిరి.

"శంకరాచార్యుడుగ నవతరించినప్పుడు "న్యాసవివాత్య రేచయత్, జ్ఞానాదేవతు కైవల్యం - ప్రాకస్యవహ్నివత్ జ్ఞానం వినా మోక్షోనసిధ్యతి (వివేక చూడామణి)

1. త్యాగరాజుని ఆధ్యాత్మిక సమన్వయము నాట్యకళ_త్యాగరాజ ద్విశత జయంత్యుత్సవ సంచిక,

సన్న్యాసాదేవ మోక్షః - ఇత్యాది శ్రుత్యుక్తరీతిని జ్ఞాననిష్ఠారూపమగు సన్న్యాసమే పరమానుష్ఠేయముగ బోధించెను. శ్రీ త్యాగరాజు రూపమునన్నో "మానసమితి విద్వాగ్ంస్తస్మాద్విద్వాగ్ంస ఏవమానసే రమంతే" "భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనంతరం - ఇత్యాది వచనముల ననుసరించి భక్తియోగ నిష్ఠయే పరమ ప్రాశస్త్యమని నిరూపించెను. అట్టి జ్ఞాననిష్ఠయు, నిట్టి భక్తినిష్ఠయు బాహ్యతః ఇతరేతర విలక్షణములుగ నెంచబడియు "భక్తిస్తు నిరతిశయానంద ప్రియానన్య ప్రయోజన సకలేతరవైతృష్ణ్యవద్ జ్ఞానవిశేష ఏవ అనెడి శ్రీరామానుజోక్తిననుసరించియు, మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవగరీయసీ - స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే, స్వాత్మతత్త్వాను సంధానం భక్తిరిత్యపరేజగుః 'చతుర్విధా....జ్ఞానీచభరతర్షభ-ఇత్యాది శ్రీశంకరాదుల భక్తిననుసరించియు చరమకాష్ఠయందు నేకరూపమని గ్రహింపనగును.

ఇంతకు దేలినదేమన శ్రీత్యాగరాజస్వామి భగవదవతార విశేషమనియు, తత్రాపి శ్రీశంకరాచార్య ప్రతిరూపమనియు తాత్పర్యము.1

శ్రీ శంకరాచార్య ప్రతిరూపమగు త్యాగరాజస్వామి సుగుణఖని. నిష్కామ కర్మయోగి. భక్తాగ్రగణ్యుడు. వైరాగ్యసంపన్నుడు. సంసారమునందున్నను "సంసారులైతే నేమయా శిఖిపింఛావతంసుడెదుటనుండగ" నని-తామరాకు మీది నీటి బిందువువలె మెలగినాడు. జ్ఞాని. సకలశాస్త్ర పారంగతుడు. శాస్త్రచర్చయందు వ్యాసుని వంటివాడు త్యాగరాజని - శ్రీవారి శిష్యుడు వాలాజాపేట వేంకటరమణ భాగవతుల వక్కణ.2 ద్వైతాద్వైత విచారణము గావించినాడు3 అద్వైత మత సిద్ధాంత ప్రవక్త శంకరభగవత్పాదులు. శంకరాచార్యుని ప్రతిరూపమగు శ్రీ త్యాగరాజ స్వామియు నద్వైతియే. కొందరు త్యాగరాజును "విశిష్టాద్వైతిగ చెప్పుచున్నారు గాని ఆ మాట సరిగాదు. శ్రీవారి కృతులనుబట్టి వారు "అద్వైతి" యనుట ఎట్లు సమంజసమో వివరించుటకు త్యాగరాజస్వామి తన నిర్యాణకాలమున చెప్పిన కృతిని ముందుగ నుదహరించి తరువాత వారి కృతుల ద్వారా "త్యాగరాజు" అద్వైతి యనుట నిరూపింపనగును.

---

1. భారతి సర్వజిత్తు - భాద్రపదము
2. వ్యాసోనైగమచర్చయా
3. ద్వైతము సుఖమా - అద్వైతము సుఖమా

ధన్యాసి — రూపకం

శ్యామసుందరాంగ సకలశక్తియు నీవేరా ॥శ్యా॥
తామస రహితగుణసాంద్ర ధరనువెలయు
రామచంద్ర ॥శ్యా॥
దుష్టదనుజ మదవిదార శిష్ట జనహృదయ విహార
ఇష్టదైవము నీవేర ఇలను త్యాగరాజు వేర ॥శ్యా॥

పై కృతిలోని భావమును పద్యముననుంచినారు శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులుగారు.

అవలన్ ముందట శ్యామసుందరుని యా యందమ్ము
గన్గొంచు మా
ధవసర్వమ్మగు శక్తినీవ మఱి నాదైవమ్ము నీవేర యి
య్యవనిన్ నీవును ద్యాగరాజు నొకడేరా యంటివద్వైత బో
ధ విశిష్టంబు తురీయ నిష్ఠకృతిగాధన్యాసి దన్యోసినాన్[1]

శ్రీ త్యాగరాజస్వామి ఆధ్యాత్మిక సాధనకు బాల్యముననే అంకురార్పణ జరిగినది. ఉపనయనానంతరము తండ్రి రామబ్రహ్మముగారు, పదునెనిమిదవయేట రామకృష్ణానంద యతీంద్రులు రామషడక్షరీ మంత్రోపదేశము చేసినారు. తల్లిసీతమ్మ గారివలన భక్తి, సంగీతము లలవడినవి. తండ్రితో బాటు ఏక పీఠ విగ్రహమును పూజించు నలవాటయినది త్యాగయ్యగారికి. తండ్రిగారు రామాయణ పురాణమును చెప్పుచుండగ త్యాగయ్య వినుచుండెడివాడు. ఈ విధముగా త్యాగయ్య ఆధ్యాత్మిక సాధనకు బాల్యముననే బీజమేర్పడినది. సంసారసాగర తరణమునకు ముఖ్యసాధనములైన భక్తి జ్ఞాన వైరాగ్యములు త్యాగయ్యగారియందు మూర్తీభవించినవి.

ఈ విషయమును గురించి కవిసామ్రాట్ విశ్వనాథ త్యాగయ్యగారి నిట్లు ప్రశంసించినారు.

---

1. త్యాగరాజ కృతిపద్య మణిహారము.

వాని భక్తిజ్ఞాన వైరాగ్యవిభవంబు లెనసియేకత్ర తోచినదిలేదు.

(త్యాగరాజస్వామి శతవార్షిక సంచిక)

త్యాగయ్యగారి ప్రతికీర్తన భక్తిజ్ఞాన వైరాగ్య ప్రబోధకమై యుండుననుట సత్యము. గ్రంథవిస్తర భీతిచే నన్నిటి నుదహరింపక వారు అద్వైతియనుట ఎట్లు పొసగునో నిరూపింప ప్రయత్నింతును.

శ్రీ త్యాగరాజు సగుణారాధనము గావించినవారు. అనేక కృతులతో సగుణ నిర్గుణ రూపుడగు పరమాత్మను స్తుతించినారు త్యాగరాజుగారు. త్యాగయ్య కృతులు చాలభాగము ఆంధ్రభాషలో నున్నవి. ఆంధ్రభాషలోనున్న ఆ కృతులను ఆంధ్రేతరులైన గాయకులు కూడ గానముచేసి భుక్తిముక్తులను పొందుచుండుట సర్వలోక విదితము. ఇట్టి పరిస్థితులలో శ్రీ త్యాగరాజు ద్వైతియా ! అద్వైతియా అను సందేహము కలుగుటకు నిమిత్తములు లేకపోలేదు.

శ్రీ త్యాగరాజస్వామి "తులసీదళములచే సంతోషముగా పూజింతును", చల్లరే రామచంద్రునిపై పూలు మొదలగు కీర్తనములతో శ్రీరామచంద్ర విగ్రహమును తులసీ దళములతో, పూలతో పూజించుట వలన సగుణ భగవదారాధన పరుడని స్పష్టమగుచుండ శ్రీ త్యాగరాజస్వామి "అద్వైతి" యెట్లగును ? "బ్రహ్మసత్యం జగన్మిథ్య-జీవో బ్రహ్మైవనాపరః" అనెడి జగన్మిథ్యాత్వ జీవబ్రహ్మైక్య లక్షణాద్వైతి శ్రీ త్యాగరాజస్వామి యెట్లగును ! అను సందేహము ఆపాతదృష్టిలో కలుగును. కాని అద్వైత సిద్ధాంతమునుగాని, అద్వైత సిద్ధాంత బోధక శ్రీ త్యాగరాజ కృతులను గాని బాగుగ పరిశీలించినచో పై సందేహము పటాపంచలగును. శ్రీ త్యాగరాజ స్వామి అద్వైతియే యనెడి సిద్ధాంతము కరతలామలకముగ సిద్ధించును. అదెట్లు ?

అసలు అద్వైత సిద్ధాంతములో సగుణ బ్రహ్మోపాసనముగాని, బాహ్య సగుణ భగవన్మూర్తి పూజాదులుగాని యుండవనుకొనుట పొరపాటు. ప్రతి జీవునకు స్థూలదేహమే తాననుకొనెడి భ్రాంతి సహజమగుట వలన "నేను మనుష్యుడను, నేను బ్రాహ్మణుడను" అని యనుకొనుట సహజము. వాసాంసి జీర్ణాని యథావిహాయ నవాని గృహ్ణాతినరోపరాణి"-జీర్ణవస్త్రమును వదలి నూతన వస్త్రమును ధరించినట్లు బ్రాహ్మణత్వ క్షత్రియత్వాది జాతీయములగు స్థూలదేహములను మరణకాలమున

వదలి "బుద్ధిః కర్మానుసారిణీ" అనియు, యంయం వాపిస్మరన్‌భావం త్యజంత్యంతే కళేబరం-తం తమేవైతి కౌంతేయ" అని భగవానుడు చెప్పిన విధముగా వారి వారి కర్మానుసారము మనుష్య గంధర్వ పశుపక్ష్యాది శరీరములలో జీవాత్మ ప్రవేశించు ననుట ద్వైతాద్వైతాది సర్వాస్తిక మత సంప్రతిపన్నమేగదా: "దేహాత్మ ప్రత్యయో యద్వత్ప్రమాణత్వేనకల్పితః లౌకికం తద్వదేవేదం ప్రమాణంత్వాత్మ నిశ్చయాత్" అని శ్రీ శాంకరచతుస్సూత్రీయ భాష్యాంతమున చెప్పినట్లు ఏ దేహమున నేజీవుడు ఆత్మభ్రాంతిలో నుండునో, ఆ భ్రాంతిని తొలగించుటకే ఆయా దేహములకు విహితములైన స్నానసంధ్య జపతపః పూజాదులుచేయవలెనని "అద్వైత సంప్రదాయ సిద్ధాంతమగుటచే" తులసీదళములతో, చంపకములతో శ్రీ త్యాగరాజ స్వామి శ్రీరాము నర్చించుట అద్వైత సిద్ధాంతమునందలి ప్రథమ కక్ష్యయగు "ప్రతీకోపాసనలో" చేరును.

ప్రతీకోపాసనమునకు పై కక్ష్య "అహంగ్రహోపాసనము లేక ప్రణవనాద బ్రహ్మోపాసనము. ఈ కక్ష్య యందుగూడ త్యాగరాజస్వామి వారు తీర్ణులై" జీవ బ్రహ్మైక్య జ్ఞానకక్ష్యలోగూడ కృతకృత్యులైరి.

అద్వైత సిద్ధాంతమునందలి మధ్యమకక్ష్యలోని "అహంగ్రహోపాసనానుభూతిని శ్రీ త్యాగరాజస్వామి యీ విధముగ వ్యక్తీకరించిరి.

"పరిపాలయ పరిపాలయ పరిపాలయ రఘునాధ
తనువే నీకనువైన సదనమౌరా రఘునాధ
స్థిర చిత్తము వరచామీకర పీఠము రఘునాధ
సుపదధ్యానము సురగంగాజలమౌరా రఘునాధ
ఇభపాలక యభిమానము శుభచేలము రఘునాధ
ఘనకీర్తిని బల్కే వాసన గంధము రఘునాధ
హరినామ స్మరణంబులు విరులౌరా రఘునాధ
తొలిదుష్కృతి ఫలమెల్ల గుగ్గులు ధూపము రఘునాధ
నీ పదభక్తే ప్రొద్దును దీపంబగు రఘునాధ
నేఁజేయు సుపూజాఫలము భోజనమవు రఘునాధ

నిను జూచుటె ఘనదీపారాధనమౌరా రఘునాధ
ఎడబాయని నా యెడగల్గు సుఖము విడెమౌరా రఘునాధ
పూజా విధి నైజ త్యాగరాజకృతము రఘునాధ

ఇట్టి అంతరమగు సగుణ అహంగ్రహోపాసనము నిర్గుణబ్రహ్మాత్మ సాక్షాత్కారజనకమగునను విషయము

"నిర్విశేషం పరంబ్రహ్మ సాక్షాత్కర్తు మనీశ్వరాః
యేమందాస్తేను కంప్యంతే సవిశేష నిరూపణైః
వశీకృతేమనస్యేషాం సగుణబ్రహ్మ శీలనాత్
తదేవావిర్భ వేత్సాక్షాదపేతో పాధికల్పనమ్"[1]

అనువాక్యముల వలన స్పష్టమగుచున్నది. కనుక ఇట్టి సగుణబ్రహ్మ అహంగ్రహోపాసనము నిర్గుణ బ్రహ్మాత్మ సాక్షాత్కారసాధనమని యాద్వైత సిద్ధాంత సంసిద్ధమైయున్నది.

ఇక సప్తస్వర ప్రణవనాదాను సంధానముగూడను జీవబ్రహ్మైక్యానుభూతి ఫలకమే. ఈ విషయమునుగూడ శ్రీ త్యాగరాజస్వామివారు

"ప్రాణా నల సంయోగము వల్ల
ప్రణవ నాదము సప్తస్వరములై బరగ[2]

అని సప్తస్వర ప్రణవనాదానుసంధానము జీవబ్రహ్మైక్యాను భూతిని కలిగించునని చెప్పిరి ఈ విషయము (43 నారద పరివ్రాజకోపనిషత్‌లో "అథ ఓం కదాచిత్ పరివ్రాజకాభరణో నారదః పుణ్యతీర్థాని తీర్థీకుర్వన్ నైమిశారణ్యం పుణ్య స్థలం అవలోక్య స-రి-గ-మ-ప-ద-ని సంజ్ఞైః వైరాగ్య బోధకైః స్వర విశేషైః- హరికథాకలాపైః నరమృగ కింపురుషామరకిన్నరాప్స రోగణాన్ సంమోహయన్- ఆగతం భగవద్భక్తం - నారదం అవలోక్య - శౌనకాది మహర్షయః - భోభగవన్

1. శ్రీ శాంకరబ్రహ్మసూత్ర భాష్య - భామతీకల్పతరువు
2. మోక్షము కలదా

బ్రహ్మ పుత్రకథం ముక్త్యుపాయో అస్మాకం ఇత్యూచుః" అని నిరూపితమైనది. తత్సంగ్రహ తాత్పర్య మెద్దియనగా బ్రహ్మరంధ్రస్థితసహస్రారమునుండి గుదస్థాన స్థిత మూలాధారమువరకు చిదేకరసాత్మక పరమాత్మయే అధ్యారూప ప్రక్రియతో దిగజారి చిత్తోపాధిక జీవుడుగానుండుట సంభవించును. అదియే సప్తస్వరాత్మక ప్రణవనాదాత్మస్థితి. అపుడు స-రి-గ-మ-ప-ధ-ని అను సంకేత నామములతో క్రమముగా సహస్రారము నుండి సుషుమ్నాద్వారా ఆజ్ఞ, విశుద్ధ - అనాహత మణి పూరక - స్వాధిష్ఠానములలో క్రమముగా-

"సమ్మోహాత్ రిక్తవిజ్ఞానః గంతామదవశః పతేత్
ధర్మచ్యుతోధనిరయీ సంసారాబ్ధౌనిమజ్జతి"

(ఇది అధ్యాహారము-సంసార స్థితిబంధము)

అనగా 1. స - సమ్మోహితాత్మ, 2. రి - రిక్తాత్మ, 3. గ - గన్తా, 4. మ - మదన మోహితః, 5. ప - పతితః, 6. ధ - ధర్మదూరః, 7. ని - నిరయి- ఈ విధముగా బ్రహ్మస్వరూపుడగు తాను అధోగతి దృష్టితో సంసారములో చేరును. తిరిగి సుకృతాతిశయమున, ఈశ్వరానుగ్రహమున, సద్గురు కటాక్షముచే మూలాధారము నుండి ప్రబుద్ధుడై స్వాధిష్ఠాన - మణిపూరక అనాహత - విశుద్ధ - ఆజ్ఞా చక్రము లను భేదించుకొని సుషుమ్నాద్వారా సహస్రారములో అఖండ చిదాత్మ స్వరూపుడై వెలుగొందును. అయ్యదియే జీవబ్రహ్మైక్య లక్షణాద్వైతముక్తియగును. తిరిగి ఆసప్త స్వరాత్మకప్రణవవాదమే అవరోహణ సాధనమగును. అది యెట్లన 1. స - సత్యాన్వేషీ, 2. ని - నిర్విణ్ణాత్మా, 3. ధ - ధర్మాత్మ, 4. ప - పరమాత్మ పరః, 5. మ - మహాత్మశీలీ, 6. గ - గచ్ఛన్వై, 7. రి - రిక్తావిద్యః స - సత్యమాభజేత్.[1] ఈ విధముగా మూలాధారమున నిద్రాణచిత్తస్వరూపుడగు జీవుడు సుకృతాతిశయమున ఈశ్వరానుగ్రహమున, గురుకటాక్షమున, కుండలినీ శక్తిప్రబోధమున మూలాధారాది ఆజ్ఞాచక్రాంతములందు, ప్రణవసప్తస్వర నాదము లతో భేదించి సహస్రారమందద్వితీయాఖండ బ్రహ్మాత్మానుభూతిని పొందును.

1. సత్యమన్విష్య నిర్విణ్ణః, ధర్మాత్మాపరతత్పరః
మహాత్మైవాత్ గచ్ఛేర్ద్వారః రిక్తమాయః సదాప్తవాన్.
(అయమపవాదః - మోక్షమార్గము)

ఇదియే కైవల్యముక్తి. ఈ విషయముల నన్నిటిని "ప్రణవనాదము సప్తస్వరములై పరగె" అని చెప్పిన శ్రీ త్యాగరాజస్వామి పైన చెప్పిన నారదపరివ్రాజకోపనిషదుక్తనాదబ్రహ్మోపాసకుడగు అద్వైతియే యగుట నిరాక్షేపము.

పైనుదహరించిన ప్రతీకోపాసనముగాని, అహంగ్రహోపాసనముగాని, ప్రణవ సప్తస్వర నాదోపాసనముగాని - లోకాంతర ప్రాప్య విష్ణుసాలోక్య సారూప్య సామీప్యముక్తులే పరమార్థములని చెప్పెడి ద్వైతసిద్ధాంతమునగూడనుండెను గదా! అట్టిచో త్యాగరాజస్వామి అద్వైతియగుటయెట్లు సిద్ధించునని కొందరాశంకింపవచ్చును.

శ్రీ త్యాగరాజస్వామివారు "శివుడనో, మాధవుడనో, కమలభవుడనో పరబ్రహ్మమనో"[1] అని ఒకే పరబ్రహ్మము త్రిగుణాత్మక మాయోపాధి భేదములవలన త్రిమూర్తులుగా వెలుగొందు పరమాత్మయే త్యాగరాజనుతుడగు రాముడని స్పష్టమగుచున్నది. పొడిమాటలు కావివి. శ్రీ త్యాగరాజనుతుడగు శ్రీరాముడు సిద్ధలోకాంతర్మహర్వ్యాపి కాద్వితీయా ఖండాత్మా రాముడె. కనుక అద్వైతానుభూతిగల శ్రీ త్యాగరాజస్వామి జీవన్ముక్తుడే. "న తస్య ప్రాణాఉత్క్రామంతి" ఇత్యాదిశ్రుతి ప్రామాణ్యముననుసరించి యా మహాత్మునకు ప్రాణోత్క్రాంతియేలేదు. కనుక లోకాంతరప్రాప్యసాలోక్యాదిముక్తి కథలు శ్రీ త్యాగరాజస్వామికి చెందనేరవు.

మఱియు ఒకే పరమాత్మ త్రిగుణాత్మక మాయోపాధివశమున త్రిమూర్తులుగావెలుగొందుననుటలో "ఏకామూర్తి ర్భిభిదేత్రిధాసా" అను మహాకవి కాళిదాస సూక్తికిని, పై త్యాగరాజస్వామి సూక్తికిని మూలప్రమాణము.

> "అథయోహ ఖలు వా వాస్యరాజసో ౨ం శోసౌస యోయం బ్రహ్మేథయో హ ఖలు వా వాస్య తామసో ౨ం
> శోసౌసయోయం
> రుద్రో౨థ యోహ ఖలు వావాస్యసాత్త్వికోంశోసౌస ఏవం విష్ణుః"[2]

1. ఎవరని నిర్ణయించిరిరా - నిన్నెట్లా రాధించిరిరా - నరవరు
2. 24 మైత్రాయణ్యుపనిషత్

కనుక త్యాగరాజనుతుడగు శ్రీరాముడు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర మూల భూతాఖండా ద్వైత పరంధాముడె యగుగాని దాశరధి యగు శ్రీరాముడుగాడు. అట్టి దాశరధియగు శ్రీరాముడుగా వెలుగొందినది గూడ విష్ణుమూలభూత పరంధాముడగు అద్వితీయాఖండ సర్వాత్మ స్వరూపుడగు శ్రీరాముడేనని తెలియనగును. ఇంతియె గాక

"శివ మంత్రమునకు 'మా' జీవము మా
ధవ మంత్రమునకు 'రా' జీవము ఈ
వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద
వితరణగుణ త్యాగరాజనుతుని"[1]

అనెడి త్యాగరాజ సూక్తిలోనెంతటి హరిహరాభేదాద్వైతార్థ గాంభీర్యము గలదో విచారించిన త్యాగరాజనుతుడగు రాముడెవరో వ్యక్తమగును. శివమంత్రమనగా "నమశ్శివాయ" అనెడి శివపంచాక్షరీమంత్రము. మాధవమంత్రమనగా "ఓం నమో నారాయణాయ" అనెడి నారాయణాష్టాక్షరీమంత్రము. ఈ రెండు మంత్రముల యందలి జీవాక్షరములు మరా (రామ) యని త్యాగరాజు వక్కాణ. కేశవ (మాధవ) మంత్రములో "రా" అను నక్షరమును తొలగించినచో ఆ మంత్రమునకు జీవకళ యుండదు. ఓం నమోనాయనాయ - అయనాయ = ముక్తికి న = సాధకము కాజాలదు. శివమంత్రమున "మ" అనుదానిని తొలగించినచో ఆ మంత్రమునకు జీవకళయుండదు. న - శివాయ = శివాయ = ముక్తికి న = సాధనము కాజాలదు. అపుడా రెండు మంత్రముల సారమే "రామ" అయినది. శివకేశవ మంత్ర సారము "రామ" కనుక శివకేశవులకు మూలాసారాత్మకాద్వైతాత్మా రాముడే "రామ" శబ్దార్థమని శ్రీ త్యాగరాజస్వామి కీర్తించుటయే త్యాగయ్య "అద్వైతి" యని సిద్ధాంతము.

హరి హర మంత్రసారమే "రామ" మంత్రమను రహస్యార్థము త్యాగరాజ కల్పిత చమత్కారార్థమని భ్రమచెందకూడదు. ఈ యర్థము-

"నారాయణా షారేక్షరేచ శివపంచాక్షరే తథా
సార్థకార్ణద్వయం 'రామో' రమంతేయత్రయోగినః"[2]

1. ఎవరని నిర్ణయించిరిరా.
2. 54 రామరహస్యోపనిషత్తు.

పై ఉపనిషద్వాక్యములోని "యోగినః" అను పదమునకు నిఖిలవేద ప్రతిపాదిత కర్మయోగము—అనగా ప్రతీకోపాసనాదికము, భక్తియోగము - అనగా అహంగ్రహోపాసనాదులు జ్ఞానయోగ జీవబ్రహ్మైక్యానుభూత్యాత్మక జ్ఞానయోగము క్రమముగ నీమూడింటి యందు తీర్ణులైన యోగులు. జీవన్ముక్తి పై మూడు యోగములకవలంబనమైనపుడు ప్రత్యగభిన్న పరంధామునియందు "రామ" శబ్దముతో రమించుచుండెదనని చెప్పిన రామరహస్యోపనిషదర్థమునే శ్రీ త్యాగరాజస్వామి వ్యక్తముచేసెనని స్పష్టమగుచున్నది.

త్రివిధ యోగములలో కృతార్థుడైన హనుమంతుడు గూడ శ్రీరామసేవ—శ్రీరామభక్తి మార్గములలో ననదృశయోగియగుటయే గాక శ్రీరామ తత్త్వముతో తానైక్యమొందెనని

"దేహబుద్ధ్యాతు దాసోహం-జీవబుద్ధ్యాత్వ దంశకః
ఆత్మబుద్ధ్యాత్వ మేవాహమితిమే నిశ్చితామతిః

అను దానివలన తెలియుచున్నది.

కాశీక్షేత్రమున చండాలవేషమునుపసంహరించుకొని ధూర్జటి రూపమున దర్శనమిచ్చిన పరశివమూర్తిని పరశివావతారస్వరూపులగు శ్రీశంకరభగవత్పూజ్యపాదాచార్యులవారుగూడ హనుమంతుడు పలికిన విధముగనేపలికినారు.

దాసస్తేఽహం దేహదృష్ట్యాస్మిశంభో, జాతస్తేఽంశో జీవదృష్ట్యాత్రిదృష్టే
సర్వస్యాత్మన్నాత్మదృష్ట్యాత్వమేవేత్యేవంమే ధీర్నిశ్చితా సర్వశాస్త్రైః[1]
(శంకర విజయము షష్ఠసర్గః)

మఱియు "తత్త్వమస్యాది" మహావాక్య సమధిగమ్యమగు జీవబ్రహ్మైక్యానుభూత్యాత్మక జ్ఞానయోగమునగూడ శ్రీ త్యాగరాజస్వామి కృతకృత్యులైరనుటకు - శ్రీవారి కీర్తనయే ప్రబలసాక్ష్యము.

---

1. మాధవవిద్యారణ్య శంకరదిగ్విజయము,

"తత్త్వమసి యనే వాక్యార్థము రామనీవను పర"[1] జీవాత్మ పరమాత్మ వాచకములగు "త్వం" పద "తత్" పదములకు అఖండలక్ష్యార్థము - రాముడు. జీవేశ్వరుల కఖండాద్వైత చైతన్యమే శ్రీరామతత్త్వమని అఖండ జీవ బ్రహ్మైక్యా ద్వైతమును బోధించెను.

"కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః
కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవ శిష్యతే"[2]

ఇచట కారణోపాధియనగా మహామాయాత్మకమగు సౌషుప్తి కావరణశక్తియే కార్యోపాధి యనగా జాగ్రత్స్వప్నములలో స్థూలసూక్ష్మ శరీరములే - అట్లగుట వలన "తత్" పద వాచ్యమగు సౌషుప్తిక తమస్సునకు "త్వం" పదవాచ్యమగు స్థూలసూక్ష్మదేహద్వయమునకు సాక్షియగు చైతన్యమొక్కటియే. మఠము గొప్ప దియు ఘటము కొద్దిదియునైనను ఆరెండిటిలో వెలుగొందు ఆకాశము అఖండాకాశమే యెట్లగుచున్నదో అట్లే అనంతకోటి బ్రహ్మాండ జనకమగు ఈశ్వరోపాధిభూత మహామాయ చాల గొప్పదియైనను, స్థూలసూక్ష్మ శరీర పిండాడాత్మక జీవోపాధి అత్యల్పమేయైనను తదుభయోపాధిసాక్షియగు అఖండచైతన్యాత్మానుభూతి పూర్ణ బోధ స్వరూపమని శుకరహస్యోపనిషత్ప్రతిపాదితమైన "తత్త్వమసి" యను వర్థ మును పేర్కొనిన శ్రీ త్యాగరాజస్వామి యద్వైతియే యనుటసత్యము. ఇట్లే "చీమలో బ్రహ్మలో శివకేశవాదులలో ప్రేమమీర వెలుగుచుండు సీతారామ"[3] అనుట వలన ఈ సీతారాముడు జానకీపతియగు దాశరథిగా కనిపించుచున్నాడేగాని అసలు పిపీలికాది - బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులలో వెలుగొందు సచ్చిదానందరూప పర మాత్మయేనని చెప్పకతప్పదు. అపుడు త్యాగరాజోక్తమగు "సీతా" "రామ" పదములలో "సీతా" పదమునకు 45 సీతోపనిషదుక్తత్రిగుణాత్మక మూల ప్రకృతియే అర్థమనియు, "రామ" పదమునకు 54 - రామరహస్యోపనిషదుక్త నిరుక్తిమూల ప్రకృత్యధిష్ఠాన సచ్చిదానంద స్వరూపాత్మా రాముడెయని చెప్పకతప్పదు. ఇట్టి "సీతారాములను" సంకీర్తనమొనర్చిన త్యాగరాజస్వామి అద్వైతికాదనుటెట్లు?

---

1. తత్త్వమెరుగతరమా!
2. 35 - శుకరహస్యోపనిషత్
3. రామ నన్ను బ్రోవరా

ఇట్లే "సృష్టి, పుష్టి, నష్టి చేయుననుచు త్రిమూర్తుల కొసగి సద్భక్త మనో భీష్టప్రదుడై బరగె శ్రీరామ చంద్రుని"1 - త్రిమూర్తుల సృష్టి స్థితి లయ కృత్యములు నికృష్టములగుటచే ఆ త్రిమూర్తులకు స్వరూపియగు అఖండ సచ్చిదానందాద్వైత పరబ్రహ్మమే తనకు సేవ్యుడని చెప్పిన త్యాగరాజస్వామి ద్వైతి యెట్లగును ? మఱియు "గీతాద్యఖిలోపనిషత్సారభూత జీవన్ముక్తుడగుటకు"2 "ఇహైవతైర్జితస్సర్గో యేషాం సామ్యేస్థితంమనః"3 బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి నతస్యప్రాణా ఉత్క్రామంతి. ఇత్యాది గీతోపనిషద్వాక్య గోచరమగు బ్రహ్మాత్మ సాక్షాత్కార కృత జీవన్ముక్తుడగు వానికి ప్రాణోత్క్రాంతియే లేదు. కనుక మరణానంతరము లోకాంతర ప్రాప్యసాలోక్యాది ముక్తియేముక్తిగాని జీవన్ముక్తియే లేని ద్వైతి త్యాగరాజస్వామి యెట్లగును ? కనుక పై జెప్పిన త్యాగరాజ కృతులను పరిశీలించినచో శ్రీ త్యాగరాజస్వామి "వైదిక ఔపనిషదసంసిద్ధ కర్మభక్తిజ్ఞాన కాండత్రయ మార్గమున నిష్ణాతుడగుటచే త్యాగరాజస్వామి అద్వైతి అని చెప్పుట త్రిసత్యము.

భగవంతుడు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ"సర్వంఖల్విదం ఇత్యాదిబ్రహ్మ శ్రుతి ప్రతిపాద్య రీతినద్వైతబ్రహ్మ స్వరూపుడను శంకర భాష్యోక్తులను ప్రతిబింబిప జేసిన త్యాగయ్యకృతులు 1. ఉండేది రాముడొకడు-

ఈ కృతియొక్క తాత్పర్యము :— త్రికాలాబాధ్యంబగు సద్వస్తువుల రామ శబ్దోపలక్షితుండగు పరమాత్మయే. అట్టిడు చండమార్తాండ మధ్య మండలమున నిండియుండు హిరణ్యగర్భాఖ్య పురుషుడు గాయత్రీ మంత్రోపలక్షితుడు. ఆ పరమాత్మ తామసాదిగుణ రహితుడు.అనగా నిర్గుణుడు. ధర్మాత్ముడు అనగా శాస్త్రయోని జగజ్జన్మాది కారణుండు. సర్వసముడు. అనగా సర్వాంతర్యామియై సర్వజ్ఞ రూపమున భాసించువాడు, త్యాగరాజ చిత్తహితుడు అనగా భక్తుల మనస్సులందు సర్వదా ప్రతిబింబించువాడు జగమునంత నిండియుండినవాడు ఒక్కడే"

2. మరుగేలరా, రాముడు చరాచరస్వరూపుడు. పరాత్పరుడు. సూర్య సుధాకరలోచనుడు. అనగా సగుణ సవిశేష నిర్గుణ నిర్విశేషచిన్మాత్ర స్వరూపుడు. అట్టిరాముని అంతరంగమున వెదకివెదకి అన్నియు రాముడేనని తెలిసికొన్నారట త్యాగయ్యగారు. ఇంకను అద్వైత సిద్ధాంతమును పట్టియిచ్చు త్యాగయ్య కృతులు— 1) ఏదారి సంచరింతురా; 2) ద్వైతము సుఖమా-అద్వైతము సుఖమా మున్నగునవి.

1. మనసా శ్రీరామచంద్రుని యేమరకే
2. సీతావర సంగీతజ్ఞానము ధాతవ్రాయవలెరా!
3. భగవద్గీత కర్మ సన్న్యాస యోగము. 5 - 19

# త్యాగరాజు - రామదర్శనము

స్తవ్యః కోపి మహాన్ రఘూద్వహకథా పీయూషవర్షిఘనో
రామబ్రహ్మ మహామహీధరభవస్స త్యాగరాజాహ్వయః
బీజం భర్గమయూర తాణ్డవ విధేర్వీణా ధనుష్యల్లస
త్తన్త్రీరిఙ్గణ విద్యుతాసహకృతో గానధ్వనిర్యస్యవై.

(వాలాజాపేట వేంకటరమణ భాగవతులు)

భగవంతుడు గానలోలుడు. గానము మోక్షార్థము. సంగీతజ్ఞానవిహీనులకు మోక్షము లేదని శ్రీ త్యాగరాజస్వామివారి సిద్ధాంతము.

సారమతి - దేశాది

మోక్షముకలదా భువిలో జీవన్ముక్తులు కానివారలకు ॥మో॥
సాక్షాత్కార నీ సద్భక్తి సంగీతజ్ఞాన విహీనులకు ॥మో॥

ఈ కీర్తనకు ఆధారభూతమైన శ్లోకము యాజ్ఞవల్క్యస్మృతియందు కలదు.

"వీణా వాదనతత్త్వజ్ఞః శ్రుతిజాతి విశారదః
తాళజ్ఞ శ్చాప్రయాసేన మోక్షమార్గం నిగచ్ఛతి"

సంగీతమును మోక్షవిద్యగా భావించి శ్రీ త్యాగరాజ స్వామివారు జీవిత గమ్యమును చేరుకొనుటకు సంగీతము నుపాధేయముగ స్వీకరించి ఉపాసించినారు "శ్రీపప్రియ సంగీతోపాసన జేయవే ఓ మనసా" అని మనసును సంబోధించి చెప్పికొనినారు. శ్రీ త్యాగరాజస్వామివారు తరించినద్ది సంగీతము వలననే. తనకురామసాక్షాత్కార భాగ్యము లభించినదియు నాదోపాసనద్వారా అనియే త్యాగయ్యగారి దృఢ విశ్వాసము.

ఎట్లా దొరకితివో రామ తనకెట్లా
చుట్లాంగడియదోవకు నాదుపట్లాభిమానము లేకుండగ ॥ఎట్లా॥

పాదమహిమో పెద్దలాశీర్వాదబలమొ సుస్వరపు
నాదఫలమొ త్యాగరాజఖేదహర శ్రీనాధ తనకెట్లా.

శ్రీ త్యాగరాజస్వామి రామభక్తి సామ్రాజ్య పట్టభద్రుడు. ఆయన యిష్ట దైవము శ్రీరామచంద్రుడు. శ్రీరాముడు "సంగీతలోలుడని, గానలోలుడని, బహుధా త్యాగయ్య గారు కీర్తించినారు. వాల్మీకమునగూడ "గాంధర్వేషుచభువిశ్రేష్ఠః బభూవభరతాగ్రజః" అని శ్రీరాముడు గాంధర్వమున (సంగీతమున) గొప్పవాడని చెప్పబడినది. త్యాగయ్యగారు తన యిష్ట దైవమగు శ్రీరామచంద్రుని' నాద స్వరూపునిగ" భావించినారు.

నాదసుధా రసంబిలను నరాకృతాయె మనసా ॥నాద॥
వేద పురాణాగమ శాస్త్రాదుల కాధారమౌ ॥నాద॥
స్వరములారొక ఘంటలు వరరాగము కోదండము
దురనయదేశ్యము త్రిగుణము నిరతగతి శరమురా
సరససంగతి సందర్భముగల గిరములురా
ధరభజనే భాగ్యమురా త్యాగరాజు సేవించు ॥నాద॥

నాదసుధారసము (సంగీతము) నరాకృతి (రామాకృతి) చెందినది. రాముని కోదండము రాగమయినది, సప్తస్వరములు కోదండమునకున్న ఏడుగంటలయినవి. రాముని త్రిగుణములు లేక కోదండమునకున్న త్రిగుణములు (మూడుత్రాళ్ళు) సంగీతమునకున్న దుర, నయ, దేశ్యమార్గములయినవి. కోదండము నుండి వెలు వడు శరములు రాగముయొక్క నిరతగమనముగా రూపొందినవి" అని వివరించి నారు. త్యాగయ్యగారింట రామపీఠముండెడిది. త్యాగయ్య తండ్రి రామబ్రహ్మముగారు రామాయణపౌరాణికులు. నిరతము ఇంటనున్న ఏకపీఠ విగ్రహమునకు విశేష ముగ నర్చనలు సలుపుచుండెడివారు రామబ్రహ్మము. త్యాగయ్యకు రామభక్తి రామాయణపఠనాసక్తి తండ్రి రామబ్రహ్మముగారి నుండియే సంక్రమించినవి.

శ్రీరామకృష్ణానందయతీంద్రులవలన రామషడక్షరీమంత్రోపదేశమును పొందిరాముని కంటె దైవములేదని, "రామ ఏవదైవతం రఘుకులతిలకోమే" - "ఉండేది రాముడొకడు ఊరక చెడిపోకుమనసా" అని చాటినారు. "రామనామము మేలు మేలని" భావించి మంత్రోపదేశమును పొందిననాటినుండి రామనామ జపమును ప్రారంభించినారు. సకలకల్యాణగుణ సంపన్నుడగు రామచంద్రుని గుణానుకీర్తనము, రామనామజపము, రామాయణపారాయణ నిత్యకృత్యములైనవి త్యాగయ్యగారికి. రామకథను కృతిరూపమున గానము చేయవలయునన్న సంకల్పము కలిగినది. సంగీతమున సందేహములెన్నియో పొడసూపినవి. సందేహములు తొలగుటకు గుర్వనుగ్రహము కొరకు పరితపించినారు. రామకృష్ణానంద యతీంద్రులవలన నారద మంత్రోపదేశమును పొంది, నారదమంత్రజపమునకు కడంగి అచిరకాలముననే నారదానుగ్రహమున "స్వరార్ణవము", నారదీయము" అను రెండు సంగీతశాస్త్ర రహస్యములను తెలియజేయు గ్రంథములను పొందినారు. ఆ రెండు గ్రంథముల పరిశీలనమున త్యాగయ్యగారికి సంగీతశాస్త్రమునందున్న సందేహములు పటాపంచలైనవి.

రామాయణ కృతిరచనకు సంకల్పించి రామానుగ్రహమున్నగాని రామాయణ కృతి రచన పూర్తికాదని శ్రీరాముని వేడుకొన్నారు త్యాగయ్యగారు. శ్రీరామచంద్రుడు త్యాగయ్యగారి చిత్తశుద్ధిని పరీక్షింపనెంచి "త్యాగయా। ఈవరకే ఎందరో రామకథను రచించిరి కదా। మరల నీవెందుకు రామకథను రచించుట॥ "మచ్ఛందాదేవ బ్రహ్మన్ ప్రవృత్తేయం సరస్వతీ" రాఘవస్య చరితం సర్వంకురు ఋషిసత్తమ" అని బ్రహ్మ వలన వరముపొంది రామాయణ రచనకు కడంగి వాల్మీకి శ్రీమద్రామాయణమును రచించినారు. "యావత్‌స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి" అని బ్రహ్మ వాల్మీకిమహర్షికి వరమును ప్రసాదించినారు. కాన నీవు రామకథను వ్రాయవలసిన అవసరములేదేమో" అని యనినారట. శ్రీరాముని పలుకులకు త్యాగయ్యగారు బాధపడి, రామకథను రచింపజాలని తన జన్మము వ్యర్థమని తలంచి బాధాతప్తహృదయముతో శ్రీరామునకిట్లు విన్నవించుకొనినారు.

ఏపనికో జన్మించితినని నీవెంచవలదు శ్రీరామ నేనేపనికో॥
శ్రీపతి శ్రీరామచంద్ర నీ చిత్తానికే తెలియదా నేనేపనికో॥

వాల్మీకాది మునులు నరులు నిన్ను
వర్ణించిన నా యాస దీరునా
మేల్మియై యుండు సద్భక్తులు
మెచ్చుదురే త్యాగరాజనుత నేనేపనికో॥

త్యాగయ్య విన్నపమును విని శ్రీరామచంద్రుడు త్యాగయా ! రామకథను రచించి నీ రచనతో నన్ను మెప్పించగలవా? అని ప్రశ్నింప - త్యాగయ్య దుఃఖోద్వేగముతో

మానములేదా తనవాడని యభిమానము॥
కానమురా నీవలెనిర్మోహిని
గానరుచి తెలియు కుశలవజనక ॥మా॥

అని పలికి అంతలో తనను తాను సంబాళించుకొని

"సొగసుగా మృదంగతాళము జతగూర్చినిను
జొక్కజేయు ధీరుడెవ్వడో ॥సొ॥
నిగమ శిరోర్థముఃగల్గిన నిజవాక్కులతో స్వరశుద్ధముతో ॥సొ॥
యతివిశ్రమ సద్భక్తివిరతి ద్రాక్షారసనవరస
యుతకృతిచే భజియించే యుక్తి త్యాగరాజుని తరమా
శ్రీరామా ॥సొగసుగా॥

సమాధానము చెప్పినారు. దయాశరధి దాశరధి మనసు కరిగినది. రామకథను రచింపుము, తప్పక నా యనుగ్రహమును బడయగలవు" అని శ్రీరామచంద్రుడు త్యాగయ్యకు అభయదానమొసంగినారు. త్యాగయ్యగారి ఆనందమునకు పట్టపగ్గములు లేవు. రామాయణకృతి రచనకు శ్రీకారము చుట్టి రామకథాపై శిష్ట్యము నిట్లు కొనియాడినారు.

రామకథా సుధారసపానమొక రాజ్యము చేసునే ॥రా॥
భామామణీ జానకిసౌమిత్రి భరతాదులతో
భూమినివెలయు ॥రా॥

ధర్మాద్యఖిల ఫలదమె మనసా - ధైర్యానంద
సౌఖ్యనికేతనమే
కర్మబంధ జ్వలనాబ్ధినావమే కలిహరమే
త్యాగరాజనుతుడగు ॥రా॥

రామకథను రచించని కవులులేరు. "కావ్యవస్తువులెల్లతూకమ్మువైన చాల మొగ్గగు మా రామచంద్రుకథలె" అని యొకకవి అభిభాషణము.

మధురము రామాయణకథ
మధురము వాల్మీకివాక్కు మఱియందులకే
బుధులందరు రామాయణ
సుధాలహరియనిరి దీనినిశ్రుతి సుభగముగాన్
రామన్నవంటి దైవము
రామాయణరచనవంటిరసవత్కృతియున్
సామీరివంటి భక్తుడు
సీమంతిని సీతవంటి చెలువయుగలరే"

అని మా గురుదేవులు ఆచార్య శ్రీ యస్వీ జోగారావుగారు రామకథా వైభవమును కొనియాడినారు.

శ్రీరామచంద్రుడు ధీరోదాత్తనాయకుడు; పుణ్యగుణాభిరాముడు. అట్టివాని గుణానుకీర్తనము ముక్తిప్రదమని భావించి కవిపుంగవులు తమశక్తిమేరకు రామకథను రచించినవారైరి. పదమూడవ శతాబ్దియందు తిక్కనకవీంద్రులు తమనిర్వచనోత్తరరామాయణమున

"ఎత్తఱినైనను ధీరోదాత్త నృ
పోత్తముడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మౌట
నుత్తర రామాయణోక్తి యుక్తుడనైతిన్"

కంకంటిపాపరాజు ఉత్తరరామాయణమును రచించుచు "రాఘవేశ్వరుచారిత్రము నెందరెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే"అని రామకథావైశిష్ట్యమును కొనియాడినారు నిత్యనూతనమైనది రామకథ.

రామకథను ఇందరు కవులిన్ని రకములుగా రచించుట చర్వితచర్వణము, పిష్ట పేషణము గాదా అను ప్రశ్నించువారలకు మురారి "అనర్ఘరాఘవమున" చక్కగ సమాధానమిచ్చినారు.

యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్యచరితమ్
గుణైరేతావద్భిర్జగతి పునరన్యోజయతికః
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మణః కథముపకరిష్యన్తికవయః"

శ్రీరామునుత్తమగుణములపట్ల వాల్మీకియేకాక తదనంతర కవులును విశేషముగ నాకర్షితులైరి. కావుననే జయదేవుడు తన ప్రసన్నరాఘవమున

"స్వసూక్తీనాంపాత్రం రఘుతిలకమేకం కలయతాం
కవీనాంకోదోషోస్సతు గుణగణానా మవగుణః
యదేతైర్నిశ్శేషై రపరగుణలబ్ధైరినజగ
త్యసావేకశ్చక్రే సతతసుఖసంవాసవసతిః"

అని శ్రీరాముని గుణములను ప్రశంసించినారు. "రామాదివద్వర్తితవ్యమ్ న రావణాది వత్" అని యాలంకారికులు లక్షణ నిర్ణయమును దీనినిబట్టియే గావించిరి.

ఆధునిక కవిసమ్రాట్టులు, జ్ఞానపీఠపురస్కార గ్రహీతలునగు శ్రీ విశ్వనాధ రామాయణ కల్ప వృక్షమును వ్రాయుచు "మరల నిదేల రామాయణ"మని తన్ను ప్రశ్నించువారలకు - రామకధను వ్రాయుటలో గల తన యుద్దేశమును హృద్యముగ చెప్పినారు.

మరల నిదేల రామాయణంబన్న చో
నీ ప్రపంచకమెల్ల నెల్లవేళ

దినుచున్న యన్నమే తినుచున్నదినాళ్ళు
తన రుచి బ్రదుకులు తనవిగాన
చేసిన సంసారమే చేయుచున్నది
తనదైన యనుభూతి తనదిగాన
తలచిన రామునే తలచెదనేనును
నా భక్తిరచనలు నావిగాన
కవిప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశములయందు దొంబదియైనపాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబునరసము వేయి
రెట్లు గొప్ప నవకథాదృతిని మించి

"నిరంతర రసోద్గారగర్భాః సౌందర్యనిర్భరాః
గిరః కవీనాం జీవంతి న కథామాత్రమాశ్రితాః"

అనిగదా కుంతకుని వక్కాణ. కుంతకుడు చెప్పిన యభిప్రాయమునే శ్రీ విశ్వనాధ వారు ఆమ్రేడించినారు.

రామకథ సర్వరససమ్మిశ్రితము. "శృంగారరసాద్యఖిలసారపూరితమైనది రామకధయని అట్టి రామకథానందాబ్ధియుత సంగీతశాస్త్ర జ్ఞానము సారూప్యసౌఖ్యద మని"నారు త్యాగయ్య.

శ్రీ మద్రామాయణము అభయవాద్దాన రత్నమాల. శ్రీ మద్రామాయణము గొప్ప ధర్మశాస్త్రము.

శ్రీత్యాగరాజస్వామి "రామ కథాసుధారసపానమొక రాజ్యము సేయునె మనసా" అను కీర్తనలో "ధర్మాద్యఖిల పాలనమె మనసా" అనినారు. రాజ ధర్మము, ప్రజాధర్మము, పతిధర్మము, సతీ ధర్మము, భ్రాతృ ధర్మము, పుత్రధర్మము, భృత్యధర్మము, మిత్రధర్మము మున్నగు ధర్మములన్నియు రామాయణమునందు రాశీభూతములై యున్నవి.

త్యాగయ్యగారు వాల్మీకి అపరావతారమని చెప్పుదురు. త్యాగయ్య ముఖ్య ష్యులలో నొకడగు శ్రీవాలాజాపేట వేంకటరమణభాగవతులు తమ గురుస్తుతిలో

'మృదుగిరావాల్మీకజన్మామునిః' అనినారు. తాను సంస్కృతమున రచించిన రామ
(థ అందరకు అర్థముగాదను నుద్దేశముతో భూలోకమున ''త్యాగరాజుగ''నవతరించి
కీయని తెలుగుభాషలో మధురాతి మధురమైన రామకథను కృతిరచన చేసినారు
వాల్మీకి అని చెప్పవచ్చును. రామాయణ రహస్యములనెన్నిటినో తమ కృతులలో
వొప్పించి రామాయణ రహస్యార్థ ప్రకాశకులైనారు శ్రీ త్యాగయ్య. తన యావ
దాస్తిని త్యాగయ్య కైంకర్యమునకై వ్రాసియిచ్చిన "గాన విద్యాసుందరి శ్రీమతి
బెంగుళూరు నాగరత్నమ్మ''గారు శ్రీ త్యాగరాజస్వామివారి అష్టోత్తర శతనామము
లను వ్రాయుచు ''రామాయణ రహస్యార్థ ప్రకాశకాయనమః'' అని త్యాగయ్యగారిని
కీర్తించినారు.

"చరితం రఘునాథస్యశతకోటి ప్రవిస్తరం
ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్"

అనిగదా వాల్మీకి అభిభాషణము. అపర వాల్మీకులైన త్యాగయ్యయు "గతమోహాశ్రిత
పాలాద్భుతసీతారమణా" అను కీర్తనలోని "శతకోటి చరితమానవ మదభేదక
దమన" అను చరణమున ("శతకోటి శ్లోకములుగల రామాయణమును చరిత్ర" గల
వాడు) పై శ్లోకభావమును వ్యక్తీకరించినారు.

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

శ్రీమద్రామాయణము వేదము. వేదోపబృంహణార్థాయ, వేదైశ్చసమ్మితమ్ అని వాల్మీకి
చెప్పియేయున్నారు. వేదవేద్యుడగు పరమ పురుషుడు దశరథాత్మజుడుగ నవతరించి
నారు. వేదము రామాయణరూపముగా వాల్మీకి మహర్షి వలన నావిర్భవించినది.

దీనిని బట్టి వేదవేద్యుడే శ్రీరాముడని, వేదతత్త్వజ్ఞుడే రామాయణకర్త
వాల్మీకియని, వేదార్థప్రకాశమే రామాయణమని తెలియుచున్నది. త్యాగయ్య "వేద
వేద్యేపరేపుంసి జాతే దశరథాత్మజే" అను శ్లోకపాదమునందలి భావమును (వేద
వేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడుగ నవతరించినారు) "ఎవరికై అవతార
మెత్తితివో" అను కీర్తనలో "వేదవర్ణనీయమౌ నామముతో" అను చరణమునందు
సూచించినారు. త్యాగయ్యగారు రామాయణ కథాఘట్టములను కీర్తనారూపమున
రచించుచు రామాయణ కావ్యకథానాయకుడైన శ్రీరాముని

"జగదానందకారక" అను నాటరాగ పంచరత్న కీర్తనలో "సక్రవిహృదాలయ" "సుకవి జనహృత్సదన 'అని' దాశరథే దయాశరథే అనుకోకిల ప్రియ రాగ కీర్తనమున 'కవీశ సుహృదయనివేశ' అని సంభావించినారు. వాల్మీకి ముని ప్రణీతమైన రామాయణముచే సన్నుతుడని నాటరాగపంచరత్న కీర్తనలో "కవీన బిలజ మౌనికృత చరిత్ర సన్నుత' అని శ్రీరాముని కొనియాడినారు. ఈ విషయమును 'The spiritual heritage of Thyagaraja' అను గ్రంథమున Dr. V. Raghavan గారు చెప్పినారు.

'In the same Nata Pancharatna (8 th charana) he calls Rama one whose story was set forth by the ant hill born sage who was also the king of poets. "కవీనబిలజమౌనికృతచరిత" అట్టిదగు రామచంద్రుని చరితమును ఆయాకాండలలో త్యాగయ్యగారెట్లు రచించినది పరిశీలింతము.

రామకథనంతను సంగ్రహముగ నొక కీర్తనలో నుంచినారు.

శ్రీ రఘుకులమందు బుట్టి నీవు సీతను చేకొనిన
రామచంద్ర ॥శ్రీ॥
ఆ రామమందు మునులకోరిక లీడేరసేయ
బూనుకొన్న రామ ॥శ్రీ॥
నవరత్న పీఠమందు మజ్జనము పుడమి సురలచే
గైకొన్న రామ ॥శ్రీ॥
వరమభక్తులను పాలనముసేయు సాకేతవాస
త్యాగరాజనుత ॥శ్రీ॥

"శ్రీ రఘుకులమందు బుట్టి నీవు సీతను చేకొనిన రామచంద్ర" అను పల్లవిలో శ్రీరామజననము - కళ్యాణమును చెప్పినారు. "ఆ రామమందు మునుల కోరిక లీడేరసేయబూనుకొన్న రామ" అను అనుపల్లవిలో రామచంద్రుడు అరణ్యవాసమున మునులకభయమిచ్చి దుష్టరాక్షససంహారమునకు కడంగి విరాధుని, ఖరదూషణాది పదునాలుగు వేలమంది రక్కసులను సంహరించిన విధమును ప్రస్తావించినారు. రామాయణము అభయవాగ్దానరత్నమాల "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచయాచతే

అభయం సర్వభూతేభ్యో దదామి ఏతద్వ్రతం మమ" అని శ్రీరామచంద్రుడు గావించిన ప్రతిన, ఆ ప్రతిన నెరవేర్చుకొనిన విధము — అరణ్యకాండమున మునుల కభయమిచ్చిన శ్రీరాముని జైత్రయాత్ర రావణవధతోగదా పరిసమాప్తి చెందినది. అరణ్యకాండ మొదలు యుద్ధకాండ పర్యంతము శ్రీరామచంద్రుని శరణాగతత్రాణ పరాయణత్వ మీ యను పల్లవియందు వ్యక్తమైనది.

"నవరత్నపీఠమందు మజ్జనము పుడమిసురులచేత గైకొన్నరామ" - ఈ చరణమునందు రావణవధానంతరము రామచంద్రుడు సీతాసమేతుడై అయోధ్యను చేరుట — పదునాలుగు సంవత్సరములు పూర్తియయి రామచంద్రమూర్తి ఎప్పుడయోధ్యకు వచ్చునా! ఎప్పుడు పట్టాభిషిక్తుడగునని యెదురులు చూచుచున్న అయోధ్యావాసుల కోరికల నీడేర్చుటకు వసిష్ఠుడు రామచంద్రుని నవరత్న ఖచితమైన పీఠమందాసీనుజేసి సర్వతీర్థోదకముతో రామచంద్రునకు స్నానము చేయించుట అను విషయము ద్వారా శ్రీరామచంద్రుని పట్టాభిషేక గాథ సూచితము. "పరమ భక్తులను పాలనము సేయు సాకేతవాస త్యాగరాజనుత" అను చరణమున రామచంద్రమూర్తి భక్తుల ననుగ్రహించిన విధము వ్యక్తమగును. సుగ్రీవుడు - విభీషణుడు మొదలగు భక్తుల ననుగ్రహించిన విషయము విదితము.

సంగ్రహముగ రామకథనంతను ఒక్క కీర్తనలో చెప్పి పిమ్మట బాలకాండ కథనంతను ఒక కీర్తనలో చెప్పినారు.

రామాయణమున బాలకాండకు "తపఃకాండ" అని పేరు. అందున్నదంతయు తపస్సే.

"తేపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాంవరం
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్"

బాలకాండము "తపస్స్వాధ్యాయనిరతం" అని "తపశ్శబ్దముతో" ప్రారంభమయినది. తపోఘట్టములను ప్రదర్శించినది. బాలకాండమునకు నాంది యిరువురు మునిపుంగవుల సమాగమము. దశరథుడు గావించిన పుత్రకామేష్టియు పెక్కులు తపస్వుల సమావేశమే. దశరథునకు పుత్రభాగ్యము ననుగ్రహించినదియు ఋషిపుంగవుడగు ఋశ్యశృంగుని యజ్ఞరూపతపః ఫలిత పాయసమే. శ్రీరామునున్ని తునిగా తీర్చిదిద్దినదియు విశ్వామిత్రుడు, అహల్యాగౌతములు, జనకుడు, పరశురాముడు త్యాగయ్యగారు బాలకాండకథను చెప్పిన కీర్తన.

యదుకుల కాంభోజి - ఝంప

శ్రీరామ జయరామ శృంగారరామ యని చింతింపరాదె
ఓ మనసా ॥శ్రీ॥

తళుకు చెక్కుల ముద్దుబెట్ట కౌసల్య మును తపమేమి
చేసెనో తెలియ ॥శ్రీ॥

దశరథుడు శ్రీరామ రారయని బిలువ మును తపమేమి
చేసెనో తెలియ ॥శ్రీ॥

తనివార పరిచర్య సేయ సౌమిత్రి మును తపమేమి
చేసెనో తెలియ ॥శ్రీ॥

తనవెంట జనచూచి యుప్పొంగ కౌశికుడు తపమేమి
చేసెనో తెలియ ॥శ్రీ॥

తాపంబణగి రూపవతి యౌటకహల్య తపమేమి చేసెనో
తెలియ ॥శ్రీ॥

ధర్మాత్మ చరణంబునోక శివచాపము తపమేమి చేసెనో
తెలియ ॥శ్రీ॥

తనతనయనొసగి కనులారగన జనకుండు తపమేమి
చేసెనో తెలియ ॥శ్రీ॥

దహరంబు కరుగ కరమునుబట్ట జానకి తపమేమి చేసెనో
తెలియ ॥శ్రీ॥

త్యాగరాజాప్తయని పొగడ నారదమౌని తపమేమి
చేసెనో తెలియ ॥శ్రీ॥

ఆయావ్యక్తులు కౌసల్యా దశరథుడు, సౌమిత్రి, విశ్వామిత్రుడు, అహల్య శివచాపము, జనకుడు, జానకి, నారదమౌని శ్రీరాముని అనుగ్రహ పాత్రులగుట కెట్టి తపముచేసిరో అని వారలను స్తుతించినాడు త్యాగయ్యగారు. "తపసాసర్వ మపిసుసాధ్యం తపోహిదురతిక్రమః" అనిగదా ! తపసుచేత సాధ్యముగానిది

(దుస్స్వాధముగానిది) ఏదియు లేదుగదా! కాననే కౌసల్యా దశరథులు మున్నుగువారు శ్రీరామానుగ్రహపాత్రులైనారు. వాల్మీకి అపరావతారము త్యాగయ్యగారనుట కింత కంటె నిదర్శనమేమి కావలయును. వాల్మీకియే త్యాగయ్య. త్యాగయ్యయే వాల్మీకి యనుటకెట్టి సందేహమును లేదు.

పై కీర్తనమున త్యాగయ్యగారు ముందుగా కౌసల్యతపమును కొనియాడినారు. "పితుః శతగుణం మాతా' అని గదా! "మాతా పుత్రస్య భూయాంసి కర్మాణ్యారభతే" తల్లియేగదా కుమారునకు మంగళపూర్వకమగు కర్మలును మొదటగా చేయునది. "మాతృదేవోభవ" అను ఉపనిషత్సంప్రదాయముననుసరించియేకాక విశ్వామిత్రుని యజ్ఞరక్షణమునకాయనవెంట రామునంపుటలో దశరథునికంటె కౌసల్యయే ముంద డుగు వేసినట్లు కనపడును. కౌసల్య వీరమాతగదా! అవియునుగాక వాల్మీకి తన రామాయణమున "సచసర్వగుణోపేతః కౌసల్యానంద వర్ధనః" "కౌసల్యాసుప్రజా రామ" "తేన పుత్రేణామిత తేజసా కౌసల్యా శుశుభే" అని శ్రీరాముని తనయునిగ పొందిన కౌసల్యభాగ్యమె భాగ్యమని కౌసల్యను ప్రస్తుతించినారు. త్యాగయ్యయు "వాల్మీక్యంశతో" జనించినవారు కావున ఆయన కీర్తనములందు వాల్మీకమునందలి ఛాయలు కన్పట్టును.

రాముని తళుకు చెక్కుటద్దాలను దువ్వి ముద్దిడు అదృష్టమునకు నోచుకొనుటకు కౌసల్య ఏమితపము చేసెనోగదా! అంతటి మాతృవాత్సల్యమును, కౌసల్య రాముని ముద్దిడుటను త్యాగయ్యగారు తీయని తెలుగుభాషలో మనకు ముద్దుముద్దుగ నందించి నారు. వెంటనే దశరథుని భాగ్యమును కొనియాడినారు.

దశరథునకు కొడుకులు నలుగురైనను జ్యేష్ఠుడైన రామునియందాయనకు దొడ్డప్రేమ. కేవలము జ్యేష్ఠుడగుటయేకాదు ధర్మప్రధానుడును.

"ఆత్మావై పుత్రనామాసి" వాల్మీకి రామాయణమున శ్రీరాముని గుణాను కీర్తనము "గుణైర్దశరథోపమః" "రామోరతికరః పితుః" అని ప్రస్తుతించినారు. దశరథుడు రాముని విడనాడి క్షణమైనను జీవించువాడుకాడు. విశ్వామిత్రుడు రాముని తనవెంట పంపుమని దశరథుని కోరినపుడు

షష్టిర్వర్ష సహస్రాణి జాతస్యమమ కౌశిక
దుఃఖేన ఉత్పాదితశ్చాయం న రామం నేతుమర్హసి
చతుర్ణామాత్మానాం హి ప్రీతిః పరమికా మమ
జ్యేష్ఠం ధర్మప్రధానంచనరామం నేతుమర్హసి''

అని బహువిధములుగా శ్రీరాముని విశ్వామిత్రుని వెంట పంపలేని తన దీనత్వమును వెల్లడించినారు దశరథుడు. ఆ ఘట్టమును తీసికొని త్యాగయ్యగారు మన కన్నులకు కట్టునట్లు రచించినారు. సాక్షాత్తువైకుంఠుని "శ్రీ రామ రారా" యని పిలుచుటకు దశరథుడు చేసికొనిన జన్మాంతర సుకృతమేమొగదా యని దశరథుని తపమును కొనియాడినారు. తరువాత లక్ష్మణుని అదృష్టమును నుతించినారు. "సౌమిత్రిభాగ్యమె భాగ్యమని" మఱియొక కీర్తనలో లక్ష్మణుని భాగ్యమును కొనియాడి తనకాభాగ్యము కలుగనందులకెంతగనో పరితపించినారు త్యాగయ్యగారు.

పాయస విభాగమునాటినుండి జన్మసంస్కారముతో లక్ష్మణునకు రాముని పరిచర్యసహజమైనది. బాల్యమున తనకు తల్లి కౌసల్య అన్నము తినిపింప ఎంత వేడినను లక్ష్మణుడు లేనిదే ముట్టుకొనెడివాడు కాడట శ్రీరామచంద్రుడు. లక్ష్మణుడు ప్రక్కనలేనిదే కనుమూయడట పురుషోత్తముడగు శ్రీరామచంద్రుడు. ఉదార పరాక్రముడైన రామచంద్రుడు మృగయావినోదమునకై అశ్వమెక్కిచన లక్ష్మణుడు నీడవలె రామునననుసరించెడివాడట.

"బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణోలక్ష్మివర్ధనః
రామస్యలోకరామస్య భ్రాతుర్జ్యేష్ఠస్యనిత్యశః
సర్వప్రియ కరస్తస్య రామస్యాపి శరీరతః
లక్ష్మణోలక్ష్మిసంపన్నో బహిఃప్రాణఇవాపరః
నచతేనవినా నిద్రాం లభతే పురుషోత్తమః
మృష్టమన్నముపానీతమశ్నాతి నహితం వినా
యదాహి హయమారుహ్యమృగయాం
యాతిరాఘవః
తద్దైవం పృష్ఠతోఽన్వేతిసధనుః పరిపాలయన్.

(వాల్మీకి రామాయణం)

విశ్వామిత్ర యాగరక్షణమునకు రామచంద్రుడు వెళ్ళినపుడును లక్ష్మణుడును వెళ్ళినాడు. అట్లే రాముడు పదునాలుగు సంవత్సరములరణ్యావాసమునకేగునపుడు లక్ష్మణుడును, సుమిత్రచే "సృష్టస్త్వం వనవసాయ"-"రామం దశరథం విద్ధి మాంవిద్ధి జనకాత్మజాం అయోధ్యామటవీం విద్ధి గచ్ఛతాత యథాసుఖమ్" అని ప్రబోధితుడై శ్రీరాముని వెన్నంటి వెళ్ళినాడు. త్యాగయ్యాగారీ ఘట్టములనన్నింటిని మనసు వందుంచుకొని "తనివార పరిచర్యసేయ సౌమిత్రిమును తపమేమిచేసెనో తెలియ" అని సౌమిత్రి తపోమహిమను ప్రస్తుతించినారు.

## విశ్వామిత్రుడు :

విశ్వామిత్రుడు రాజర్షి. తరువాత బ్రహ్మర్షియయినాడు. సకలశస్త్రాస్త్ర మంత్ర రహస్యముల నెరిగినవాడు. సృష్టికి ప్రతిసృష్టి చేయగల తపస్వి. తానార్జించుకొనిన సకలశస్త్రాస్త్రమంత్ర విద్యాసంపదను ధర్మాత్మునకొకనికప్పగించి లోకరక్షణము చేయు సామర్థ్యముగలవాని కొఱకై అన్వేషణ సాగించినాడు విశ్వామిత్రుడు. అతని యన్వేషణ ఫలించినది. 'రామోవిగ్రహవాన్ ధర్మః' తన తపః ఫలితముగా దశరథాత్మజుడు లభించినాడు. ఏనాడు విశ్వామిత్రుడు రాజాశ్రయము నెరుగడు. యాచన అనునది అతనికి తెలిసినది కాదు. దశరథకుమారుని తనవెంట తీసికొని వెళ్ళుటకై యాచించి యాగరక్షణావ్యాజమున తనవెంట రప్పించుకొనినాడు. విశ్వామిత్రుడు శ్రీరాముని తనవెంట తీసికొని వెళ్ళినది "యోగమాయాపి సీతేతిజాతా జనకనందినీ తాం రామాయ యో జయితుం ఆగతః - సీతారాములకిరువురకు కల్యాణము చేయించుటకు. ఇంతకాలము తనకు ప్రత్యర్థియగు వసిష్ఠుడు రామచంద్రునకు గురువుగానున్నాడు. ఆ యదృష్టము తనకుకూడ కలుగవలయునన్న విశ్వామిత్రుని సంకల్ప మీనాటికి నెరవేరినది. బ్రహ్మర్షియగు విశ్వామిత్రునకు రాముడు పరాత్పరుడని తెలియును.

"అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా యేచేమే తపసిస్థితాః"

అని విశ్వామిత్రుడు శ్రీరాముని గొప్పతనమును గురించి తానెరుంగుదునని దశరధునకు చెప్పినాడు.

రాముని తత్త్వమంతయుఁ గరామలకంబుగఁ జూచువార లీ
భూమిని నిర్వురుండిరి తపోమహితుండగు గాధినందన
స్వామియునైక జన్మసముపార్జితతపః పరిశీలితాత్మ వి
ద్యా మహితప్రభావ హృదయంగమ కేకయరాజ
పుత్రియున్.

ఇది యపూర్వమైన సన్నివేశము. త్యాగయ్యగారు రామాయణమున ఆయా ఘట్టములను పారాయణము చేయుపట్టుల ఆయాసన్నివేశముల ఆయావ్యక్తుల అదృష్టమున కెంతగనో మురియుచుండెడివారు. తనకు గూడ రామునిచెంత కొంత చోటివ్వుమని ప్రార్థించిన సన్నివేశములు గూడ లేకపోలేదు.

"చెంతనే సదా యుంచుకోవయ్యా
మంతుకెక్కు శ్రీమంతుడౌ హనూమంతు రీతిగా శ్రీకాంత"

రామచంద్రుడు తనవెంట వచ్చుటచూచి ఉప్పొంగుటకు విశ్వామిత్రుడు గావించిన తపము ఊహాతీతముగదా! కాని త్యాగయ్య భావన చేసినారు. సామాన్యముగా మహాకవు లందరును పరమభావుక పట్టభద్రులుగదా! "రవిగాననిచో కవిగాంచునని" గదా యార్యోక్తి. త్యాగయ్య మహాకవి. కావుననే విశ్వామిత్రుని తపోమహిమను తన చిత్తమునందూహించి కీర్తించినారు.

## ఇక అహల్య :-

"తాపంబణగి రూపవతియౌటకహల్య తపమేమిచేసెనో తెలియ."

విశ్వామిత్రుని యాగమును కాచినాడు శ్రీరాముడు. విశ్వామిత్రుడు శ్రీరామునితో "రామచంద్రా! కృతకృత్యుడనైతిని. నాయాశ్రమము సార్థకమైనదని" నాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటనిడుకొని మిథిలానగరమునకు పయనమైనాడు. మార్గమధ్యమున గౌతమాశ్రమమున్నది. రామచంద్రుడు విశ్వామిత్రుని ఆ యాశ్రమమును గురించి యడిగినాడు. విశ్వామిత్రుడు రామచంద్రునకు అహల్యా గౌతముల వృత్తాంతమును చెప్పినాడు. మంచుకప్పిన మబ్బుచాటున నుండిన నిండు చంద్రుని కాంతివలెనున్న దానిని, నీట ప్రతిబింబితంబయినెగడుచున్న ఎండయిన

దేవిచూడ రాకుండు అహల్యను రామచంద్రుడు చేరగా ఆమె తాపము పోయి తన పూర్వాకారముతో లోకములకు కనపడినది. శ్రీరామచంద్రుడాయరణ్యమున ప్రవేశించుటతో అహల్యకు గౌతముని మాటప్రకారము శాపమోక్షణమయినది.

## శివధనుర్భంగము :-

"ధర్మాత్మచరణంబుసోక శివచాపమును తపమేమి చేసెనోతెలియ" — రామ నామ మహిమను నెరిగినవాడు శివుడు. (జానాతిరామ తవనామరుచింమహేశః). అకారణముగా శివధనువు రామపాదస్పర్శనందినదని - శివచాపము ఏమి తపము చేసెనో తెలియ అని కొనియాడినారు త్యాగయ్య. "త్యాగరాజు శివుండు" (కీ. శే. శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు). త్యాగరాజు "రామనామామృతపాననిర్జితశివుడ"ని శ్రీవారి ముఖ్య శిష్యులు వాలాజాపేట వెంకటరమణభాగవతుల ప్రశంస.

## జనకుని తపము :-

"తన తనయనొసగికనులారగన జనకుడు తపమేమి చేసెనోతెలియ" అని జనకుని తపమును కొనియాడినారు. జనకుడు రాజర్షి. జ్ఞాని. ప్రకృతిపురుషులైన సీతారాములను దర్శించిన అదృష్టశాలి. రామచంద్రుని పాదపద్మములను కడిగి కన్యాదానము చేయుటకు జనకుడు ఏమితపము చేసెనోగదా అని జనకుని తపమును కొనియాడినారు.

## సీతాకరగ్రహణము :

'దహరంబుకరుగ కరముసుబట్ట జానకి తపమేమిచేసెనో తెలియ' మహా సాధ్వి శ్రీమహాలక్ష్మి యగుసీత[1] తన దహరము కరగునట్లుగ రాముని కరగ్రహణ మొనర్చుటకెంత తపము చేసినదోగదా! సీత పరాప్రకృతి. శ్రీరాముడు పరాత్పరుడు. "శ్రీలలనా అచర!త్తపః విహాయకామాన్ సుచిరం ధృతవ్రతా" అనిగదా భాగవతము. అట్టి లక్ష్మీదేవ్యంశయగు సీత, పరాత్పరుడగు రాముడు వీరియువుర అనుబంధము సహజసిద్ధము. సర్వలోక రమణీయము అద్వైతానుభవములో నేకైకతత్త్వము. భవభూతి ఉత్తరరామ చరిత్రలో-

---

1. రాఘవత్వే భవత్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని.

'అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః
కాలేనావరణాత్యయా త్పరిణతే యత్స్నేహసారేస్థితం
భద్రంతస్య సుమానుషస్య కథమప్యేకం హితత్ప్రార్థ్యతే'

అని రామునినోట చెప్పినది గూడనిదియేకదా। ఉపాసక దృష్టిలో చిన్మయము. ఈ దివ్యానుభవమును హృదయావరణమందుగల దహరాకాశమందు యోగులు అనుభవింతురు. శ్రీరాముని కరగ్రహణమున సీత కరగుట యనగా చిద్రూపిణియైనదని శ్రీ త్యాగరాజస్వామివారి యనుభవము. అనగా చంద్రునియందు వెన్నెలవలె, అగ్నియందు ప్రకాశమువలె అంతర్లీనమైనదని భావము.

## నారదమౌని తపము :

"త్యాగరాజాప్తయని పొగడ నారదమౌని తపమేమి చేసెనో తెలియ" అని నారదుని తపమును కొనియాడినారు.

నారదుడు భగవన్నామ కీర్తనా తత్పరుడు. త్యాగరాజాప్తుడట శ్రీరామ చంద్రుడు. త్యాగరాజు అనగా తిరువారూరనున్న త్యాగేశ్వరస్వామి. శివున కిష్ట దైవము రాముడు. రామున కిష్టదైవము శివుడు. త్యాగయ్యగారు ఇందు తన పేరును త్యాగేశ్వరునితో కలిపి పరవశముజెంది ఆ పారవశ్యమును వెల్లడించినారు.

ఈ విధముగా తపఃకాండయగు బాలకాండ కథను తీసికొని మృదుమధుర మైన కవితలో మనకందించినారు త్యాగయ్య. వాల్మీకమునయన్న మృదుత్వమాధుర్యములు త్యాగయ్యగారి రచనలోను చోటుచేసికొన్నవి. త్యాగయ్య వాల్మీకి అపరావతారము గదా. వాల్మీకేర్వద నారవిందగళితం రామాయణాఖ్యంమధు" అని గదా। కాననే మృదువైన వాక్యములను పలుకుటలో త్యాగయ్య వాల్మీకితో సరిపోల్చ దగినవాడని[1] శ్రీవారి ముఖ్యశిష్యుడగు వాలాజాపేట వేంకటరమణభాగవతులవక్కాణ.

ఈ విధముగా సంగ్రహరామాయణకథను ఒక్క కీర్తనలోను, బాలకాండ కథను ఒక్క కీర్తనలోను - పొందుపఱచినారు త్యాగయ్య.

ఇక అయాకాండలలో - ఆయాఘట్టములలో త్యాగయ్యగారు. "రామాయణ కథాసుధను" ఏ విధముగ మనకందించినది ఒక్కొక్కకాండను తీసికొనిపరిశీలింతము

1. మృదుగిరావల్మీకజన్మామునిః.

దశావతారములలో రామావతారము చాలగొప్పది. త్యాగయ్యగారును" మది లోన యోచనపుట్టలేదా" అనునొక కీర్తనలో "పదివేసములలో రామవేసమే బహు బాగనుచు గోరునన్ను బ్రోవ" మదిలోన అని దశావతారములలో రామావతారమే చాల గొప్పదనినారు. శ్రీ మహా విష్ణువుయొక్క సప్తమావతారము శ్రీరామచంద్రుడు. తక్కిన అవతారములలో బోధమాత్రమే కన్పడును. శ్రీరామావతారమున ఆచరణ కన్పడును. శ్రీరామావతారకారణమును త్యాగయ్యగారిట్లూహించినారు.

మనవ్యాలకించరాదటే మర్మమెల్ల దెల్పెదనే మనసా ॥మ॥
ఘనుడైన రామచంద్రుని కరుణాంతరంగముదెలసి ॥నామ॥
కర్మకాండమతాకృష్టులై భవగహనచారులై గాసిజెందగ
కనిమానవావతారుడై కనిపించినాడే నడత
త్యాగరాజు ॥మన॥

మతములలో నుండు బాహ్యకర్మకాండలనే ప్రధానమనుకొని, పాపారణ్యము లలో విహరించుచు జనులందరు తబ్బిబ్బులుపడుచున్నారు. అటువంటి సమయమున భూమిని మానవరూపముననవతరించి - ప్రవర్తన - ఇవ్విధముగ నుండవలయునని ప్రత్యక్షము చేసినాడు రామచంద్రుడు.

త్యాగరాజుగారును తన యిష్టదైవమగు రామచంద్రుని కేవలము దశరథాత్మజు డుగ భావింపక సచ్చిదానందరూపముగ భావించినారు.

మనసా శ్రీరామచంద్రుని మరవకే - ఏమరకే మనసా
మునుపుట్టను పుట్టిన ముని కృతమున
మూడున్నారధ్యాయముల జూచుకో ॥మ॥
సృష్టి పుష్టి నష్టి జేయుపనులు ని
కృష్టమనుచు త్రిమూర్తుల కొసగి
తుష్టుడై బరగె సద్భక్తమునో
భీష్టము లిచ్చే త్యాగరాజ సుతుని ॥మ॥

సృష్టి, స్థితి, లయములు సత్వరజస్తమోగుణ కార్యములు. ఆయా గుణోపాధులచే త్రిమూర్తులు బ్రహ్మ, విష్ణు, శివులుగ వ్యవహరింపబడుచున్నారు. ఈ మూర్తిత్రయమునకు అధిష్ఠానమైన సచ్చిదానంద బ్రహ్మవస్తువు సర్వాధారము. అట్టి సచ్చిదానంద బ్రహ్మతత్త్వమే తారకరామ రూపమున సమన్వయమగుచున్నది. అనగా రామతత్త్వము ఏ విధమైన పరిహారములు లేక సచ్చిదానంద రూపముగనే యోగులు భావింతురు. కాని శ్రీరాముడుగా ఇక్ష్వాకు వంశమున నావిర్భవించినది — దుష్ట శిక్షణ — శిష్టరక్షణ కొఱకే.

వాల్మీకి కృతమైన రామాయణమునందలి మూడవ, ఆరవ అధ్యాయములలో (అరణ్య, యుద్ధకాండములలో) రామతత్త్వము ప్రతిఫలించును.

## బాలకాండ

ఆసీదయోధ్యానగరీ దేశేకోసల నామని
తస్యాం శ్లాఘ్యగుణశ్శ్రీమాన్ రాజాదశరథోఽవసత్

దేవేంద్రుడు స్వర్గమును పాలించురీతిగా దశరథుడు అయోధ్యను పాలించుచుండెను. దశరథునకు ముగ్గురుభార్యలు. కౌసల్య, సుమిత్ర, కైక. ఈ ముగ్గురియందును సంతానము కలుగనందులకెంతగనో పరితపించి వసిష్ఠునాదేశమున "అశ్వమేధ, పుత్రకామేష్టుల"ను ఋశ్యశృంగుని ఆధ్వర్యమున జరిపించినాడు దశరథుడు. ఆ సమయముననే దేవతలందరు శ్రీమహావిష్ణువును చేరి రాక్షసులు తమను పెట్టుచున్న బాధలను మొరపెట్టుకొనిరి. శ్రీమహావిష్ణువు.

అహం దాశరథిర్భూత్వా కరిష్యామి హితంతువః
భయంత్యజత భద్రం వోహితార్థం యుధిరావణే
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్రజ్ఞాతి బాంధవమ్
హత్వాక్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహమ్
దశవర్ష సహస్రాణి దశవర్ష శతానిచ వత్స్యామి
మానుషేలోకే పాలయన్పృథివీమిమామ్

అని దేవతలకు, మునులకభయమిచ్చినాడు. ప్రాజాపత్య పురుషుడు దశరథునకు పాయసమునిచ్చినారు. ఆ పాయసమును భార్యలకు ముమ్వురకు పంచియిచ్చినాడు దశరథుడు

కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌతదా
అర్థాదర్థం దదౌచాపి సుమిత్రాయైనరాధిపః
కైకేయ్యై చావశిష్టార్థం దదౌపుత్రార్థ కారణాత్
ప్రదదౌ చావశిష్టార్థం పాయసస్యామృతోపమమ్
అనుచింత్య సుమిత్రాయై పునరేవమహీపతిః
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్

(వాల్మీకిరామాయణము)

కౌసల్య, సుమిత్ర, కైక ముమ్వురు పాయసమును స్వీకరించి గర్భవతులైనారు.

చైత్రశుద్ధ నవమి – పునర్వసు నక్షత్రము – కర్కాటక లగ్నమున బుధవారము పంచగ్రహము లుచ్చస్థితియందుండ, గురుచంద్రులు కూడియున్న సమయమున కౌసల్య రాముని కనినది. శ్రీ మహావిష్ణువు అవతరించినారు దశరథాత్మజుడుగ దశరథునింట.

వెలయు పండ్రెండవ నెలయందు చైత్ర పు
నర్వసు బుధశుద్ధ నవమినాడు
పంచగ్రహంబులు పరగ నుచ్చస్థాన
గతులుగా గురుసుధాకరులు గూడ
కర్కటకాఖ్యలగ్నమునందు కౌసల్య
హరికర్థభాగమగు రామునమరగనియె
గురువారమున జారుతర మీనలగ్నంబు
నను బుణ్యదశమి దినమునఁ గయిక
పద్మనాభు నంశమున భరతుగనియెఁ
గర్కటకలగ్న మాశ్లేష కాప్యవార

మమరసేకాదశిని విష్ణువంశమున సు
మిత్ర లక్ష్మణ శత్రుఘ్ను మెఱయఁ గనియె.

త్యాగయ్యగారు రామావతార ఘట్టమును తీసికొని—

ఎవరికై యవతారమెత్తితివో-ఇపుడైన తెలుపవయ్య
రామయ్య నీ ॥వెవరికై॥
అవనికి రమ్మని పిలిచిన మహరాజెవడో వానికి మ్రొక్కెను
రామ ॥ఎవరికై॥

అని కీర్తించినారు.

ఆదిశేషుడు లక్ష్మణుడుగా, చక్రము భరతుడుగా, శంఖము శత్రుఘ్నుడుగ నవతరించిరి.

"అతీత్యైకాదశాహంతు నామకర్మతథాఽకరోత్" పదునొకండవరోజున వసిష్ఠునిచే దశరథుడు నల్వురు కొడుకులకు నామకరణ మహోత్సవమును జరిపించినాడు.

"జ్యేష్ఠంరామం మహాత్మానం" జ్యేష్ఠునకు రామచంద్రుడని నామకరణము చేయుటలోని యౌచిత్యమును త్యాగయ్యగారు పరమాద్భుతముగ చిత్రీకరించినారు.

'రమయతీతిరామః' అనగా నందరను రమింపజేయువాడని యర్థము. రఘుకుల వర్ధనుడగు రాముడే యోగులను భోగులను ఏకసుఖముగా రమింపజేయుటకు శక్తుడు.

'రమంతే యోగినోఽనంతే పరానందే చిదాత్మని తేన రామ ఇతిప్రోక్తః'

"రమంతేయోగినోఽనంతే నిత్యానందే చిదాత్మని ఇతిరామ పదేనాసౌ పరబ్రహ్మాభిధియతే" అనంతుడును, నిత్యానంద సంధాయకుండును, పరమాత్మ స్వరూపుడగు బ్రహ్మతత్త్వమునందు యోగులు క్రీడించు కతమున పరమాత్మకు రామశబ్దము వచ్చినది. సృష్టి స్థితిలయములకు కారణభూతుడైన సచ్చిదానందమూర్తి యగుటచే రామనామ ముంచబడినది,

"ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయన్తే ఆనందేన జీవంతి"

ఎవరని నిర్ణయించిరిరా నిన్నెట్లారాధించిరిరా నరవరు
లెవరని॥
శివుడనో, మాధవుడనో, కమలభవుడనో పరబ్రహ్మమనో॥ఎ॥
శివమంత్రమునకు మాజీవము మాధవమంత్రమునకు
రా జీవము ఈ
వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద వితరణగుణ
త్యాగరాజ వినుత నిన్నెవరని॥

"నమశ్శివాయ"అను మంత్రమునందు "మ" బీజాక్షరము. "నమో నారాయణాయ" అను మంత్రమునందు "రా" బీజాక్షరము. ఈ రెండు మంత్రముల యందలి బీజాక్షర సంపుటితోడనే "రామ శబ్దము" ఏర్పడినది. శ్రీరామచంద్రుడు త్రిమూర్తులకు మూలకారణమైన పరమాత్మ. రామనామమునందు సర్వపాపములను సమస్త దుఃఖములను పోగొట్టు శక్తిగలదు. "రాశబ్దోచ్చారమాత్రేణ ముఖాన్నిర్యాంతిపాతకాః" అనిగదా! కాననే త్రికాలజ్ఞుడగు వసిష్ఠుడు దశరథ జ్యేష్ఠునకు రామనామమునుంచెను. వసిష్ఠుడు కైకనుతునకు భరతుడని, సుమిత్రా నందనులకు లక్ష్మణ, శత్రుఘ్నులని పరమప్రీతితో నామకరణమును చేసెను. అల్లారు ముద్దుగా పెరుగుచున్నారు దశరథాత్మజులు నల్వురు. జ్యేష్ఠుడు — ధర్మప్రధానుడగు శ్రీరామునిమీద దశరథునకు ప్రేమము మెండు.

త్యాగయ్యగారు రామచంద్రుని "శ్రీరామా! నీకు పేరుపెట్టి పెంచిన వారెవరో చూపుమని అడుగుచున్నారు.

పేరిడి నినుబెంచిన వారెవరే ॥పే॥
వారిని జూపవే శ్రీరామయ్యా ॥పే॥
సారసారతర తారక నామమును ॥పే॥
సర్వమతములకు సమ్మతమైన ॥పే॥
ఘోరపాతకముల గొప్పున యణచు ॥పే॥
త్యాగరాజు సధా భాగుగ భజియించు ॥పే॥

"రామేతి మధురం వాచం" అనిగదా!

రామ పదమందు మరుగు మందేమికలదో
తలపుగా సనేదా ప్రేమ బంధము బిగించు
నెన్నిమాటలు పలికిననేని నమృత
రసము చిప్పిలునేకాని విసువురాదు

రామ యనినంత నెంతటి కోమలతయొ
సీతయన నంతటి లేతదనము
యే మహర్షులు కనిపెట్టి యీ మనోజ్ఞ
నామ యుగళంబు గూరిచినారో కాని

96 కోట్ల రామనామమును - జపించుట వలన కలుగు సౌఖ్యమును పూర్తిగ అనుభవించినవారు త్యాగయ్య. పరమశివునకు రామనామమందలి రుచి తెలియును. తిరువారూరనున్న త్యాగేశ్వరుడే త్యాగరాజుగ నవతరించినారు కనుక రామనామ మందలి రుచి పూర్తిగ త్యాగయ్యకు తెలియును. రామనామమందలి మాధుర్యము నెరింగినవారు కనుకనే త్యాగయ్య "శ్రీరామ ని పేరిడి సనుబెంచిన వారెవరే - వారిని జూపవే" అని యడుగుచున్నారు. రామనామమును జపించుటవలన కలుగు సౌఖ్య మిట్టిదని చెప్పుటకు వలనపడదని – ఆ సౌఖ్యమును తెలిసినవారు శంకరుడని చెప్పు టలో - ఆ సౌఖ్యము తనకు తెలియునని త్యాగయ్యగారు చెప్పికొనినట్లయినది.

ఇంత సౌఖ్యమనినే జెప్పజాల
ఎంతో యేమో యెవరికి దెలుసునో ॥ఇం॥
దాంత సీతాకాంత కరుణా
స్వాంత ప్రేమాదులకే దెలుసును గాని ॥ఇం॥

స్వరరాగ లయ సుధారసమందు
వరరామనామమనే కండచ
క్కెర మిశ్రముజేసి భుజించే శం
కరునికి దెలుసును త్యాగరాజవినుత ॥ఇంత॥

రాముడు కౌసల్యానందవర్ధనుడు. నిత్యము కౌసల్య రామచంద్రుని చెక్కిళులను దువ్వి ముద్దుపెట్టుచుండెడిది. దశరథుడు శ్రీరామచంద్రుని "శ్రీరామ రారయని పిలుచుచుండెడివాడు.

నల్వురుకుమారులు క్రమముగా పెరిగి ఊనషోడశవర్షప్రాయులైనారు. అన్ని విద్యలయందారితేరినారు. రామలక్ష్మణులొకజంటగను, భరతశత్రుఘ్నులొక జంటగను ఎంతయునొద్దికతో నుండిరి. "పలుకు పలుకునకు తేనెలొలుకుమాటలాడు సోదరులు"[1] గల వారట రామచంద్రుడు. ఇది త్యాగయ్యగారి భావన. నలుగురు కొడుకులకేకకాలమున వివాహము చేసి ఆనందింపవలయునని దశరథుని కోరిక.

"అథరాజా దశరథః తేషాం దారక్రియాంప్రతి
చింతయామాస ధర్మాత్మా సోపాధ్యాయస్సబాంధవః"

దశరథుడిట్లాలోచించుచుండ విశ్వామిత్రుడు వచ్చినాడు. మహాత్ముల సంకల్పములకు వికల్పములుండవుగదా! వారు సత్యసంకల్పులు. విశ్వామిత్రుని రాక శుభసూచకము. తానొక యజ్ఞమును తలపెట్టితినని, ఆ యజ్ఞమునకు రాక్షసులు విఘ్నము కలిగించుచున్నారని" స్వపుత్రం రాజశార్దూలం రామం సత్యపరాక్రమం కాకపక్షధరంశూరం జ్యేష్ఠంమే దాతుమర్హసి" అని దశరథునడిగినాడు విశ్వామిత్రుడు. ముహూర్తమాత్రము నిశ్చేష్టుడైనాడు దశరథుడు.

షష్టిర్వర్షసహస్రాణి జాతస్యమమకౌశిక
దుఃఖేన ఉత్పాదితశ్చాయం నరామంనేతుమర్హసి"

అని రాముని పంపలేని తన యశక్తతను దశరథుడు విశ్వామిత్రునకు వెల్లడించినాడు విశ్వామిత్రుడాగ్రహోదగ్రుడైనాడు. వసిష్ఠునాదేశముతో ఎట్టకేలకు (వసిష్ఠః ఉవాచ రాజానం సానుజోదీయతామ్") లక్ష్మణుని తోడిచ్చి శ్రీరామచంద్రుని విశ్వామిత్రుని వెంట నంపినాడు దశరథుడు.

విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులు వెళ్ళునప్పటి సన్నివేశము వాల్మీకమున నీ క్రింది విధముననున్నది.

---

1. రాఘునీసమానమెవరు,

తతోవాయు సుఖస్పర్శో నీరజస్కోవవౌ తదా
విశ్వామిత్రగతం దృష్ట్వారామం రాజీవలోచనం
పుష్పవృష్టిర్మహత్యాసీ ద్దేవ దుందుభి నిస్వనైః
శంఖదుందుభి నిర్ఘోషం ప్రయాతేతు మహాత్మని
విశ్వామిత్రోయయావగ్రే తతోరామోధనుర్ధరః
కాకపక్షధరో ధన్వీ తంచ సౌమిత్రి రన్వగాత్.

త్యాగయ్యగారు విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు వెళ్ళినప్పటి సన్నివేశమును కన్నులకు కట్టునట్లు వర్ణించినారు. "లోకోత్తర వర్ణనా నిపుణః కవిః కవేఃకర్మకావ్యమ్" అనిగదా యాలంకారికోక్తి. త్యాగయ్య మహాకవి.

వెడలెను కోదండపాణి అనుజ సౌమిత్రిగూడి
పుడమిలో జనులెల్ల పొగడ పూజితుడై మునితోగూడి ॥వెడ॥
ఉరమున హారము మెరయ శిరమున కొ౦డియుజార
కరమున శరచాపములు ఘనముగ మెరయ
సురుచిర వాద్యములుమ్రోయ సురలెల్ల వినుతిసేయ
వరత్యాగరాజనుతుడు వసుధ భారమెల్లదీర్ప ॥వెడ॥

ఈ కృతి త్యాగయ్య కృతముకాదని కొందరమతము. ఆంధ్రుడై కారణాంతరములచేత దక్షిణదేశమున జన్మించినను తెలుగుబాసలో రామాయణ కృతి రచనగావించి "స్వయంతీర్ణః పరాంస్తారయతి" తాను తరించుటయేకాక మనకందరకు తరణోపాయము జూపిన త్యాగయ్య ప్రాతఃస్మరణీయుడు. కాననే కవులు త్యాగయ్యనీ విధముగ కీర్తించినారు.

"తీయని తెల్గుబాస గడితేరకృతుల్ రచియించి తంబురా
కొయ్యకు జీవదానమిడి కోమలకంఠము మేళవించిరా
మయ్యను తన్మయత్వముననాడియుబాడి తరించినట్టి త్యా
గయ్యను సంస్మరింతు మనసా మనసాధుగుణ ప్రవృత్తికై"

ఇక విశ్వామిత్రుని వెంట రాముడు బయలుదేరిన దృశ్యమును సంభావించి"

వినయమునను కౌశికుని వెంట జనునంఘ్రులను జూచేదెన్నటికో విశ్వామిత్రునివెంట నడచివెళ్ళిన రామచంద్రుని పాదపద్మములను జూచునదృష్టమెన్నటికో గదా అని తలచినారు.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటనిడుకొని అభిజిల్లగ్నమున బయలుదేరి ఆరుక్రోసుల దూరమునడచి సాయంకాలము ఐదుగంటలకు సరయూనదీ దక్షిణ తీరమునుజేరినారు. చీకటిపడనున్నది. రాత్రిపూట మంత్రోపదేశము చేయగూడదని మాధురీవాణిప్రేమ రఘూత్తంసుని "రామచంద్ర రఘురామాయంచునోవత్స నీకర నీరేజములన్ జలంబుగొనుమా కానిమ్ము జాగేటికిన్" అని రామచంద్రుని హెచ్చరించినారు గాధినందనస్వామి రామచంద్రుడు శుచియై వచ్చినాడు విశ్వామిత్రుడు రామచంద్రునకు "బల" "అతిబల" యను మంత్రముల నుపదేశించినారు. త్యాగయ్యగారీఘట్టమును

"శ్రీకాంత నీయెడ బలాతిబల చెలఁగంగలేదా వాదా ॥శ్రీ॥
పాకారినుత నీవారి బలాబలమును తెలియఁగలేదేమి ॥శ్రీ॥

సూర్యతనయలైనట్టి సమస్తమంత్ర విద్యలకు తల్లులని పేరందిన బల - అతిబల యను మంత్రములనుపదేశించిన విషయమునీ కీర్తనమున నుంచినారు. అటనుండి బయలుదేరినారు ముప్పురు. తాటకను సంహరించినారు శ్రీరామచంద్రుడు. విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు - సిద్ధాశ్రమమును చేరినారు. విశ్వామిత్రుడు యజ్ఞదీక్షనున్నాడు. రామలక్ష్మణులు జాగరూకులై ధనుర్బాణములను ధరించి యజ్ఞరక్షకులుగ నుండిరి. ఐదురోజులు యజ్ఞము నిర్విఘ్నముగ కొనసాగినది. ఆరవనాటి మధ్యాహ్నము మారీచసుబాహువులు యజ్ఞవిఘ్నకారులైనారు. శ్రీరామచంద్రుడు మానవాస్త్రమును సంధించి మారీచుని సముద్రమునబడునట్లుకొట్టినారు. ఆగ్నేయాస్త్రమున సుబాహువును సంహరించినారు. మారీచమదహరణమును, సుబాహువధను త్యాగయ్యగారు పెక్కు కీర్తనములయందుంచి శ్రీరాముని పరాక్రమమును ప్రస్తుతించినారు.

వాచామగోచరమే మనసా వర్ణింపదరమె రామమహిమ
రేచారిమారీచుని బడగబెట్టి రెండోవాని శిఖి కొసగెనే॥
వాచామ॥

శశివదన భక్తజనావన శంకర నే తాళగలనా
పసితనమందే ముని యాగమున నీ
బాహుపరాక్రమమును నెరుంగనా రాకా శశివదన॥
దినదినమౌపాసన జపతపధ్యానమను
యాగమువేళ మనసున బుట్టిన
ఘనడంభుని తోడను మారీచుని
పనిచెరచినయా త్యాగరాజార్చిత - శశివదనా॥

"మునిసవంబుఁజూడవెంటజని ఖల మారీచాదుల హతంబుజేసి" "బ్రోచే వారెవరే రఘుపతే నినువినా" అను కీర్తనమున రామునిశరణాగతత్రాణ పరాయణత్వ ముమ కీర్తించినారు.

విశ్వామిత్ర యాగరక్షణమునాటికి శ్రీరాముని వయసు పంద్రెండు సంవత్సములు. ఊనషోడశవర్షప్రాయుడై, కాకపక్షధరుడై, ఆలీఢపాదుడై బాణము నెక్కుపెట్టి మారీచుని మదమునణచునప్పటి శ్రీరాముని సౌందర్యమును జూచి విశ్వామిత్రుడెంతగనో పొంగియుండునని - విశ్వామిత్రుని భాగ్యమును కీర్తించినారు త్యాగయ్యగారు. విశ్వామిత్రుడు పొంగినాడో - లేదో - తెలియదుగాని త్యాగయ్యగారు శ్రీరాముని దివ్యసౌందర్యమును జూచి పొంగినమాట యదార్థము. మారీచుని మదహరణసమయమున రాముని "అలకలల్లలాడినట్లు" వాల్మీకమునలేదు. అది త్యాగయ్యగారి స్వోపజ్ఞము.

అలకలల్లలాడగగని ఆరాముని ఎటుపొంగెనో ॥అల॥
చెలువుమీరగను మారీచుని మదమణచేవేళ
॥అలకలల్లలాడగగని॥

త్యాగయ్యగారుచూచినంతగ రాముని దివ్యసౌందర్యమును వాల్మీకిగూడ చూచియుండ లేదట.

"వాని హేలాముగ్ధరాముని రూపమునికాదికవికి కట్టినదిలేదు"
(కవిసామ్రాట్ - విశ్వనాథ)

పరమభావుకపట్టభద్రులైన త్యాగయ్యగారు రామాయణకృతి రచనా సందర్భమున మారీచమదహరణఘట్టమున - "రాముని అలకలుఅల్లలాడియుండునని - ఆ రూపము చూచి విశ్వామిత్రుడెంగనో పొంగియుండునని - ఊహించినారు. రాముని దివ్య సౌందర్యమునుజూచి పొంగినది విశ్వామిత్రుడనుటకంటె త్యాగరాజనుట సత్యము.

విశ్వామిత్రునియాగము నిర్విఘ్నముగ పరిసమాప్తి చెందినది.

ఇల్లు బయలుదేరిననాటినుండి పదియవరోజునకు యజ్ఞముపూర్తియయినది. ఆ రాత్రి రామలక్ష్మణులు సుఖముగ నిదురించినారు. ఇట్లుండ జనకమహారాజు 'సీతా స్వయంవరమును' ప్రకటించి నారదుడు చెప్పినమాటచొప్పున శుభలేఖలను విశ్వామిత్రునకంపినాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంటనిడుకొని బయలుదేరి కతిపయ ప్రయాణమాచరించి మార్గమధ్యమునగల విశేషములను రామలక్ష్మణులకు తెలియజెప్పుచు గౌతమాశ్రమమును జేరినారు. రామచంద్రుడాయాశ్రమమును జూచి 'ఈయాశ్రమంబెవ్వరిది ? నిర్జనమైయున్నకతంబేమి ? యని విశ్వామిత్రుని ప్రశ్నించినాడు. విశ్వామిత్రుడు అహల్యా వృత్తాంతమును చెప్పినారు. గౌతముడు దేవేంద్రుని శపించిన సన్నివేశమును త్యాగయ్యగారు

"దేవేంద్రునికి సుదేహము - పూర్వదేవుళ్ళ కమృతమభావమే గాని'[1] అను ధానిలో వ్యంగ్యముగ సూచించినారు. కావ్యము వ్యంగ్యవైభవముగదా !

వాల్మీకి రామాయణమున అహల్య శిలగా శపింపబడినట్టులగాని, రాముని పాదరజము సోకినపిదప శిలారూపముననున్న అహల్య నిజరూపమును పొందగలదని కాని లేదు.

## అహల్యా వృత్తాంతము - వాల్మీకము

"ఇహ వర్ష సహస్రాణి బహూని త్వం నివత్స్యసి
వాయుభక్షా నిరాహారా తప్యన్తీ భస్మశాయినీ
అదృశ్యా సర్వభూతానామాశ్రమేఽస్మిన్ని వత్స్యసి
యదా చైతద్వనం ఘోరం రామో దశరథాత్మజః
ఆగమిష్యతి దుర్ధర్షః తదా పూతా భవిష్యతి"

1. రానిదిరాదు — మణిరంగు.

అహల్యా వృత్తాంతము - అధ్యాత్మ రామాయణము

దుష్టేత్వంతిష్ఠ దుర్వృత్తే శిలాయామాశ్రమే మమ
నిరాహారా దివారాత్రం తపః పరమమాస్థితా
ఆతపానిల వర్షాది సహిష్ణుః పరమేశ్వరమ్
ధ్యాయన్తీ రామమేకాగ్రమనసా హృది సంస్థితమ్.
నానాజన్తు విహీనోఽయ మాశ్రమో మేఽధ భవిష్యతి
ఏవంవర్ష సహస్రేషు హ్యనేకేషు గతేషుచ
రామో దాశరథిః శ్రీమానాగమిష్యతిసానుజః
యదా త్వదాశ్రయశిలాం పాదాభ్యాం ఆక్రమిష్యతి
తదైవ ధూత పాపాత్వం రామం సంపూజ్య భక్తితః
పరిక్రమ్య నమస్కృత్య స్తుత్వా శాపాద్వి మోక్షసే
పూర్వవన్మమ శుశ్రూషాం కరిష్యసి యథాసుఖం-

త్యాగయ్యగారు రామాయణకృతి రచనాసందర్భముననొక్క వాల్మీకమునేగాక సంస్కృతాంధ్రభాషలలోగల అనేక రామాయణములననుసరించినట్లు కనపడును. అహల్యా వృత్తాంతమును త్యాగయ్యగారు అధ్యాత్మ రామాయణానుసారముగ కీర్తించినారు.

శ్రీరామపాదమా నీ కృపచాలునే చిత్తానికిరావే ॥శ్రీ॥
వారజభవ సనకసనందనవాసవాదులెల్ల పూజించే ॥శ్రీ॥
దారినిశిలయై తాపముతాళకవారము కన్నీరును రాల్చగ
శూరఅహల్యను చూచి బ్రోచితాకీతి ధన్యుజేయవే
త్యాగరాజ గేయమా ॥శ్రీ॥

త్యాగయ్య గారీకీర్తనకు అమృతవాహిని రాగమునెన్నుకొనినారు. అహల్యా పాపము ప్రక్షాళనము కావలయును. అందులకమృతము కావలయును. "కలుష విధ్వంసిని గంగకుమారియై పతితపావనుడన్న ప్రతిభదెచ్చె"[1] సర్వపాపములను

1, ఆంధ్రనాయక శతకము - కాసుల పురుషోత్తమకవి -

పోట్రోచు గంగ విష్ణు పాదములనుండి యుద్భవించినదిగదా! "విష్ణు పాదోద్భవీ గంగా" - అనిగదా! గంగ కుమార్తెగ జనించుటచేతనే పతితపావనుడన్న ఖ్యాతిని వహించినాడట విష్ణువు. పతితురాలైన అహల్యనుద్ధరింప యోగ్యుడు విష్ణ్వంశతో జనించిన రామచంద్రుడు. "కామిని పాపముకడిగిన పాదము" గదా అది. రామ పాదము శిలారూపముననున్న అహల్యను తాకుటతో అమృతము జాలువారి అహల్య పాపము ప్రక్షాళనమైనగాని - ఆమె స్వస్వరూపమును పొందదు కాననే త్యాగయ్య గారు పై కీర్తనమునకు "అమృతవాహిని" అను రాగము నెన్నుకొనినారు. అట్లెన్నుకొనుట యెంతయు సముచితము.

ఈ కీర్తనలో త్యాగరాజస్వామి తన భావనలో శాపనిమిత్తముగా శిలయైన అహల్యజాల్గిని, ఆమె తాపమును, కన్నీరు కార్చుటను భావించి రామపాద మహిమ మును కీర్తించినారు.

"రాతిని నాతిజేసిన చరణములను జూచేదెన్నటికో" ఆ పాదములను జూచు భాగ్యము తనకెన్నటికి కలుగును? అసలు కలుగునా? కలుగదా?అని వేదన చెందినారు.

అహల్యా శాపవిమోచనమును - తద్ద్వారా శ్రీరామ పాదమహిమముననేక కీర్తనములలో కొనియాడినారు.

నీ పద పంకజములను నే నెఱనమ్మినాను - అను బేగడ రాగ కీర్తనము నందలి చరణములో -

కోపముతో మునుతాపసి ఇచ్చిన
శాపము అహల్య అనుదినము
చాపరాయి తను తాపమోర్వలే
నాపెనుగని పరితాపముఁ దీర్చిన-

కరుణాకర నీచరణము శిలను
వరనారిగఁ జేసినది గాకను

(భవసన్నుత నాదఘమెంత ఘనీభవమో - వరాళి)

మదిని బెదురు సుదతిని గనినీదు
పదములు దయను ధరలోను బ్రోచే
(శరణు శరణనుచు మొరలిడిన నాగిరములన్ని పరియాచకము లౌనా-
మధ్యమావతి)

ఆ రాత్రి ( ఇల్లు బయలుదేరిన 14వనాటిరాత్రి ) విశ్వామిత్రుడు, రామ లక్ష్మణులు గౌతమాశ్రమమున అహల్యా గౌతముల యాతిధ్యమును స్వీకరించి అచట శయనించిరి. 15వరోజు ఉదయము బయలుదేరి మిధిలానగరము చేరినారు. జనకుడు వారలకు స్వాగతము పలికినారు. తమకేర్పాటు చేసిన విడిది గృహము నకు బయలుదేరుచున్న విశ్వామిత్రుని, రామలక్ష్మణులను - మిధిలాపుర స్త్రీలు మేడలపైనుండి జూచిరి. రామచంద్రుని సౌందర్యమునకెంతగానో అబ్బురమంది -

ఏకావదత్పశ్య సఖి! కామకోటి సమావిమౌ
ఏతాదృశంతు సౌందర్యం దేవేష్వపి నదృశ్యతే-
చతుర్భుజో మహావిష్ణుశ్చతురా స్యోపితామహః
శివః పంచముఖశ్చాయముపమేయో నతైస్సఖి-
త్యాగయ్యగారీ శ్లోకభావము నీక్రింది కీర్తనలో నుంచినారు.
"ఎవరికైయవతారమెత్తితివో - ఇపుడైన తెలుపవయ్యా!
రామయ్యా! నీవెవరికై

వేదవర్ణనీయమౌ నామముతో
విధిరుద్రు కు మేల్మియగు రూపముతో
మోదసదనమగు పటుచరితముతో
మునిరాజవేషియౌ త్యాగరాజనుత ॥ఎ॥

స్వయంవరమునకెందరోరాజులు విచ్చేసిరి. శ్రీరాముడు వచ్చినజాడలేదు. సీత మనసు అల్లకల్లోలముగనున్నది. స్నేహితురాండ్రెవరో వచ్చి శ్రీరామాగమనమును గురించి సీతకు చెప్పినారట. అప్పుడు సీత ముఖమున దోబూచులాడిన ఆనందమును తనకు దయసేయవలసినదిగా త్యాగయ్య శ్రీరాముని అడుగుచున్నారు.

యదుకుల కాంభోజి - ఆది

దయసేయవయ్యా సదయ రామచంద్ర ॥ద॥

దయను కొంచమైన నాడుదలచుచున్న సీతాసుఖము ॥ద॥

క్షితినాథులరాకయు సమ్మతి లేక శ్రీసాకేత

పతి రాడేయన వచ్చెనని సతికి గల్గిన

యానందము ॥ద॥

వాల్మీకమున సీతారాములకు పూర్వరాగములేదు. సీతారాములిరువురు మొట్ట మొదటగా కలిసికొనిన కల్యాణమంటపమున సీతను రామునకు ఒప్పగించు సందర్భమున.

"ఇయం సీతామమసుతా సహధర్మచరీ తవ

ప్రతీచ్ఛచైనాం భద్రంతేపాణింగృహ్ణీష్వపాణినా

కంబన్, తులసీదాసులు వివాహాత్పూర్వమే రాముడు సీతను చూచినట్లు, మిధిలాపుర ఉద్యానవనమందలి పూదోటలో పరస్పరము ఒకరినొకరు చూచుకొని నట్లు వ్రాసినారు. అధ్యాత్మరామాయణమున సీత రాముని చూచుట, ఆయనపై ప్రేమ గలిగి రాముడు శివధనుర్భంగముచేసి తానాయనకు భార్యనుకాగలిగిన పదునాలుగేండ్లు అరణ్యములలోనుందునని సర్వదేవతలను ప్రార్థించినట్లు గలదు.

సుందరకాండలో హనుమతో సీత "అలరుతోటన్గన్నెనై తొలుత నీ కగపడి పొంచున్న పొగడగున్న" అనినట్లు హరిదాసజగద్గురువులు ఆదిభట్ల నారాయణదాసు గారు యథార్థరామాయణమున వ్రాసినారు.

స్వయంవరసభప్రారంభమైనది. స్వయంవరసమాగత రాజకుమారులకందరకు జనకుడు స్వాగతముపలికి "ఈధనుర్యాగమునందు శంకరశరాసనమెక్కిడు నెవ్వడామహాభాగువరించు నాయనుంగు పట్టి సమస్త సభాముఖమ్మునన్" అని చాటి నారు. శివధనుర్భంగముచేయుటకు రాజకుమారులెవ్వరును ముందుకురారైరి. జనకుడు ఘోషపడి"

"అద్వ్యపాత్పరతోప్యమీ నృపతయః సర్వే సమభ్యాగతాః
కన్యేయం కమనీయకోమలరుచిః కీర్తిస్తునాతఃపరామ్
నాకృష్టం నచటంకృతం ననమితం నోత్థాపితంస్థావతః
కేనాపీదమహో మహద్ధమరతో నిర్వీర్యముర్వీతలమ్"

అనినాడు. అప్పుడు విశ్వామిత్రుడు

"విశ్వామిత్ర స్సధర్మాత్మా శ్రుత్వాజనకభాషితమ్
వత్స! రామ! ధనుఃపశ్య ఇతి రాఘవమబ్రవీత్"

అనినాడు. విశ్వామిత్రునాదేశముతో శివవిల్లు విఱువటకు కడంగినారు శ్రీరాముడు. త్యాగయ్యగారీఘట్టమును

"మునికనుసైగ తెలసి శివధనువు విరచే సమయమున త్యాగరాజనుతుని మోమున రంజిల్లు అలకలల్లలాడగగని ఆ రాణ్మని యెటు పొంగెనో" అని కీర్తించినారు.

శివధనువును విరచుసమయమున రాముని అలకలు అల్లలాడినట్లు వాల్మీకమున లేదు. మఱియే యితర రామాయణములందును లేదు.

రంగనాథరామాయణమున నీక్రింది విధముగా నున్నది

"సౌమిత్రియును దాను జయ్యనలేచి ప్రేమయుదమకంబు
పెనగొనుచుండ జెలఁగుచు దనమీఁదిచెఱఁగుఁరాదిగిచి
మొలనూలు బిగజుట్టి మోహనాకృతుల దిరముగా నిగ్గులు
దిశలశోభిల్ల
నరవిందలోచనుండసమసాహసుడు మొలనూలి
ఘంటలు మురువుమిన్నగను
మలగుచు నవరత్నమాలికలొప్పరల బాహుర్లుంగ
రాల్పఁ కంకణములు

బాహువుల(గుళావలి కాంతులీనసమరంగ గర్ణభూషామల
కాంతి
కొమరారు చెక్కిళ్ళుగుదిగొనిమెఱయ అలకలు పెడతలనట
నృత్యమాడి తళుకొందు బంగారుకాంతులీన

రంగనాథ రామాయణమునను శివధనుర్భంగ సమయమున రాముని అలకలు అల్లలాడినట్లు లేదు. "అలకలు పెడతలనట నృత్యమాడి" అని యున్నది. అలకలు పెడతల నృత్యమాడుట త్యాగయ్యగారికి నచ్చలేదేమో! మారీచుని మదహారణ సమయమున శ్రీరాముని అలకలు అల్లలాడినట్లు చిత్రీకరించిన త్యాగయ్య శివధనుర్భంగ సమయమున గూడ "అలకలు అల్లలాడినట్లుగ" చిత్రీకరించి ఆ సన్నివేశమునకు వన్నె పెట్టినారు.

"ధర్మాత్మ చరణంబుసోక శివచాపంబును తప మేమి చేసెనో తెలియ" అని శ్రీరాముని పాదపద్మములను తాకుటకు శివధనుపేమి తపము చేసినదో కదా! ఆ రాముని పాదపద్మములను తాకునదృష్టము తనకు లేదుగదా అని పరితపించినారు. త్యాగయ్య కోరుకొనినది "రామపాద సేవయే". ఎన్నో కీర్తనములలో ఆ విషయమును చెప్పికొనినారు.

1) శ్రీమానినీ మనోహర చిరకాలము మాట యొకటేరా
వేమారు బల్కజాలరా ॥శ్రీ॥
శ్రీమంతులౌ నీ సోదరులు సేయురీతి పాదసేవ
కోరితి ॥శ్రీ॥

2) అనుదినము నీ పాదాంబుజముల నొత్తుచును
కనకమయమౌ సురటి కరముఁబడి విసరుచును
ఘనమైన ఫణితల్పమునను నిచి పాడుచును
కనులార సేవింపుచు కాలముగడుపకను
॥తీరునా నాలోనిదుగ్ధ॥

"ఘనమైన శివుని చాపమును ద్రుంచిన పాదమును జూచే దెన్నటికో"

శివధనుర్భంగమైనది. సీత శ్రీరాముని మెడను పుష్పమాల నలంకరించి నది. దశరథుడు సపరివారముగ మిథిలకేతెంచినారు. నలుగురు కొడుకులకేకకాల మున కళ్యాణము జరిపించి ఆనందము ననుభవించవలయునన్న దశరథుని కోరిక ఈడేరినది. జనకుడు శ్రీరాముని కాళ్ళుకడిగి కన్యాదానము చేసినారు.

"జనకరాజు పాలగడిగిన యా కాళ్ళను జూచేదెన్నటికో" "తన తనయ నొసగి కనులారగన జనకుడు తపమేమి చేసెనో తెలియ" అని జనకుని తపమును కొనియాడినారు. శ్రీరాముడు "సీతకు బొట్టు కట్టి" నారు. "చనువున సీతకు బొట్టు కట్టిన ఆ కరమును జూచేదెన్నటికో" శ్రీరాముడు తనకు తాళిబొట్టు కట్టినందులకు, తా నాయనకు అర్థాంగి కాగలిగినందులకు సీత చాల సంతసించినది. శ్రీరాముడు బొట్టుకట్టి కరముబట్టువేళ సీతకున్న సుఖమును తనకును దయసేయుమని అడుగు చున్నారు త్యాగయ్య.

ఎట్టివారికైన దొరకనట్టి జనకజను బొట్టు
గట్టి కరముఁబట్టువేళ కాంతకున్న సుఖము తనకు
॥దయసేయవయ్య॥

శివధనుర్భంగమునకై స్వయంవరసభకు "రాముడురాడేమో" అని తలచు సీతకు రాముడు వచ్చినప్పుడు కలిగిన ఆనందము, సుందరసుకుమార శరీరుడైన రాముడు "శివధనువును వంచలేడేమో" అనుకొను సీతకు రాముడు తన పరాక్రమ మును జూపినప్పుడు కలిగిన ఆనందము, శ్రీరాముడు తనకు బొట్టుకట్టి, కరగ్రహ ణము చేసినప్పుడు సీతకు కలిగిన సుఖము తనకు దయసేయుమని త్యాగయ్యగారు చెప్పిన కీర్తన

దయసేయవయ్యా సదయ రామచంద్ర
దయను కొంచమైన నాడు దలచుచున్న
సీతాసుఖము ॥ద॥
క్షితినాథులరాకచేయు సన్మతిలేక శ్రీసాకేత
పతి రాడేయన వచ్చెననిన సతికిగల్గిన యానందము ॥ద॥

చెలియరో నావలె నాథునకుగలరేమో రాలేదని జాలి
దెలిసి మ్రొక్కుకొని బ్రోవువేళ బలిమినినెదురైన
సుఖము ॥ద॥
కొంచెమీరూపమూవిల్లు వంచకూడకపోనోయని
ఎంచిజాలిజెందమేను బెంచికనిపించినట్లు ॥ద॥
ఎట్టివారికైనదొరకనట్టి జనకజను బొట్టు
గట్టి కరముఁబట్టువేళ కాంతకున్న సుఖము తనకు ॥ద॥
కోరినవారలను నేనీరీతి బ్రోతునని సభ
వారలకు దెలియజేయు దారి త్యాగరాజునకు ॥ద॥

శ్రీరాముడు సీతాకరగ్రహణము చేసినారు. "దహరంబుకదుగ కరమును బట్ట జానకి తపమేమి చేసెనో" తెలియ అని జానకి తపమును కొనియాడినారు.

సీతాకరగ్రహణము చేసిన దొరయగు రామచంద్రునకు దృష్టిదోషము తగులకుండ రక్షబెట్టినారు.

రక్షబెట్టరే దొరకు రక్షబెట్టరే
వక్షస్థలమున వెలయు లక్ష్మీరమణునికి సాయ ॥ర॥
సీతాకరమునుబట్టి చెలగినదొరకు ॥ర॥

వైశాఖశుద్ధదశమినాడు సీతారాముల కళ్యాణము జరిగినది. ప్రతి సంవత్సరము త్యాగయ్యగారు తమ యింట సీతారాముల కళ్యాణమునతివైభవముగ జరిపించుచుండెడివారు. "శ్రీరాముని పెండ్లికొడుకుగ నలంకరించి - కళ్యాణము జరిపించిన తరువాత కళ్యాణరాముని సొగసును వర్ణింపదరము కాదనినారు త్యాగయ్యగారు.

"ఇంతనుచునర్ణింపదరమా బ్రహ్మేంద్రాదులకైన ॥ఇం॥
కంతునిగన్న మాచక్కని కళ్యాణరామచంద్ర
నీసొగసింతనుచు॥

సీతారాముల కళ్యాణవైభవమును త్యాగయ్యగారు ఆనందపారవశ్యముతో ప్రస్తుతించినారు.

సీతాకళ్యాణ వైభోగమే ||సీ||

పవనజస్తుతిపాత్ర పావనచరిత్ర - రవిసోమవరనేత్ర -
రమణీయగాత్ర ||సీతా||

భక్తజనపరిపాల భరితశరజాల, భుక్తిముక్తిదలీల
భూదేవపాల ||సీతా||

పామరాసుర భీమ పరిపూర్ణకామ శ్యామజగదభిరామ
సాకేతధామ ||సీతా||

సర్వలోకాధార సమరైకవీర గర్వమానస
దూరకనకాగధీర ||సీతా||

నిగమాగమ విహార నిరుపమశరీర -
నగధరాఘవిదారనతలోకాధార ||సీతా||

పరమేశనుతగీత భవజలధిపోత తరణికులసంజాత
త్యాగరాజనుత ||సీతా||

తలంబ్రాలు పూర్తియైనవి. సీతారాములకు హారతి నిచ్చినారు.

పతికి హారతీరే - సీతాపతికి హారతీరే
అతిమృదుతర సత్యభాషణునికి.
అఖిలాండనాధునకు ||సీతా||

సీతారాముల కళ్యాణానంతరము దశరథుడు సపరివారముగనయోధ్యకు బయలుదేరినారు. శ్రీరాముడు శివధనువును విరచిన విషయమును విని పరశురాముడు రోషావేశముతో శ్రీరామునిపైకి వచ్చినాడు. శ్రీరాముడు శాంతముగా, మృదువుగా మాటలాడినను విననివాడుకాడు పరశురాముడు. పరశురాముని భుజబల గర్వము నణచినాడు దాశరథి.

"కోపమున భృగుసుతుచాపబలమందుకొన్న బాహులను
చూచేదెన్నటికో||

పరశురాముని గర్వమునణచిన శ్రీరామునిట్లుకీర్తించినారు త్యాగయ్య.

రఘువీర - రణధీర - రారా రాజకుమార
భృగుసూను మదవిదారబృందారకాధార ॥రఘు॥

భృగురాముని మదమణచి శ్రీరాముడయోధ్యకు చేరినారు.

## అయోధ్యాకాండ

వాల్మీకిమహర్షి అయోధ్యాకాండ కథను

"గచ్ఛతామాతులకులం భరతేన తదాఽనఘః
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః"

అను శ్లోకముతో నారంభించినారు.

"గచ్ఛ్" అను ధాతువునకు 'వెళ్ళుట' అనియర్థము. భరతుడు శత్రుఘ్నునితో కలిసి మేనమామల యింటికి వెళ్ళినాడు. పట్టాభిషేకము భంగమయి శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడై పదునాలుగేండ్లు దండకాటవిని వసించుటకు వెళ్ళినాడు. రామవియోగమును తట్టుకొనలేక దశరథుడు పరలోకములకేగినాడు. అయోధ్యా రాజధానియే కోసలదేశమును వీడి నందిగ్రామమును చేరినది. "ఋషయః సత్యవచనః" అనిగదా! 'నాఽనృషిఃకురుతే కావ్యమ్" అనిగదా అలంకారికవచనము. వాల్మీకిమహర్షి మొదట ఋషి. ఆ పిమ్మట కవి. ఆ మహర్షినోట వెలువడిన వాక్యముల కన్యథాత్వము కలుగునా!

"లౌకికానాంహిసాధూనాం అర్థంవాగనువర్తతే
ఋషీణాంపునరాద్యానాం వాచమర్థోఽనుధావతి"

(భవభూతి-ఉత్తర రామచరిత్ర).

ఇక అయోధ్యాకాండమునందలి సన్నివేశములను త్యాగయ్యగారెట్లు చిత్రించిరో చూతము.

వివాహమగునాటికి శ్రీరాముని వయసు పండ్రెండు సంవత్సరములు. వివాహానంతరము పండ్రెండు సంవత్సరములు శ్రీరామచంద్రుడు సీతాసహితుడై అయోధ్యలో సర్వసుఖము లనుభవించినారు. సీతారాముల కళ్యాణము "సాధారణ నామ సంవత్సర వైశాఖ శుద్ధ దశమి"నాడు జరిగినది. శ్రీరామునకు దశరధుడు పట్టాభిషేకముచేయ సంకల్పించినది దుందుభినామ సంవత్సర చైత్ర శుద్ధ నవమినాడు". అయోధ్యాకాండ ప్రారంభమున వాల్మీకి శ్రీరాముని గుణగణముల నేకరువు పెట్టినారు.

"బుద్ధిమాన్ మధురాభాషీపూర్వభాషీచరాఘవః"
"సచనిత్యం ప్రశాంతాత్మా మృదుపూర్వం భాషతే"
సహిరూపోపన్నః వీర్యవాన్ అనసూయకః ....
తమేవంలోకపాలోపమంనాథమకామయతమేదినీ

కేవలము రాముడు జ్యేష్ఠుడనియే కాదు దశరధుడాయనకు పట్టముకట్ట సంకల్పించినది. సకల కల్యాణగుణ సంపూర్ణుడు, పుణ్యగుణాభిరాముడు శ్రీరాముడగుటయే.

"బుద్ధిమాన్ మధురాభాషీ - పూర్వభాషీ చ రాఘవః" అను శ్లోకములోని "మధురాభాషీ" అను విశేషణమును తీసికొని త్యాగయ్యగారు శ్రీరాముని 'సుధామాధుర్యభాషణ' అని కీర్తించినారు. "సచనిత్యం ప్రశాంతాత్మా - మృదుపూర్వం భాషతే" అను శ్లోకమునందలి భావమును "నీ చిత్తము నిర్మలము నిశ్చలమని నిన్నే నమ్మినాను. (సచనిత్యం ప్రశాంతాత్మా) - మృదుభాషణ నత విభీషణ(మృదుపూర్వం భాషతే) - అను కీర్తనము లందు జొప్పించి శ్రీరాముని గుణానుకీర్తనము చేసినారు త్యాగయ్యగారు.

దశరధుని చిరకాలవాంఛ శ్రీరాముని పట్టాభిషిక్తుని చేయవలయుననీ. కదానామ సుతంద్రక్ష్యామి అభిషిక్తమహం ప్రియం' రామపట్టాభిషేక విషయమును వసిష్ఠునితో చెప్పి ఆయన అంగీకారముతో అయోధ్యాపుర ప్రజలనందరను రావించినాడు. (నానానగర వాస్తవ్యాన్ పృథక్ జానపదానపి నతుకేకయ రాజానం జనకం వా నరాధిపః) ప్రజల కందరకు రామపట్టాభిషేక వార్తను తెలియజెప్పినాడు. ముక్తకంఠముతో-

"ఇచ్ఛామోహి మహాబాహుం రఘువీరం మహాబలం
గజేనమహతాయాన్తం రామంఛత్రావృతాననం"

అని తనయంగీకారము తెలిపినారు దశరథుడు సంతసించినాడు.

శ్రీరాముడు పట్టాభిషిక్తుడై రాజ్యపాలనము సేయనున్నాడని దేవతలకు తెలిసినది. "దేవకార్యంచ రామస్యావతార ప్రయోజనమ్"– రామావతార ప్రయోజనము పౌలస్త్యవధ. "పౌలస్త్యవధమిత్యేవచకార చరితవ్రతః" అని వాల్మీకి అభిభాషణము. అయోధ్యలోనుండి రాజ్యపాలనము సేయుటకు గాదు శ్రీరాము డవతరించినది. దేవతలకు కావలసినది రామపట్టభంగము. బ్రహ్మ నారదుని "శ్రీరామునకు కర్తవ్యమునుద్బోధింపుమని" అయోధ్యకంపినారు. శ్రీరాముని దగ్గరకు నారదాగమనము అవాల్మీకము. నారదుడయోధ్యనుచేరి శ్రీరాముని బహువిధముల కీర్తించి –

"రావణస్యవధార్థాయ జాతోఽసిరఘుసత్తమ
ఇదానీంరాజ్యరక్షార్థం పితాత్వామభిషేక్ష్యతి
యదిరాజ్యాభిసంసక్తోరావణంనహనిష్యసి
ప్రతిజ్ఞాతేకృతారామ భూభారహరణాయవై"

(అధ్యాత్మరామాయణము - అయోధ్యాకాండ ప్రథమసర్గః)

శ్రీరామునకు కర్తవ్యమును జ్ఞప్తికి దెచ్చినారు. త్యాగయ్యనారదాంశతో జన్మించిరని చెప్పువారు లేకపోలేదు. (In the aspect of Music he is Narada). త్యాగయ్యగారీ సన్నివేశమును తన మనమున సంభావనచేసి శ్రీరాముని "నీ అవతార కారణమేమని" ప్రశ్నించుచున్నారు.

ఏలావతారమెత్తుకొంటివి ఏమికారణము రాముడై ॥ఏ॥
అలము సేయుటకా అయోధ్యపాలనజేయుటకా
ఓ రాఘవ ॥ఏ॥
యోగులను జూచుటకా భవరోగులను బ్రోచుటకా శత
రాగరత్నమాలికలు రచించిన త్యాగరాజునకు
వరమొసంగుటకా ॥ఏలావ॥

అయోధ్యయందేయుండి శ్రీరాముడు రాజ్యపాలనము సేయుచున్న రావణసంహారము జరుగు నవకాశములేదు. రావణసంహారమే అవతారప్రయోజనముగా గలిగిన శ్రీరామచంద్రుడయోధ్యయందుండుటకవకాశములేదు. వచ్చిన నారదునకు పట్టాభిషేకము జరుగదని, రేపుదయమే అడవులకు బయలుదేరి వెళ్ళగలమని, సీతాకారణముగా రాక్షసులతో వైరమువచ్చునని, రావణుని సంహరింపగలనని శ్రీరాముడు చెప్పినారు.

నారదుడు సంతోషముతో వెడలినారు. శ్రీరాముడు చెప్పినట్లుగనే మందర ప్రోద్బలమువలన కైక వరములుకోరుట - కైక కోరిన వరముల కారణముగా రామ పట్టాభిషేకము భంగమగుట — జరిగినది.

ముందుగా కైక మందరవలన రామపట్టాభిషేకవార్తను విని ముత్యాల హారమును బహూకరించినది.

*ఉత్తసౌహార్ద సంపూర్ణా చంద్రలేఖేవశారదీ
అతీవసాతు సంతుష్టా కైకేయీ విస్మయాన్వితా
ఏకమాభరణం తస్యైకుబ్జాయై ప్రదదౌ శుభమ్

త్యాగయ్యగారీ సన్నివేశమునెంత మనోజ్ఞముగా చిత్రీకరించిరో చూడుడు.

మనసా మనసామర్థ్యమేమి ఓ ॥మనసా॥
విను సాకేతరాజు విశ్వమనే రథమునెక్కి
తన సామర్థ్యముచే తానే నడిపించెనే ॥మనసా॥
అలనాడు వసిష్ఠాదులు పట్టముగట్టే పలు
కులవిని వేగమె భూషణముల నొసగిన కైకను

శ్రీరామ పట్టాభిషేక వార్తను విన్న ఆనందముతో మంథరకు ఆభరణములను బహూకరించు సమయమునకు కైక మనసు కలుషితముకాలేదు. శ్రీరామ పట్టాభిషేకము భంగము గావించుటకు మంథర ఎంత ప్రయత్నించినను కైక "రామేవా భరతే నా విశేషం నోపలక్షయే తస్మాత్తుష్టాస్మి యద్రాజా రామం రాజ్యేభిషేక్ష్యతి, యథామే భరతో మాన్యః - తథాభూయోపి రాఘవః" అని సమాధానము చెప్పి మంథర ప్రయత్నమును సాగనిచ్చినదికాదు. కాని అనుకొనని విధముగా

పట్టాభిషేకము భంగమై శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడై పదునాలుగేండ్లు కానన సీమలకేగుట జరిగినది. ఇది ఎవ్వరునూహించనిది. రామపట్టాభిషేకము భంగమగుటకు మంధర కారణమను జనాపవాదమున్నను ఇంతటి యుద్యమమునకు కేవలదాసి మాత్రురాలైన మంధర కారణమనుట సరికాదు. మంధరయే కాదు; కైకకూడ కారకురాలు గాదు శ్రీరామ పట్టభంగమునకు. దేవతల ప్రోత్సాహమున ముందు సరస్వతి మంధర వాక్కున ప్రవేశించి, తరువాత కైకవాక్కున ప్రవేశించి- అంత కఠినముగా నామెచేత మాటలాడింపజేసి-మనసును కలుషితము చేసినది

'కైక తపంబు చేసినది కాననె రాముని లోననున్న లో
కైక మహత్వమున్ దెలిసి యామహితాత్మునరణ్యసీమకున్
బొకడపెట్టు యత్నమును బూనినదాయమ పంతమొక్కడే
సాకుగచేసినాడు రఘుచంద్రుడు లోకము నుద్ధరింపగన్'

(మాండవి - శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులు)

చిత్రకూటమున భరతుడు కైకేయిని నిందించుచుండ వసిష్ఠుడు భరతుని వారించి "శ్రీరామ వనవాసమునకు మీ తల్లి కైక కారకురాలు కాదు. "దేవ కార్యంచ రామస్యావతార ప్రయోజనమ్", అదియునుగాక సీతారామ లక్ష్మణులకు సాముద్రిక లక్షణములనుబట్టి వనవాసము తప్పనిసరి యయినది. తల్లి కైకను నిందింపవలదని" చెప్పినాడు. ఆ సాముద్రిక లక్షణములెట్టివని ప్రశ్నించిన భరతునకు వసిష్ఠుడు -

'రామే విరళ దన్తత్వం లక్ష్మణేస్తు పాదఘుణ్టికా
సీతాయాః కేశభగ్నత్వం త్రిభిరారణ్య మాశ్రితాః'

అని సమాధానము చెప్పినారు.

ఈ విషయములన్నిటిని మనసునందుంచుకొని త్యాగయ్యగారు రామ పట్టాభిషేక భంగమునకు మంధరగాని, కైకగాని కారకులుగారు, దైవమే బలీయము - విధిర్బలీయసీ అనినారు.

మనసా-మనసామర్థ్యమేమి అను కీర్తనములకు కీ॥ శే॥ శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు "త్యాగరాజు - ఆత్మవిచారము" అను గ్రంథమున నీ క్రింది విధముగ వ్యాఖ్యానము వ్రాసినారు.

"మనసా-మనసామర్థ్యం ఏముంది? చచ్చు సామర్థ్యం. విశ్వం అనే రథం ఎక్కి ఆ సాకేతరాజు తన సామర్థ్యముతో సర్వమూ నడిపిస్తున్నాడు. చూడు, అదీ సామర్థ్యం అంటే. రాముడికి పట్టం కడతారనే సంగతి మంథరకు చెప్పగా చాల సంతోషించి తన నగలు కొన్నితీసి ఆ మంథరకు బహుమతి ఇవ్వబోయిందట ఆ మహాతల్లి కైక. అలాంటి కైక లోకులు తల్చుకున్నప్పుడల్లా తిట్టేదకంగా అనగా అంత అనుకూలురాలు అంత ప్రతికూలురాలుగా ఎల్లా మారిపోయింది అతని సామర్థ్యం కాకపోతే".

శ్రీ ఛమికిపాటివారి వివరణమునకు శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ప్రశంస.

"ఇక్కడ అనుకూలురాలైన కైకను ప్రతికూలురాలుగా మార్చివేయడం అనువర్థం చెప్పడం సొగసుగా ఉన్నది. కైకను మాయవలలో వేసికొన్నాడు శ్రీరాముడు. యావద్రామాయణగాథకీపట్టు శ్రీరాముని అరణ్యవాసం. కైక హృదయం ప్రతికూలంకానినాడు వనవాసమే కల్ల. వనవాసం లేకపోతే సీతాపహరణమే జరుగదు"

పట్టాభిషేకవార్తను కైకకుచెప్పి ఆమెను సంతోషపఱచవలయునని దశరథుడు కైకేయీ గృహమును

సకైకేయ్యాగృహంశ్రేష్ఠం ప్రవివేశమహాయశాః
పాణ్డురాభ్రమివాకాశం రాహుయుక్తంనిశాకరః''

ప్రవేశించినారు. కైక కోపగృహము జేరినది. కైక కోపమునకు కారణమేమో దశరథుడూహింపలేకపోయినాడు. రామపట్టాభిషేకము కారణమయియుండునన్న ఊహ దశరథునకు రాలేదు. కారణము "సవృద్ధస్తరుణీం భార్యాం ప్రాణేభ్యోపి గరీయసీం." దశరథునకు కైకమీద ఎక్కడలేని మోహము. కైక వరములడుగుట. దశరథుడు వరములననుగ్రహించుట, రాముని మీద దశరథుడు ఒట్టుపెట్టుకొనుట, కైక రాముడు పదునాలుగేండ్లు కానలకేగవలయునన్నప్పుడు "రాజ్యం గృహాణ పుత్రాయ - రామస్తిష్ఠతుమందిరే - అంజలింకుర్మి కైకేయి పాదౌస్పృశామి" అని దశరథుడెంతగానో బ్రతిమిలాడినాడు. దశరథుడెంతటివాడైననేమి? కైకకులొంగక

తప్పలేదు. ఈ సన్నివేశమును మనసునందుంచుకొనియేకాబోలు "ఎంతనేర్చిన ఎంత జూచిన ఎంతవారలైన కాంతదాసులే" అనినారు.

సుమంత్రుడు తెల్లవారనున్న సమయమున కైకేయీమందిరమునకు వెళ్ళినాడు. శ్రీరాముని తన మందిరమునకు తీసికొనిరమ్మని సుమంత్రునికి చెప్పి పంపినది. సుమంత్రుడు రాముని తీసికొని కైకేయీ మందిరమునకు వెళ్ళినాడు. దశరధుడు శ్రీరామునిజూచి తను చేసినపనికి సిగ్గుపడి రాముని పలుకరించలేదు. కైకయే తనకు దశరధుడిచ్చిన వరములను రామునకు తెలియజెప్పి పదునాలుగేండ్లు అరణ్యవాసముచేయబొమ్మని, భరతుడు పట్టాభిషిక్తుడుకాగలడని చెప్పినది. "తచ్ఛృత్వా రాఘవోవాక్యం అభిషేకాత్పరంప్రియమ్" - తండ్రి పట్టాభిషిక్తుడవుకమ్మని చెప్పినపుడు పొందిన యానందము కంటె పినతల్లి పదునాలుగేండ్లడవులకు బొమ్మని చెప్పినపుడు రాముడెక్కువ ఆనందమును పొందినాడు. శ్రీరామచంద్రుడు కైకేయీ దశరధులకు ప్రణమిల్లి అటనుండి నిష్క్రమించినాడు.

శ్రీరాముడట్లు వెడలుటనుజూచి దశరధుడు -

రామచంద్ర నీదయ ఏలరాదయా ॥రా॥
కామకోటి సుందర కరధృతమందర
ప్రేమమీర ముందర బిల్వరాకయుందుర ॥రా॥
కాననంబు తాపమో కైకమీద కోపమో
నేను చేయు పాపమో నీకు శక్తిలోపమో ॥రా॥
ఆడదన్న రోసమో అలనాడుపాసమో
మేడలేనివాసమో మేము సేయు దోసమో ॥రా॥
కల్లలైననేయ మాకంటె నీకు హేయమా
తల్లడిల్లన్యాయమా త్యాగరాజగేయమా ॥రా॥

రాముడు తనపై కోపించినాడని తలచి పై విధముగ సంభావన చేసినారు.

రామచంద్ర! ఏలనాతో మాటలాడవు? నాపైని ఎందులకు నీకు దయరాదు? అరణ్యవాసము చేయవలయునను మాటను వినుటవలన కలిగిన తాపమా! వన వాసమునకు కారణభూతురాలు కైకయని కైకమీద కోపమా! లేక నేజేసిన

పాపమా ! ముందుగ నిన్ను పట్టాభిషిక్తునిచేయుదునని మాటయిచ్చి తీరా కైక కోరిన వరములను కాదనలేక నిన్నరణ్యావాసమున కంపుటకై కతో బాటు నేనును నీవనవాసమునకంగీకరించి ఆడినమాట తప్పి పాపమునకొడిగట్టితినియా ! రామచంద్ర ఏలనయ్యా ! నాపై నిర్దయుడవై యున్నావు.

ఇవ్విధముగ కైక గృహమునుండి వెడలి తల్లియగు కౌసల్యాదేవి మందిరమునకు వెళ్ళి వనముల కేగనున్న విషయమును చెప్పినారు. తల్లడిల్లినది కౌసల్య. సీతకును తానరణ్యములకేగనున్న విషయమును చెప్పినారు. సీత తానుకూడ వత్తునన్నది. రాముడు వలదనినాడు. ఎంతగనో చెప్పిచూచినది. రాముడు వల్లగాదనినాడు. సీత

కిం త్వామన్యతవైదేహః పితామే మిధిలాధిపః
రామజామాతరం ప్రాప్యస్త్రియం పురుషవిగ్రహం"

అని రాముని నిష్ఠురములాడినది. త్యాగయ్యగారు రాముడు సీతను తనతో కాననములకు రావలదని వారించుటకు గలకారణము "ఆడదన్నరోసమో" అని యనినారు. రామచంద్రునకసలు స్త్రీ జాతిమీదనే ద్వేషమట. రామాయణకథా సన్నివేశములనెంత రమణీయముగ నాయాసందర్భములలో చిత్రీకరించిరో పై కీర్తన తెలియజేయును. ఇంకను రాముడు తనతో మాట్లాడకుండుటకు తనపై నిర్దయుడగుటకు కారణమునూహించినారు. అది అలనాడుపాపమో. త్యాగయ్యయు ఆ భావములను హృద్యముగ చిత్రీకరించినారు అలనాడు పాపమో ! దశరధుడు రామచంద్రుని పట్టాభిషేకమునకు ముహూర్త నిర్ణయముచేసినారు. పుష్యమి నక్షత్రము - రామునకు సంపత్తార. దశరధుడీముహూర్తమును శ్రీరామునకు తెలియజెప్పి

"తస్మాత్త్వయాఽద్యప్రభృతి నిశేయంనియతాత్మనాసహ వధ్వోపవస్తవ్యా దర్భప్రవర్తశాయినా" - నియమమునుజెప్పినారు.

పట్టాభిషేకమునకు ముందురోజు సీతారాముల నుపవసింపుమని, రాత్రి నేలపై పరుండవలసినదని చెప్పినారు దశరధుడు. రాముడుపవసించినాడు. కాని పట్టాభిషేకము జరుగలేదు. అనవసరముగనుపవసింపజేసితివని కోపము కలిగినదా ! అని ప్రశ్నించినారు. రామాయణకథా ఘట్టములను సరళమైన భాషలో తెలుగువారికందించినారు త్యాగయ్య. కాననే త్యాగయ్య అపరవాల్మీకులని పేరందసినారు

శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడై దండకాటవికి బయలుదేరినారు. తమసానదినిచేరి, ఆ రాత్రి అచట శయనించి తెల్లవారకమునుపే అటనుండి బయలుదేరి గంగా తీరమును చేరినాడు. అచట నిషాదరాజు గుహుడు కలడు. సీతారామలక్ష్మణులను గంగ దాటించినాడు గుహుడు. సీతాలక్ష్మణులు చెంతఃనిల్చి కొల్వ గంగాతీరమును చేరినారు. శ్రీరాముడు అట్టి రామునిజూచుట నిజముగా గుహుని పురాకృతసుకృత విశేషము.

'చెంతకు జేరుకున్న రఘుసింహునిగాంచె సతీసహోదరుల్
చెంతలనిల్చిగొల్వ వనసీమలలోబడి వచ్చువాని వే
దాంత పవిత్రవీధుల విహార మొనర్చెడు వాని సజ్జన
స్వాంతనివాసు నగ్గుహుడు సంచితభాగ్య విశేషమెట్టిదో'

రామచంద్రుడు శయనించుటకు గుహుడు ఆకులు అలములతో తల్పము నమర్చినాడు. త్యాగయ్యగారా సన్నివేశము నీ క్రిలది కీర్తనలో నుంచినారు.

కిరణావళి – ఆది

పరాకు నీకేలరా రామ ॥ప॥
చరాచరమ్ములవసియించే యో
సారసాక్ష నా పనులంటే యీ ॥ప॥
ధరాతలమున గుహునివలె పత్ర
తల్పమొనర్చితినా శ్రీ త్యాగరాజుపై ॥ప॥

అచటనుంచి భరద్వాజాశ్రమమును జేరినారు. "భరత్-వాజః" (ఇంద్రియ నిగ్రహము గలవాడు) సప్తర్షులలో నొకడు. భరద్వాజుడు సీతారామలక్ష్మణులకు అతిథ్యము నిచ్చినారు. "భరద్వాజ విందులని" లోకప్రసిద్ధి గదా!

భరద్వాజమహర్షి శ్రీరామచంద్రునీవిధముగ స్తుతించినారు.

సుజన జీవన సుగుణభూషణ రామ ॥సు॥
భుజగ భూషణార్చిత బుధజనావనా
అజవందిత శ్రితచందన దశరథ రంగమామవ ॥సు॥

చారునేత్ర శ్రీకళత్ర శ్రీరమ్యగాత్ర
తారకనామ సుచరిత్ర దశరథ పుత్ర
తారకాధిపానన ధర్మపాలక
తారయ రఘువర నిర్మల త్యాగరాజసన్నుత ॥సు॥

ఇది త్యాగయ్యగారి సంస్కృత రచన. సంస్కృతమున రచింపబడిన కీర్తన యని చెప్పినగాని తెలిసికొనలేనంతటి సరళ సంస్కృత రచన సేయుట శ్రీత్యాగరాజ స్వామివారి సొమ్ము. వాల్మీకికృతమైన శ్రీమద్రామాయణమెంతటి సారళ్యము గనిగిన రచనయో త్యాగరాజకృత రామాయణ రచనయు నంతటి సారళ్యము గలిగినదియనుటకెట్టి సందేహమును లేదు. వాల్మీకమునందున్న మాధుర్య - సారళ్యములు త్యాగయ్య రచనయందును కలవు. కాననే త్యాగయ్య అపరవాల్మీకి. త్యాగయ్య శిష్య ప్రముఖుడు, త్యాగయ్యచేయు రామపూజకు నిత్యము తులసిని దెచ్చి యిచ్చునట్టిడునగు శ్రీ వాలాజాపేట వేంకటరమణభాగవతులు అయ్యగారిని "మృదు గిరావల్మీకజన్మామునిః" అని ప్రస్తుతించినారు.

"శ్రీవాల్మీకాంశ సంభూతం
రామనామ పరాయణం
సద్గురు శ్రీత్యాగరాజం
వందేఽహం సతతంముదా"

అని త్యాగయ్యను స్తుతించినారు కవులు.

భరద్వాజునికడ సెలవుతీసికొని ఆ మహర్షి సూచనమేరకు "అచటకు పది క్రోసుల దూరమునయున్న చిత్రకూటము తమకు వాసయోగ్యమగు ప్రదేశమని తెలిసి కొని చిత్రకూటమును చేరినారు సీతాలక్ష్మణసహితుడై శ్రీరామచంద్రుడు—

చిత్రకూటమునయున్న రోజులలో సీత చమరీమృగమును జూచి దాని తోకను కోరగా రాముడు బాణప్రయోగము చేసినారట. ఇదియును వాల్మీకమే.

వాచామగోచరమే మనసా - వర్ణింపదరమె రామమహిమ
మానవతీమదెరింగి చామరమౌట కస్త్రము నేయగని
మానంబుకై మెడగాచగమాధవుండు కనికరగవేగమే

దీనార్తిభంజనుడై ప్రాణదానంబొసగ మున్ను చనిన
బాణంబునటు చెదరసేయలేదా గానలోల త్యాగరాజనుతు
మహిమ ॥వా॥

ఈ కీర్తనమునకు "శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు "త్యాగరాజ కీర్తనలు - విశేషవివరణము" అను తమ గ్రంథముననిట్లు వివరణము నొసంగిరి.

"ఒకప్పుడరణ్యమున స్వేచ్ఛగా తిరుగుచున్న చమరీమృగమును జూచి దాని వాలమును చామరముగా నుపయోగించుకొను తలపున ఆ వాలము మాత్రము తెగునట్లుగా బాణము వేసెనట. అపుడా మృగము మానవతియగుటచే తన వాలము (తోక) తెగినంతనే తనకు మానభంగమగునని అందుకు సహించక మానభంగమగుటకంటె ప్రాణభంగమె మేలని భావించి తన మెడను త్రిప్పి తనవాలమునకడ్డము పెట్టెనట. శ్రీరాముడా దృశ్యమును దూరమునుండి చూచి యీ దీనురాలిని కాపాడవలెనను దయతో వెంటనే తానొకబాణమును వేసి వేటకానిముందు బాణమును చెదరగొట్టి ఆ చమరీమృగముయొక్క మానప్రాణములను కాపాడెనట.

ఈ కీర్తనమందు వేటకాని విషయమున్నటులతోపదు. ఈ కీర్తనమునకే శ్రీ E. N పురుషోత్తమన్‌గారు తమ "Thyagopanishad" అను గ్రంథమున నిట్లు వివరణమునొసంగిరి.

'The most interesting thing in this Composition is the story of the Chamaramrugam, which professor P. Sambamurthy has translated as yak. But yak is a Tibeten ox and I am doubtful whether both are the same. However the story is according to Prof.P. Sambamurthy, Seetha saw a Chamaramrugamu roaming in the forest and was so visibly fascinated by it that Rama surmised that she desired to have its tail. When he despatched an arrow to cut off its tail the self conscious and susceptible animal shrunk its tail and showed its head to the arrow preferring death to the disgrace of living a truncated life bereft of its beauty. Touched by its spirit of life and sense of pride, Rama shot a swifter arrow which smashed the earlier one and saved the Chamari from both disgrace and death. But according to Sri Sastry

it was a hunter who tricd to cut the tail while Rama foiled the heartless hunter and rescued the agitated animal. Thyagaraja has called the chamari by the beautiful name manavathi which is usually used only for women of great modesty.

Commenting on this incident and a few more, Prof. Sambamoorthy says that Thyagaraja has narrated some episodes which are not to be found either in Valmiki or Kamban, nor in Adhyatma Ramayana.

Indian Express (8th June 81) Ramayana–Some versions II అను శీర్షిక క్రింద ఈ చమరీమృగ సన్నివేశమును త్యాగయ్యగారు కీర్తించుటను గురించి ఇట్లున్నది.

At Chitrakoota (a) In one place Valmiki makes a casual reference to Rama's refraining from killing a deer in the forest. Sri Thyagaraja mentions a beautiful anecdote in the (his) song "Vachamagocharamay" (Kaikavasi) Oh! mind Rama's glory is beyond description. Understanding the desire in Sita's heart, he sent an arrow at the tail on the Chamari deer to save its honour and pride (that was the tail) the deer covered its tail with its head intending to risk its life rather than lose the tail vide Tirukkura 969 seeing this and flowing with compassion did not Rama, the remover of the distress of the meek quietly with draw the arrow aimed already" – R R.

చిత్రకూటమున నిట్లుండ అయోధ్యలో దశరధుడు రామవియోగమును భరింపజాలక శరీరమును విడచినారు. భరతుని మేనమామల యింటినుండి పిలిపించినారు. దశరధుని మరణవార్తను విని భరతుడు వాపోయినాడు, తల్లి కైక కోరిన రెండు వరముల కారణము శ్రీరామపట్టాభిషేకము భంగమయినదని, రాముడు పదునాలుగేండ్లు దంటకాటవిని నివసించుటకై వెళ్ళినాడని, రామవియోగమునకు తాళలేక దశరధుడు మృతి చెందినాడని విని మండిపడినాడు భరతుడు. తల్లిని అనరానిమాట లనినాడు. దశరధునకు ఉత్తరక్రియలాచరించినాడు.

భరతుడు తల్లులతో, వసిష్ఠాదులతో చిత్రకూటముననున్న శ్రీరామునిచేరి అయోధ్యకువచ్చి రాజ్యపాలనాభారమును వహింపుమనినాడు. దశరథుని మరణ వార్తను తెలియజెప్పినాడు. శ్రీరాముడు పితృవియోగమునకు మిగుల దుఃఖించినారు. అదియే రామావతారమునందలి విశిష్టత. తక్కిన అవతారములలో లేని ఆచరణ, ఆచార్యకత్వము శ్రీరామావతారమున కిన్నడును. రామావతారమున తాను భగవంతుడు నని ఎచటను చెప్పికొనినవాడుకాడు శ్రీరామచంద్రుడు, "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం' అని మాత్రమే చెప్పికొనినారు. తాను అవతారపూరుషుడై యుండి కూడ సాటి మానవుని పితృవియోగ దుఃఖమునకు తట్టుకొనలేక విలపించు రీతిగా రాముడు విలపించి ఆదర్శప్రాయుడైనాడు. రాముడు తండ్రికిచ్చినమాట మేరకు పదునాలుగు వత్సరములు కాననమునందుండి కదలననినారు. భరతుడు భ్రాతృభక్తి భరితుడు. త్యాగయ్యగారు రామభక్తి గొప్పదనుచు "భరతుడు చూచిచూచి సొలసునా"[1] అనినారు.

రామచంద్రుడెట్లును పదునాలుగేండ్లు పూర్తికానిదే అయోధ్యకు మరలిరాడని తలచిన భరతుడు రాముని పాదుకలనడిగినాడు. కారణము శ్రీరామ తత్త్వమంతయు నాతని దివ్యపాదములందు కలదని భరతుడు తలచుటయే.

'సహిదేవైరు దీర్ణస్య రావణస్య వధార్థిభిః అర్థితో మానుషేలోకేజజ్ఞే విష్ణు స్సనాతనః' —

సాక్షాచ్ఛ్రీమన్నారాయణుడే శ్రీరామచంద్రుడుగ నవతరించినందున — ఈ విషయమును తెలిసిన భగవానుడైన[2] వసిష్ఠుడు శ్రీరాముని దివ్యస్వరూప వైభవ మాతనిపాదుకలయందు గలదని చెప్పుటచే భరతుడు శ్రీరాముని పాదుకలను తీసికొని శిరముపై నుంచుకొని తీసికొనివెళ్ళి అయోధ్యలో కాలిడక నందిగ్రామమున శ్రీరాముని పాదుకలనుంచి, అభిషేకించి రామునకు ప్రతినిధిగా రాజ్యమేలినాడు. త్యాగయ్యగారీ ఘట్టమునుకూడ సంభావించి వసిష్ఠునుపదేశమున రామునికంటె రాముని పాదములే గొప్పవని భరతుడు భావించి ఆ పాదుకలనెట్లు తీసికొనినాడో త్యాగయ్యయు శ్రీరామ పాదుకామాహాత్మ్యమును తెలిసికొని యిట్లు కీర్తించినారు.

---

1. అప్పరామభక్తి ఎంతోగొప్పరా ।
2. "వ్యుత్పత్తించ వినాశంచ భూతానామాగతిం గతిం వేత్తి విద్యామవిద్యాంచ సభగవానితి ఈరితః"

సందేహమును దీర్పవయ్య సాకేతనిలయ రామయ్య॥
సందార్చిత పదయుగములు మేలో నాగరికమగు
పదయుగములు మేలో ॥సం॥
వరమౌనులెల్ల చరణమ్ములను స్మరియింప నీదు
పదమొసంగెనే
భరతార్చనచే పాదుకలు ధరనిన్నొసంగె త్యాగరాజు
భాగ్యమా॥

రామపాదుకాపై భవమునీవిధముగ కీర్తించి త్యాగయ్య తనకుకూడ రామ పాదమునను(గహింపుమని వేడుకొనుచున్నారు.

నాపాలి శ్రీరామ - భూపాలక స్తోమ
కాపాడ సమయము నీ పాదము లీర॥

చేతికందివచ్చిన రాజ్యమును వదలి, యోగియై నందిగ్రామమున రాముని పాదుకల నభిషేకించి రామునకు బదులుగా రాజ్యమేలినవాడు భరతుడు. భరతుని వంటి భ్రాతృభక్తి గలిగిన సోదరులెందరని శ్రీరాముడే భరతుని ప్రశంసించినాడు.

"న సర్వే భ్రాతరస్తాత భవన్తి భరతోపమాః"

శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సహితుడై చిత్రకూటమందు నివసించుచున్న దినములలో నొకనాడు రామచంద్రుడు సీత అంకమందు శిరమునుంచి నిదురించు చున్నారు. ఆ సమయమున కాకాసురుడు సీతాదేవి పాదము బొటనవ్రేలిని తన ముక్కుతో బొడిచి బాధింపసాగెను.

వాల్మీకి రామాయణమున సుందరకాండమునందు కాకాసురుడు సీత స్తన మధ్యమును బట్టి బాధించినట్టులుగలదు. (ఈ విషయము సీత హనుమతు చెప్పెను.) తనకు కాకదైత్యుడు కలిగించిన బాధకు తట్టుకొనలేక సీత తన పాదమును కదల్చి నది. శ్రీరామునకు నిద్రాభంగమయినది. జానకి కాలి పుండును జూచి విషయమడిగి నారు శ్రీరాముడు జానకిని. విషయమును వివరించిచెప్పినది సీత. శ్రీరాముడు కోపించి నారు. కాకాసురుమాయగ గుర్తెరింగి అతనిపై శరమునొకదానిని ప్రయోగింపనది బ్రహ్మాస్త్రముగా మారినది.

"కాకాదై త్యునేకశరమున నేయ కంజాస్త్రమై పరగలేదా" ఆయస్త్రము కాకాసురుని వెంబడించినది. భయభ్రాంతుడై కాకాసురుడు సర్వదేవతానమ్ముఖమున కేగి తనను రక్షింపుమని వేడుకొనినాడు. కాకాసురునకు భయముకలిగినది రామబాణము వలననని తెలిసికొని కాకాసురుని రక్షించుటకు దేవతలు వెనుదీసిరి. (రామచంద్రుని వలన ప్రయోగింపబడిన అస్త్రము తనను బాధించుట, దేవతలెవరు తనను రక్షింపలేమనుట - మఱల కాకాసురుడు శ్రీరాముని శరణుజొచ్చి ఆయన అనుగ్రహమును బడసినంత దనుక) మనోజ్ఞముగ చిత్రించినారు త్యాగయ్యగారు.

దేవతలు కాకాసురుని రక్షించుటకు వెనుకాడిన విషయము, మఱల కాకాసురుడు రాముని శరణుజొచ్చిన విషయము - శ్రీరాముడాతనిని కాపాడిన విషయమీ క్రింది కీర్తనమున గలదు.

శరము తరమ తరముగాక కాకా
సురుడు సురులనరయ వేడగాను ద
శరథ వరకుమారుని బాణమనుచును
వెరచి జరగమరల తానుగని గా
బరపడి సరగున శరణను మాత్రమున
ఇరువుగను రజతగిరినాథాదులు
వరమగు బిరుదున సరసతమెచ్చను
కరుణను స్థిరమగ వరమిచ్చిన నిను॥

(శరణు - శరణనుచు మొరలిడిననా)

"వికలుని కాకినిబ్రోవ త్రిమూర్తులు వెనుదీసినారట" త్రిమూర్తులు కాకాసురుని రక్షించుటకు వెనుదీసినారని త్యాగయ్యగారు హృద్యముగ చిత్రీకరించినారు. ఎవరును తనను రక్షింపకుండుట జూచి కాకాసురుడు నారదుని ప్రార్థించినాడట. నారదుడు "రామబాణమమోఘమని, తాను ప్రయోగించిన బాణమును తానుమాత్రమే ఉపసంహరింపగల సమర్థుడు శ్రీరామచంద్రుడ"ని చెప్పగా కాకాసురుడు శ్రీరాముని శరణు జొచ్చినాడట. నారదుడు చెప్పినమేరకు కాకాసురుడు రాముని పాదములపై వ్రాలి శరణు వేడినాడు. శరణాగతవత్సలుడగు రామచంద్రుడు కాకాసురు ననుగ్రహించినాడు. శరణన్న శత్రువునైన కాపాడునుదారుడు రామచంద్రుడు. "రిపూణామపివత్సలః" అని శ్రీరాముని గురించి వాల్మీకి అభిభాషణము. త్యాగయ్యగారు "శత్రుమిత్రులను సమముగా జూచుదైవము" ఎందుకు నిర్దయ శ్రీరాముడనినారు.

తాను ప్రయోగించిన అస్త్రము వ్యర్థమగుటకు వీలులేదు కనుక కాకాసురు కంటినొదానిని తీసికొని (ఆతనిని ఏకాక్షిగాచేసి) రాముడనుగ్రహించినారు. త్యాగయ్య గారీ విషయమునుగూడ రామాయణకృతి రచనా సందర్భమున నుటంకించినారు.

'కాకను శరమసురుని గాచెనే'

(భవసన్నుతనాగము మెంతమునీభవమో)

తనకుతానే కాకాసురుని కాచిన శరమును చూచేదెన్నటికో- (వినయమునను)

చిత్రకూటమున నివసించుచున్న మునులు ఆ ప్రాంతమును వీడివెళ్ళుచు "రాక్షసుల బాధలను తాళజాలమని శ్రీరామునితో మొరపెట్టుకొనినారు. భయభ్రాంతులైన మునులజూచి రామచంద్రుడు అభయమొసగినారు.

'భయములుగల మునిచయముల జూచి హృ

దయము కరుగగ అభయమొసగిన రఘునాధు

చిత్రకూటమును వీడినారు మునులు. శ్రీరాముడును సీతాలక్ష్మణ సహితుడై చిత్రకూటమునుండి బయలుదేరి అత్రిమహాముని అశ్రమమును చేరినారు. అత్రి మహాముని దంపతులు సీతారామలక్ష్మణులకాతిథ్యమొసగి శ్రీరాముని అనంత కళ్యాణ గుణములను, రూపసౌందర్యమును కీర్తించినారు.

సుందరతరదేహం వందేహం రామం సుం॥

కుందరదనమాప్తకుముదశాంకం

కందర్పశతకోటి కాంతిమతినిష్కళంకం

పతితజనపావనం పరిపాలితభువనం

శ్రుతినికరసదనం శుభకరవదనం

యతివరజీవనం ఇభరాజపాలనం

దితిజమదదమనం దీనజనావనం

నవదూర్వదళనీలం నందితామరజాలం

అవనతసురపాలం అద్భుతలీలం

భవభయహరణకాలం భక్తజనవత్సలం

శివమద్వైతమమలం శ్రీమత్కనకాభచేలం

అగమసంచారం అఖిల లోకాధారం
వాగాధిపకుమారం వరవీరవీరం
రాగాదిసంహారం రాఘువముదారం
త్యాగరాజహృత్సంచారం కారుణ్యపారావారం॥

అనసూయా మహాసాధ్వి సీతకు అంగరాగములిచ్చి గౌరవించినది. సీత నిట్లు కీర్తించినది అనసూయా మహాసాధ్వి.

సరియెవ్వరే శ్రీ జానకి నీ సరి॥
పరమాత్మునికై గడిదేరిసదా
సిరులిచ్చుటకు చేరిగొలిచిన నీ ॥సరి॥
వనమందు భయంకరమైన తా
వున నిల్తునని మనసుదెలిసి
కనకాంగి యందందున రాజసుఖం
బును కల్గజేసితివె త్యాగరాజనుతే ॥స॥

సీతాలక్ష్మణసహితుడై రామచంద్రుడు అనసూయ మహాసాధ్వి, అత్రిమహర్షి కడ సెలవుగైకొని బయలుదేరి దండకారణ్యమును చేరిరి.

## అరణ్యకాండ

"ప్రవిశ్యతుమహారణ్యం దండకారణమాత్మవాన్
దదర్శ రామోదుర్ధర్షః తాపసాశ్రమ మండలమ్"

శ్రీరాముడు సీతాలక్ష్మణసహితుడై అరణ్యమునుజేరి మునులకెందరకో అభయమిచ్చినారు. "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే అభయం సర్వ భూతేభ్యో దదామి ఏతద్వ్రతం మమ" అనిగదా శ్రీరాముని ప్రతిన. శ్రీమద్రా మాయణము అభయవాగ్దాన రత్నమాల. ఆ యరణ్యమున -

"అగ్రతః ప్రయయౌరామః సీతామధ్యేసుమధ్యమా
పృష్ఠతః ధనుష్పాణిర్లక్ష్మణో౽నుజగామహ"

శ్రీరాముని పాదవిన్యాసముద్రిత ప్రదేశములను తప్పించి ప్రక్కన సీత తన పాదములనుంచుట, భక్తాగ్రగణ్యుడగు లక్ష్మణుడు సీతారాముల పాదపద్మములకు దక్షిణపువైపున తనయడుగులిడుచు ప్రయాణమును సలిపినాడు. సీతాలక్ష్మణులు రామచంద్రునకిరుప్రక్కల నిలబడి కొలిచే ముచ్చటను తన కనుగ్రహింపుమని పై సన్నివేశమును సంభావనచేసి త్యాగయ్యగారు శ్రీరాముని వేడుకొనినారు.

ప్రక్కల నిలబడి కొలిచేముచ్చట బాగ తెల్పరాదా ॥ప్ర॥
చుక్కలరాయనిఁ గేరుమోముగల సుదతి
సీతమ్మ సౌమిత్రి రామునికిరుప్రక్కల నిలబడి॥

దండకాటవిని జొచ్చిన శ్రీరాముడు మునులకభయమొసగి ముందువకు జనుచుండ "విరాధుడ"ను రాక్షసుడు సీతనెత్తుకొని పోయినాడు. కొంతతడవు రామలక్ష్మణులకు విరాధునితో వాగ్వివాదము జరిగినది. శ్రీరాముడు విరాధుని చేతులను ఖండించినాడు.

"వనమున జని విరాధుని జంపిన చేతులను చూచేదెన్నటికో'' విరాధుని పాతి పెట్టుటకు రాముడు నమకట్టినారు. విరాధునకు పూర్వజన్మజ్ఞానము కలిగినది. శాప వశాన రాక్షసుడైనాడు. విరాధుడు శ్రీరామునిట్లు కీర్తించినారు.

దినమణి వంశతిలక లావణ్య దీనశరణ్య
మనవిని బాగుగా మది తలంచుచు
చనువుననేలు చాలుగా జాలు
శర్వ వినుత నను సంరక్షించను
గర్వము లేల గాచువారెవరే
నిర్వికారగుణ నిర్మలకర ధృత
పర్వత త్యాగరాజ సర్వస్వమౌ॥

విరాధుడు రాముని కీర్తించి శరభంగమహర్షిని దర్శింపుమనినాడు. రామ చంద్రుడు సీతానుజసహితుడై శరభంగునాశ్రమమును జొచ్చినారు. ఇంద్రుడు తనను రథముపైనెక్కించుకొని స్వర్గలోకమునకు తీసికొనిపోకడంగినను వెళ్ళినవాడు కాడు శరభంగుడు. కారణము శ్రీరాముని రాకనెఱింగి ఆయనను దర్శించి తరింప

కుతూహలము కలిగినవాడగుటయే. శ్రీరాముని కన్నుల కఱవుదీరగాంచనివాడును, తన జన్మము ధన్యమొంద శ్రీరాముని దృష్టిపథమున బడనివాడును వ్యర్థులు గదా!

యశ్చ రామం నపశ్యేత్తు యంచ రామోనపశ్యతి
నిందితస్స వసేల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే

దయాశరధి దాశరధి దయకు పాత్రముకాని మానవజన్మము వ్యర్థమనికదా పై శ్లోక భావము. త్యాగయ్యగారును

దయలేని బ్రతుకేమి దాశరధి రాముని
వయసునూరైన గాని వసుధనేలినగాని ॥దయలేని॥

అనియనినారు. శాశ్వతబ్రహ్మలోక నివాసము కంటెను క్షణకాలము రామదర్శన భాగ్యము మిన్నయని శరభంగుని నిశ్చయము. "స్వర్గలోకభవము, బ్రహ్మలోకభవము నైన సుకృతమెల్ల మానసీయ నీకు నొసంగువాడ - కైకొనుమని శరభంగుడు వేడ శ్రీరాముడంగీకరించినాడు.

శ్రీరాముని దివ్యసౌందర్యమును కరవుదీరగాంచవలయునను కుతూహలము గలవాడై ఇంద్రునివెంట వెళ్ళని శరభంగుడు శ్రీరాముని దివ్య సౌందర్యమును కీర్తించినారు.

నిను వినా నామదెందు నిలువదే శ్రీహరి హరి
కనులకు నీ సొగసెంతో గ్రమ్మియున్నది కనుకను
నీదు కథలు వీనులందు నిండియున్నది
శ్రీద నీ నామమునోట జెలగియున్నది కనుక
నేను ఎచటజూచినను నీవై యున్నది
కపటమౌ మాటలెల్ల కమ్మనైనది
తపము యోగఫలము నీవే త్యాగరాజసన్నుత
నిను వినా॥

శరభంగుననుగ్రహించినారు రామచంద్రుడు. అగ్నిని ప్రజ్వలింపజేసి శరభంగుడందు ప్రవేశించి భస్మమై వహ్నిసన్నిభకుమారకరూపముదాల్చి బ్రహ్మలోకమును చేరినారు. సీతారామలక్ష్మణులు శరభంగునాశ్రమమునుండి బయలుదేరిరి. ఆ ప్రాంతవాసులగు మునీశ్వరులు శ్రీరాముని రాకనెరింగి గుంపులు గుంపులుగావచ్చి దర్శించిరి. రామచంద్రుడు వారల క్షేమాదులను గురించి ప్రశ్నించినారు. ఆ మహర్షులు శ్రీరాముని శ్రీమన్నారాయణునిగాను, సీతామహాసాధ్విని ఆదిలక్ష్మిగాను, లక్ష్మణుని ఆదిశేషునిగాను తెలిసి కీర్తించినారు.

"శ్రీరామ నీ వాదినారాయణుడవు - ఈ రమామణియే సీత", రాక్షసులు తమను పెట్టుచున్న బాధలనుతెల్పి, శ్రీరాముని శరణుజొచ్చిరి. రామచంద్రుడు వారలకభయమిచ్చినారు.

"అల్లమునిజనులనుగని యభయమిచ్చిన హస్తమును జూచేదెన్నటికో"

అచటనుంచి సుతీక్ష్ణాశ్రమము చేరినారు. "నామ్నా సుతీక్ష్ణః చరితేనదాంతః" అనిగదా! ఆ రాత్రి మహర్షియిచ్చిన ఆతిథ్యమును స్వీకరించినారు. మరునాటి యుదయమున బయలుదేరి దండకారణ్యమున మునులతో ప్రవేశించినారు. జానకి శ్రీరామునకు శస్త్రసాంగత్యము దోషమని చెప్పినది. మరల సుతీక్ష్ణాశ్రమమును జేరి కొన్నిదినములచటనుండి ఆయన యనుజ్ఞగైకొని అగస్త్యాశ్రమమునకు బయలు దేరినారు. ముందుగా లక్ష్మణునిద్వారా అగస్త్యునకు తమ రాకను తెలియపరచినారు శ్రీరామచంద్రమూర్తి. అగస్త్యుడెంతగనో సంతసించి శ్రీరామునకు స్వాగతము పలికినారు.

రమారమణ రారా ఓ ॥ర॥

సమానమెవరు వినుమా నా మనవిని
తమాము పొగడఁదరమా౽హిపతికిని ॥ర॥

బుధాద్యవన దశరథార్భక మనో
రథంబొసగు సమరధార్హ సద్గుణ ॥ర॥

కలార్థభూష సకలార్థ శశధర
కమలాధరనుత వికలార్తి సంహార ॥ర॥

రణాధిశూర శరణాగతాత్మ చ
రణంబు భవతారణంబు చేసును ॥ర॥

ముఖాబ్జమును శతముఖారిజూప స
ముఖానఁ గొలుతు దుర్ముఖాసురహరణ ॥ర॥

విరాన బ్రోవగరాద శ్రీమద
గరాజధర త్యాగరాజ సన్నుత ॥ర॥

అగస్త్యుడు రామునకు వైష్ణవాయుధములను సమర్పించినారు. సీతారామ లక్ష్మణులచటనుంచి బయలుదేరి పంచవటిని చేరినారు. పంచవటిని పర్ణశాలను నిర్మించినాడు సౌమిత్రి. శ్రీరామచంద్రుడొకనాడు సీతాలక్ష్మణసహితుడై గౌతమీనదిని స్నానమాడి నిజపర్ణకుటీరమును చేరినారు. శ్రీరామచంద్రుడు.

"సరామః పర్ణశాలాయామాసీనస్సహసీతయా విరరాజ మహాబాహుశ్చిత్ర యాచన్ద్రమాఇవ" ప్రకాశించెను. అట్టిడగు రామచంద్రుని జూచినది దశాస్యునిసోదరి యగు శూర్పణఖ. రామచంద్రుని జూచి శూర్పణఖ.

జటీతాపసరూపేణ సభార్యశ్శరచాపధృత్.
ఆగతస్త్వమిమం దేశం
కథంరాక్షససేవితమ్. కిమాగమనకృత్యంతే తత్త్వ
మాఖ్యాతుమర్హసి"

అని యడిగినది. రామచంద్రుడు తన వృత్తాంతమును చెప్పినాడు. తన్ను పెండ్లాడుమని శ్రీరాముని కోరినది శూర్పణఖ. ప్రతిఫలముగా ముక్కు చెవులను పోగొట్టుకొనినది. శూర్పణఖాపరాభవమునుగూడ త్యాగయ్యగారు రామాయణకృతి రచనా సందర్భమున నుటంకించినారు.

ఆశహరణ రక్కసి ఇష్టమడుగ అపుడెముక్కు
పోయె ఓరామ"
(అడిగి సుఖము లెవ్వరనుభవించిరిరా - రామ)

రామచంద్రునిచే పరాభూతయయిన శూర్పణఖ జనస్థానమున రాక్షసపరీతుడైన సోదరుడగు ఖరునిగాంచి వృత్తాంతమును చెప్పినది. శూర్పణఖ వికృత వేషమును జూచి ఖరుడు శ్రీరామునిపైకి దండెత్తివచ్చినాడు. ఖరదూషణాదిరాక్షససంహారము చేసినారు రాఘవుడు.

'క్షణమున బహురథములను పొడిచేసిన యస్త్రమును
చూచేదెన్నటికో॥

అని క్షణకాలమున ఖరదూషణాదుల రథములను నుగ్గు చేసిన యస్త్రమును చూచు టెన్నటికోగదా ! ఖరదూషణాదుల పదునాలుగు వేలమంది రక్కసులను నిస్సహాయుడై వధించినాడు కాకుత్థ్సుడు. వారలను వధింపపట్టున రాముడేసిన ఒక్కొక్కబాణము-

'ఒకటేసిన పదినూరై - వెయ్యై
చకపకలాడి శత్రులనణచేనటా'
(ఎవరిచ్చిరిరా శర చాపముల్ నీ కినకులాబ్ధి చంద్ర)

ఖరదూషణాద్యసురసంహారము చేసిన రాముని మహర్షులనేకవిధముల కీర్తించినారు.

ఇట్లుండ అకంపనుడు రావణునకు రామచంద్రుని బలపరాక్రమములను గురించిచెప్పినాడు. రావణుడు మారీచునితో సంప్రదించినాడు. శ్రీరామునితో విరోధమువలదని రావణునకు నొక్కిచెప్పినాడు మారీచుడు. శూర్పణఖ లంకకేగి రావణుని రోషపరవశుని జేసినది. రావణుడు మరల మారీచునికడకేగి తనకు సాయ పడవలసినదని యెంతగనో యొత్తిడి చేసినాడు. "రకారాదీనినామాని రామత్రస్తస్య రావణ" 'వృక్షేవృక్షేచ పశ్యామి చీర కృష్ణాజినాంబరం, రామోవిగ్రహవాన్ ధర్మః అని రావణుని సమాధానపరుప ప్రయత్నించి విఫలుడై "సజ్జనుని చేతిమృతియు నిస్తార కంబు"రామునిచేతిలో చచ్చుటమేలని భావించి - రావణునకు సాయపడనంగీకరించి నాడు మారీచుడు.

రావణమారీచులు పంచవటికి ప్రయాణమై వెడలినారు. మారీచుడు మాయా మృగమైనాడు.

# మాయ సీత

రామచంద్రుడు శూర్పణఖను విరూపనుచేసిన పిమ్మట ఆత్మదృష్టిచే రావణుని ప్రయత్నమునవగతమొనరించుకొని ఏకాంతమున సీతతో -

"ఉవాచ సీతామేకాంతే శృణు జానకి మద్వచః
రావణో భిక్షురూపేణ ఆగమిష్యతి తేఽన్తికమ్
త్వన్తుచ్ఛాయాం త్వదాకారం స్థాపయిత్వోటజే విశ
అగ్నావదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా
రావణస్య వధాంతే మాం పూర్వవత్ప్రాప్స్యసే శుభే
శ్రుత్వా రామోదితం వాక్యం సాఽపి తత్ర తథాఽకరోత్[1]
మాయాసీతాం బహిః స్థాప్య స్వయమన్తర్దధేఽనలే"

"జానకీ! రావణుడు నిన్నపహరించుటకు భిక్షురూపమున రాగలడు. కనుక నీవు నీ ఛాయారూపమును మాత్రమే ఈ కుటీరమునయుంచుము. నా యాజ్ఞననుసరించి ఒక్క సంవత్సరకాలము అగ్నియందదృశ్యవై యుండుము. రావణవధానంతరము నన్నుచేరగలవు" అనెను. రామాజ్ఞననుసరించి సీత తన ఛాయారూపమైన మాయసీతను ఆశ్రమమున నుంచి తానగ్నియందంతర్హితురాలయ్యెను.

త్యాగయ్యగారుకూడ రావణుడపహరించి తీసికొనివెళ్ళినది "మాయ సీతనే" అని చెప్పినారు. రావణుడపహరించి తీసికొనివెళ్ళినది మాయ సీతను అన్న అధ్యాత్మ రామాయణమునందలిభావమును తీసికొనినారు త్యాగయ్యగారు

"కానకేగి యాజ్ఞమీరక మాయా
కారమునిచ్చి శిఖిచెంతనేయుండి"[2]

మాయ సీత రామచంద్రుని

"పశ్య రామ మృగం చిత్రం కానకం రత్నభూషితం
విచిత్రబిందుభిర్యుక్తం చరంతమకుతోభయం
బద్ధ్వా దేహి మమ క్రీడామృగో భవతు సుందరః
తథేతి ధనురాదాయ చ్ఛ లక్ష్మణమబ్రవీత్"

అని కోరినది. రాముడంగీకరించినాడు.

---

1. అధ్యాత్మ రామాయణము — అరణ్యకాండ.
2. మా జానకి చెట్టబట్టగా మహరాజువైతివి.

అసంభవం హేమమృగస్యజన్మ
తథాపి రామోలులుభే మృగాయ
ప్రాయస్సమాపన్నవిపత్తికాలే
ధియోఽపి పుంసాంమలినాభవన్తి

రామచంద్రుడు "బంగారులేడిని చంపి చర్మమును తీసికొనిరమ్మని"[1] కోరిన సీత కోరికను చెల్లించుటకై పర్ణశాలనుండి నిష్క్రమించినాడు. రాక్షసుని మాయవలన సీతాదేవి పరుషభాషణములను విని లక్ష్మణుడును పర్ణశాలను వీడిచనినాడు. రావణుడు సీత నపహరించి తీసికొనివెళ్ళినాడు.

మారీచవధానంతరము పర్ణశాలకు తిరిగి వచ్చిన రాముడు సీత కనపడమికి శిలలుద్రవించునట్లు విలపించినారు.

'అపిగ్రావారోదిత్యపిదళతి వజ్రస్యహృదయం'

భవభూతి - ఉత్తరరామచరిత్ర.

రామలక్ష్మణులు సీతాన్వేషణతత్పరులై బయలుదేరినారు. జటాయువు వలన సీతాపహరణవృత్తాంతమును తెలిసికొనినారు. జటాయువునకు అగ్ని సంస్కారము చేసినారు రామచంద్రమూర్తి. రామలక్ష్మణులు కబంధునిచేత చిక్కినారు. లక్ష్మణుడు కబంధునకు తమవృత్తాంతమును చెప్పినారు. కబంధుడును రామలక్ష్మణులకు తన వృత్తాంతమును చెప్పినారు.

తనకు శాపావసాన కాలమాసన్నమైనదని సంతసించినాడు కబంధుడు.దాశరధి కబంధుని కళేబరమునకు అగ్ని సంస్కారమొనర్చినారు. కబంధుడు శ్రీరామునకు శబరి వృత్తాంతముచెప్పి "ఆమెచే వినదగు సీతవృత్తము లభించునుపాయము గూడ" నని చెప్పినాడు. సుగ్రీవుడు అన్న వాలికి జడిసి పంపాసరోవర తీరప్రాంతమున ఋష్యమూక పర్వతముననున్నాడని చెప్పినాడు.

---

1. దినవాధకులనాథ దీనివెన్ దగిలి
ఛనియేసి వెస దీని చర్మంబుదెమ్ము - రంగనాథ రామాయణము

రామలక్ష్మణులు శబరీయాశ్రమప్రాంతమును చేరినారు. రామలక్ష్మణుల రాకను వినిన శబరికి ప్రాణములు లేచివచ్చినవి. ఎదురుగ వెళ్ళి స్వాగతము పలికినది. "పాదౌ జగ్రాహ రామస్య లక్ష్మణస్యచ" శ్రీరాముని పాదపద్మములకు ప్రణమిల్లినది. శ్రీరాముడు శబరిని కుశలాదికం బడిగినాడు. శబరి-రామ సందర్శన భాగ్యమునకు కడుంగడు సంతసించి శ్రీరాముని స్తుతించినది.

రామ నన్నుబ్రోవరా ప్రేమతో లోకాభిరామా॥
చీమలో బ్రహ్మలో శివకేశవాదులలో
ప్రేమమీర వెలుగుచుండే బిరుదు వహించిన సీతా॥
మెప్పులకై కన్న తావునప్పుబడక విర్రవీగి
తప్పుపనులు లేకయుంటే త్యాగరాజవినుత సీతా॥

శ్రీరాముడు చిత్రకూటము చేరిననాటనుండి శబరి రామాగమనకు నిరీక్షించుచున్నది. రామ సందర్శన భాగ్యముతో "నీవు తరించగలవని" శబరికి ఆమె గురువులు మతంగశిష్యులు చెప్పినారు. అప్పటినుండి రామచంద్రుని రాకకొరకు కన్నులలో ఒత్తులు వేసికొని ఎదురులు చూచుచున్న శబరికి రామచంద్రుడు ఒంటరిగ (సీతను వెంటబెట్టుకొని కాక) తన యాశ్రమమునకువచ్చుట నచ్చినదికాదు. "అమ్మను జూచి సంతసమునందెడు భాగ్యము" తనకులేదని వాపోయినది. శ్రీరామ తత్త్వమంతయు శబరికి మతంగశిష్యులు చెప్పినారు.

శ్రీరాముడు చిత్రకూటము చేరినప్పటినుండి తాను ఏర్చికూర్చియుంచిన ఫలములను రామునకర్పించినది, శ్రీరాముని సేవించి పునరావృత్తి రహితమైన పదమును పొందినది. అట్టి శబరీభాగ్యము నెంతగనో కొనియాడినారు త్యాగయ్యగారు —

ఎంతని నే వర్ణింతు శబరీ భాగ్యమెంతని॥
దాంతులు వరకాంతలు జగమంత నిండియుండగ ॥ఎం॥
కనులార సేవించి కమ్మని ఫలముల నొసగి
తనువు పులకరించ పాదయుగములకు మ్రొక్కి

ఇనకులపతి సమ్ముఖంబున పునరావృత్తి రహిత పద
మును పొందిన త్యాగరాజనుతురాలి పుణ్యంబును ॥ఎం॥

త్యాగయ్యగారు శబరీ ఘట్టమును-

"శబరి ఎంగిలిచ్చునా" (అప్ప — రామభక్తి ఎంతోగొప్పరా) అను కీర్తన మందలి చరణమునను, "పురాన శబరియొసంగిన యటు నే భుజించుకొన్న శేషమా రామా" (పరాకు నీకేలరా రామ-కిరణావళి) రాగకీర్తన చరణమునందును ప్రస్తావించినారు.

ఉచ్ఛిష్ట ఫలభక్షణము వాల్మీకమునలేదు. అధ్యాత్మమునకూడ లేదు.

## వాల్మీకమునన్న శబరీ వృత్తాంతము

"మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ-తవార్థే పురుష వ్యాఘ్ర పంపాయాస్తీర సంభవమ్" — ఈ శ్లోకమునకు గోవిందరాజీయ వ్యాఖ్యానము-

వన్యశబ్దేన ఫలమూలాదికముచ్యతే-వివిధమిత్యనేన ఫలమూలాది భేదఉచ్యతే-సంచితమిత్యనేన రామస్య చిత్రకూటాగమనాత్ప్రభృతి సంపాదితత్వం ఆదరేణ గుప్తత్వంచ తత్తత్ఫల జాతీయమాధుర్యం పరీక్ష్య స్థాపితమితి సంప్రదాయః—

### అధ్యాత్మము

సంపూజ్య విధివద్రామం ససౌమిత్రిం సపర్యయా
సంగృహీతాని దివ్యాని రామార్థం శబరీ ముదా
ఫలాన్యమృత కల్పాని దదౌ రామాయ భక్తితః
పాదౌసంపూజ్య కుసుమైః సుగంధైః సానులేపనైః
కృతాతిథ్యం రఘుశ్రేష్ఠముపవిష్టం సహానుజం
శబరీభక్తిసంపన్నా ప్రాంజలిర్వాక్యమబ్రవీత్.

కాని శబరి తాను శుచిచూచి ఇచ్చిన ఎంగిలిపండ్లను రామడారగించినట్లు ప్రపంచమున వాడుకయున్నది. వాల్మీకి అధ్యాత్మములలేని ఈ లోకప్రచలితగాథకునాధారము పద్మపురాణాంతర్గతమందురు కొందరు.

"ఏవము క్తాయతోఽహమతోమయాత్వదర్థం వన్యం సమ్యక్పరీక్ష్య. మాధుర్యాయు క్తం సంచితమిత్యర్థః. తదు క్తం పాద్మే శబరీం ప్ర స్తుత్య ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథనివేశ్య కుశవిష్టరే పాదప్రక్షాళనంకృత్వా తత్తోయం పాపనాశనం శిరసాధార్య పీత్వాచ వన్యైః పుష్పైరథార్చయత్

ఫలానిచసుపక్వాని ఫలాని మధురాణిచ
స్వయమాస్వాద్య పరీక్ష్య పరిభక్ష్యచ
పశ్చాన్నివేదయామాస రాఘవాభ్యాంధృఢవ్రతా
ఫలాన్యాస్వాద్య కాకుత్స్థః తస్యై ముక్తింపరాందదౌ.

వాల్మీకముననుసరించి చూచిన రామాగమనమును ప్రతీక్షించుచునేవేవి వన్యములలో రుచ్యములో వానిని దాచియుంచి శబరి రాఘవులకర్పించెనని తోచును. పాద్మముననుసరించి తాను భక్షించి యాస్వాదించి మంచి మంచి ఫలములనర్పించెనని యున్నది. ఈ రెండును పరస్పర విరుద్ధములు కావు. ఎట్లన కొన్ని ఫలముల వాసనచూచి వాని గుణమును కనుగొనవచ్చును. కొన్నింటిని తిని వాని గుణమును కనుగొనవచ్చును. శబరి మహాభక్తి సంపన్నురాలు కావున శ్రీరామునకట్టి ఫలముల భక్షించి యర్పించెనను భావమును గ్రహింపవచ్చును. ఒక్కచెట్టు పండ్లనొక్కదానిని భక్షించి స్థాలీపులాకన్యాయమువననుసరించి తక్కినపండ్లు మంచివని యెఱింగెను. ఒక్క చెట్టుపండ్లనొక్కదానింబరిమళమును పరికించి మంచివని తెలిసికొనెను. తాను భక్షించినది వాసనచూచినది కాక తక్కినవానినే శ్రీరామున కర్పించెను.

శబరి తపోనిరతిగలది. మహర్షులకడనున్నది. యోగాభ్యాసము కలది. ఆమె గురువులు బ్రహ్మర్షులు. కాన శబరి పండును కొంత భాగము తాను దిని మిగిలిన భాగమును శ్రీరామునకర్పించెననుట సముచితముగాదు.

మఱి త్యాగయ్యగారు "శబరి ఎంగిలిచ్చునా!" శబరి శ్రీరామునకు తాను రుచి చూచిన పండ్లను ఇచ్చినదని – అది రామభక్తి గొప్పతనమును చాటుచున్నదనినారు. త్యాగయ్యగారీ ఉచ్ఛిష్టఫలభక్షము నెచటనుండి తీసికొని వచ్చినారు.

త్యాగయ్యగారికి భద్రాచలరామదాసు ఆదర్శప్రాయుడు.

కలియుగమున వర భద్రా
చలమున నెలకొన్న రామచంద్రుని పద భ
క్తులకెల్ల వరుడనందగి
వెలసిన శ్రీరామదాసు వినుతింతుమదిన్

అని రామదాసునకు నివాళులర్పించినారు త్యాగయ్యగారు. రామదాసు దాశరథీ శతకమున రామభక్తి విశేషమును చాటి చెప్పుచు శ్రీరాముడు శబరి ఇచ్చిన ఎంగిలిని తినినారని వ్రాసినారు. త్యాగయ్యగారు దాశరథీశతకమందలి పద్యమునాధారముగ గొని "శబరి ఎంగిలిచ్చునా" అని వ్రాసియుండనోపు.

ఎంతటిపుణ్యమో శబరియెంగిలిగొంటివి వింతగాదె నీ
మంతనమెట్టిదో యుడుతమైని కరాగ్రనఖాంకురంబులన్
సంతసమందజేసితివి సత్కులజన్మములేమిలెక్క వే
దాంతముగాదె నీమహిమ దాశరథీ కరుణాపయోనిధీ!

"సత్కులజన్మములేమి లెక్క" :– కులము ప్రధానముగాదు. త్యాగయ్యగారును 'బలము కులము ఏల' రామభక్తి కారణమనినారు.

శంకరాచార్యస్వామి శివానందలహరిలో గూడ భక్తి గొప్పదనమును చాటినారు.

మార్గావర్తితపాదుకా పశుపతేః అంగస్యకూర్చాయతే
గండూషాంబునిషేచనం పురరిపోః దివ్యాభిషేకాయతే
కించిద్భక్షితమాంసశేషకబలం నవ్యోపహారాయతే
భక్తిః కింనకరోత్యహో వనచరో భక్తావతంసాయతే

శబరియును రామసందర్శనమున కెంతగనో సంతసించి తనకు మోక్షము ననుగ్రహింపుమని వేడుకొనదలచి శ్రీరామునితోనిట్లనినది.

తవ సందర్శనం రామ గురూనామపిమే నహి
యోషిన్మూఢాఽప్రమేయాత్మన్ హీనజాతిసముద్భవా
తవ దాసస్య దాసానాం శతసంఖ్యోత్తరస్య వా
దాసీత్వేనాధికారోఽస్తి కుతస్సాక్షాత్తవైవహి
కథం రామాద్యమేదృష్టస్త్వం మనోవాగగోచరః
స్తోతుంనజానే దేవేశ కిం కరోమిప్రసీదమే

రాముని సమాధానము

పుంస్త్వేస్త్రీత్వే విశేషోవా జాతినామాశ్రమాదయః
న కారణం మద్భజనేభక్తిరేవహికారణం
యజ్ఞదానతపోభిర్వా వేదాధ్యయనకర్మభిః
నైవద్రష్టుమహంశక్యో మద్భక్తి విముఖైస్సదా
తస్మాద్భామిని సంక్షేపాద్వక్ష్యేఽహంభక్తిసాధనం
సతాంసంగతిరేవాత్రసాధనం ప్రథమంస్మృతం
ద్వితీయం మత్కథాలాపః తృతీయం మద్గుణేరతిం"

శ్రీరాముని సమాధానముతో శబరి సంతృప్తి చెందినది.

'ఇతోమద్దర్శనాన్ముక్తి స్తవనాస్త్యత్రసంశయః
యదిజానాసి మేబ్రూహి సీతా కమలలోచనా
కుత్రాస్తే కేనవాసీతాప్రియామే ప్రియదర్శనా'

అని యడిగిన శ్రీరామచంద్రునకు. "పొందడె ఋష్యమూకమునకు" అచట సుగ్రీవుడు - వానరరాజు కలడు" అతనితో సఖ్యము చేయుడు" అని చెప్పి యోగాగ్నిలో శరీరమును దహింపజేసికొని అక్షయమైన పుణ్యలోకములకువెళ్ళినది.

# కిష్కింధా కాండ

పంపాతీరమున శ్రీరాముడు సీతావిరహమున తపించినారు. లక్ష్మణుడు శ్రీరామచంద్రునకు ధైర్యవచనములు పలికినారు. పంపాతీరమునందలి వనభూములను చూచుచు రామలక్ష్మణులు ముందుకుసాగి ఋష్యమూక పర్వత సమీపమున సంచరించు చుండగా సుగ్రీవుడు వారలను గాంచి భయపడినాడు. సుగ్రీవుడు పర్వతశిఖరమున నున్నాడు.

"తౌతుదృష్ట్వామహాత్మానౌ రామలక్ష్మణౌ వరాయుధధరౌ
వీరౌసుగ్రీవః శంకితోఽభవత్"

రామలక్ష్మణులను జూచి భయపడిన సుగ్రీవుడు

"ఉద్విగ్నహృదయస్సర్వాదిశస్సమవలోకయన్
నవ్యతిష్ఠత కస్మింశ్చిద్దేశే వానరపుంగవః"

నిప్పు త్రొక్కిన విధముగా, పాదమునొకచోటనుంచక రామలక్ష్మణులజూచుచు స్వస్థలము వీడి శోకతప్తుడై "ఉండినచోటనుండుటమేలా, పలాయనము చిత్తగించుట అత్యంతశుభమో" అని తలపోసి మంత్రులకిట్లనెను.

"శుభాకారులగు వీరులను జూచితిరా ; నారచీరలు ధరించినారు, నాకును, వాలికిని విడువని వైరమున్న కారణమున వాలి పంపున వచ్చినారు. కపట మునిరూపులుగాకయున్న తాపసులెచటనైనను శరచాపములను ధరింతురా." సుగ్రీవుని మాటలను విని ఆతని మంత్రులును భయమందినారు.

తతః సుగ్రీవసచివాః పర్వతేన్ద్రం సమాశ్రితాః
సంగమ్యకపిముఖ్యేన సర్వే ప్రాఞ్జలయస్థితాః

సుగ్రీవుడు, ఆతని మంత్రులు వాలి వలన భయమునొందినవారై హనుమానుని చేరినారు. "తతస్తం భయసంవిగ్నం వాలికిల్బిషశంకితమ్ ఉవాచ హనుమా

న్వాక్యం సుగ్రీవం వాక్యకోవిదః." అప్పుడు మారుతి సుగ్రీవుని జూచి "ఎందుకయ్యా వాలి వలన ఇంతగ భయపడెదవు? ఇది ఋష్యమూక పర్వతము గదా! వాలి ఇచటకు రాడు గదా! వాలి కనపడిన వాడుకూడ కాడుగదా! భయమెందులకనినాడు. హనుమ మాటలకు సుగ్రీవుడు "సుగ్రీవస్తు శుభంవాక్యం శ్రుత్వా సర్వంహనూమతః తతశ్శుభతరం వాక్యం హనూమన్తమువాచహ దీర్ఘబాహూ విశాలాక్షౌ శరచాపాసిధారిణౌ కస్యనస్యాద్భయం దృష్ట్వాహ్యేతౌ సురసుతోపమౌ" వాలియే పంపగా వచ్చినవారు వారలని తలంచుచున్నాననెను. కావున నీవు ప్రాకృతుని వేషమునవెళ్ళి వారల వృత్తాంతమును తెలిసికొనిరమ్మని సుగ్రీవుడు హనుమంతుని పంపినాడు. హనుమంతుడు సుగ్రీవునిపనుపున భిక్షువేషమున రామలక్ష్మణులను జేరినాడు (ఇది వాల్మీకము). కాని అధ్యాత్మ రామాయణమున హనుమంతుడు వటు రూపమున రామలక్ష్మణులను చేరినట్లున్నది. "గచ్ఛ జానీహి భద్రంతే వటుర్భూత్వా ద్విజాకృతిః.

హనుమంతుడు రామలక్ష్మణులనుజేరి నమస్కరించి వారల వృత్తాంతమడిగినాడు.

ఉవాచ కామతోవాక్యం మృదుసత్య పరాక్రమౌ
రాజర్షిదేవప్రతిమౌ తాపసౌ సంశితవ్రతౌ
దేశంకథమిమం ప్రాప్తౌ భవన్తౌ వరవర్ణినౌ
త్రాసయన్తౌ మృగగణానన్యాంశ్చ వనచారిణః
పంపాతీరరుహాన్వృక్షాన్వీక్షమాణౌ సమన్తతః
ఇమాంనదీంశుభజలాం శోభయన్తౌ తపస్వినౌ
ధైర్యవన్తౌ సువర్ణాభౌ కౌయువాంచీరవాససౌ.

హనుమంతుడు రామలక్ష్మణులకు తన వృత్తాంతమునిట్లు చెప్పినాడు.

సుగ్రీవోనామ ధర్మాత్మా కశ్చిద్వానర యూథపః
వీరోవినికృతో భ్రాత్రా జగద్భ్రమతి దుఃఖితః
ప్రాప్తోఽహంప్రేషితస్తేన సుగ్రీవేణ మహాత్మనా
రాజ్ఞావానరముఖ్యానాం హనూమాన్నామ వానరః
యువాభ్యాం సహధర్మాత్మా సుగ్రీవస్సఖ్యమిచ్ఛతి

తస్యమాం సచివంవిత్తం వానరం పవనాత్మజమ్
భిక్షురూపప్రతిచ్ఛన్నం సుగ్రీవ ప్రియకామ్యయా
ఋష్యమూకాదిహప్రాప్తం కామగం కామరూపిణం

ఇంతవరకు మాటలాడి మారుతి ఊరకుండినారు. అపుడు రామచంద్రుడు తనదు చెంతనున్న తమ్ముని కనుగొని హనుమంతుని వాగ్వైఖరిని అత్యంతము ప్రశంసించినారు.

నానృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః
నాసామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుమ్
నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతమ్
బహువ్యాహరతాఽనేన నకించిదప శబ్దితుమ్
నముఖే నేత్రయోర్వాపిలలాటేచ భ్రువో స్తథా
అన్యేష్వపిచ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్
అవిస్తరమసందిగ్ధమవిలంబితమద్రుతమ్
ఉరస్థం కంఠగం వాక్యంవర్తతే మధ్యమేస్వరే
సంస్కారక్రమ సంపన్నామద్రుతామవిలంబితామ్
ఉచ్చారయతి కల్యాణీం వాచంహృదయహారిణీమ్
అనయాచిత్రయా వాచాత్రిస్థాన వ్యంజనస్థయా
కస్యనారాధ్యతే ముద్యతాసేర రేరపి.
"ఏతాదృగ్గుణగణ సముపేతుండగు దూతనిలుచు
నెవ్వని కడ నా
భూతలపతి కార్యంబులు దూతముఖంబుననె
తీరుధ్రువమనియన్నన్''

ఈ విధముగా హనుమానుని వాగ్వైఖరిని శ్రీరాముడు ప్రశంసించిన మీదట లక్ష్మణుడు ఆంజనేయునితో "పండితవర్యా! సూర్యజుని ప్రభావమును, అతని అమేయ గుణములను గూర్చి వినియుంటిమి. అతనిని వెదకుచు మేమిచటకు వచ్చినారము. మీ ప్రభువుచెప్పిన మాటలకు సంతసించితిమి. నీవు చెప్పిన విధముగ జేయగలమ"ని నాడు.

లక్ష్మణుని మాటలకు హనుమ నంతసించి సుగ్రీవు విజయమును కాంక్షించిన వాడై రామసుగ్రీవులకు మైత్రిగూర్పదలంచెను.

"పనివడి సూర్యపుత్రుగన వచ్చినవారమటన్న" లక్ష్మణుని మాటకు హనుమయుబొంగి, రవిపుత్రుని తలచి, ఇక ఆతని కార్యము చక్కబడుట తధ్యమని భావించెను. హనుమ రామచంద్రుని జూచి "నీవు సోదర సహితుడవై పంపాతీర మందలి ఘోరాటవుల సంచరింపరాగతంబేమి"అని అడుగరాముడు తాను ప్రత్యుత్తర మీయక లక్ష్మణునిచేత మాటలాడింపజేసెను.

త్యాగయ్యగారు రామాయణకృతిరచనజేయుచు కిష్కింధాకాండము నందలి పై సన్నివేశమును(హనుమద్రామలక్ష్మణ సమాగమమును) క్రింది కీర్తనలో నుంచినారు.

ఆడమోడిగలదే రామయ్య మాటలాడమోడిగలదే॥
తోడునీడ నీవేయనుచు భక్తితో
గూటి పాదములబట్టిన మాటలాడ॥
చదువులన్ని తెలిసి శంకరాంశుడై
సదయుడాశుగసంభవుడు మ్రొక్క
కదలు తమ్ముని బల్కజేసితివి
గాకను త్యాగరాజేపాటి మాట ॥లా॥

రామచంద్రునకు భక్తులతో మాటలాడుటకు బింకమట. తానెంతగ వేడికొన్నను రాముడు తనతో మాటలాడినవాడుగాడు శ్రీరాముడని త్యాగయ్యగారి భావన. తన భావనకు రామకథాసుధయందలి పై సన్నివేశమును జోడించి "రామచంద్రా! నీకు నీ భక్తులతో మాటలాడుట కెందుకయ్యా అంత బింకమని అడుగుచున్నారు శ్రీరాముని త్యాగయ్య. ఆనాడు రామచంద్రుడు తానడిగిన ప్రశ్నమునకు సమాధానము చెప్పక లక్ష్మణునిచేత మాటలాడింప జేసినపుడు ఆంజనేయుడు శ్రీరాముని ప్రశ్నించి నాడో లేదోగాని త్యాగయ్యగారు అడుగుచున్నారు. 'As real Bhakta Thyaga-raja is Anjaneya'. చక్కని తెలుగు పలుకుబడితో సాగిన కీర్తన.

"వానితెల్గుల పల్కుబడిలోని అందమ్ము తిక్కన్నకైన అందినదిలేదు" అని విశ్వనాధవారి ప్రశంస త్యాగయ్యగారి తెలుగు పలుకుబడులను గురించి.

వాల్మీకమున "నానృగ్వేద వినీతస్య" అని మొదలిడి చెప్పిన శ్లోకములన్నిటి యందలి సారాంశమును "చదువులన్ని తెలిసి" అను దానిలో సంగ్రహించి చెప్పినారు. హనుమంతుడు ఈశ్వరాంశసంభూతుడు. త్యాగయ్యగారు "శంకరాంశు"డని నారు. "నీ మహత్వమొకింతయున్నివయెరుగవుగాని హనుమ నీవు సాక్షాచ్ఛివుడవు." సముద్రలంఘనమునకు జాంబవంతుడు హనుమంతునుత్సాహపరచు సందర్భమున అన్నమాటగా హరిదాసజగద్గురువులు ఆదిభట్ల నారాయణదాసుగారు వ్రాసినారు.[1]

తన కొలువునకు వచ్చిన ఆంజనేయుని జూచి రావణుడు, "కిమేషభగవాన్ నందీ భవేత్సాక్షాదిహాగతః" అని భావించినారు.

ఈ కీర్తనమునకు త్యాగయ్యగారెన్నుకొనినరాగము "చారుకేశి. తోడి - శంకరాభరణరాగముల సమ్మేళనముచే నేర్పడినది చారుకేశిరాగము. తోడి ఉత్తర దేశపు రాగము. శంకరాభరణము దక్షిణదేశపురాగము. రాముడుత్తరదేశీయుడు. ఆంజనేయుడు దక్షిణప్రాంతమునకు చెందినవాడు. భిన్న ప్రాంతములకు చెందిన ఇరువురువ్యక్తుల సమాగమము (హనుమద్రామలక్ష్మణ సమాగమము) జరిగిన సందర్భమున ఆయా ప్రాంతములయందు వాడుకలోనున్న రాగములను తీసికొని త్యాగయ్యగారు "చారుకేశి" అను రాగమున నీ కీర్తనను రచించుట యెంతేని సముచితము. అదియునుగాక తోడి, శంకరాభరణరాగముల పేళ్ళను గూడ నిందు సూచించినారు త్యాగయ్యగారని కొందరందురు. "తోడునీడ నీవె" యనుచు రామునితో మొరపెట్టుకొనినాడు. రామపరముగ "తోడు" - తోడి, "శంకరాంశుడు" హనుమంతుడు. శంకర - శంకరాభరణము.

త్యాగరాజుగారు "ఆడమోడిగలదే రామయ్యమాట" అను కీర్తనకు చారుకేశి రాగమునెన్నుకొనుటను గురించి ఆయన సంగీతశాస్త్ర పాండిత్యమును ప్రశంసించుచు శ్రీ E. N. పురుషోత్తమన్‌గారు తమ "Thyagopanishad" అను గ్రంథమున నిట్లు వ్రాసినారు.

This is another Jem of Thyagaraja which dazzles with musical brilliance... This lovely raga reveals through musical tradition the new friendship between the aryan Rama - Lakshmana and the non - aryan Hanuman - Sugreeva Rama may be

1. యథార్థరామాయణము - హనుమత్సందేశము.

likened to Thodi and Hanuman to Sankarabharanam. Thus this keerthanam exemplifies the amplitude of Thyagaraja's imaginative genius.

లక్ష్మణుడు మాటలాడిన తరువాత హనుమంతుడు రామలక్ష్మణులను సుగ్రీవుని సన్నిధికి తీసికొనివెళ్ళి రామసుగ్రీవులకు అగ్నిసాక్షిగ మైత్రి జరిపినారు. శ్రీరాముడు సుగ్రీవునితో మైత్రి జరుపుటను త్యాగయ్యగారు -

"అలు నీకైన భక్తురాలో యనుచు నాడు
ప్రాలుమాలక రవిబాలుని చెలిమిఁ చేసినదెల్ల మరచితివో"

అను తోడిరాగకీర్తన చరణమందు కీర్తించినారు.

సుగ్రీవుడు తనకు వాలి చేసిన అపకారమును శ్రీరామునకు విన్నవించుకొనినారు. వాలిని వధింతునని శ్రీరాముడు ప్రతిన గావించినారు. "సీతాన్వేషణము గావింతునని సుగ్రీవుడు చెప్పినాడు. త్యాగయ్యగారి విషయమునంతను "మనసా మనసామర్థ్యమేమి అను కీర్తనమున నీ క్రిందిచరణమున స్ఫురింపజేసినారు.

"పలుమారుజగములు కల్లలనిన రవిజుని మాయ
వలవేసి త్యాగరాజ వరదుడు తాజనగలేదా । మనసా॥

ముందుగ రామలక్ష్మణులను జూచిన సుగ్రీవుడు వాలి పంపగా వచ్చి యుందురని, తనను చంపుదురని యెంతగనో భయపడినాడు. హనుమంతుడు శ్రీరామసుగ్రీవులకు మైత్రిని చేసిన పిమ్మట వాలిని జంపుదునని శ్రీరాముడు ప్రతిజ్ఞ సేయుట, సీతావృత్తాంతమును తెలిసికొనివత్తునని సుగ్రీవుడు శపథమూనుట - ముందుగ అంతప్రతికూలుడైన సుగ్రీవుడు - అంత అనుకూలుడుగమారుట - అంతయును దైవలీల - ఇందు మనసామర్థ్యమేమియులేదు.

"మనసా మనసామర్థ్యమేమి అనుకీర్తనలోని 'పలుమారు జగములు కల్లలనిన రవిజుని మాయవలవేసి త్యాగరాజవరదుడు తాజనగలేదా" అను చరణమునకీయర్థమును స్ఫురింపజేసినవారు కీర్తిశేషులు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు. శ్రీకామేశ్వరరావుగారు స్ఫురింపజేసిన అర్థమునకు మెచ్చుకొనుచు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు "త్యాగరాజు - ఆత్మవిచారము అను గ్రంథమున నిట్లు వ్రాసినారు.

"రవిజుని మాయ వలవేసి అన్న దగ్గర అయోమయంగా కనిపిస్తున్నది. రవిజుడు అంటే సుగ్రీవుడు. సుగ్రీవుణ్ణి మాయవలలో వేయటం ఏమిటి? రవిజుడు అన్నదానికి వాలి అనే అర్థం చెప్పడం అసాధ్యం. కీర్తన చూడగానే ఈసంశయాలు పీడిస్తున్నని. శ్రీకామేశ్వరరావుగారు ఇక్కడ వ్రాస్తున్నారుగదా,రాజులు ఎంతకేనా తగుదురని వాలి పంపగా తన్ను చంపటానికి వచ్చి ఉంటారని రామ లక్ష్మణుల్ని గురించి మొదట శంకించాడట సుగ్రీవుడు. అల్లాంటి సుగ్రీవుడు అనగా అంత ప్రతికూలుడు అంత అనుకూలుడైన రామసేవకుడుగా మారిపోవడం అనే మాయ ఎల్లాజరిగింది రాముడి సామర్థ్యంకాకపోతే. ప్రతికూలభావం మొట్టమొదట్లో కనబరిచిన సుగ్రీవుణ్ణి అనుకూలుడుగా చివరికి మార్చివేసికోడం అనే విధంగా కైక విషయంలో ప్రాతికూల్యభావాలకి, సుగ్రీవుని విషయంలో అనుకూల్యభావాలకి అనుగుణంగా కీర్తనకు అర్థం చెప్పడం సొగసుగా ఉన్నది. ఆ విధంగా కైకను, ఈ విధంగా సుగ్రీవుణ్ణి కూడ మాయవలలో వేసికొన్నాడు శ్రీరాముడు రావణాది రాక్షస బలాన్ని జయించటానికి ముఖ్యమైనది అంగబలం. వనవాసియైన శ్రీరాముడికి ఆ బలం బొత్తిగాలేదు. తాను సుగ్రీవుడి స్నేహం తప్పక వాంఛించవలె. అతడప్పుడు రాముని యెడల ప్రతికూల భావంతో ఉన్నాడు. ప్రాతికూల్యం అనేది రాముడికి లేదు. రాముకి విషయంలో సుగ్రీవుడికి మాత్రమే. రాముణ్ణిచూడగానే కపిరాజు పరమోద్విగ్నుడై పోయాడు.

"నైవచక్రే మనస్థానే వీక్షమాణో మహాబలః
కపేః పరమభీతస్య చిత్తం వ్యససాదహ
చింతయిత్వా సధర్మాత్మావిమృశ్య గురులాఘవం
సుగ్రీవః పరమోద్విగ్నస్సర్వైరనుచరైస్సహ॥

ఇక కల్లూరి వీరభద్రశాస్త్రిగారు "త్యాగరాజ కీర్తనలు - విశేష వివరణము "అను తమ గ్రంథము రెండవ భాగమున "మనసా - మనసామర్థ్యమేమి" అను కీర్తనమందలి "పలుమారు జగములు కల్లలనిన రవిజుని మాయవలవేసి త్యాగరాజ వరదుడు తాజనగలేదా" అను చరణమునకీ విధముగా వివరణమునిచ్చినారు.

రవిజుని=సుగ్రీవుని ముందుగా వాలితో యుద్ధమునకు వెడలుమనియు నేను సహాయమువత్తునని చెప్పి తొల్త తాను మరలివచ్చెను. రెండవమారు చాటునుంచి

వాలిని సంహరించెను. ఇందునూ దేవరహస్యము కలదు. వాలిసుగ్రీవుల మొదటి యుద్ధమందే తాను వాలిని వధించలేకనా తిరిగివచ్చినది. తాను భగవంతుడయ్యును వాలిపట్ల తానే ముందుగా విరోధభావమును చూపరాదని తోచెదిని. ఇట్లు ముందు తలచిన దొకటి జరిగినది మరొకటి అయినందున దైవవిధి ఇందు అంతర్లీనమై యుండును.

కైకేయీ వృత్తాంతమున ప్రాతికూల్య భావమును సూచించిన త్యాగయ్య గారు, సుగ్రీవుని విషయమున ఆనుకూల్య భావమునే సూచించి యుందురు. ఈ కీర్తనకు భమిడిపాటివారి సమన్వయమే బాగున్నది. శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారి సమన్వయము-వాలిసుగ్రీవుల మొదటి యుద్ధమును వర్ణించిచెప్పుట దూరాన్వయము

ఇక శ్రీ E. N. పురుషోత్తమన్‌గారు తమ "Thyagopanishad" అను గ్రంథముననిట్లు వ్రాసినారు.

'But the second episode is not so well known. I have consulted some distinguished scholars but none of them is able to say convincingly who this Ravijudu is who spurned this world at first as an illusion but then succumbed to its maya. Sri Kalluri Veerabhadra Sastry also says this line is not interpretable. Ravijudu means son of Surya. But none of Surya's sons, Vyvaswatha Manu, Yama, Saavarni, Manu, Sani, Vasishta, Sugreeva and Karna are said to have been caught in such a snare. One of the scholars said that Ravijudu may meen Vasistha because according to one Ramayana, Vasishta is said to have prevailed over the good Kaikeyi to play that most treachorous and ignominous role so that Rama may fulfill the mission for which he had come otherwise, Ramavarthara would have been a glorious failure.

వాలి తనను పరిభవించిన విధమును, వాలితో తనకు విరోధము కలిగిన కారణమును శ్రీరామునకు విన్నవించినాడు సుగ్రీవుడు. శ్రీరామునకు సుగ్రీవుడు వాలి బల పరాక్రములను తెలిపినాడు. దుందుభివృత్తాంతమును, వాలి దుందుభుల యుద్ధమును, మతంగుని శాపకారణముగా వాలి ఋష్యమూకమును చేరకుండుట మొదలుగాగల వృత్తాంతములను శ్రీరామునకు చెప్పినాడు సుగ్రీవుడు. త్యాగయ్యగారు

తనను అనుగ్రహింపుమని శ్రీరాముని అనేక విధములుగా ప్రార్థించినారు. శ్రీరాముడు తనపట్ల ప్రసన్నుడు కాలేదని భావించినారు త్యాగయ్యగారు. తానునమ్మినది ఏ రామునో, తాను పూజించినది ఏరామునో అని భావించుచు త్యాగయ్యగారు రామాయణకథా సన్నివేశములను తడవినారు.

"దారపుత్రులవద్ద చేరనీక రవి కు
మారుని వెలపట బారదోలి గిరి
జేరఁజేసినట్టి తారానాయకుని సం
హారము చేసిన శ్రీరాముడు గాదో[1]"

దాశరథి దయాశరథియని త్యాగయ్యగారి విశ్వాసము. భక్తపరాధీనుడు దాశరథి. అట్టి రాముని పూజించినారు త్యాగయ్య. కాని దయాశరధి - దాశరధి అనుగ్రహము తనపై ప్రసరింపకుంటతో తాను పూజించినది దాశరధి రాముని గాదేమో" అని యను మానము కలిగినది త్యాగయ్యగారికి. సుగ్రీవుననుగ్రహించిన దాశరధి తన పట్ల నిర్దయుడైనాడు. తాను పూజించినది దాశరధి రాముని కాదేమో అను సందేహముకలిగి — రామాయణ కథాసన్నివేశములను తీసికొని రాముని శరణాగత త్రాణ పరాయణత్వమును బహుధా శ్లాఘించినారు త్యాగయ్య.

ఒక వనచరుడలనాడు సహోదరు బాధలు తా
శక మొఱలిడ బ్రోచితివి తనకు సుగ్రీవముగాదా[2]

సుగ్రీవుడు శ్రీరాముని పరాక్రమమునకు పరీక్షపెట్టి దుందుభి శరీరమును కాలితో తన్నుమని కోరినాడు. శ్రీరాముడట్లే దుందుభి శరీరమును కాలితో తన్నినారు. త్యాగయ్యగారా సన్నివేశమును వర్ణించుచు శ్రీరామ పాద మహిమమును ప్రస్తుతించినారు.

---

1. ఏ రాముని నమ్మితినో నేనేపూల పూజ చేసితినో
2. నా మొరాలకింపవేమి శ్రీరామ

"వనరుహ తులితనయన సంక్రందన
తనయుని బాధ సహింపని విరో
చన సుతుమతిఁ గలిగిన భయమెగయగ
ఘనతమ దుందుభి పెనుతలఁ దన్నిన"[1]

దుందుభి పెనుతలను దన్నినను శ్రీరాముని పరాక్రమమును విశ్వసించినవాడు కాడు సుగ్రీవుడు. శ్రీరామచంద్రు డప్పుడొక బాణమున సాల సప్తకమును ఛేదించి తన పరాక్రమముపై సుగ్రీవునకు నమ్మకము కలిగించినారు. త్యాగయ్య కిష్కింధా కాండమున వాలివధ - సుగ్రీవ పట్టాభిషేకము - మొదలుగాగల ఘట్టములను అనేక కీర్తనములలో ప్రస్తావించినారు. కారణము సుగ్రీవుడు - తాను ఇరువురు అగ్రజుని వలన బాధలనొందినవారగుటయే.

నీ సముఖాన రవితనయుడు నిన్ను
బాసలుపల్కగ రోసముతో సిం
హాసనాధిపతిఁ జేసిన నీకు
దాసుడైన త్యాగరాజ కరార్చిత"[2]

వాలిని సంహరించి సుగ్రీవునకు పట్టము గట్టినాడవె. నాపట్ల నిర్దయుడవై యున్నావెందులకు? నేను నీవాడనను అభిమానము లేదా అని శ్రీరాముని ప్రశ్నించినారు త్యాగయ్య.

శ్రీరామునండ చూచుకొని సుగ్రీవుడు వాలిమీదకు యుద్ధమునకు వెళ్ళి పరాభూతుడై తిరిగి వచ్చినాడు. శ్రీరాముని నిష్ఠురములాడినాడు సుగ్రీవుడు. శ్రీరాముడు తాను వాలిని జంపకుండుటకుగల కారణమును సుగ్రీవునకు చెప్పినారు. లక్ష్మణునిచే గజపుష్పమాలను సుగ్రీవుని మెడనలంకరింపజేసినారు శ్రీరాముడు. సుగ్రీవుడు శ్రీరాము ముతో రెండవమారు వాలిని యుద్ధమునకు రమ్మని పిలిచినాడు.

---

1. నీపద పంకజములను నే నెఱనమ్మినాను.
2. మానములేదా తనవాడని యభిమానము లేదా?

తార యుద్ధమునకు వెళ్ళవలదని వాలినెంతగనో ప్రతిమిలాడినది. వినినవాడు కాడు వాలి. వాలిసుగ్రీవులు యుద్ధసన్నద్ధులైనారు. వజ్రసదృశమైన బాణముతో శ్రీరాముడు వాలిని కొట్టినారు.

'ఘనబలుడైన వాలినిజంపిన బాణమును జూచేదెన్నటికో'[1]

# వాలివధ

తాళవృక్షముల చాటున దాగియుండి శ్రీరాముడు వాలిన కొట్టినట్లుగ వాల్మీకి మునలేదు. వాల్మీకమున నిట్లున్నది.

సుగ్రీవుడు వాలి భుజబలముచే హీనసత్త్వుడు కాగా పరికించి శ్రీరాముడు బాణమును సంధించెను.

తతోవర్ధత వాలీతు బలవీర్య సమన్వితః
సూర్యపుత్రో మహావీర్యః సుగ్రీవః పరిహీయతొ
వాలినా భగ్న దర్పస్తు సుగ్రీవో మందవిక్రమః
వాలినం ప్రతిసామర్షో దర్శయామాన లాఘవం
తతో రామో మహాతేజా ఆర్తం దృష్ట్వా హరీశ్వరం
శరంచ వీక్షతొ వీరోవాలినోవధ కారణాత్.

భూరిత రార్తిఁజొక్కు రవిపుత్రుని దుస్థితిఁ జూచి యుగ్ర తే
జోరమణీయమూర్తి యరిసూదనదక్షుడు రామచంద్రుడున్
ఘోరశరంబు వాలివధకుందగు దానినిదీసి మౌర్వి టం
కారము మీఱ వింటను నఖండ జవంబునఁ గూర్చెదక్షుడై-
(ఆంధ్రవాల్మీకి రామాయణము వావిలకొలను సుబ్బారావు)

---

1. వినయమునను కౌశికుని వెంట

అధ్యాత్మ రామాయణమున నిట్లున్నది

బాణమాదాయ తూణీరాద్వైన్ద్రం ధనుషిసందధే
ఆకృష్యకర్ణపర్యంతమదృశ్యో వృక్షషండగః
నిరీక్ష్య వాలినం సమ్యగ్లక్ష్యం దద్హృదయం హరిః
ఉత్ససర్జాశనిసమం మహావేగం మహాబలం.

కని, పరులకరయరాకుండనొక్కతరుషండంబునందొదిగియుండి నిషం గమ్మునుండి బాణమ్మొందీసి కుంభసంభవదత్తంబగు జంభారిచాపంబున సంధించిన వాడై-వాలి రొమ్మునకు గురిపెట్టి విడిచెను.

త్యాగయ్య వాలివధను అధ్యాత్మ రామాయణానుసారముగనే రచించినారు.

"మును వారివాహవాహన తనయుడు మదమున
రవిజుని చాల
కొట్టుటజూచి మనసు తాళలేక ప్రేమమున పాలనముసేయ
తాళతరువు మరుగున నిల్వగలేదారీతినినేడు
(ఎందు దాగినాడొ-తోడి)

రాముడు వాలినొక్క కోలనేసి రవిబాలుని రాజుజేసినాడు. వాలివలన అనేక బాధ లకు గురియయిన సుగ్రీవుడు శ్రీరాముని శరణుజొచ్చినాడు. శ్రీరాముడు సుగ్రీవుని మదినున్న కొరత దీర్చినాడు. త్యాగయ్యగారా విషయమును నీ క్రింది చరణమునందు సూచించినారు.

"మున్ను వజ్రబాధలనోర్వజాలకను ఇనజుండు నిను
రామచంద్ర
కొనియాడ పరితాపమునుజూచి వానిమదికొరత తీర్చిన
రామచంద్ర

సుగ్రీవపట్టాభిషేకము జరిగినది. శ్రీరామునాజ్ఞమేరకు సుగ్రీవుడు అంగదుని యువరాజుజేసినాడు. రామలక్ష్మణులు ప్రస్రవణగిరిగుహ చేరినారు. అది వర్షర్తువు. వర్షకాలము ముగిసినపిమ్మట సీతాన్వేషణము గావింతునని చెప్పినాడు సుగ్రీవుడు.

శరదృతువు వచ్చినను సుగ్రీవుడు భోగలాలసుడై శ్రీరాము కార్యమును మఱచినాడు. హనుమంతుడు సుగ్రీవుని హెచ్చరించినాడు. కార్తీకపూర్ణిమవరకు సుగ్రీవుని జాడ లేదు. శ్రీరాముడు సీతావియోగ దుఃఖమునను న్నాడు. శ్రీరాముని స్థితిని జూచి లక్ష్మణుడు సుగ్రీవునిపై ఆగ్రహించినాడు. రామాజ్ఞను గైకొని లక్ష్మణుడు కిష్కింధ చేరినాడు. సుగ్రీవుడు వానరవీరులతో కలిసి రాముని జేరి శరణుజొచ్చినాడు. శ్రీరాముని కోపము చల్లారినది.

"సాధోః ప్రకుపితస్యాపి మనోయాతి న విక్రియామ్
నహి తాపయితుం శక్యం సాగరాంభ స్తృణోల్కయా"

సుగ్రీవుని ఆదరించినాడు శ్రీరాముడు. సీతాన్వేషణ విషయమును మఱచి భోగ లాలసుడైన సుగ్రీవుని పట్ల కోపమూనిన రాముడు, సుగ్రీవుడు తనను చేరగనే కోపమును మఱచి అనుగ్రహించిన విషయమునీ క్రింది చరణమునందుంచి రాముని శరణాగతత్రాణపరాయణత్వమును కీర్తించినారు త్యాగయ్యగారు.

"మరచియున్న వనచరుని బ్రోచిన మహిమ తెలుపవయ్యా"
(మరి మరి నిన్నే మొరలిడ నేమరతగునా - కాంభోజి)

సీతాన్వేషణము ప్రారంభమైనది. సుగ్రీవుడు కార్యభారమును హనుమ భుజ స్కంధములపై మోపినారు. రామచంద్రుడు మారుతుని చేరబిలిచి "కోతివికావు నీవు మాకుల దేవతవని" ప్రశంసించి ముద్రికనిచ్చినారు. వానరలు సీతను వెదక ప్రారంభించినారు. సుగ్రీవుడిడిన నెలరోజులు గడువు ముగియనున్న సమయమున ఋక్ష బిలమును చేరినారు వానరులు. సహస్రయువతీ సంసేవితయై కిన్నెరంబూని శ్రీరామసంకీర్తనము సేయు స్వయంప్రభను జూచి వానరులు సీతయని భ్రమ పడినారు. ఇంతలో "తన్న తంద్రీ" యని స్వయంప్రభ శ్రీరాముని సంబోధించు టతో నామె సీతగాదను నిర్ణయమునకు వచ్చినారు వానరులు. సీతాయి సమాచార మును చెప్పుమని యడిగిన వానరులకు స్వయంప్రభ "నేను సీతకు కూతురనగు దును. మిమ్ముగాంచి పాపవిముక్తినొందితిని. ఇక నేను రామచంద్రుని జూడగలను. ఆనాడు బ్రహ్మయన్న మాట నిజమైనది. నేను శ్రీరామదర్శనభాగ్యమును పొందు టకై బ్రహ్మను గురించి తపస్సుచేసితిని. భూమిజను వెదకు కపులనుగన్నంత మాత్రమున రామదర్శనము కాగలదని చెప్పినారు బ్రహ్మ. నేనమరకన్యను, నన్ను

స్వయంప్రభయందురు. ఈ గుహ మొదలు ఒక కాండ కొనగలదు. దక్షిణ సముద్ర మున కీదారి వేయిరెట్లు తక్కు త్రోవల కన్న చేరువ. గాడుపిచట మిమ్ముదేలించి అటప్రవాహమ్ము కరణిజేర్చును. మీకు మేలగును. వెళ్ళుదని" చెప్పి శ్రీరామ సందర్శనార్థము బయలుదేరినది స్వయంప్రభ. అనేక విధముల శ్రీరాముని ప్రార్థించినది స్వయంప్రభ. శ్రీరామసాక్షాత్కారమునందినది. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేయుటకవతరించితివని శ్రీరాముని ప్రార్థించినది.

"మానిని నీ భక్తికి నే
మానసమున మెచ్చినవాడ మఱి యేవరముల్
మానుగగోరెదవో యను
మానము లేకుండనడుగుమీ యవియిత్తున్'

అనినారు దాశరథి. రామచంద్రుని మాటలకు స్వయంప్రభ "దాసురాలిపై దయ గలిగినది. కృతార్థురాలను జేయదలచి నీ సుదర్శనమును నేటికనుగ్రహించితివి. నిశ్చల తపము ఫలించినది. వేరెవరములక్కరలేదు. మోక్షమునీయుమనినది. కేవ లాత్మమయుండవై నీవు నీ తమ్మునితో, దేవేరితో నిరంతరము నా మనమునందుం డుము. మరల భూమిపై జన్మమెత్తజాలను.

అనుచు బ్రార్థింప సంతోషమంది రాము
డనియె యోగిని బదరికా వనమునందు
జేరి నా నామజపమును జేయుచుండు
మంత్యమందైక్యమగుదు నాయందు నిజము.

అని సెలవిచ్చినారు రాఘవులు. స్వయంప్రభ అంత్యమున రాముని యందైక్యము జెందినది. ఈ వృత్తాంతమునంతను ఈ చరణభాగమునుంచి 'అబలస్వయంప్రభకు దైవమచలపదవినిచ్చునా[1] రామయణకృతి రచనా సందర్భమున- రామభక్తి వైభవ మును చాటినారు. రామాయణ కథాసన్నివేశములు చోటుచేసికొనని కీర్తన త్యాగయ్య రచనలలో లేదనుట అతిశయోక్తి కానేరదు. రామభక్తి వైభవమును చాటిచెప్పిన క్రింది కీర్తనలో బాలకాండ మొదలు సుందరకాండ పర్యంతముగల కథా సన్నివేశ ములనెంత మనోజ్ఞముగా చిత్రీకరించిరో చూడుడు.

1. అప్ప రామభక్తి ఎంతోగొప్పరా!

అప్ప రామభక్తి యెంతోగొప్పరా మా ॥అప్ప॥
త్రిప్పటలనుదీర్చి కంటిరెప్పవలెను గాచుమా ॥అప్ప॥
లక్ష్మీదేవి వలచునా లక్ష్మణుండు గొలుచునా
సూక్ష్మబుద్ధిగల భరతుడు చూచిచూచి సొలసునా ॥యె॥
శబరి యెంగిలిచ్చునా చంద్రధరుడు మెచ్చునా
అబల స్వయంప్రభకు దైవమచలపదవినిచ్చునా మా ॥యె॥
కపివారిధి దాటునా కలికి రోటగట్టునా
అపరాధి త్యాగరాజునకానందము హెచ్చునా మా ॥యె॥

వాల్మీకి రామాయణమున, భాస్కర రామాయణమునగూడను స్వయంప్రభ వృత్తాంతము లేకపోలేదు. కాని వాల్మీకి, భాస్కర రామాయణములలో స్వయంప్రభ వానరులకు ఋక్షబిలవృత్తాంతమును తెలిపి వారలనాబిలమునుండి వెలువరించినంత వరకు మాత్రమే గలదు. తరువాత స్వయంప్రభ బదరికావనమును జేరుటగాని, రామచంద్రుని భజించి అంత్యమున రామునిలో నైక్యమందుటగాని లేదు, అధ్యాత్మ రామాయణమున నున్నది.

వానరులను గుహనుండి వెలుపలకుజేర్చి స్వయంప్రభ శ్రీరాము సన్నిధికి వెళ్ళెను.

తత్రరామం ససుగ్రీవం లక్ష్మణంచ దదర్శహ
కృత్వా ప్రదక్షిణం రామం ప్రణమ్య బహుశస్సుధీః
ఆహ గద్గదయా వాచా రోమాంచిత తనూరుహా
దాసీతవాఽహం రాజేన్ద్ర దర్శనార్థమిహాగతా
బహువర్ష సహస్రాణి తప్తం మేదుశ్చరంతపః
గుహాయాం దర్శనార్థం తే ఫలితం మేఽద్య తత్తపః
నమస్యామి రఘుశ్రేష్ఠం బాణాసనశరాన్వితమ్
లక్ష్మణేన సహభ్రాత్రా సుగ్రీవాదిభిరన్వితమ్

ఏవంస్తుతో రఘుశ్రేష్ఠః ప్రసన్నః ప్రణతాఘహృత్
ఉవాచయోగినీం భక్తాం కింతేమనసికాంక్షితమ్
సాప్రాహ రాఘవం భక్త్యా భక్తిం తే భక్తవత్సల
యత్రకుత్రాపిజాతాయా నిశ్చలాందేహిమే ప్రభో
త్వద్భక్తేషు సదాసంగో భూయాన్మేప్రాకృతేషు న
జిహ్వామే రామరామేతి భక్త్యా స్మరతుసర్వదా
మానసం శ్యామలం రూపం సీతాలక్ష్మణ సంయుతం
ధనుర్బాణధరం పీతవాససం మకుటోజ్జ్వలమ్
అంగదైర్నూపురైర్ముక్తాహారైః కౌస్తుభకుండలైః
భాన్తంస్మరతుమే రామ వరం నాన్యేవృణే ప్రభో
భవత్వేవం మహాభాగే గచ్ఛ త్వం బదరీవనమ్
తత్రైవ మాంస్మరంతీ త్వం త్యక్త్వేదం భూతపంచకమ్
మామేవ పరమాత్మానమచిరాత్ ప్రతిపద్యసే
శ్రుత్వా రఘూత్తమ వచోఽమృత సారకల్పం
గత్వాతదైవ బదరీ తరుషండ జుష్టమ్
తీర్థత్వదా రఘుపతిం మనసాస్మరంతీ
త్యక్త్వాకలే వరమవాప పరంపదం సా.

సుగ్రీవుడిచ్చిన గడువు మీరినందులకు అంగదుడు బాధపడి ప్రాణములను విడుతు నన్నాడు. అంగదు వాక్యములను కపులామోదించినారు. హనుమంతుడంగదుని సమాధాన పఱచినారు. అంగదాదులుప్రాయోపవేశము చేసినారు. సంపాతియంగ దాదులను జూచివారితో సంభాషించినారు. అంగదుడు సంపాతికి తమవృత్తాంతమును చెప్పినారు. రావణుడు సీతను బలాత్కారముగ తీసికొనివెళ్ళినట్లు, శ్రీరాముని జనకు సఖుడును గృధ్రేశుండునగు జటాయువు రాముని భార్యనుజూచి, ఆమెను విడిపింప గోరి ఆకాశమార్గమున జనెడి రావణుని దాకి అతని రథమును గూల్చి అక్కపలయా క్షిని ధరమీదనిల్పెనని జటాయు వృత్తాంతమును, తరువాతి వృత్తాంతమును

జెప్పినారు. జటాయువు తన తమ్ముడని సంపాతి కపులతో చెప్పినారు. సంపాతి కపులకు రావణునునికి చెప్పినారు. సంపాతి చెప్పినమీదట వానరులు సముద్రతీరమును చేరినారు. నూరామడల సముద్రమును దాటుటకెవ్వరును ముందుకురారైరి. అంగదుడు నూరామడల సముద్రమును తాను దాటగలనుకాని తిరిగిరాలేనన్నారు. జాంబవంతుడు తొంబది ఆమడలు మాత్రమే దాటగలనన్నారు. జాంబవంతుడు నూరామడల సముద్రమును దాట మారుతిని ప్రోత్సాహపఱచినారు.

"రాముకరుణనపారభవాంబుధి లంఘించిన కపివీరుడనని" శతయోజన విస్తీర్ణమైన సముద్రమును దాటనుంకించినారు ఆంజనేయుడు. హనుమదాదులు మహేంద్రగిరినధిరోహించినారు.

# సుందరకాండ

శ్రీమద్రామాయణమున సుందరకాండమునకొక ప్రత్యేక స్థానముగలదు. ఇది పవిత్రతమ కాండము. ప్రత్యేకపారాయణయోగ్యతకలది. భారతేతిహాసమున భగవద్గీత ఉపనిషత్స్థానము నాక్రమించుకొని యుజ్జ్వలతారయై ప్రకాశించుచున్నటుల రామకథాసుధయందు సుందరకాండమొక పవిత్రసుందరఘట్టమై ప్రకాశించుచున్నది.

సుందరే సుందరో రామః సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనం
సుందరే సుందరంకావ్యం సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం సుందరే కింన సుందరం

రామాయణ మహామాలారత్నమాంజనేయుడు. నూరామడల సముద్రమును మారుతిగోష్పదమంతగచేసికొని దాటుట రామభక్తి విశేషమేననినారు త్యాగయ్యగారు.

"కపి వారిధి దాటునా

(అప్ప రామభక్తి ఎంతో గొప్పరా)

సముద్రమును దాటి లంకం బ్రవేశించి అశోకవనమున సీతాభగవతినిగాంచి నారు మారుతి. నూరామడల సముద్రమును దాటిన రామభక్త శిఖామణియగు నాంజ నేయుని త్యాగయ్యగారు శరణువేడినారు.

'పాహి రామదూత జగత్ప్రాణకుమార-వాహినీశతరణ' ॥మాం

అనుదానిలో సముద్రలంఘన విషయమును సూచించినారు త్యాగయ్యగారు. ఆంజ నేయుడు అశోకవనమున సీతాభగవతిని గాంచి రామముద్రికనిచ్చినారు. సీత ఆన వాలుగనిచ్చిన చూడామణిని తీసికొని లంకంగాల్చి రాక్షసవీరులనెందరనో సంహరించి నాడు హనుమంతుడు. సంహరింపబడిన రాక్షసులలో రావణునికుమారుడగు అక్షుడు కూడ నొకడు.

అంజనానందనం వీరం జానకీశోకనాశనం
కపీశమక్షహంతారం వందే లంకాభయంకరం

"దశవదనసూనుతనుహరణ" అనుచరణమున (పాహి రామదూత జగత్ప్రాణ కుమార) రావణుకుమారుడగు అక్షుని సంహరించిన విషయమును తెలియనగును.

ఆంజనేయమతిపాటలాననం కాంచనాద్రికమనీయవిగ్రహం
పారిజాతతరుమూలవాసినం భావయామిపవమాన నందనం

అను శ్లోకమునందలి "పారిజాత తరుమూల వాసినం" అను విషయమును "పాహి రామదూత జగత్ప్రాణకుమార మాం" అను కీర్తనమందలి "పారిజాత తరునివాస" అనుచరణ భాగమున సూచించినారు. సీతాపాతివ్రత్యమహిమముచే తనకేమాత్రమపాయము కలుగకుండ బయటపడినాడు మారుతి. హనుమగావించిన వీరవిహారమునకు జగన్మాతసీత సంతసిల్లి "భవ్యరామాయణగాధ లోషు మహత్వము నీయదె మారుతాత్మజా" యని ప్రశంసించినది. సీతదగ్గర సెలవునై కొని పావని శ్రీరామునిచేరి "దృష్టామయాసీతా" అనిచెప్పి శ్రీరామునకానందము కలిగించినారు.

సీతా కుశలవార్తలను తెలియజెప్పి తనకానందము గలిగించిన మారుతిని గాఢాలింగనము చేసికొన్నారు శ్రీరాముడు. "త్యాగయ్యగారి విషయమునుకూడ తన రామాయణకృతి రచనా సందర్భమున ప్రస్తావించి శ్రీరాముని భక్తవాత్సల్యమును బహుధా ప్రస్తుతించినారు. ఇత్యుక్త్వా ప్రీతిహృష్టాఙ్గో రామస్తం పరిషస్వజే".

సతిమాటలు సదా కపిజుచే విని స
మ్మతిని గౌగలించిన శుభానన—
(ఓ రామ! రామ! సర్వోన్నత! నీకిపుడోరవంచన ఏలా రాఘుృణాకర)

శ్రీరాముడు ఆంజనేయుని "భావిబ్రహ్మను" చేసినారు. భవిష్యచ్చతురాననుడు గదా ఆంజనేయుడు. ఈ విషయమును త్యాగయ్యగారు "చేసినదెల్ల మరచితో" అను కీర్తనమందలి క్రిందిచరణమున సూచించినారు.

రామ శ్రీ త్యాగరాజ ప్రేమావతార సీతా
భామమాటలు తెల్పు భీమాంజనేయు(బ్రహ్మ" చేసినదెల్ల.

# యుద్ధకాండ

శ్రీరాముడు సముద్రమును దాటుపెట్లని హనుమతో యోజనసల్పినారు. సుగ్రీవుడు శ్రీరామునకుత్సాహము కలుగునట్లు మాటలాడినారు. "సేతు నిర్మాణంబు చేయక వారిధి దరియింపరాదయ్య సురలకైన" అని చెప్పినాడు సుగ్రీవుడు.

వరుణాలయ మెటులైనను
దరియింపన్ వలయునంతదనుకనె కష్టం
బరిరావణాసురుడు సం
గరసీమను నిర్జితుండుగానెంతు నృపా.

ఏలా పలుమాటలు నీ
కేలీలలనైన విజయమెసగును శుభదం
బౌ లక్షణముల గంటిని
జాలగ నా మనము సంతసంబున దేలెన్॥

అని పలికిన సుగ్రీవుని మాటలువిని మరుత్తనూజుని కనులారగని "నీవు దశకంఠుని కంటివిగదా! లంకయందెన్ని మార్గములుగలవో చెప్పుమనినారు - రామచంద్రుడు.

హనుమంతుడు లంకావృత్తాంతమును రామునకెరింగించి ముహూర్త నిశ్చయము చేయుమనినారు. హనుమంతుని వాక్యములనువిని అభిజిల్లగ్నమున బయలుదేరి కపిసేనలతో లంకపై దండయాత్ర వెడలినారు. కపిసేనతో సముద్రతీరమును జేరినారు దాశరధి. శ్రీరాముడు సీతందలంచి దుఃఖించినారు. ఇది యిట్లుండ రావణుడు లంకలో మంత్రులతో నాలోచనచేసినారు. ప్రహస్తాది రాక్షసవీరుల ప్రగల్భములు విని విభీషణుడు రావణునకనేక విధముల రాజనీతిని బోధించి "ప్రదీయతాం దాశరథాయ మైథిలీ" అని చెప్పినాడు. ఎంతచెప్పినను విననివాడుకాడు రావణుడు

''విభీషణవచః శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః
విసర్జయిత్వా తాన్ సర్వాన్ ప్రవివేశ స్వకంగృహమ్''

ప్రత్యూషమున విభీషణుడు రావణుని గృహమునుజేరి "జానకి లంకలో ప్రవేశించినదాది పెక్కు దుశ్శకునములు పొడముచున్నవని" చెప్పి, ఈ యశుభములన్నియు తొలగవలయుననిన అశుభములకు ప్రాయశ్చిత్తముగా జానకిని శ్రీరామున కర్పించుట తప్ప గత్యంతరములేదని ఎంతగానో రావణునకు చెప్పినాడు. విభీషణుని మాటలను విని రావణుడు-

"భయం నపశ్యామి కుతశ్చిదప్యహం న రాఘవః
ప్రాప్స్యతి జాతు మైథిలీమ్ సురైస్సహేన్ద్రైరపి సం
గతః కథంమామగ్రతః స్థాస్యతి లక్ష్మణాగ్రజః
ఇతీవముక్త్వా సురసైన్యశాసనో మహాబలః
సంయతి చండవిక్రమః దశాననో భ్రాతరం
ఆప్తవాదినం విసర్జయామాస తథా విభీషణమ్".

విభీషణుని విడిచి కొలువుకూటమును చేరినారు. రాక్షసులనెల్లరను సమావేశపరచి సీతావృత్తాంతమును చెప్పినాడు. కుంభకర్ణుడు రావణుని గోపించి పలికినాడు. మహాపార్శ్వుడు సీతను విడువరాదని రావణునకు చెప్పినాడు. విభీషణుడు మరల రావణునితో సీతను శ్రీరామునకు ఒప్పగింపుమని వేయివిధముల చాటిచెప్పినాడు. విభీషణుని మాటలను ప్రహస్తుడు గర్హించినాడు. రావణునకు చెప్పి ప్రయోజనములేకుండుట

చూచి విభీషణుడు మింటికెగసి రావణునకు హితము చెప్పినారు. విభీషణుడు తన నలువురు మంత్రులతో కలిసి శ్రీరాముని సన్నిధికి చేరినారు.

"తమాత్మ పంచమం దృష్ట్వా సుగ్రీవోవాహినీపతిః
వానరై స్సహదుర్ధర్షః చింతయామాస బుద్ధిమాన్
చింతయిత్వా ముహూర్తంతు వానరాంస్తానువాచహ
హనూమత్ప్రముఖాన్ సర్వానిదం వచనముత్తమమ్
విషసర్వాయుధోపేతః చతుర్భిస్సహ రాక్షసైః
రాక్షసోఽభ్యేతి పశ్యధ్వమస్మాన్హన్తుం నసంశయః"

ఇవి సుగ్రీవుని వచనములు. విభీషణునిరాకను గురించి సుగ్రీవుని యభిప్రాయము. సుగ్రీవుని వచనములను విని వానరులు దురాత్ములను వధింప అనుమతినిమ్మని వేడిరి. ఈ సన్నాహమును జూచిన విభీషణుడు సుగ్రీవుని సంబోధించి-

రావణోనామ దుర్వృత్తో రాక్షసోరాక్షసేశ్వరః
తస్యాహమనుజోభ్రాతా విభీషణ ఇతిశ్రుతః
తేన సీతాజనస్థానాద్ధృతా హత్వాజటాయుషమ్
రుద్ధాచ వివశాదీనా రాక్షసీభిస్సురక్షితా
తమహం హేతుభిర్వాక్యైః వివిధైశ్చన్యదర్శయమ్.
సాధునిర్యాత్యతాం సీతా రామాయేతి పునఃపునః
సచ నప్రతి జగ్రాహ రావణః కాలచోదితః
ఉచ్యమానం హితం వాక్యం విపరీత ఇవౌషధమ్
సోహం సరుషితస్తేన దాసవచ్చావమానితః
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవంశరణంగతః
సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయత మాంక్షిప్రం విభీషణముపస్థితమ్

అనినారు.

సుగ్రీవుడు శ్రీరామునకు విభీషణుని రాకను తెలిపి రాక్షసులను నమ్మ రాదనినాడు. శ్రీరాముడు విభీషణుని విషయమై వానరుల యభిప్రాయమునడిగి నారు. అంగదాదులు విభీషణుని గ్రహింపరాదని చెప్పగా హనుమంతుడు విభీషణుని పరిగ్రహింపవచ్చునని చెప్పినారు. వాయుసూనుని వచనములను విని తన మనసున నున్న భావమును వెల్లడించినారు లక్ష్మణాగ్రజుడు.

మిత్రభావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన
దోషో యద్యపి తస్యస్యాత్సతామేతదగర్హితమ్

"స్వభ్రాతను వీడివచ్చినవాడు ఇతరులనాదుకొనంగనేర్చునే" అని ఎన్ని విధములు గనో విభీషణుడగ్రాహ్యుడని చెప్పినాడు సుగ్రీవుడు. రామచంద్రుడామాటలకు

న సర్వే భ్రాతరస్తాత భవంతిభరతోపమాః
మద్విధావా పితుః పుత్రాస్సుహృదోవాభవద్విధాః

అని ప్రత్యుత్తరమిచ్చి శరణాగతరక్షణమవశ్యకర్తవ్యమనినారు.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచయాచతే
అభయంసర్వభూతేభ్యో దదామి ఏతద్వ్రతంమమ"

అని చెప్పి విభీషణునకభయదానమొసంగినారు రామచంద్రుడు. విభీషణుడు రాముని పాదములపై వ్రాలి

"అనుజో రావణస్యాహం తేన చాప్యవమానితః
భవన్తం సర్వభూతానాం శరణ్యం శరణాగతః
పరిత్యక్తామయా లంకా మిత్రాణిచధనానిచ"
భవద్గతం మేరాజ్యంచ జీవితంచసుఖానిచ"

అనినాడు. విభీషణునిపై కరుణాకటాక్షవీక్షణములను ప్రసరింప జేసినారు రాఘవులు.

'కనికరమున విభీషణుని చూచిన కన్నులనుచూచేదెన్నటికో
'మున్ను రావణుబాధనోర్వక విభీషణుడు మొఱబెట్టగా
మన్నింతుననుచు కులభిరుదులను బొగడినమాటమరచితివో

విభీషణుడు శ్రీరామునకు రాక్షసబలమును తెలియజెప్పినారు.

'అహంహత్వాం దశగ్రీవం సప్రహస్తం సబాంధవమ్
రాజానం త్వాం కరిష్యామి సత్యమేతద్బ్రవీమితే
రసాతలం వాప్రవిశేత్పాతాళం వాపిరావణః
పితామహసకాశం వా నమేజీవన్విమోక్ష్యతే
అహత్వారావణం సంఖ్యే సపుత్రజనబాంధవమ్
అయోధ్యాం నప్రవేక్ష్యామిత్రిభిస్తైర్భాతృభిశ్శపే'

అని ప్రతిన గావించినారు శ్రీరాముడు. విభీషణుడును అంజలి ఘటించి-

''అనుడు భక్తి విభీషణుండునునంజలిన్ ఘటియించి యో
యనఘశీల మదీయదేహమునందు ప్రాణములుండునం
దనుక జొచ్చెద శత్రుసేననితాంత సౌఖ్యమొనర్తు లం
కను వినాశమొనర్చ రాక్షసకాండమును బరి మార్పగన్''

ప్రతినగావించి అనినాడు. రాముడు విభీషణుని అంకపాళిగ్రుచ్చి లక్ష్మణునిచే-

''అబ్రవీల్లక్ష్మణంప్రీతః సముద్రాజ్జల మానయ
తేనచేయం మహాప్రాజ్ఞమభిషిఞ్చ విభీషణమ్''

సముద్రజలమును తెప్పించి విభీషణుని లంకా పట్టణమున కభిషిక్తుని చేసినారు. త్యాగయ్యగారు విభీషణ శరణాగతి ఘట్టమును, రాముని శరణాగతత్రాణపరాయణత్వ మును బహుధా కీర్తించినారు.

''సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయతమాంక్షిప్రం విభీషణముపస్థితమ్''

అనిగదా విభీషణుడు సుగ్రీవుని వేడుకొనినాడు. త్యాగయ్యగారు విభీషణ పట్టాభి షేక వృత్తాంతమును బహుధా కీర్తించినారు.

"గర్వించిన ఆ రావణు బాధల నోర్వలేక విభీషణుడు నిన్ను
సర్వలోక శరణ్యా వందనమన నిర్వికారుడై నీవు
సర్వదా రక్షించెదనను మను సార్వభౌమ లంకాధిపత్యమును
సర్వజ్ఞుని లక్ష్మణునిమ్మనగా సర్వసన్నుత త్యాగరాజుని"[1]
శరణాగత జనరక్షక సురపాల ముఖజిత సుధా
కరనిన్ను విభీషణుడు శరణనగానే
సురమునిజనవైరి సహోదరుడనుచు ఎంచక నీ
బిరుదును పొగడుచు లంకాపురపతిగా జేసిన.

(రామ రఘుకుల జలధిసోమ)

విభీషణుడు శ్రీరాముని శరణువేడుట - సుగ్రీవాదులు విభీషణుడగ్రాహ్యుడని చెప్పుట, హనుమ "విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః" అని చెప్పుట - రాముడు విభీషణుననుగ్రహించుట మొదలుగాగల విషయమును త్యాగయ్యగారు క్రింది కీర్తనలో నుంచినారు.

సీతాపతే నా మనసున సిద్ధాంతమని
యున్నానురా ॥సీ॥
వాతాత్మజాదులచెంత నేవర్ణించిన పలుకెల్ల ॥సీ॥
ప్రేమజూపి నాపై పెద్ద మనసు జేసి
నీ మహిమలెల్ల నిండారజూపి
ఈ మహిని భయమేటికన్న మాట
రామచంద్ర త్యాగరాజ వినుత ॥సీ॥

వాతాత్మజాదులచెంత ప్రేమతో పెద్దమనసుతో రాముడాడిన మాట (ఈ మహిని భయమేటికి) సిద్ధాంతమని మనసున నమ్మినారట త్యాగయ్యగారు. దీని కథ యిది.

1. ఎన్నడో రక్షించితే

సముద్రతీరమందు హనుమత్సుగ్రీవాదులు రాముని పరివేష్టించియున్నారు. ఆ సమయంలో విభీషణుడు రాముని శరణువేడగా సుగ్రీవాదులు కొంతమంది విభీషణుడు రాక్షసుడు, రావణుని సోదరుడు కనుక వధ్యుడని అంటారు. హనుమంతుడు మాత్రము విభీషణుని గుణములుగ్గడిస్తాడు. అప్పుడు రాముడు "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచయాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ" ఒక్కసారి నన్ను ఆశ్రయించిన వానికి సర్వభూతముల నుండి అభయం ఇచ్చే వ్రతము నాది. కనుక విభీషణునకభయమిస్తాను అని రాముడు పలుకుతాడు. ఈ మహిని భయమేటికి" అని త్యాగయ్యగారు పాడినపాటలో కథ అంతా ఉన్నది. కొంచెం ఆలోచన ప్రసరింపజేస్తేకాని పై అర్థం బాగా స్ఫురించదు. ఈ విధంగానే రామాయణప్రభావం త్యాగయ్యగారి కృతులలో పెక్కింటిలో కనిపిస్తున్నది. "సీతాపతే నా మనసున" అను కీర్తనకు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యుల వారి కథనమిది.

రామచంద్రుడు విభీషణునకు పట్టముగట్టుట జూచి సుగ్రీవుడు రామచంద్రునితో

అనఘచరిత్ర మీకు శరణాగతరక్ష కులవ్రతంబు మీ
సునిశితబాణజాలముల చోకునకోర్వక వచ్చితా దశా
ననుఁడభయంబు వేడికొనినందగవెట్లు గునన్న నవ్విభుం
డినసుతుజూచి యట్లయిననిచ్చెదవాని కయోధ్యనావుడన్

(భాస్కర రామాయణము – యుద్ధకాండ)

త్యాగయ్యగారు పై భాస్కరరామాయణ పద్యమందలి భావమునీ క్రింది కీర్తనలో నుంచినారు. సుగ్రీవుడడిగిన ప్రశ్నకు (రావణుడభయము వేడికొనిన కర్తవ్యమేమి అన్న ప్రశ్నకు) రాముడు తనయయోధ్యనే యిచ్చెదనని చెప్పిన సమాధానము నాధారముగా తీసికొని త్యాగయ్యగారు రాముని శరణాగతత్రాణపరాయణత్వమును, రాముడు సామదాన భేదదండోపాయచతురుడనుటను చక్కగ కీర్తించినారు. తన రామాయణ కృతి రచనా సందర్భమున విభీషణశరణాగతి ఘట్టమున త్యాగయ్యగారు,

సరససామదాన భేదదండచతుర
సాటిదైవమెవరే బ్రోవవే ॥సరస॥

పరమశాంభవాగ్రేసరుండనుచు
పలుకరావణుండు తెలియలేక పోయె ॥సరస॥
హితువుమాటలెంతో బాగబల్కితివి
సతముగా నయోధ్యనిత్తునంటివి
నత సహోదరుని రాజుచేసి రాక
హతము చేసితివి త్యాగరాజనుత ॥సరస॥

ఈ కీర్తనమునకు శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు, శ్రీ K.V. శ్రీనివాసయ్యం గార్ "రావణుడు బుద్ధి గలిగి సీతను ఒప్పగించిన ఏమి చేయుదువని సుగ్రీవాదులు ప్రశ్నింప" శ్రీరాముడు తన అయోధ్యనే యిచ్చెదనన్నాడని వ్యాఖ్యానించినారు. ఇది అవాల్మీకము. అధ్యాత్మమునగూడలేదు. పై పద్యము భాస్కరరామాయణమునందలిది. భాస్కరుడు త్యాగరాజునకు పూర్వుడు. భాస్కరుని పద్యములోని స్పష్టార్థము త్యాగయ్యగారి కీర్తనమున కనపడదు. భాస్కరరామాయణమునందలి పద్యము నాధారముగ తీసికొని త్యాగయ్య "సరససామదానభేదదండచతుర" "అను కీర్తనను రచించినారని చెప్పవచ్చును.

శ్రీ E. N, పురుషోత్తమన్‌గారు "తమ Tyagopanishad" అను గ్రంథమున "సరససామదాన" అను కీర్తనమునకు వివరణము వ్రాయుచు "సతముగా నయోధ్య నిత్తునంటివి అనుదానిలో రామచంద్రుడు రావణుడు బుద్ధికలిగి సీతను ఒప్పగించిన ఆయోధ్య నిచ్చెదనన్న అర్థములేదనినారు.

In verses 33 and 34 in sarg 18 in Yuddhakanda, while making Sugreeva to usher in Vibhishana to his presence, Rama says he is vowed to give protection to all living beings that seek his refuge, even if it be Ravana himself. Apart from this, I have not been able to find either in Valmiki or in Kamban, Rama saying [illegible] ould give away Ayodhya itself to Ravana if the latter also comes and asks for pardon. Both Kalluri Veerabhadra Sastry and K. V. Srinivasa Ayyangar have interpreted as Rama saying he would give away Ayodhya. Tyagaraja does not say to whom Rama meant to give. I consulted different scholars to

find out the basis for this verson, but in vain. One scholar said that this may be found in some lesser Ramayana written by some minor poet, with an eye for chamatkarm, which is imaginative exuberance or hyperbolic landation.

చతుర్వింశతియార్ష రామాయణములనన్నిటిని సంగ్రథితముచేసి కీ. శే. శ్రీ ములుకుట్ల నరసింహావధానులుగారు "రామాయణసారోద్ధారమ"ను పేర నొక గ్రంథమును ప్రకటించినారు. దానిని తెలుగునకు "జగన్నాథ రామాయణమ"ను పేరఅనువదించినారు శ్రీతంగిరాల జగన్నాథకవి. ఆ గ్రంథమున యుద్ధకాండమున పై సన్నివేశమునిట్టులున్నది.

రామచంద్రుడు విభీషణునకు పట్టాభిషేకముచేసి విభీషణు నిట్లాశీర్వదించినారు.

నాదుచరితంబు చెందన్క బాడుకొను ధ
రిత్రి వందన్క లంకబాలింపుమీవు
పిదపజేరుదు నా దివ్యపదము
పుత్రపౌత్ర సంయుక్తముగ నీవు భవ్యచరిత.

అచ్చోట వర్తించు నగచరు లన్యోన్య
మాశ్చర్యమొంది మాట్లాడిరిట్లు
తపనజు రాజ్యప్రదానంబు సల్పుప్ర
తిజ్ఞ వెన్వెంటనే తీఱిపోయె
దనుజుని రాజ్యప్రదానమట్టిది కాదు
మహనీయులు బలసమర్థులైన
రాక్షసుల్ గల్గిరాలంకలో రామ రా
వణ యుద్ధమేరీతి బరిణమించు

నో తెలియ వీలుగానిదిట్లుండ రాజ్య
పట్టము విభీషణునకెట్లు కట్టె రాము
డిది యనాలోచితంబుగా నెసగె ననుచు
వానరులువల్క వినుచు భూపతి వచించె.

సురనాథుండు సహాయమైనను దశాస్యున్
సంగరంబందు సం
హరణంజేయుట నిశ్చయంబు అటు చేయంజాలజాలనై తేనినీ
కరయన్‌లంక నొసంగుదన్న పలుకుకన్యార్థంబు
గాకుండ నా
దరణన్ గోసలరాజ్య మిచ్చెదను మిత్రవ్రాత మగ్గింపగన్.

శ్రీ E. N. పురుషోత్తమన్‌గారు నుడివినట్లు "Thyagaraja does not say to whom Rama meant to give" అన్నదే త్యాగయ్యగారి కీర్తన లోని యస్పష్టత అని యనుకొన్నను రెండురకముల (శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రి, శ్రీ కె. వి శ్రీనివాసయ్యంగారలు) చెప్పినట్లు రావణునకు, జగన్నాథ రామాయణము ననున్నటుల విభీషణునకు రాముడు అయోధ్య ఇత్తునన్నట్లు చెప్పినారనుట కవకాశము గలదు. రావణునకు అయోధ్యను ఇత్తునని చెప్పుదానికంటె విభీషణునకే అయోధ్య నిత్తునని రాముడన్నమాట సమంజసము. "రాజ్యకాంక్షీచ రాక్షసః" అని గదా విభీషణుని గురించి వాల్మీకి అభిభాషణము. రావణుడు బుద్ధిగలిగి ప్రవర్తించిన శ్రీరాముడు లంకను రావణున కొసగి తననాశ్రయించుకొనిన విభీషణునకు అయోధ్యనే యిత్తునని అనియుండును. కీడెంచి మేలెంచుమనిగదా!

రామావతారమున "ఆత్మానం మానుషంమన్యే రామం దశరథాత్మజం'' అని చెప్పుకొనినాడు శ్రీరాముడు. వాల్మీకము ననుసరించి శ్రీరాముడు మర్యాదా పురుషోత్తముడు. "చారిత్రేణచకోయుక్తః" అనిగదా వాల్మీకముననున్నది.

త్యాగయ్యగారు వాలిసుగ్రీవుల వృత్తాంతమును, రావణవిభీషణుల వృత్తాంతము ననేక కీర్తనములలో నుంచినారు.

"ఒకనిశిచరుడన్నమాటలోర్వక శరణనగా
శుకవచనములో నాదుపలుకులన్ని విభీషణమా''

(నా మొరాలకింపవేమి శ్రీరామా)

శ్రీరాముడు సుగ్రీవునితో సఖ్యముచేసి సుగ్రీవుని కోరిక మేరకు వాలిని వధించినారు, విభీషణుడు శ్రీరామునిచేరి రావణుచావు రహస్యము నెరింగించి రావణు

వధకు శ్రీరామునకు తోడ్పడినారు. అగ్రజునివలన బాధల ననుభవించినవారలై సుగ్రీవవిభీషణులు అగ్రజుని చావును కోరుకొన్నవారే. త్యాగయ్యగారు అగ్రజుని వలన బాధల ననుభవించినవారైనను అగ్రజుని శ్రేయస్సును కాంక్షించినవారే కాని ఆయనకు కీడు తలపెట్టినవారు కారు.

సాగరమును తరించునుపాయము చెప్పుమని శ్రీరాముడు విభీషణు నడిగినారు. సాగరుని శరణుజొచ్చుట మంచి యుపాయమని దాశరథికి చెప్పినాడు రావణావరజుడు. లక్ష్మణ సుగ్రీవులును సముద్రుని శరణువేడుటయే యుక్తమనిరి. శ్రీరాముడు నంగీకరించినాడు. సముద్రునుద్దేశించి ప్రతిశయనము గావింప నుద్యుక్తుడయినాడు శ్రీరాముడు.

శ్రీరాముడు కపులతో సముద్రమునొద్దున విడిసియున్నాడని శార్దూలుడు రావణున కెరింగించినారు. రావణుడు సుగ్రీవునొద్దకు శుకుని రాయబారిగనంపినాడు. వానరులు శుకుని మర్దించినారు. సుగ్రీవుడు రావణునకు ప్రత్యుత్తరమంపినారు.

రామచంద్రుడు ప్రాఙ్ముఖముగా రాత్రిత్రయము దర్భశయనుడై దారినొసంగుమని సముద్రుని ప్రార్థించినారు. సముద్రుడు శ్రీరామునకు దారినొసంగినవాడు కాడు. ఆగ్రహోదగ్రుడైనాడు దాశరధి. "సౌమిత్రే! చాపమానయ" అని సౌమిత్రి నాదేశించి ఆశీవిషతుల్యశరముతో బాహుబలంబొప్పశరసంధాన మొనర్చి సముద్ర జలము సర్వమునింకితునని కోదండమును చేబట్టి తీక్ష్ణశుగమును సంధించి శ్రీరాముడు త్రిపురములను దగ్ధముచేయు శంభునివలె దుర్నిరీక్షుడై తోచినారు. బ్రహ్మాస్త్రమును సంధించి సముద్రునిపై వేయకడంగ గ్రావానీకములు సంచలించినవి. దిశలు పెంజీకటితో అల్లల్లాడినవి. సముద్రుని గర్వమణగినది.

'వననిధి మదగర్వమణచిన సాయకమును చూచేదెన్నటికో'

సముద్రుడు ప్రత్యక్షమై శ్రీరాముని అభయదాన మొసంగుమని ప్రార్థించినాడు. లంకకేగు మార్గమును చెప్పగలననినారు. కోపము మానుమని కోరిన సముద్రుని శ్రీరాముడు "ఇయ్యది అమోఘంబైన శరము. ఎచట దీనినివేతును" అని యడిగినారు. అంత సముద్రుడు "అటకు ఉత్తరముగా ద్రుమకుల్యమను ప్రదేశమొండు గలదనియు, అందు పెక్కురుగ్రకర్ములు, ఆభీరప్రముఖులు, పాపులు నివసించి తన

నపవిత్రుం జేయుచున్నారనియు, వారిపై శరమును విడచి దానినమోఘము సేయ దగున"ని వచించినారు.

శ్రీరాముడట్లే తన యస్త్రమును ద్రుమకుల్యమున ప్రయోగించినారు.

ఎవరిచ్చిరిరా శరచాపములు నీ కినకులాబ్ధిచంద్ర
॥ఎవరిచ్చిరిరా॥
అవతరించువేళ నుండెనో లేక అవనికేగి యార్జించితివో
॥ఎవరిచ్చిరిరా॥
సకలనదీపతికై ద్రుమకుల్యల సంహరించెనటా
ప్రకట కీర్తి కలిగిన కోదండపాణి శ్రీ త్యాగరాజ వినుత
॥ఎవరిచ్చిరిరా॥

సముద్రుడు శ్రీరామునితో "విశ్వకర్మ సుతుడగు నలుడు బుద్ధిమంతుడు. అతడు సేతునిర్మాణము సేయ సమర్థుడ"నెను. శ్రీరాముడు నలుని సేతువుగట్ట నాజ్ఞాపించినారు. నూరామడల సేతునిర్మాణము సేయుటకు ఐదుదినములు పట్టినది. హనుమమూపుపై రామచంద్రుడు, అంగదునిమూపుపై సౌమిత్రి ఎక్కి సముద్రమును దాటినారు.

రామచంద్రమూర్తి ఆ సేతువును దాటుసమయమున నొకయుడుత శ్రీరాముని సందర్శించి పూర్వస్మృతికలదై రామసేవచే జన్మము ధన్యతగావించుకొన నెంచి నీటందుమునుచు నార్ద్రశరీరమున సైకతంబున బొర్లుచు తన దేహమున కంటుకొన్న యిసుకనా సేతు మార్గమున దులుపుచుండుట నవలోకించి శ్రీరాముడా చిక్రోడముం బట్టుకొని దాని శరీరముపై తనచేతి వ్రేళ్ళుంచి నిమురుచు చూచుచుండగనే శాప విముక్తినొంది స్వర్గమునకేగినది. త్యాగయ్య గారాఘట్టమునుకూడా రామాయణ కృతి రచనా సందర్భమున ప్రస్తావించినారు.

"ఎందుకు నిర్దయ ఎవరున్నారురా ॥ఎం॥
ఇందునిభానన ఇనకుల చందన ॥ఎం॥
ఉడుత భక్తికిగని ఉప్పతిల్లగ లేదా ॥ఎం॥

ఉడుత వృత్తాంతము వాల్మీకమునలేదు. అధ్యాత్మరామాయణమునగూడ లేదు. తెనుగున రంగనాధరామాయణమున నున్నది. త్యాగయ్యగారికాదర్శప్రాయులైన రామదాసుగారు కీర్తించినారు.

పలుకే బంగారమాయెనా పిలచిన పలుకవేమి
తిరవుగ ఇసుకలోన పొరలిన యుడుత భక్తిని
కరుణించి బ్రోచితివని నెర నమ్మితి నిన్నే తండ్రి.

"ఉడుతమైని కరాగ్రనఖాంకురంబులన్ సంతసమందజేసితి

(ఎంతటిపుణ్యమో - దాశరధిశతకము)

"ఉడుత" వృత్తాంతమును గురించి ఆచార్య సాంబమూర్తిగారిట్లు వ్రాసిరి.

'Udata Bhakti' or the devotion of squirrel. This episode is not realised in any of the Ramayanaes. There is the strong tradition about the story in South India and Thyagıraja has incorporated this in his kriti 'Enduku Nirdaya - Harikambhoji Raga).

సంస్కృతమున "శ్రీరామభాగవతమున" ఉడుతవృత్తాంత మున్నదని శ్రీ ములుకట్ల నరసింహావధానులుగారు రామాయణ సారోద్ధారమున పేర్కొనినారు.

సేతుబంధనముగావించిన శ్రీరాముని ట్లు కీర్తించిరి
నిరవధిసుఖద నిర్మలరూప నిర్జిత మునిశాప ॥ని॥
శరధిబంధన నతసంక్రందన
శంకరాదిగీయమాన సదన ॥ని॥
మామవ మరకత మణి నిభదేహ
శ్రీరమణీలోలాశ్రిత జనపాల
భీమపరాక్రమ భీమకరార్చిత
తామసరాజసమానసదూర త్యాగరాజవినుతచరణ ॥ని॥

యుద్ధము సన్నద్ధమైనది. రాక్షసవీరులెందరో చచ్చినారు. రావణలక్ష్మణుల యుద్ధమున "శక్తి" వలన లక్ష్మణుడు మూర్ఛితుడైనాడు. మూర్ఛిల్లిన లక్ష్మణుని రావణుడెత్త ప్రయత్నించినాడు. ఆ సమయమున రథికుడుగాడు రాముడు. నేల మీద నిలబడియున్నాడు. రథికుడగు రావణుడు రామునిపై పడనున్న స్థితిలో వాయుజుడు పరుగునవచ్చి వజ్రసన్నిభమైన ముష్టిబొమ్మనందు గ్రుద్దినారు. ఆ దెబ్బకు రావణుడరచావు చచ్చినాడు. దేవరులు, ఋషులు, వాసవాదులు మిక్కిలి సంతసించిరి. రావణశరార్దితుడు, అనఘతేజస్వియునగు సుమిత్రానందనుని వాతాత్మజుడు బాహువులనెత్తికొని చని స్నేహగరిమ రామచంద్రుని యంతికసీమనిలిపినాడు. రాముడు జాత రుషారుణాక్షుడయి సత్వరుడై దశకంఠుని మీదకు బోవ వాతసుతుండాపి "బలవంతుసుపర్ణుని విష్ణునట్లునన్ క్ష్మాతనయేశయెక్కి సురశాసను శాసితుజేయు టొప్పగు"ననినాడు. రామచంద్రుడు మారుతి మూపుపైనెక్కి పిడుగుల వర్షములా ధ్వనించుచు తనబాణముతో రావణుని రథమును, గుర్రములను, ఖడ్గములను, కిరీటమునుగూడ గొట్టినాడు. శ్రీరాముని పరాక్రమమునకు రావణుడు నిలువలేక పోయినాడు. రావణుడు డస్సినాడు. శ్రీరాముడు డస్సిన రావణుజూచి

"నీవనిగడుడస్సినాడవని యాత్మదలంచి నిశాచరేంద్రనిన్
దునుమగ నొల్ల రాముడిని ద్రుంపడుసుమ్ము
నిరాయుధున్ జడున్
"పొమ్ము లంకకనుజ్ఞయిచ్చితిని బోపోగానిదీబంగ రా
రమ్ము క్రమ్మఱథన్వివై రథివినై రాజన్మహాశస్త్రపూ
గమ్ముం గైకొని యప్డుచూచెదు శతాంగస్థుండవై నాదు శౌ
ర్యమ్మున్ రాత్రిచరేంద్రయన్న హతదర్పానందుడై
వాడునున్

రథికుడైన రావణుడు విరథుడైన రాముని చంపవచ్చినాడు. కొంత తడవునకే రావణుడు విరథుడైనాడు. రాముడు రథికుడైనాడు. రావణుని చంపకుండగ వదలినాడు రాముడు. రావణుని సాగనంపి తరువాత తనకు తోడునీడగా నుండిన లక్ష్మణుని విశల్యునిచేసి ఆదరించినాడు. పిమ్మట రావణుడింటికేగి మంచి ఎరపంపించి

తమ్ముడైన కుంభకర్ణుని లేపి తీసికొని రమ్మనినాడు. సమయమేనా అని కుంభకర్ణుడు సందేహించినాడు. సమయమేనని రూఢిచేసికొని లేచినాడు.

రామబాణము యొక్క మహిమమును ప్రస్తుతించుచు త్యాగయ్యగారు చెప్పిన కీర్తన.

రామబాణ త్రాణశౌర్యమేమని పొగడుదురా
ఓ మనసా ॥రా॥
తమ్ముడు బడలినవేళ సురరిపుతెమ్మని చక్కెర
బంపీయగగని
లెమ్మనుచును ఇంద్రారిబల్క సమయమ్మనిలేవగా
సమ్మతితో నిలబడి కోదండపుజ్యా ఘోషములశనులజేసితా
నెమ్మదిగల తోడును జూచెనురా నిజమైన
త్యాగరాజనుతుడగు ॥రా॥

ఈ కీర్తనమునకు కీర్తిశేషులు శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు త్యాగరాజు ఆత్మవిచారము అను గ్రంథమునవిట్లు వివరణనిచ్చినారు.

రామరావణ ప్రథమ సమావేశంలోనే రావణుడు ప్రయోగించిన శక్తివల్ల లక్ష్మణుడు మూర్ఛిల్లి పడిపోగాఅప్పట్లో రాముడు రథికుడై ఉండక నేలమీద నిలబడి ఉన్నా రథికుడైన రావణాసురుడు వచ్చి రాముడిమీద పడబోయే స్థితిలో హనుమంతుడి మాట చొప్పున హనుమంతుణ్ణి రథంగా చేసుకుని పిడుగుల వర్షంలా ధ్వనించే తన బాణంతో రాముడు రావణాసురుడి రథాన్ని, గుర్రాల్ని, ఖడ్గాన్ని, కిరీటాన్ని ఊడగొట్టేసి (అసలు ఆ దెబ్బతో రావణాసురుడు నసాళం అంటిపోయి తారెత్తిపోయి అధైర్యంలో పడిపోయి రామ క్షమవల్ల తన ఇల్లు చేరుకోడంతోటే మంచి ఎర పంపించి తన తమ్ముడైన కుంభకర్ణుణ్ణి లేవగొట్టుకు రమ్మని జనాన్ని పంపడమూ, వాళ్ళెళ్లి లెమ్మని కుంభకర్ణుణ్ణి పొడవడము, వాడు సమయమేనా అని సందేహించడము - సమయమే అని రూఢిచేసుకుని లేవడము జరగవలసి వచ్చే టంతగా) రావణాసురుడికి గుండె బేజారెత్తిపోగా రాముడతణ్ణి చూసి "భయపడకు,

ఛాళ్ళ శ్రమపడ్డావు. ఇప్పుడు నువ్వు విరథుడవు, నిరాయుధుడవు అయి ఉన్నావు. ఇంటికెళ్ళి సేదదీర్చుకొని, తయారై రేపురా, అపుడు చూచుకోవచ్చు బలాబలాలు" అని వదిలేశాడు.

భమిడిపాటివారి వివరణమునకు మధునాపంతులవారి ప్రశంస:

ఈ కీర్తనలో సురరిపు తెమ్మని అన్నదగ్గరనుంచి అర్థం గంపతిరుగుడుగా ఉంది. సురరిపు - ఇంద్రారి అనే పదాలు ఏకార్థకాలా? భిన్నార్థకాలా? చక్కెర పంచీయటం ఏమిటి? లక్ష్మణమూర్ఛ విషయం విన్నతరవాత రావణుడు పంచదార పంచిపెట్టాడా? సంతోష శుభసమయాల్లో పంచదార, పంచదార చిలకలు వగైరా పంచిపెట్టించడం సంప్రదాయం. రక్షోనాథుడు మాంసాశనులకి పంచదార పంచి పెట్టించి ఉంటాడా? అన్నది సంశయాస్పదం. అది మధురపదార్థం కనక మధువు=మద్యము అని దూర దూరంగా ఔపచారికార్థాలు చెప్పుకోవలసి ఉంటుందని ప్రథమ దృష్టికి తోస్తుంది. రామబాణత్రాణశౌర్యము అన్నచోట ఒకే సమాసంగా భావించి అర్థం ఆలోచించినప్పుడు అనుగమకం కుదరటంలేదు. తిరుగుడుగా ఉన్న ఈ కీర్తనార్థం సామరస్యసంభావనతో శ్రీ కామేశ్వరరావుగారు ఈ తీరుగా వెల్లడించినారు.

రామబాణముయొక్క త్రాణ వేరుగాను, శౌర్యంవేరుగాను చూపి ఈ రెంటికీ ప్రభది పంక్తుల్లోని భావాలు సముచితంగా సమన్వయింప చేయడంలో శ్రీ కామేశ్వర రావుగారి పరిశ్రమ అభినందనీయమైనది. చక్కెర, చక్క+ఎర = అని విడదీసి కుంభకర్ణుడికి ఎర పంపడమనే అర్థం గ్రహించడం ఎంతో సంవాదంగా ఔచితీ భరితంగా కనిపిస్తున్నది.

ఈ కీర్తనమునకు శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు వివరణమును వ్రాయుచు చక్కెర అనుచోట పంచదార అనునర్థమునే వ్రాసినారు. ఇది యసంగతము. చక్క+ఎర అని విడదీసి ఎర పంపించుట అనునర్థమే బాగున్నది. వాల్మీకమున నా విధముగనే యున్నది. త్యాగయ్యగారి హృదయము గూడ నయ్యదియే.

కుంభకర్ణాది రాక్షసవీరులందరు యుద్ధరంగమున మడిసినారు. ఇంద్రజిత్తు కూడ మరణించినాడు. పుత్ర వియోగమునకు రావణుడు మిక్కిలి దుఃఖించినాడు.

రావణుడు బలముఖ్యవర్యులను యుద్ధమునకు పురిగొల్పినాడు. రావణుని మూల బలము యుద్ధమునకై తలపడ రాముడు రావణుని మూలబలమును సంహరించినాడు.

"భామకాసపడు రావణు మూల బలముల నేలఁగూలఁజేయు
(రామబాణత్రాణశౌర్య)

శరశర సమరై కశూర - శరధిమదవిదార ||శర||
సురరిపు మూలబలమను తూల
గిరులకనల సమమౌ శ్రీరామ ||శర||

# ఇక రామరావణ యుద్ధము

"రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ" అన్నట్టుల సాగినది. రామ రావణులిరువురు దివ్యాస్త్రముల పోరినారు రావణలక్ష్మణుల యుద్ధమున లక్ష్మణుడు మూర్ఛిల్లినారు. శ్రీరాముడు లక్ష్మణుని వానరులకప్పగించినారు. రావణుడు పరాజితుడై లంకకేగినాడు. మూర్ఛిల్లిన లక్ష్మణుని జూచి శ్రీరాముడు దుఃఖించినారు.

దేశేదేశే కళత్రాణిసంతి దేశేదేశేచ బాంధవాః
తంతుదేశం నపశ్యామి యత్రభ్రాతా సహోదరః

సుషేణుడు శ్రీరామునూరార్చినారు. హనుమంతుడు సంజీవిపర్వతమును దెచ్చినారు. లక్ష్మణుడు మూర్ఛదేరినారు. లక్ష్మణుడు శ్రీరాముని రణంబునకుఁ బ్రోత్సహించినాడు. శ్రీరామరావణుల కడపటి యుద్ధమున రావణుడు చనిపోయినాడు. రావణుని మరణమునకు విభీషణుడు విలపించినాడు. మరణాంతాని వైరాణి గదా! విభీషణుడు రావణునకు సంస్కారముచేసినాడు. రామచంద్రుడు వానరులచే సముద్రజలమును తెప్పించి, విభీషణుని అర్హసింహాసనమున నిలిపి బుధ వినోది మధ్యమునందు సమంత్రకంబుగ నభిషిక్తుని గావించినారు శ్రీరాముడు హనుమంతుని సీత యొద్దకు పంపినారు. హనుమంతుడు లంకకేగి సీతకు రాముని

విజయవార్తను చెప్పినారు. సీత హనుమంతుని ప్రశంసించినది. 'పతివిగనగోరెద వని" సీత యనినమాటలను హనుమ రామునకు చెప్పినాడు. శ్రీరాముడు సీతాదేవిని తోడిదేర విభీషణుని నియోగించినారు. విభీషణుడు నస్నాతవై సీతను రమ్మనినారు. అస్నాతయగుచు వచ్చెదనన్నది సీత, రామాజ్ఞయనినారు విభీషణుడు. వల్లెయనినది సీత. జలకమాడినది. భూషణజాలభూషితాంగియయి సీత విభీషణుని వెంట వచ్చినది. సీతరాకను విభీషణుడు శ్రీరామునకెఱింగించినారు. శ్రీరాముడు సీతను స్వీకరింప నిరాకరించినారు. ఆనాడు లంకలో సీత రావణుని సంహరింప గలిగియుండియు రామాజ్ఞ లేనందున, తాను తపోదీక్షనున్నందున సీత రావణుని తన పాతివ్రత్యప్రభావముచే సంహరించినదికాదు. పైగా ఆ కీర్తి రామచంద్రునకే రావలయునని సీత యుద్దేశము.

'అసందేశాత్తు రామస్య తపసశ్చాను పాలనాత్
నత్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా"

అని రావణునితోననినది సీత. త్యాగయ్యగారు సీతాపాతివ్రత్యమహిమమును ప్రస్తుతించుచు చెప్పిన కీర్తన.

'దానవునివెంటచని యశోకతరుమూలనుండి
వాని మాటలకు కోపగించి కంట వధియించకనే యుండి
శ్రీనాయక యశమునీకే గల్గజేయలేదా త్యాగరాజ పరిపాల
మా జానకి చెట్టబట్టగా మహరాజువైతివి ॥మా॥
రాజరాజవర రాజీవాక్ష విను రావణారి యని రాజిలు
కీర్తియు ॥మా॥

"సీతాయాశ్చరితం మహత్" అని గదా వాల్మీకి అభిభాషణము. 'అప్రమేయం హి తత్తేజః యస్యసా జనకాత్మజా" అనిగదా వాల్మీకివక్కణ. వాల్మీకమునందలి భావములను అపరవాల్మీకులైన త్యాగయ్యగారు రామాయణకృతి రచనా సందర్భమున హృద్యముగ కీర్తించినారు.

సీత అగ్నిప్రవేశము చేయుట, దేవతలు శ్రీరామునకు ప్రత్యక్షమై సీత నిర్దోషిత్వమును తెలియజెప్పి పరిగ్రహింపుమని కోరుట – రాముడు

సీతను పరిగ్రహించుట జరిగినది. సీతా రామలక్ష్మణులు దశరధుని సందర్శించినారు. దశరధుడు శ్రీరాముని ప్రశంసించినారు. శ్రీరామ సేవ కర్తవ్యమని దశరధుడు లక్ష్మణునకు బోధించినారు. సీతనూరార్చినాడు దశరధుడు. దశరధుడు స్వర్గమును చేరినాడు. ఇంద్రుడు శ్రీరాముని దర్శించి "నీ దర్శనము సేత నెగడె స్థారకమయి ప్రీతులమైతిమి ఖ్యాతచరిత – యిష్టమెయ్యది నీకు నెరింగింపుమ"నినారు. రాముడు ఇంద్రున కభివాదనమొనర్చి "కరుణ నాపై నీకుగలద యేని వచియింతు నా కోరిక తీర్పుమని"నారు. "తన కొరకై యుద్ధమున ప్రాణములను కోల్పోయిన వానరులను పునర్జీవితులను జేయుమని" శ్రీరాముడు కోరగా నింద్రుడట్లే చేసినాడు.

'రావణునిగొట్టి పేదకపులు లేవజూచు దృష్టిని
జూచేదెన్నటికో'

శ్రీరాముడు భరతునిజూడ తొందరలో నున్నారు. విభీషణుడు పుష్పక విమానమును సిద్ధము చేసినారు. సుగ్రీవ విభీషణాదులయోధ్యకు వచ్చుటకు శ్రీరాముడు సమ్మతించినారు. అందరును పుష్పకవిమానము నధిరోహించిరి.

'ఘనమైన పుష్పకమున రాజిల్లిన సొగసును
జూచేదెన్నటికో'

కతిపయప్రయాణములతో భరద్వాజ నాశ్రమంబుచేరినారు. భరతునిజేరి "అనుజునితో, జనకజితో జనుదెంచినాడు రాముడని" చెప్పుమని హనుమనంపినారు. హనుమంతుడు భరతునకు రామాగమన వృత్తాంతమును చెప్పినాడు. భరతుడు సంతసించినాడు. ఇక పట్టాభిషేకము జరుగవలయును. శత్రుఘ్నుడు భరతునాజ్ఞచే అయోధ్యనలంకరించినారు. భరతాదులు శ్రీరామునకెదురు వెళ్ళినారు. విమానమునను్న శ్రీరామాదులను భరతునకు చూపించినారు హనుమ.

విమానము నేల వ్రాలినది. అంబుజాక్షునాజ్ఞచే భరతుడద్దానిపై నెక్కి రాముడాసి వ్రాలి ప్రణతి చేసినారు. రామచంద్రుడు కైకేయ్యా నందవర్ధనుడగు భరతు లేవనెత్తి కౌగిట చేర్చినారు. రామచంద్రుడు భరతునిచేయి పట్టుకొని ఆతని భ్రాతృభక్తికి కడుంగడు సంతసించి భరతు నాశ్రమమునకు పోయినారు.

'భరతునిగని చేయిబట్టుకొని వచ్చిన వేడుకను
చూచేదెన్నటికో'

భరతుడు రాజ్యమును శ్రీరామునకర్పించినారు. శ్రీరామాదులు జడలను విడచినారు.

శత్రుఘ్నువాక్యమున సుమంత్రుడు సర్వాంక శోభనసహితమగుచు, అర్క మండల నిభంబయి దివ్యమగు తేరి సజ్జీకృతముచేసి తెచ్చినారు. శ్రీరాముడు స్నాతుడై, కుండలోపేతుడై దివ్యసంకాశవస్త్రంబులగ్రాలి అందునెక్కిచనిరి. సుగ్రీవ హనుమదాదులు శ్రీరామురథము వెంటవెళ్ళిరి. అభిషేకమునకు వలయు పరికరము లన్నియు నెక్కడివక్కడ సుందరముగ సమర్చబడియుండెను. రాముడరుదేరగనే శత్రుఘ్నుడు సచివులతోగూడి రామునకు రాజ్యాభిషేకము చేయుడని పురోహితునకు చెప్పెను. అంతట ప్రయతుడు, వృద్ధుడునగు వసిష్ఠమహర్షి బ్రాహ్మణులతో కూడిన వాడై రామునిసీతతోబాటు రత్నపీఠమున నలంకరింపచేసిరి.

"కనక సింహాసనమున నెలకొన్న నీవిని చూచేదెన్నటికో
వరమునులు రాజులుగూడి సేయు నలంకారమును
చూచేదెన్నటికో'

పట్టాభిషేకమును చూడవచ్చిన వారిని సముచితరీతిని గౌరవించినారు రామ చంద్రులు. వానరులతో సహపంక్తి భోజనము చేసినారట దాశరధి పేరపేరపిలచి హారములను బహూకరించినారట రాఘవులు. త్యాగయ్యగా రాసన్నివేశమును మనోజ్ఞముగ చిత్రీకరించిరి.

తనవారి తనములేదా తారకాధిపాననవాదా! ॥త॥
ఇనవంశరాజులకీగుణములెన్నడైనగలదా నాదుపై ॥త॥
అలనాడు అన్నమారగించు వేళ
బలువానరుల పంక్తి నుంచలేదా ॥త॥
పేరపేరఁబిలచి హారములు ప్రేమ
మీర మీరొసగ లేదా నాదుపై ॥త॥

సీతాలక్ష్మణ సహితుడై పట్టాభిషిక్తుడై కొలువు తీర్చియున్న శ్రీరాముని ట్లు కీర్తించినారు త్యాగయ్యగారు.

కొలువై యున్నాడే కోదండపాణి ॥కొ॥
సలలితమతులై సారెకు శీలులై
వలచుచుకోరివచ్చి సేవింపగ ॥కొ॥
జనకజ భరతాదులతో మంచి నైవేద్యంబుల
చనువున వేడుక నారగించి మెరపుకోట్లగేరు
కనకపటము బొమ్మలను ధరించి వేదోక్తములైన
సనకవచనములచేతోషించి శ్రితులపోషించి ॥కొ॥
వరవగువాసనలు పరిమళింప సన్నిధిలో వెలుగుచు
సురవారసతులు బాగనటింప అడిగాక పరా
శరనారదమునులెల్లనుతింప ఎంతెంతో నెనరున
సురపతి వాగీశులు సేవింప మేనుపులకరింప ॥కొ॥
ఉడురాజముఖుడు శేషశయ్యపై నిచెలంగగ గని
పుడమికుమారి సుగంధము పూయనమ్మి నవారలకే
కడగంటిని కోరిన వరమీయ త్యాగరాజు నెనరుగ
అడుగడుగుకు మడుపులనందీయ శ్రీరామయ్య ॥కొ॥

పట్టాభిషిక్తుడైన శ్రీరామునకందరునిట్లు మంగళముపాడినారు

జయమంగళం నిత్య శుభమంగళం॥
మంగళమవని సుతానాధునికి మంగళ
మరవిందాక్షునికి ॥జయ॥
మంగళమద్భుత చారిత్రునికి మంగళమాదిదేవునికి ॥జయ॥

ఇనకులమున వెలసిన రామునికి జనకవచన పరిపాలునికి
మనసిజకోటి లావణ్యునికి కనక సింహాసన
నిలయునికి ॥జయ॥

తీయని తెలుగు భాషలో రామాయణకృతి రచనచేసి తానుతరించుటయేకాక పరులకందరకు తరణోపాయమును (స్వయంతీర్ణః పరాంస్తారయతి) చూపించిన త్యాగయ్యగారు రామాయణవాగ్గేయకారులు. "రామాయణ రహస్యార్థ ప్రకాశకులు త్యాగయ్యగారని శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారు కీర్తించుట ప్రత్యక్షర సత్యము".

త్యాగయ్యగారు రామాయణ పఠనశ్రవణమువలన కలుగు ఫలశ్రుతి నిట్లు నాటినారు.

రామకథా సుధారస పానమొక రాజ్యముచేసునే॥
భామామణి జానకిసౌమిత్రి భరతాదులతో భూమిని
వెలయు శ్రీ॥
ధర్మాద్యఖిల ఫలదమె (పాలనమె) మనసా
ధైర్యావందసౌఖ్య నికేతనమే॥
కర్మబంధజ్వలనాబ్ధినావమే
కవిహరమే త్యాగరాజనుతుడగు ॥రామ॥

# ఉత్తరకాండ

ఉత్తరకాండ కథా సంబంధియగు త్యాగయ్య కీర్తనలు నేడనుపలబ్ధములు. "వినరానసకొనియున్నానురా" అను ప్రతాపవరాళిరాగకీర్తన ఉత్తరకాండమునందలి దని అచార్య శ్రీసాంబమూర్తిగారు వ్రాసినారు *

ప॥ వినవాసకొనియున్నానురా విశ్వరూపుడైన
అ॥ప॥ మనసారగ వీనులవిందుగ మధురమైన
పలుకుల ॥వి॥
చ॥ సీతారమణితో ఓమనగుంటలాడి గెల్చుట
చేత నొకరికొకరు జూచి సా
కేతాధిప నిజమగు ప్రేమతో పల్కుకొన్న ముచ్చట
వాతాత్మజభరతులు విన్నటుల
త్యాగరాజసన్నుత ॥విన॥

సీతారాములొకనాడు ఏకాంతమందిరమున ఓమనగుంటలాట ఆడినారట. అందు రాముడు గెలిచినాడట. సీతారాములొకరినొకరు పరస్పరముజూచుకొని ప్రేమగ మాటలాడుకొన్నారట. ఆ మధురమైన మాటలను గదికి వెలుపలనున్న భరతాంజనేయులు విన్నారట. తనకు గూడ ఆ మధురమైన మాటలను వినవలయు నను ఆసగలిగి యున్నారట.

త్యాగయ్యగారి కీర్తనములకు "త్యాగబ్రహ్మోపనిషత్తు"లను పేరుగలదు. త్యాగయ్య కృతులలోని పల్లవి సూత్రమని, అనుపల్లవి వృత్తియని, చరణము భాష్యమని, ఆకారణముగ త్యాగయ్య కృతులకు త్యాగబ్రహ్మోపనిషత్తులను అను నన్వర్థనామము కలిగినదని విజ్ఞుల తలంపు.

## సూత్ర లక్షణము

అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖం
అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదోవిదుః

సూత్రమునకు కొద్ది వివరణ వృత్తియందు, పూర్తి వివరణము భాష్యమునందుండును.

*Great Composers-II, Revised Edition-Page 151

ఈ పై త్యాగయ్యగారి కీర్తన ఇందులకుదాహరణమని తద్జ్ఞులతలంపు.

"వినదాసకొనియున్నానురా" అని పల్లవిలో సంగ్రహముగ చెప్పి ఎట్లు వినదలచుకొనితో - ఏమి వినదలచుకొనిరో - అను పల్లవిలో చెప్పి (మనసారగ వీనులవిందుగ మధురమైన పల్కులు) ఆ మధురమైన పల్కులెట్టివో - ఆ పల్కులను వినినవారెవరో చరణమునందు వివరముగ జెప్పినారు త్యాగయ్యగారు.

శంకరభగవత్పాదులే తాను సంస్కృతమున చెప్పిన ఉపనిషత్పూర్తులు, వేదాంతరహస్యములు అందరకునర్థము గాకుండుటతో త్యాగయ్యగనవతరించి అద్వైత వేదాంతసారమును తేట తెలుగులో మానవాళికందించి మహోపకారము చేసిరను విమర్శకులమాట ప్రత్యక్షరసత్యము.

## సింగారముని వృత్తాంతము

### కోరి నువ్వులకొండ దీసి సింగారముని కూర్మి భుజించెనా

(కళలనేర్చినా - దీపకం)

రావణవధానంతరము శ్రీరాముడయోధ్యను జేరి పట్టాభిషిక్తుడైనాడు. శ్రీరామపట్టాభిషేకసమయమున యోగ్యులైనవారలకు వివిధ దానముల నిచ్చు ఏర్పాటు జరిగినది. కేవల పట్టాభిషేకసందర్భమునియేగాదు - శ్రీరాముడు దానముల నీయ సంకల్పించినది. తాను రావణునితో యుద్ధ సందర్భమున చేసిన పాప పరిహారార్థమును, తిలదానమునీయనేర్పాటుకూడ జరిగినది. సామాన్యముగా తిలలను దానముగ స్వీకరించుట నికృష్టమని భావించి ఆ దాన గ్రహణమునకెవ్వరును ముందుకురారు. బీదవారు, సంస్కారహీనులు తప్ప ఇతరులా దానమును పట్టుట కంగీకరింపరు. సత్పాత్రుడైనవాడు ఆ దానమును పట్టుటకు ముందుకువచ్చిన అతనికి బంగారముకూడ నిచ్చు ఏర్పాటు జరిగినది. ఆ విధముగ చాటింపువేసినను తిలలను దానము పట్టుటకెవ్వరును ముందుకు రాలేదు.

ఆ రోజులలో సింగారముని అనునాతడు అయోధ్యపొలిమేరలలో నివసించుచుండెను. అతడు నిరుపేద. తన కాలమునంతను తపోధ్యానాదులందు గడుపుచుండెడివాడు.

సింగారముని భార్య ఆ దండోరావిని, భర్తను తిలదానము పట్టుమని యొత్తిడి చేసినది. ఆ బంగారము లభించిన విలాసజీవితము గడపవచ్చునని ఆమె తలంపు. సింగారముని భార్య మాటలకు ఆగ్రహోదగ్రుడైనాడు. తుచ్ఛ బంగారమునకాశించి తన ఆధ్యాత్మికోన్నతినంతను త్యాగము చేయ సిద్ధపడని సింగారముని భార్యను గద్దించినాడు.

భర్తమాటలను విని వినమ్రురాలై శ్రీరాముడవతార పురుషుడు. దానమును స్వీకరింపగనే అతని ముఖమును దర్శించిన సర్వపాపములు పటాపంచలుకాగలవు అని బదులు పలికినది. భార్య మాటలలోని అంతరార్థమును గ్రహించిన సింగార ముని తిలదానము పట్టుటకంగీకరించి ఆ వార్తను రాజప్రాసాదమునకు కబురంపి నాడు. ఆ వార్త అయోధ్యా పురప్రజలకు తెలిసినది. "అప్పుడే కలియుగమారంభ మైనదా! సింగారమునివంటి యోగ్యుడు బంగారమునకాశించి ఎంతటినీచస్థితికి దిగ జారినాడని గుసగుసలు పోసాగినారు పౌరులు.

వసిష్ఠముని సింగారముని దంపతుల ఉద్దేశమును పసిగట్టినాడు. తిలదానమును స్వీకరించిన తరువాత దానమును పట్టిన వ్యక్తి దానమునిచ్చినవాని వైపు చూడ రాదను నియమము గలదు. ఆ కారణముగ సింగారముని దానము స్వీకరించినంతనే రాముని దర్శింపకుండునట్లు ఒక తెర హఠాత్తుగ వారి మధ్య దిగునట్లు వసిష్ఠునాజ్ఞచే నమర్చబడినది.

దానమునిచ్చు సమయమాసన్నమైనది. సింగారముని రాజప్రాసాదమున కేగి నాడు. దానమును స్వీకరించుటకై ప్రత్యేకముగ నేర్పరుపబడిన యొక వేదిక దగ్గరకు చేరినాడు సింగారముని. మంత్రోచ్చారణలమధ్య దానమునిచ్చు తంతు పూర్తియయినది. తెరపడినది. శ్రీరామునితోబాటు సభాసదులందరునాశ్చర్యచకితు లైరి. సింగారముని రామదర్శనమునకై ముఖమును పైకెత్తగా తెర కనబడినది. హతాశుడైనాడు. రామదర్శనము కాకుండుటతో విచారగ్రస్తుడై వెడలినాడు. ఈలోగా బంగారము సింగారముని గృహమును చేరినది. సింగారముని భార్య చాల సంతసించి భర్తకు స్వాగతము చెప్పుటకు ఎదురుచూచుచుండెను. కన్నీటితో నిండిన ముఖముతో తిరిగి వచ్చుచున్న భర్తను చూడగనే ఆమె విభ్రాంతురాలయినది.

"నీదురూపదేశమును విని ఈ బంగారమునకాశపడి నా తపస్తేజమును దివ్యశక్తులనన్నిటిని కోల్పోయినానని" భార్యకు చెప్పి వాపోయినాడు సింగారముని.

ఊహింపని ఆ పరిణామమునకు సింగారముని భార్యయు చాల వ్యధచెందినది. కొంత తడవునకు తేరుకొని భర్తతో "మించిన దానికి వగచి ప్రయోజనమేమున్నది? పట్టాభిషేకమహోత్సవము పూర్తియయిన పిమ్మట శ్రీరాముడు రథారూఢుడై ఊరేగింపుగా రాగలడు. ఆ ఊరేగింపు మన నివాసమునకు సమీపముగా మలుపుతిరుగును. ఆ ప్రదేశమున నిలబడి రథము కనబడగనే రథమును చేరి శ్రీరాముని దర్శింపుమ"ని చెప్పెను. అన్నపానీయములను వర్జించి సింగారముని ఆసక్తితో శ్రీరామదర్శనము నకై ఎదురులు చూచుచుండెను. ఆ రోజు రానేవచ్చినది. ఊరేగింపు తన యింటి వందు మొదలికిరాగనే సింగారముని శ్రీరామునకు సాష్టాంగపడినాడు. శ్రీరామ దర్శనముతో తాను కోల్పోయిన దివ్యతేజమును తిరిగిపొందినాడు సింగారముని. శ్రీరాముడాసందర్భమున సింగారమునితో "నీవు తిలదానమును గ్రహించిన కారణ ముగా ఈ కొద్దిరోజులు బాధపడితివి. ఇప్పుడు నీ పాపములన్నియు పటాపంచలైనవి: నీ కాశీస్సులు" అనెను. సింగారముని ఆనందభరితుడై యింటికి తిరిగివెళ్ళినాడు. కాని రాజప్రాసాదము నుండి తన గృహమును చేరిన బంగారమును తాకనైన లేదు.

సింగారముని (దానరూపమున) లభించిన బంగారము వలన సుఖించినాడా? విభీషణుడు రంగనాధుని లంకకుగొనిపోగలిగినాడా? విధి విధానము ననుసరించియే కార్యములు జరుగుచుండును. అని శ్రీ త్యాగరాజస్వామి "కళలనేర్చిన" అను కృతి యందు విశదీకరించినారు.

కళలనేర్చిన మును జేసినది గాకనేమి యరవైనాలుగు ॥క॥
కోరి నువ్వుల కొండదీసి సింగారమునికూర్మి భుజించెనా ॥క॥

## ఉడుత భక్తిగని ఉప్పొంగిల్లగ లేదా!

శ్రీరామచంద్రమూర్తి సేతువును దాటు సమయమున ఒక ఉడుత రాముని దర్శించి పూర్వస్మృతి కలదై—

తదా జాతిస్మరః కశ్చిచ్చి క్రోడో రభసాన్వితః

రామసేవచే జన్మము ధన్యతగావించ కొననెంచి నీటం దుముకుచు ఆర్ద్రశరీరంబున సైకతంబున బొర్లుచు తన దేహమునకంటుకొన్న యిసుకనా సేతు మార్గమున

దులుపుచుండుటనవలోకించి రాముండాచిక్రోడముంబట్టుకొని దాని శరీరముపై తన చేతి వ్రేళ్ళుంచి దానివి నిమురుచు చూచుచుండగనే శాపవిముక్తి నొంది స్వర్గమున కేగెను.

## సేతుబంధన సహాయ మొనర్చిన ఉడుత చరిత్ర

అనవిని పార్వతి శంభున
కనియెన్ జిక్రోడ మెవరు? ఆ రూపము బొం
దిన కారణమేమియొ నా
కనఘా వచియింపుడన్న హరు డిట్లనియెన్.

పూర్వము బ్రాహ్మణుడొక్కడు కలడు. అతని కుమారుడు అఖిల శాస్త్రజ్ఞుడు. పండిత సభలలో వాదోపవాదముల పాల్గొని జయపత్రికలను గడించినాడు. సత్కీర్తి నార్జించినాడు. పండితులందరు బ్రాహ్మణుని జేరి "నీ తనయుడు బుద్ధిమంతుడు. నీ పూర్వపుణ్యవశమున కీర్తిని వెలయించు సుతుడుద్భవించినాడు" అని పొగడసాగిరి. అంత బ్రాహ్మణుడు పండితులతో "మీరలాతని నుతింపవలదు. వానికి శాస్త్రములు తెలియవ"నినాడు. కుమారునకీవిషయము తెలిసి ఆగ్రహోదగ్రుడైనాడు. కోపముతో యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము నశించుటతో దండమును చేకొని తండ్రిని దండింపదలచి ద్వారముకడనుగ్రుండయి అతనింగనుగొని ధరణి బడునట్లుగా దండమును విసరివైచినాడు. తండ్రి మూర్ఛిల్లినాడు. ఆక్షణములోనే తెలివొంది క్రోధతత్పరుడయి" క్రూరజంతువు విధంబున చరించితి కాన కావనాంతరమున క్రూరజంతువుగ జన్మము నొందుమని దుర్భరముగ తనయునకు శాపమొసగినాడు.

జనకు డొసంగిన శాప కారణాన శార్దూలమై పుట్టినాడు తనయుడు. అడవిని తిరుగాడుచున్నాడు బ్రాహ్మణుడు గ్రామాంతర మేగుటకై ఆ వనమున పయినించుచుండగా శార్దూలమా విప్రునిజంప మీదికి దుముకబోయినది. ఆ బ్రాహ్మణుడుగ్రుడైనాడు. సుతుడీరీతిగ వ్యాఘ్రమై పొడమెనని బ్రాహ్మణుడెంచి "దుర్మతివై

ఇచ్చుటగూడ హింసా కృత్యములకు పాల్పడితివా! ఎవరికిని బాధలను కలగజేయకుండుటకై "ఉడుతవై పృథ్వీస్థలింబుట్టుగావుత" అనగా స్మృతి కలిగి వ్యాఘ్రతనువౌ పుత్రుండు దీనాత్ముడై శాపవిముక్తి ననుగ్రహింపుమని తండ్రిని వేడుకొనగా అనుగ్రహించి శాపమోక్షణము నిట్లు అనుగ్రహించినాడు.

"శ్రీరాముని హస్తస్పర్శ తగులుటతోడనే శాపవిముక్తినొంది సద్గతినొందెద వనెను. ఆ కారణమువ ఇప్పుడు రామ హస్తస్పర్శ తగులుటచే శాపవిముక్తినొంది సద్గతి జొందెన"ని శంకరుడు పార్వతికి చెప్పినాడు.

ఆచార్య సాంబమూర్తిగారు "ఉడుత భక్తి" (ఉడుత వృత్తాంతము) ఏ రామాయణములలోను లేదని, దక్షిణ భారతమున సంప్రదాయానుసారముగ వచ్చుచున్న దనుట సరిగాదు. తెలుగున రంగనాథరామాయణమునన్నది. ఉడుత పూర్వ జన్మ వృత్తాంతము ఆర్షరామాయణ గ్రంథముల గాదు.

# రామకథాసుధయందు రామాదిపాత్రల స్వరూప స్వభావ చిత్రణము

త్యాగరాజయ్య తన రామాయణకృతి రచనా సందర్భమున రామాదిపాత్ర స్వరూపస్వభావములనెట్లు చిత్రీకరించినది పరిశీలింతము.

శ్రీరాముడు ద్వాత్రింశల్లక్షణోపేతుడను సాముద్రిక సత్యమును త్యాగరాజు వెలార్చినాడు. "లక్షణములు గల రామచంద్రునికి ప్రదక్షిణ మొనరింతము రారె- ముప్పదిరెండు లక్షణములుగల రామచంద్రునికి". వాల్మీకి శ్రీ మద్రామాయణమున శ్రీరాముని కల్యాణగుణములను బహు సుందరముగ హనుమంతుని ముఖతః వర్ణించి శ్రీరాముడు ద్వాత్రింశల్లక్షణోపేతు డనినారు.

ప్రముఖ వాగ్గేయకారుడైన త్యాగయ్య రామాయణకృతి రచనా సందర్భమున శ్రీరాముని మానవీయ, దివ్యగుణగణములను వర్ణనాతీతమగు రీతికో తమ కీర్తనల యందు చిత్రించినారు.

వాల్మీకి శ్రీమద్రామాయణమున పలుతావుల శ్రీరామునకుగల సంగీత ప్రియత్వమును వర్ణించినారు. "గాంధర్వేచ భువి శ్రేష్ఠః బభూవభరతాగ్రజః". త్యాగయ్యయు శ్రీరామునకు గల సంగీత ప్రియత్వమును బహుధా వర్ణించుచు చెప్పిన కృతులు.

శ్రీరాముడు నాదాత్మకుడనినారు త్యాగయ్య (నాదాత్మక త్యాగరాజనాథాప్రమేయ - సదా నీ భక్తి)

1. ఇంగిత మెరిగిన సంగీతలోలుని (ఏట జన్మమిదిహా-ఓరామ)
2. సారసహితకులాబ్జభృంగ సంగీతలోల (శ్రీరఘువర అప్రమేయ)
3. a) గానలోల ఘనతమాలనీల (శ్రీ జానకీ రమణ)
   b) గానలోల (వాచామ గోచరమే)
4. వరలీల గానలోల (వరలీల గానలోల)
5. గీతప్రియ (రాముని మరవకవే)
6. సంగీతప్రియ త్యాగరాజగేయుడైన (రక్ష బెట్టరే)

"నినువినా సుఖముగాన" అను తోడిరాగ కీర్తనమున శ్రీరాముని రాగరసికుడని కీర్తించినారు త్యాగరాజయ్య. నాదసుధారసంబిలను అను ఆరభిరాగకృతియందు, నాదబ్రహ్మానంద రసాకృతిగల నీవయచే రామనిత్యానందుడనైతినని శ్రీరాముని నాదస్వరూపునిగ వర్ణించినారు. శ్రీరాముడు సంగీత సంప్రదాయము తెలిసిన వాడని "రంగేశుడు సద్గంగా జనకుడు సంగీత సంప్రదాయకుడని" సాధించెనే అను ఆరభిరాగ పంచరత్నకృతియందు చెప్పినారు.

శ్రీరాముని మృదుభాషిత్వమును, వాగ్వైభవమును ప్రశంసించినారు త్యాగయ్య. 1. మృదుభాషణ, 2. సుధామాధుర్యభాషణ-సుధాకరానన, 3. ఏమనిమాటాడితివో, 4. త్యాగరాజకుల విభూష మృదుసుభాష (రామ నీ సమాన మెవరు), 5. మృదు వార్తల గల (నినువినా సుఖముగాన) 6. ముద్దుముద్దుగ మాటలాడిన (సార్వభౌమ సాకేత) 7. పలుకుకండ చక్కెరగేరునే పణతులార-జూడరే-కొలువుకూటమునను కొలుచు వారిని బిలచి దాశరధి ప్రేమమీర పలుకు –

శ్రీరాముడు ఏకపత్నీవ్రతుడు : ఒకమాట - ఒకబాణము, ఒక పత్నీవ్రతుడే మనసా. శ్రీరాముడు సత్త్వగుణ ప్రధానుడు. 1. ఉండేది రాముడొకడు. 2. ఏమని పొగడుదురా. శ్రీరాముడు భక్తపాలన కళాదక్షుడు. (మనసా శ్రీరామచంద్రుని, కదనువారికి) -

**శ్రీరాముడు పుంసాంమోహనరూపుడు :** రూపౌదార్య గుణైః పుంసాందృష్టి చిత్తాపహారిణమ్ అనిగదా వాల్మీకి అభిభాషణము. 1) ముద్దు మోము ఏలాగు చెలంగెనో, 2) ఎంతముద్దో ఎంతసొగసో, 3) అద్దంపు చెక్కుళ్ళచే ముద్దుగారుమోము, 4) నిగనిగమను సుకపోల యుగముచే మెరయు, 5) మోహన రామ - ముఖజితసోమ. శ్రీరాముడు శృంగార శేఖరుడు.

**సీతాదేవి :** "అప్రమేయం హి తత్తేజః యస్యసా జనకాత్మజా' అనిగదా వాల్మీకి అభిభాషణము. (మా జానకీ, సరియెవ్వరే. భామామరువంపు మొలక - భక్తియను పంజరపు చిలక. (రామ నీ సమానమెవరు). భామామణి (రామ కథాసుధారస).

**లక్ష్మణుడు :** తనివారపరిచర్యసేయసౌమిత్రి మను తపమేమి చేసెనో. (రామస్య దక్షిణోబాహుః నిత్యం ప్రాణోబహిశ్చరః) మిత్రిభాగ్యమే భాగ్యము - సౌమిత్రి.

సౌమిత్రికి కనులజాడల సుఖము (లేకనా).
అలనాడు సౌమిత్రి పాదసేవచెలరేగి సేయువేళ సీతతో
పలికి చూచినంత పులకాంకితుడై పరగినయటు త్యాగరాజునిక్రీ-కంటజూడుమీ.

భరతుడు : 1) భరతునిగని మది కరగినవాని యురమున జేర్చి
కరమునుజూపు రఘునాథా నన్నుబ్రోవవే.
2) భరతుడావేళ కరగి కరగి నిల్వగా
కరముబట్టి కౌగలించె వరదుడప్పుడు
దాచుకోవలెనా - దాశరథే నీదయ.

**హనుమంతుడు :** సకల విద్యాపారంగతుడు. నవవ్యాకరణ పండితుడు. చదువులన్ని తెలిసి శంకరాంశుడై సదయుడాశుగ సంభవుడు మ్రొక్క.
(ఆడమోడి గలదె)

హనుమంతుడు సంగీతశాస్త్రప్రవక్త. "కర్తా సంగీతశాస్త్రస్య హనూమాంశ్చ మహాకపిః" అనికదా. సంగీతానందము "సీతాపతి చరణాబ్జము నిడుకొన్న వాతాత్మజునికి బాగతెలుసు. (గీతార్థము)